# మా విమర్శ ప్రస్థానమ్

రచన :

గుంటూరు శేషేంద్ర శర్మ

జి.వి. సుబ్రహ్మణ్యం

కోవెల సంపత్కుమారాచార్య

కోవెల సుప్రసన్నాచార్య

తుమ్మపూడి కోటీశ్వరరావు

చేకూరి రామారావు

వడలి మందేశ్వరరావు

ఎస్వీ రామారావు

ముదిగొండ వీరభద్రయ్య

కూర్పు :

ఎల్లూరి శివారెడ్డి

కసిరెడ్డి వెంకటరెడ్డి

సి. మృణాళిని



జీవియస్ సాహితీ కళాపీఠం

శ్రీవాణి 1-8-702/105, నల్లకుంట, హైదరాబాదు - 500 044

# MAA VIMARSA PRASTHANAM

(Our Vision of Literary Criticism)
Essays by nine contemporary literary critics :

Dr. Gunturu Seshendra Sarma
Dr. K. Sampathkumaracharya
Dr. T. Koteswara Rao
Sri. Vadali Mandeswara Rao
Dr. M. Veerabhadraiah
Dr. G.V. Subrahmanyam
Dr. K. Suprasannacharya
Dr. C. Rama Rao (Chera)
Dr. S.V. Rama Rao &



First Edition : **Sept. 2000**
Copies : **1000**
Price : **Rs. 60/-**

*Copies available at :*
**G.V.S. SAHITI KALA PEETHAM,**
Sri Vani 1-8-702/105, Nallakunta,
Hyderabad - 500 044, Phone : 7633275

**VISHALANDHRA PUBLISHING HOUSE**
4-1-435, Vijnana Bhavan, Bank Street,
Hyderabad - 500 001. and other Branches,

**NAVODAYA BOOK SELLERS,**
In Frant of Arya Samaj,
Hyderabad.

*Printed at*
**SRI DATTA SAI GRAPHICS**
శ్రీవాణి 1-8-702/105, నల్లకుంట, హైదరాబాదు - 500 044
ఫోన్ : 3399390; 7633275





# మాన్యశ్రీ ఎ.పి. జితేంద్ర రెడ్డి గారికి

**పార్లమెంటు సభ్యులు - మహబూబునగర్**

తండ్రి అదుపాజ్ఞల్లో
అనుశాసన పర్వంలో
ఆత్మీయతానురాగంలో
ఇంతగా ఎదిగానంటున్న
సాహిత్య బంధువుకు
సాంస్కృతిక సింధువుకు
నవరత్న విమర్శకుల
ప్రయోగ - ప్రస్థాన గ్రంథం
సాదరంగా

**అంకితం**

**- జీవియస్ సాహితీ కళా పీఠం**

# నవరత్నహారం

ఆంధ్రదేశంలో సాహిత్యానికి ఆదరణలో కొరత లేదు. అయితే ఆ ఆదరణలో అధికభాగం కవిత్వానికి, మిగిలిన భాగం కథలకు నవలలకు లభిస్తున్నదంటే, అందులో అవాస్తవం లేదు, అతిశయోక్తి లేదు. సాహిత్యంలో అన్నిటికంటె తక్కువ ఆదరాభిమానాలు లభిస్తున్న ప్రక్రియ సాహిత్య విమర్శ. ఈ విషయం అందరెరిగినదే. చాలామంది సాహితీ ప్రియులను కలతపరిచినదే. కాని, ఎవరూ కూడా ఈ పరిస్థితిని సవరించడానికి సాహసించలేదు. ఆ సాహసానికి ఒడిగట్టిన సంస్థ జీవియస్ సాహితీ కళాపీఠం. సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు, పరిశోధకులు, రచయిత అయిన ఆచార్య, జి.వి. సుబ్రహ్మణ్యం గారి షష్టిపూర్తి సందర్భంగా 1996 ఫిబ్రవరి 10వ తేదీన జీవియస్ సాహితీ పీఠం ఆవిర్భవించింది.

సాహిత్య విమర్శలోని సృజనాత్మకతకు హారతిపడుతూ తెలుగు సాహిత్య విమర్శ ఉన్నత ప్రమాణాలతో ముందుకు సాగడానికి అవసరమైన వేదికను వాతావరణాన్ని కల్పిస్తూ పెనుమార్పులతో పురోగమిస్తున్న ప్రపంచ సాహిత్య విమర్శ రంగాన్ని పరిశీలిస్తూ, భారతీయ విమర్శ తత్త్వం అస్తిత్వాన్ని విలుపుకొంటూ, తెలుగు సాహిత్యంలోని భిన్న ప్రక్రియలపై సైద్ధాంతికమైన అవగాహనను పెంపొందించడం, భిన్న ధోరణులకు చెందిన విమర్శకులను ఒక వేదికపై సమాదరించడం, సమాజానికి, సాహిత్యానికీ, సాహిత్య విమర్శకూ అవినాభావ సంబంధాన్ని సమీక్షించడం జీవియస్ సాహితీ కళాపీఠం లక్ష్యాలు.

ప్రతి సంవత్సరం ఒక ఉత్తమ విమర్శకుడికి పురస్కారం ప్రదానం చేయడంతో కళాపీఠం కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. కేవల విమర్శ రంగానికి మాత్రమే పురస్కారాలు ఇవ్వడమే తెలుగు సాహిత్య చరిత్రలో ఒక అరుదైన విషయం. అయితే కళాపీఠం గత సంవత్సరం మరో అడుగు ముందుకు వేసి, 'నా విమర్శ ప్రస్థానం, ప్రయోగం' అనే సరికొత్త కార్యక్రమాన్ని రూపొందించింది. కవులకో, కథకులకో తమ గురించి చెప్పుకోవడానికీ, తమ సాహితీ కృషిని పరిచయం చేసుకోవడానికీ లభించే అవకాశాలు, విమర్శకులకు దొరకవు. సృజనాత్మక సాహిత్యానికి ఒక విస్తరణగా మాత్రమే

విమర్శను భావించేవారు ఎక్కువైన నేపథ్యంలో, విమర్శకూడా కవిత్వం,కథ, నవలల స్థాయిలో ఒక ఉదాత్తమైన సృజనాత్మక ప్రక్రియ అని నిరూపించడానికి సాహితీకళాపీఠం ఉద్యమించింది. ఈ ధ్యేయంతోనే కడచిన ఐదునెలల్లో 'నా విమర్శ ప్రస్థానం' శీర్షిక కింద, 9 మంది విమర్శకులు, తమ సాహితీ కృషిని వెల్లడించుకోడానికి ఒక వేదికను సమకూర్చింది. ప్రతి నెల 18వ తేదీన హైదరాబాదు నగరంలో నిరాటంకంగా దిగ్విజయంగా ఈ సభలు జరిగాయి. ఈ క్రమంలో ఏప్రిల్ 18వ తేదీన చేకూరి రామారావు, కోవెల సంపత్కుమారాచార్యగారలు మే18వ తేదీన కోవెల సుప్రసన్న, ముదిగొండ వీరభద్రయ్య గారలు జూన్ 18వ తేదీన తుమ్మపూడి కోటీశ్వరరావు, వడలి మందేశ్వరరావు గారలు, జూలై 18వ తేదీన ఎస్వీ రామారావు, జి.వి. సుబ్రహ్మణ్యం గారలు, ఆగస్టు 18వ తేదీన గుంటూరు శేషేంద్రశర్మ తమ విమర్శ ప్రస్థానాలను ప్రయోగాలను వివరించారు.

ఈ ప్రసంగాలు సాహితీ ప్రియులను విశేషంగా ఆకర్షించడంతోపాటు, ఆయా విమర్శకులను అంచనా వేయడానికి సరికొత్త అవగాహనను అందించాయి. సృజనాత్మక సాహిత్యానికి విలువ కట్టడం ఎంతశ్రమతోకూడుకున్న కార్యమో, విమర్శకులను అంచనా కట్టడం కూడా అంతే. అందునా, ఇతరుల గురించి రాయడం కంటె, తమ గురించి చెప్పుకోవడం మరీ కష్టం. సాహిత్య విమర్శలో మూడు ప్రధాన ధోరణులను కళాపీఠం గుర్తించింది. అవి సాహిత్య స్పృహ, సామాజిక స్పృహ, సాహిత్య సామాజిక స్పృహ. ఈ ఐదు సభల్లో ప్రస్థాన ప్రయోగాల్లో పాల్గొన్నవారు సాహిత్యస్పృహ, సాహిత్య సామాజిక స్పృహ అనే రెండు ధోరణులకు మేలైన ప్రతినిధులు. ఈ తొమ్మిదిమంది కూడా ఈ శతాబ్దం ఉత్తరార్ధంలో తెలుగు సాహిత్య విమర్శపై కొత్త వెలుగులను ప్రసరించినవారు. కొత్త కొలమానాలను అందించినవారు. కొత్త విమర్శనా చైతన్యానికి ప్రాతినిధ్యం వహించేవారు.

ఒక విమర్శకుడి కృషిని అంచనా వేయడానికి, అతని విమర్శ ప్రమాణాలకు విలువకట్టడానికి కొన్ని కొలమానా లుంటాయి. అవి సిద్ధాంత ప్రతిపాదన, సరికొత్త సమన్వయం, నూతన సాహిత్య దృక్పథం, వినూత్న విశ్లేషణం ఇటువంటిది ఏదైనా కావచ్చును. ఈ నాల్గింటిని లేదా వీటిలో ఏదో ఒకటన్నా సాధించిన వారిని విమర్శ

పరిణామ క్రమంలో 'ట్రెండ్ సెట్టర్స్'గా, భావించడానికి వీలుంది. 'నా విమర్శ ప్రస్థానం' కార్యక్రమంలో పాల్గొన్నవారందరూ ఈ లక్షణాలలో ఏదో ఒకటి కలిగినవారే. వీరిలో కొందరు సాహిత్యాన్ని అర్థం చేసుకోవడానికి అవసరమైన నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించారు. కొందరు ప్రాచ్య, పాశ్చాత్య విమర్శనా రీతులను సమన్వయపరచి సరికొత్త దృక్పథాన్ని అందించారు. ఇతరులు అంతవరకు సాహిత్య విమర్శలో నెలకొనివున్న సిద్ధాంతాలను, కల్పనలను (**Myth**) భగ్నం చేశారు. వారిలో కొందరు ఇంతకు పూర్వం అస్తవ్యస్తంగా ఉన్న సాహిత్య చరిత్రకు కొత్త నిర్మాణ సూత్రాల నందించారు. సాహిత్యచరిత్ర, సాహిత్య సిద్ధాంతం, సాహిత్య విమర్శ అనే మూడు కీలకమైన అంశాల్లో వీరు కృషిచేశారు. కేవలం తత్కాలానికి ప్రశంసార్హమైన, కావ్యాల సమీక్షణంతో తృప్తి పడినవారు, పూర్వులు చెప్పిన సిద్ధాంతాలనే వల్లె వేసినవారు ఈ ఉపన్యాసక్రమంలో లేరు. వీరందరు సాహిత్యంపై తమ బలమైన ముద్రను వేసినవారే. సాహిత్య విమర్శను యథాలాపమైన ప్రసంగంగా కాక ఒక ఉదాత్తమైన బాధ్యతగా భావించినవారే. తమ విశ్వాసాలపై, తమ సాహితీ సిద్ధాంతాలపై సంపూర్ణమైన నమ్మకం ఉన్నవారే. తమ తమ ప్రసంగాల్లో వారందరూ తమ విమర్శ ప్రస్థానంలోని భిన్న దశలను ఎదుర్కొన్న ఆటుపోట్లకు, చెరగని తమ విశ్వాసాలను ప్రకటించుకొని, విమర్శకుడు కూడా ఒక సృజనాత్మక దీక్ష కలిగిన వ్యక్తేనని నిరూపించారు.

అయిదు నెలలపాటు జరిగిన ధారావాహిక సభల్లో పాల్గొని తమ విమర్శరీతులను, తమ ఆత్మగీతాల్ని ఆత్మీయంగా పంచుకొన్న తొమ్మిదిమంది విమర్శకుల ప్రసంగ వ్యాసాలను ఈ పుస్తక రూపంలో అందిస్తున్నందుకు, జీవియస్ సహితీ కళాపీఠం ఎంతో ఆనందిస్తున్నది. దీని ద్వారా తెలుగు సాహిత్య విమర్శకు ఒక నవరత్నాల హారాన్ని అందిస్తున్నామని మేము గర్విస్తున్నాం. ఈ గ్రంథంలో వ్యాసాల క్రమం, సౌకర్యం కోసం చేసిందే కాని, తరతమ భేదాలు సూచించేది కాదు. గ్రంథంలో ఆయా విమర్శకులు ప్రకటించిన అభిప్రాయాలు, సిద్ధాంతాలు, అచ్చంగా వారివే. జీవియస్ సాహితీ కళాపీఠానికి వాటితో నిమిత్తం లేదు. అలాగే, సంక్లిష్టమైన సాహిత్య విషయాలను వ్యాఖ్యానించిన ఈ విమర్శకులు, తమ విమర్శ గురించి చెప్పుకొన్న విషయాలకు ఎటువంటి ఉపోద్ఘాతాలు, పరిచయాలు, వ్యాఖ్యానాలు అవసరంలేదని

మేము భావిస్తున్నాం. ఆయా విమర్శకులు విమర్శనా రంగంలో చేసిన కృషిని, వారి ద్వారానే నేరుగా తెలుసుకొని ఆనందించవలసిందని పాఠకులను కోరుతున్నాం.

అయిదు నెలల పాటు నిర్విఘ్నంగా సాగిన ఈ సాహిత్య విమర్శ యాగాన్ని సాధ్యం చేసినవారు ఎందరో వదాన్యులు సాహితీ, ప్రియులు, సాహిత్య పోషకులు. హార్దికంగానూ, ఆర్థికంగానూ సాయిపడిన డా॥ జె. బాపురెడ్డి, శ్రీయుతులు లామ్‌కో ఛైర్మన్, ఎస్. కొండలరావు, రత్నా జూనియర్ కాలేజి అధినేత నాగయ్యశెట్టి, ఆచార్య రవ్వా శ్రీహరి ఆచార్య ఎస్.వి. రామారావు, డా॥ ఆర్. కమల గారలు- వీరందరికీ, మా కళాపీఠం కార్య వర్గానికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు. తెలుగు సాహిత్యంలోనే ఇటువంటి పుస్తకం ఇదే ప్రథమం అని మేము సగర్వంగా చెప్పుకోగల ఈ గ్రంథాన్ని అంకితం తీసుకుంటున్న పార్లమెంటు సభ్యులు, మాన్యశ్రీ ఎ.పి. జితేంద్రరెడ్డి గారికి మా అసంఖ్యాక ధన్యవాదాలు.

తెలుగు సాహిత్య రంగంలో మొదటిసారిగా, ప్రయోగాత్మకంగా మేము నిర్వహించిన సభలను ప్రేక్షకులు విశేషంగా ఆదరించారు. అదే స్ఫూర్తితో ఈ పుస్తకాన్ని కూడా అదే ఆత్మీయతలో ఆదరించాలని పాఠకులను మేము కోరుతున్నాము.

ఈ కృషిలో అడుగడుగునా సాయపడుతున్న సహృదయులందరికీ సాదరకృతజ్ఞతాం జలులు.

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డి
డాక్టర్ సి. మృణాళిని.

హైదరాబాద్
10-9-2000

# ఇందులో......



---

లోపలి అట్టలమీది బొమ్మలు : 'నా విమర్శ ప్రస్థానం : ప్రయోగం' సభలలో సన్మానాలందుకొంటున్న ఈ గ్రంధరచయితలైన సాహితీవిమర్శకులను చూడవచ్చు.

*"Criticism is the last reward of consummate scholarship. It is harder to be a critic than to be a poet. At twenty one can afford to be a poet but it is only at forty one can achieve criticism."*

*-ABERCROMBIE*

# నా సాహిత్య ప్రస్థానం - విమర్శ

గుంటూరు శేషేంద్ర శర్మ

నేను 1939లో మాగ్రామానికి సమీపంలో ఉన్న పట్టణంలో హైస్కూల్లో 3వ ఫారంలో చేరాను.ఆ రోజుల్లో పట్టణం చదువు అంటే ఇంగ్లీషు చదువు. గ్రామంలో సంస్కృత సాహిత్యం ప్రధానంగా, తెలుగు దానికి అనుబంధంగా విద్యాభ్యాసం జరుగుతుంది. సంస్కృతం ద్వారా నాకు తెలిసిందేమిటంటే ఒక కావ్యంలో ప్రతి శ్లోకాన్ని షడంగరూపమైన ఒక సహాయక సాధనం ద్వారా విద్యార్థికి బోధపరచేవారు. ఆ సాధనంలో 1) పరిచ్ఛేదము (శ్లోకంలో) ఉన్న సంధులు, సమాసాలు ఇత్యాదులను విడిచి శ్లోక క్రమంలోనే ఉంచి చూపించడం. 2). అర్థము (శ్లోకంలో ఉన్న శబ్దాలకు అర్థం చెప్పబడటం) 3). ఆకాంక్షా "బభూవ భావేషు దిలీపనందనః" (రఘు. 3స. 41 శ్లో.) అని శ్లోకాంతంలో ఉందనుకోండి- దీనికి ఆకాంక్షా-బభూవ= ఆమెను-కః= ఎవడు? దిలీపనందనః= దిలీపుని పుత్రుడైన రఘుమహారాజు-ఇలా శ్లోకాంతర్గత శబ్దాలకున్న పరస్పర సంబంధం తెలుపుతూ శ్లోకాన్ని వివరిస్తుంది ఆకాంక్ష. 4) శబ్దాస్సమాసాశ్చ-ఇందులో శబ్దాల విభక్తి ప్రత్యయాలు ఏకద్విబహువచనాల్లో ఎలా ఉంటాయో ఆ రూపాలు చూపించబడతాయి. (శ్లో. 41.) జలేన-జలాభ్యాం-జలైః. 5) వ్యాఖ్యానము-"పరిచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్య యోజనా, ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్" అని నిర్వచనం. ఈ పంచ లక్షణములు కలిగిన వ్యాఖ్యానము చేత శ్లోకం సంస్కృత భాషలో వివరింపబడుతుంది. 6). భావము-అంతిమ ఫలిత రూపంగా శ్లోకభావం తెలుగులో సరళంగా చెప్పబడుతుంది. ఇలా ఒకటి, రెండు కావ్యాలు చదువుకునే సరికి విద్యార్థికి సంస్కృత భాషతో సన్నిహితపరిచయం ఏర్పడుతుంది.

ఇదేగాక కావ్యాలను వృత్తి. పద్ధతి, భాష్యం, సమీక్ష, టీక, టుప్టీక, కారిక, వార్తికం, వివేకం, వ్యాఖ్యానం అనే వివరణ ప్రక్రియల చేత గూడా కావ్యాలు పాఠకులకు సుబోధములుగా చేసేపద్ధతి సంస్కృత సాహిత్యంలో ఉన్నది. ఈ సంస్కృత పద్ధతి యొక్క

సంక్షిప్త రూపమే తెలుగు ప్రబంధాలు బోధించడానికి తెలుగు సాహిత్యంలో వాడబడింది.

నేను హైస్కూలు చదువుకు వెళ్ళేసరికి, ఈ విషయాల సమగ్ర పరిచయం నాకుంది. ఆ నాటి ఇంగ్లీషు చదువుల్లో Words Worth, Keats, Shelly ఇత్యాది కవులు, Twelveth Night, King Lear, Macbeth లాంటి Shakespeare నాటకాలు Oliver Twist, David copperfield ఇత్యాది Charles Dickens నవలలు, Walter Scott నవలలు చదివించే వాళ్ళు. ఇది స్కూలు, కాలేజీలకు పరిమితమైన ఇంగ్లీషు చదువు స్వరూపం. కాని, నేను నా అపార కుతూహలం, ఆసక్తి చేత ఇంగ్లీషు సాహిత్యమే కాక మూలత: సంస్కృతాంధ్ర సాహిత్యాలను, శాస్త్ర జ్ఞానాన్ని అధికంగా విస్తృతం చేసుకున్నాను. నా జీవితంలో కౌమార్యము, యౌవనాలలో మొదటి భాగం కేవలం అధ్యయనానికే పరిమతమై ఉండేది. యౌవన దశ రెండో భాగంలో తొలకరి చినుకులు లాంటి పద్యాలు వ్రాసే వాణ్ణి. కొన్నింటిని నా జనవంశంలో చేర్చాను. చిన్న వాణ్ణి; జ్వరంతో హాల్లో మంచంలో పడుకోని ఉన్నాను. ఎదుట మా "పూలదొడ్డి" అనే పూలచెట్లు ఉన్న ప్రాంగణం ఉంది. శ్రావణ మాసం. జల్లులు పడుతున్నాయి. ఆ పూవుల్ని చిగుళ్ళని, ఆకుల్ని చూస్తూ నా మనస్సు ఒక పద్యాన్ని అల్లింది.

శ్రావణ మేగుదెంచెను విశాలనభమ్ముల మేఘమాలికా
రావ పరంపరల్ శ్రవణ రమ్యములై వినిపించె, మాధురీ
భావము లంకురించి మధుపాత్రను జేసె మదంతరంగమున్
నీ వదనారవింద మొక నిస్తులశోభ వెలార్చె నెచ్చెలీ!

(ఈ నెచ్చెలి ఒక ఊహ) తర్వాత మెల్లిగా లేచి ఈ పద్యం ఒక కాగితం మీద వ్రాసి ఉంచాను మరచి పోతానేమోనన్న భయంతో.

తాత్పర్యం- నా జీవితంలో ప్రథమ పాదం నిరంతరాధ్యయనంతోనే నిండిపోయింది. " నరుడు నక్షత్రాలు", "ఊహలో", "విశ్వవివేచన", "సాహిత్య కౌముది", "స్వర్ణహంస", "షోడశి" ఇత్యాది నా గ్రంథాలు నా నిబిడ అధ్యయన మగ్నతని సూచిస్తాయి. తెలుగులో "విమర్శ" అనే మాట నే నప్పటికి ఎఱుగను. నా జ్ఞానాన్ని , తదుపజ్ఞములైన నా ఊహల్ని ముందు వ్రాస్తూ ఉండేవాణ్ణి. వాటిని పత్రికలకు పంపేవాణ్ణి. అవన్నీ ప్రచురితము లయ్యేవి.

భూగోళానికి మా ఊళ్లో వెడల్పైన సొరంగం తవ్వుతూ పోతే భూగోళానికి అవతలి వైపు ఎక్కడ చేరుతావు? అని ఊహ వచ్చేది. (మా ఇంట్లో అప్పుడు నుయ్యి తవ్వుతున్నారు. దాన్ని చూసి ఈ ఊహ బయలుదేరింది). బహుశా కోస్టారికా, పనామా, హవాయి, హోనలులు చేరుతామేమో అని తోచేది. ప్రపంచ మ్యాపు పెట్టుకొని లెక్కలు వేస్తూ పోయేవాళ్ళు. కాని భూగోళపు కేంద్రం దాకా మనం సొరంగంలోకి దూకినట్లు ఉంటుంది. అక్కణ్ణించి భూమ్యాకర్షణ శక్తి మనకు వ్యతిరేకంగా పనిచేస్తుంది. భూమి మీద విమానం భూమ్యాకర్షణ శక్తిని ఎదుర్కొంటూ ఎలా పైకి లేవాలో భూగోళ కేంద్రం చేరిన తర్వాత అక్కణ్ణించి అవతలివైపుకు చేరే వరకు భూమ్యాకర్షణ శక్తితో పోరాటమే! అయితే, భూగోళం డయా మీటర్లో సగభాగం దూరం ఏ శక్తినీ వినియోగించ నవసరంలేకుండా సుళువుగా వెళ్ళిపోతాం. అంటే మానవ ప్రయాణం కోసం చేసే ఖర్చు సగం తగ్గుతుంది . . . . . .

ఈ ప్రథమ పాదం గడిచిన తర్వాత ముఖ్యంగా సంస్కృత సాహిత్యంలో నాకు కలిగే సందేహాలకు సమాధానాలు అన్వేషిస్తూ ఉండేవాణ్ణి. అందులో నుంచే స్వర్ణహంస, షోడశి గ్రంథాలు జన్మించాయి. తర్వాత సాహిత్య కౌముది వచ్చింది. నాకు పద్యమంటే పంచ ప్రాణాలు. ముఖ్యంగా ధారాశుద్ధి ఉన్న చమత్కృతి భరితమైన శ్రీనాథుడి పద్యాలు, పోతన్న, తెనాలి రామకృష్ణుడు, నాచన సోమనాథుడు, జక్కన, పినవీర భద్రుడు ఇలాంటి కవుల పద్యాలు కంఠస్థమై ఉండేవి. ఒంటరిగా అరుగు మీద కూర్చోనో, వేప చెట్టు కింద మంచం మీద పడుకోనో ఆ పద్యాలు కంఠమెత్తి చదువుతుండేవాణ్ణి. అందులో ఎంత ఆహ్లాదం పొందేవాణ్ణో చెప్పడానికి మాటలు చాలవు.

"ప్రవహించు నెందేని భాగీరథీ గంగ ఉపకంఠమున హారమో యనంగ . . . ."

"శివుని నివాళించు శేషాహి నడురేయి బహుఫణారత్న దీపములచేత . . . ."

"పాదాభిహతి సప్త పాతాళములతోడ ఉర్వీకటాహ ముద్రూత లూగ . . . . ."

"జిలుగు సంధ్యారాగ చీనాంబరము గట్టి కుసుమ గర్భముగ కీల్గొప్పు దురిమి . . . ."

"మన్మథ భుజానత పుష్పధనుర్మధూళి ధారామధురోక్తి గుంభన భర స్ఫురణా పరిణాహచాతురిన్ . . . ."

"నల్లని వాడు పద్మనయనంబుల వాడు . . . ."

"సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపడు . . . . "

"గనయంబున్ గొనయంబు నెన్నడుముతో కర్ణావతంసంబుతో . . ...లక్ష్మీభూత దైతేయ తర్జన గర్జారవ జర్జరాంగ రుధిరాసారంబు తోరంబుగన్ . . ."

"అరి జూచున్ హరి జూచు చూచుకము లందంద మందార కేసర మాలా మకరంద బిందు సలిలస్యందంబు లందంబులై . .. ."

ఇలా పద్యాలంటే పిప్పరమెంట్లలా చప్పరిస్తూ ఆనందంలో మునిగి పోయేవాణ్ణి. నాకు దైవ యోగం చేత ఆ రోజుల్లో అలాంటి స్నేహితులే దొరికారు. ఆంధ్రపద్య సృష్టి ఇంత అనధిగమనీయ సమ్మోహకత్వం కలిగినది అవడం చేత ఆ ప్రాచీన కవులే శైలిలో. శబ్ద ప్రయోగంలో, శబ్ద చయనంలో, శబ్ద సంయోజనంలో ఇలాంటి ఎన్నో కళాత్మక ప్రక్రియల్లో ఒకరినొకరు అనుసరించడానికి వెనుకాడేవారు కారు.

"ఘనమైన రారాపు చనుదోయి రాయిడి దుంబీ ఫలంబు దుందుడుకుజెంద" అనే అల్లసాని పెద్దన పాదమునకు మాతృక శ్రీనాథుని

"ఘనమైన రారాపు చనుదోయి రాయిడి నిరుపేద నడిమికి వెరపు జూప"

"పుడమిపై నడనేర్చి అడుగు పెట్టిన నాడె ధర్మంబు నాల్గు పాదముల నిలిపె!"

"జలిబిలి పలుకులు పలుక నేర్చిన నాడె సత్య భాషా హరిశ్చంద్రు డాయె!" అను పాండురంగ మాహాత్మ్య పద్యానికి జక్కనలో

"అడుగెత్తి అల్లన నడువ నేర్చిన నాడె ననిచి ధర్మము త్రోవ నడువ నేర్చె!"

"లలి తొక్కు పలుకులు పలుక నేర్చిన నాడె పరికించి సత్యము పలుక నేర్చె!"-అని కలదు.

ఇది సంస్కృత సాహిత్యంలో కూడా ఉంది. వాల్మీకి భాస కాళిదాసాదుల్లో ఎలా ఉన్నాడో నేను షోడశిలో, కాలరేఖలో చూపించాను. 11వ శతాబ్ది వాడైన భవభూతి ఉత్తరరామ చరిత నాటకంలో పంచమాంకంలో ఉన్న "ఆగర్జద్గిరి పుంజ కుంజర ఘటానిస్తీర్ణ కర్ణజ్వర" పాదంలో "నిస్తీర్ణ కర్ణ జ్వర" అనంతర కవి జయదేవుని గీత గోవిందంలో

"ఉన్మల న్మధుగంధలుబ్ధ మధుప వ్యాధూత చూతాంకుర క్రీడత్కోకిల కాకలీకలరవై రుద్గీర్ణ కర్ణజ్వరాః" అయింది. ఉభయత్ర సందర్భమూ, అర్థమూ పరస్పర తుల్యములే-ఉద్గీర్ణ= కలుగ జేయబడిన-నిస్తీర్ణః= దత్తః ఇవన్నీ ఎప్పుడు దృశ్యమాన మవుతాయంటే "అంభోధు లేడింటి నాపోశనం బెత్తి! కలిగించే నెవ్వాడ క్రమ్మఅంగ" అన్నట్లు సంస్కృతాంధ్ర సాహిత్యాంభోధులను ఆపోశనము పట్టిన వాడికే ఈ విరాట్ సత్యాలు దర్శన మిస్తాయి. " "మునిర్జయతి యోగీంద్రో! మహాత్మా కుంభ సంభవః, యేనైక చుళుకే ద్రష్టా దివ్యౌతౌమత్స్య కచ్ఛపౌ" అన్నా డొక దర్శన తత్త్వ మెరిగిన మహానుభావుడు.

ఇలా ఈ సముద్రాల్లో ఈత కొడుతూ దివ్యదర్శనంతో అనిదంపూర్వోక్తములైన అనన్యాదృశములైన జాజ్జ్వల్య మాన సత్యాలను తెలుగు జాతికి నేను ఆ పరమేశ్వరి కృపతో చూపించాను. ఎందరో ఉద్దండ పండితులు హర్షోల్లాస పులకితులై నా గ్రంథాలను రాగ ద్వేష రహిత వచస్సులతో ప్రశంసించారు. నా జీవితం ధన్యమైంది.

కానీ, కవిత్వ రచనా క్షేత్రంలోకి వచ్చేసరికి కవిత్వ మంటే ఏమిటో ఎరుగని వారు అసంఖ్యాకులు కవిత్వం పేరుతో కవిత్వ రచనలు చేస్తూ, వాటిని కవిత్వ మంటూ రాజకీయ జంబాల పటల కలుషిత సంస్థలచేత అవార్డులు పొందుతూ కవిముద్రలు వేయించుకొని వీరభద్ర తాండవం చేస్తున్నారు. అప్పటికీ నేను విద్వదామోదము పొందిన "సొరాబు" ,"ఋతుఘోష", "పక్షులు" అనే కృతులు వ్రాసి ఉన్నాను. కానీ, ఈ కవినామక అకవుల గుంపులు చేస్తున్న ఘోరవీర తాండవ ఘోషకు తట్టుకోలేక నేను దైనందిన వ్యవహారంలో ఉన్న భాషలోనే కవిత్వం వ్రాసి పాఠకుల్ని చేరగలిగాను. నా పాఠకుల సంఖ్య అనతికాలంలోనే అప్పటికే వీర తాండవం చేస్తున్న కుహనాకవుల పాఠక సంఖ్యకంటే అత్యధికం అయింది. పైగా కుర్చీ లెక్కి కూర్చొని మఠాధిపతులుగా వ్యవహరిస్తున్న కుహనాకవుల కుర్చీలు కూలిపోయాయి. వాళ్ళు కేవలం భ్రాంతి కల్పించే సభలు పెట్టుకోవడం, పత్రికల్లో, టి.వి.ల్లో ఫోటోలు వేయించుకొని, ప్రశంసలు వ్రాయించుకుని తెల్లవారి మొహంకడుక్కునేముందే వాటిని చూసి ఆనందించి ఆత్మవంచన చేసుకుంటూ జీవించ వలసిన స్థితి ఏర్పడింది. వీరికి మృదంగం వాయించే వాళ్ళుగా విమర్శకులనే ఒక జాతి తెలుగు గడ్డ మీద పుట్టింది. ఆంధ్రభారత విమర్శ వ్రాసిన కోరాడ రామకృష్ణయ్య, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ ఇత్యాదులు విమర్శ వ్రాసిన యుగం అంతరించిపోయింది. ఈ కొత్త మృదంగ విమర్శకుల ధోరణి

పూర్తిగా భిన్నమైంది. ఇలాంటి విమర్శకులు మఠాధిపతులైన కవులు కలిసి తెలుగు కవిత్వం ఒక చరిత్రాత్మకమైన మలుపు తిరిగింది. యువతరం కవులందరూ నా కవితా పద్ధతిని అనుసరించి, పాడివచనపు ఎండుగడ్డి లాంటి రచనలు వ్రాసే వాళ్ళను దూరం చేసి నేను వ్రాస్తున్న కావ్య భాషలో కవిత్వం వ్రాయడం ప్రారంభించారు. కావ్యభాషను మనం ఇంగ్లీషులో 'Metophorical language' అనవచ్చును. ఆ యువతరమే కవిసేన ఉద్యమం తెచ్చారు. ఉద్యమం అటు విశాఖ పట్టణం నుంచి ఇటు తిరుపతి వరకు, ఇటు మచిలీపట్నం నుంచి అటు అనంతపురం వరకు తీవ్రంగా వ్యాపించింది. అనంతపురం, విశాఖపట్నం, నరసరావు పేట, నెల్లూరు, హైదరాబాదు ముఖ్య కేంద్రాలయ్యాయి. ఈ తుఫాను ధాటికి పూర్వం చెత్త వ్రాస్తున్న కుహనాకవులు కూడా ఈ నూతన కవిసేన ఉద్యమ శైలినే అవలంబించడం ప్రారంభించారు. ఈ చారిత్రాత్మక పరిణామం గత శతాబ్దం ఆరవ దశకం ఉత్తరార్ధం నుంచి ప్రారంభించి 7వ, 8వ దశకాల్లో స్థిరపడిపోయింది. పూర్వం భారత దేశంలో గౌరవస్థానం లేని తెలుగు కవిత్వం ఈనాడు భారత దేశంలో అగ్రస్థానం గడించింది. కవిసేన వారు కోరగా నేను 'కవిసేన మానిఫెస్టో' వ్రాశాను. ఇందులో భారతీయ ప్రాచీన కావ్య శాస్త్ర పరంపర ఆనాటి గ్రీకు రోమన్ కావ్యశాస్త్ర పరంపర, ఆధునిక యుగంలో పాశ్చాత్య సాహిత్య విమర్శ, మార్క్సియన్ కావ్యశాస్త్రం- ఈ నాలుగింటినీ జోడించి సాహిత్యంలో మూలభూతమైన ప్రశ్నలకు ఈ నాలుగు ఒకే సమాధానం చెబుతాయి అని నిదర్శన పూర్వకంగా సిద్ధాంతీకరిచాను. ఈ 'కవిసేన మానిఫెస్టో' అనే ఆధునిక కావ్య శాస్త్రాన్ని చదివినట్లయితే ప్రపంచంలో మరి ఏ కావ్య శాస్త్రాన్ని చదవనక్కరలేదు. అన్నీ ఇందులోనే ఉన్నాయి. ఇది ఒక అపూర్వ గ్రంథం. కొందరు ఈర్ష్యాళువులు, సమాచారం తెలియని వాళ్ళు 'కవిసేన అని పేరేగాని వాస్తవంగా ఏమీ లేదు' అని ఆత్మవంచన చేసుకొని సంతోషిస్తుంటారు కానీ, కవిసేన ఆంధ్రసాహిత్యంలో ఎప్పుడూ రానంతటి సాహిత్య పరమైన ఉత్కృష్ట ఉద్యమం. కవిత్వ రచనాపద్ధతిని సంపూర్ణంగా మార్చివేసినంతటి శక్తిశాలి ఉద్యమం. ఇప్పుడు కూడా ఖమ్మం జిల్లా ఇత్యాది ప్రాంతాల్లో పశ్చిమ బెంగాల్లోని ఖరగ్‌పూరులో కూడా కవిసేన పనిచేస్తోంది. ఇప్పు డందరూ "కవిత్వ"మే వ్రాస్తున్నారు. నా స్వప్నం సఫలమైంది. నాకు కావలసిం దేమిటి?

దేశ శ్రేయస్సు, సాహిత్య శ్రేయస్సు- ఇవి నెరవేరిన తర్వాత 'ఏది, మా కవిసేన ఎక్కడుంది?' అని ఎవ డేడ్చినా ఫరవాలేదు. ఉద్యమం అంటే టికెట్లు, చందాలు, సభ్యత్వం అనే పదాలతో నడిచే సంస్థ కాదు. ఉద్యమం ఒక ఋతువు. కాలవశాన వస్తుంది. ఋతువులా దాని ప్రభావం చూపిస్తుంది. కార్యం ఫలించగానే ఋతువు వెళ్ళిపోతుంది. ఇది విమర్శకులు తెలుసుకొని ఈ ఉద్యమం యొక్క ప్రాముఖ్యాన్ని రికార్డు చేయాలి. అలా చేయని వాళ్ళు సారస్వత ద్రోహులు అనబడతారు. విమర్శకులు రాగద్వేషరహితంగా న్యాయమూర్తుల్లా ఉండాలి.

ఇప్పుడు తెలుగు ప్రజలు చదువుతున్నది కవిసేన కవిత్వాన్నే. అందరూ మళ్ళీ ఒకసారి కవిసేన మానిఫెస్టోని చదవండి. "కొమ్మలు చీల్చుకొని వస్తున్నపూలు" అనే కవిసేన కవితా సంకలనాన్ని చదవండి. గత ముప్పై ఏళ్ళుగా నడిచిన చరిత్రను అవగతం చేసుకోండి. సత్యానికి న్యాయం చేయండి. తద్వారా ధన్యులవండి.

-ooo-

# జీవియస్ విమర్శ ప్రస్థానం

జి.వి. సుబ్రహ్మణ్యం

నా జీవిత యాత్ర మొదలైంది 1935లో.

నా విమర్శ ప్రస్థానం ప్రారంభమైంది 1955లో.

ప్రస్థానం అంటే లక్ష్యశుద్ధితో చేసే ప్రయాణం. పురోగతి, సాహితీ దర్శనం అనే అర్థాలు రూఢిలో ఉన్నాయి. ఈ మూడర్థాలూ నా సాహిత్య ప్రస్థానంలో విమర్శపరంగా సార్థకమయ్యాయి. కవిగా, నాటక కర్తగా, కథకుడుగా, నవలాకర్తగా, విమర్శకుడిగా, నటుడుగా, కళాకారుడుగా నా జీవితంలో సాహితీ ప్రయాణం సాగించాను 1950 నుంచే. నేటికీ ఆ మార్గాలన్నిట్లో అడపాదడపా నడక సాగిస్తూనే ఉన్నాను. కాని, 1955 నుంచి సాహిత్య విమర్శ నన్ను పురోగతి పంథాలో ముందుకు నెట్టింది.

1950లో పర్చూరులో ఎస్.ఎస్.యల్.సి. చదివేటప్పుడే పాటలు పద్యాలు రాసేవాణ్ణి. నాటకాలు వేసేవాణ్ణి. ఆ తరువాత 1955 వరకూ నిజాంకళాశాలలో ఇంటర్, బి.ఏ., చదివాను. నాలో వికసిస్తున్న సాహిత్య కళాచైతన్యానికంతా నా కళాశాల జీవితం ఎంతో దోహదం చేసింది. తెలుగు సాహిత్య విద్యార్థుల్లో వ్యాసకర్తగా ప్రథమ స్థానంలో, వక్తగా రెండో స్థానంలో ఉండేవాణ్ణి. సాలార్‌జంగ్ హాల్లో. జంటనగరాల్లో జరిగే కవిసమ్మేళనాల్లో నా పాటలూ, పద్యాలూ వినిపిస్తూ ఉండేవాణ్ణి. కవిత్వమంటే అప్పుడెంత పిచ్చంటే- నేను తెలుగు సారస్వత-సమితి కార్యదర్శి పదవికి పోటీచేసినప్పుడు నా ప్రచార కరపత్రాన్ని పద్యాల్లో రూపొందించాను. అప్పటి విద్యార్థులు ఎంతో రసికులు. కవిత్వమంటే కళలంటే ఎంతో అభిమానం చూపించేవారు. ఆ తరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1955-57 మధ్య ఎం.ఏ., చేశాను. అప్పుడూ నా రచనా వ్యాసంగమే విద్యార్థి రాజకీయాల్లో నాకొక అస్తిత్వాన్ని కలిగించింది. ఆర్ట్స్ కళాశాల తెలుగు విద్యార్థి సమితికి అధ్యక్షుడనయ్యాను. ఆంధ్రాభ్యుదయోత్సవాలలో సి.నా.రె. చేపట్టి కళాత్మకంగా నిర్వహించిన కార్యక్రమ వ్యాఖ్యానాన్ని వారి తరువాత నేనే అందుకొని నిర్వహించాను. నాటకాలలో బహుమతులు

పొందాను. రేడియో నాటకాల్లో విరివిగా పాల్గొన్నాను. వ్యాస రచనలో ప్రథముణ్ణి కావటంచేత, బి.ఏ.లో, ఎం,ఏ.లో. తెలుగులో ప్రథమునిగా ఉత్తీర్ణుణ్ణి కావటంచేత విద్యార్థి లోకంలో మంచి గుర్తింపు వచ్చింది. దానితో పాటు పేరు నిలువబెట్టుకొనే బాధ్యత కూడా పెరిగింది.

**ప్రస్థానంలో తొమ్మిది పంచవర్ష ప్రణాళికలు:**

నా జీవిత యాత్రలో ప్రతి అయిదేళ్ళకూ ఏదో మార్పు వస్తుండేది. అది నా పురోగతికి కొత్తబాటలు వేస్తుండేది. ఇది జాతక ఫలమేమో తెలియదు. 1955 నుండి 2000 దాకా నా ప్రస్థానంలో తొమ్మిది పంచవర్ష ప్రణాళికలు ప్రవర్తిల్లాయి. అందులో అనుమానం లేదు. ప్రణాళికలని ఎందుకంటున్నా నంటే - అవి నేను స్వయంగా రూపొందించుకొని, స్వయంకృషితో, స్వీయ దర్శనంతో సాధించుకొన్నవే. అందువల్ల నా సాహిత్య విమర్శ ప్రస్థానం సప్రయత్న సార్థక పురోగమనమే. నా రచనలన్నీ ఆయా కాలాల్లో, ఆయా రంగాల్లో నేను నిర్వహించవలసిన విమర్శక పాత్రను గుర్తించి దానికి తగినట్లు వేసిన ముందడుగులే. అంటే-నేనేం రాస్తున్నానో, ఎందుకు రాస్తున్నానో, దానివలన సాహిత్య వికాసంలో ఏ లోపం పూరించబడుతుందో, ఏ చైతన్యం బలోపేతమై విస్తరిస్తుందో, ఏయే ప్రయోజనాలు సాధించబడతాయో తెలిసే రాశానన్నమాట! అటువంటి ప్రవృత్తిని- బాగా చదవటంవల్లా, నిత్య జాగృతి శీలాన్ని అలవరచుకోవటం వల్లా, ఏదో కొత్తది చెప్పాలన్న తపనను ప్రజ్వలింపచేసుకోవటం వల్లా, విమర్శ ప్రగతికి తోడ్పడే వ్యూహాన్ని దర్శించటం వల్లా, అవిచ్ఛిన్నమైన అభ్యుదయాన్ని సాధించాలన్న సాహితీ స్పృహ వల్లా- నాలో సజీవంగా, బలంగా పెంపొందించుకోగలిగాను.

నా మొదటి పంచవర్ష ప్రణాళికకు పూర్వరంగం 1950-55 మధ్య సిద్ధమయింది. హైదరాబాదు నగరం నా సాహిత్యజీవితానికి పెంపుడుతల్లి. శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయం, నిజాంకళాశాల గ్రంథాలయం, మా అన్న బిదురు వేంకట శేషయ్య గారి సొంత గ్రంథాలయం- నాకు నిరంతర అధ్యయన కేంద్రాలుగా ఉండేవి. మా అన్నగారు సమకాలీన గ్రంథాలయ సాహిత్యోద్యమాల్లో చురుకుగా పనిచేసినవారు. ప్రతి అంశంలోనూ కొత్తగా వస్తున్న విశేషాలను విశ్లేషించి తెలుసుకోవాలనే ఆసక్తి ఆయనలో తీవ్రంగా ఉండేది. ఆ ప్రవృత్తిని ఆయన నాలో వెలిగించారు. వారు 'మేధావి' మాస పత్రికకు సంపాదకులు. ఆయనకు సహాయకునిగా ఉండి పత్రికా నిర్వహణ, రచనా వ్యాసంగాలను నేర్చుకున్నాను. తెలంగాణా రచయితల

సంఘ కవి సమ్మేళనాలు, విద్యార్థి కవితాగోష్ఠులు, వివిధ సాహిత్య సభలు, ఆంధ్రసారస్వత పరిషత్తు నిర్వహించే బహుముఖ కార్యక్రమాలూ మమ్మల్ని ఆకర్షించేవి. కొన్నిట్లో మేం పాల్గొంటున్నా అంతకంటే మించి వాటినుంచి ప్రత్యక్షంగా పరోక్షంగా నేర్చుకొన్న సాహిత్య సంస్కారం, విజ్ఞానం అపారం. ఆ రోజుల్లో సభల్లో ఉపన్యాసాలు ఊకదంపుడుగా ఉండేవికావు. పదిగ్రంథాలు చదివిన పెట్టుగా ఉండేది. ఒక స్థాయిలో లేకపోతే వినేవాళ్ళు వాటిని నిరాకరించేవారు. అందువలన సాహిత్య సభలకు వెళ్ళితే ఆ రోజుల్లో మనసూ మేధా వికసించినట్లయ్యేవి. ఈ వాతావరణంలో పెరిగిన నాకు రాసినా, మాట్లాడినా వెలుగులు చిమ్మే విద్యగా ఉండాలన్న సంస్కారం నా నరాల్లో జీర్ణించుకొని పోయింది.

దీనితో పాటు నా దృష్టి ప్రధానంగా సాహిత్యంలో, అభిరుచుల్లో, ప్రయోగాల్లో కళాప్రదర్శనల్లో వస్తున్న మార్పులను గురించి, వాటి విలువలను గురించి విచారించే పద్ధతి మీద ఎక్కువగా లగ్నమౌతూ ఉండేది. నిజాం కళాశాల విద్యార్థి పత్రికలో ప్రచురితమైన నా మొదటి వ్యాసం 'మార్పు'. 'Old orders changeth yielding place to new' అనే మిల్టన్ మహాకవి సూక్తి నా అధ్యయన పద్ధతి కొక మౌలిక విన్యాసంలా మారిపోయింది. దానితో ప్రతిదాన్ని గురించి ఎన్నో ప్రశ్నలు, అనుమానాలు కలుగుతుండేవి, వాటికి తర్కబద్ధమైన సమాధానాలకోసం పుస్తకాలను, పండితులను, పత్రికలను, మిత్రులను సంప్రదిస్తూ ఉండేవాణ్ణి. అందుకే -

ఇది నా ప్రస్థానానికి పూర్వరంగం - ఒక ప్రశ్నోపనిషత్తు. అందులో నాకు దొరికిన సమాధాన మేమంటే- మన ప్రశ్నల కన్నింటికీ సమాధానాలు దొరకవు. కాబట్టి కొన్నింటికి మనమే సత్యాన్వేషణం చేసి సమాధానాలు చెప్పాలి. ఆ చెప్పే అవకాశం కాలం మనకు కల్పించటమే మన అదృష్టం. మన ప్రస్థానానికి అదే పురోగమనం.

1955 నుండి నా సాగిన సాహిత్యవిమర్శ ప్రస్థానాన్ని స్థూలంగా ఈ క్రింది విధంగా విశ్లేషించవచ్చు.

1. 1955-1960 వీరరసంతో సాహిత్యాన్ని వివేచించిన కాలం.
2. 1961-1965 కావ్య కళా విమర్శలో కలం నడిపిన కాలం.
3. 1966-1970 తెలుగు పురాణాలపై వెలుగులు చిమ్మిన కాలం.

4. 1971-1975 వస్తు సంవిధాన కళా రహస్యాలను ఆవిష్కరించిన కాలం.

5. 1976-1980 సిద్ధాంత రాద్ధాంతాల కాలం.

6. 1981-1985 ప్రభావ పరిశీలనం పురస్కార మందుకొన్న కాలం.

7. 1985-1990 ప్రక్రియా విమర్శలో ప్రథమస్థానం కోసం ప్రయత్నించిన కాలం.

8. 1991-1995 నవ్య సంప్రదాయోద్యమ విజయ భేరి మ్రోగించిన కాలం.

9. 1996-2000 సాహిత్య వికాస చరిత్రలో అంతర్గతి సూత్రాన్ని వివరించిన కాలం.

## వీరరసంతో సాహిత్యాన్ని వివేచించిన కాలం : (1955-60)

నేను బి.ఏ., ఎం.ఏ., చదివే కాలంలో మహాభారత విమర్శ నా చుట్టూ ఆవరించింది. ఒక వ్యాస రచనలో బహుమతిగా కోరాడ రామకృష్ణయ్య గారి 'ఆంధ్ర భారత కవితా విమర్శనం', మరొక బహుమతిగా 1954లో వెలువడ్డ విశ్వనాథ వారి 'నన్నయ గారి ప్రసన్న కథా కలితార్థయుక్తి' నాకు వచ్చాయి. ఆ రెంటినీ చదువుతూ మావూరు వెళ్ళాను ఎండాకాలపు సెలవులకు. మా నాన్నగారు గూడ వీరరాఘవయ్య గారు ఆంధ్రమహాభారతాన్ని నాచేత చదివించుకొని విన్నారు. ఆ తరువాత ఆంధ్రసారస్వత పరిషత్తువా రిప్పించిన మహాభారతోపన్యాసాలను విన్నాను. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విద్యార్థులం భారతం మీద సెమినార్ వ్యాసాలు తయారు చేసి చదివాం. ఇలా దాదాపు మూడు నాలుగేళ్ళు భారత సాహిత్య విమర్శలో మునిగి తేలాను. భారత విమర్శలో వస్తున్న పరిణామాలు, మార్పులు పరిశీలించిన తరువాత విశ్వనాథ వారి విమర్శ పద్ధతి నాకు బాగా నచ్చింది. నే నా కాలంలో మహాభారత విమర్శ వికాసంలో ఒక మలుపులో ఉన్నానని ఊహించగలిగాను. అక్కడి నుంచి వెనక్కు పోకుండా, ఎవరినీ అనుకరించకుండా, ముందుకు సాగే ప్రస్థానం కోసం మథనపడుతున్నాను 1958 నాటికి.

నాలో జరిగిన మథనం తెలియడానికి నా వివేచన గమనించ తగింది. 20వ శతాబ్ది ఆంధ్ర మహాభారతవిమర్శలో మార్పులు అయిదు దశల్లో సాగాయని నా కనిపించింది. అవి -

1. వ్యాసభారతం గొప్పది, దాన్ని అనువదించి కవిత్రయం పాడుచేశారని అనుకున్న దశ.

2. చేసింది అనువాదమైనా కవిత్రయం వారు మూలానికి మెరుగులు పెట్టారని వివేచించిన దశ.

3. మూలంతో పని లేకుండా ఆంధ్రమహాభారతాన్ని స్వతంత్ర రచనగా చూడాలనీ, కవిత్రయ కవిత్వాన్ని సాపేక్ష ప్రమాణాలతోనే అనుశీలించాలని అభినవ విమర్శ సాగించిన దశ.

4. తులనాత్మక దృక్పథంతో భారతీయ సాహిత్యాల్లో ఆంధ్ర భారతాని కున్న స్థానాన్ని చారిత్రక, సామాజిక, సాహిత్య స్పృహలతో పరిశీలించే దశ.

5. ఆంధ్ర సాహిత్య వికాసానికి ఆంధ్రభారతం దోహదం చేసిన తీరును సాహిత్య అంతర్గతి సూత్రంతో ప్రక్రియా పరిశీలనతో విలువకట్టే దశ.

వీటిల్లో విశ్వనాథవారు మూడో దశను ఆవిష్కరించిన రోజు లవి. నే నా మార్గంలో విమర్శ ప్రస్థానాన్ని మొదలు పెట్టాను. అందువల్లనే- నా విమర్శలో ఎక్కడా కవిత్రయ మహాభారతాన్ని అనువాదంగా పరిశీలించలేదు. అనుసృజనంగానే అనుశీలించాను. నా చర్చల్లో - మహాభారతంలో రసం, నన్నయ నాటకీయత, శబ్దగుణశాలి నన్నయ చతురశైలి, అర్థగుణశాలి తిక్కన యజ్వశైలి, ఉభయగుణశాలి ఎఱ్ఱయ కావ్యశైలి- ఇటువంటి అంశాలే కనపడతాయి. విశ్వనాథ నుండి నేను ముందుకు సాగే అవకాశాలను ఆయనే అనేక చోట్ల చూపించాడు. ఆయన నడిచి ఆగిన చోటు నుంచి నడక సాగించటం నా ప్రస్థానంలో ఒక కీలకాంశం- అదృష్టవశాత్తు - 1960లో 'ఆంధ్రసాహిత్యంలో వీర రసపోషణం' అనే అంశం మీద ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు పోటీ రచనను ఆహ్వానించారు. ఆ అదను వినియోగించుకున్నాను. అనూచానంగా వస్తున్న శాంతరస ప్రధాన వాదాన్ని కాదని ఆంధ్రమహాభారతం ధర్మవీర ప్రధానమని నిశ్చయించి చెప్పాను. అప్పటి కదొక ముందడుగే. అకాడమి బహుమానం దానికి గుర్తింపు.

నా విమర్శ ప్రస్థానంలో నవ్య సిద్ధాంత ప్రతిపాదన గౌరవాన్ని అందించిన గ్రంథం వీరరసం (1961). ఇది సిద్ధాంత గ్రంథమన్నారు కొందరు. ఒక రసాన్ని గురించి అటు సిద్ధాంత పరంగానూ, ఇటు అనుశీలన అనువర్తనల పరంగానూ ఇంత విశ్లేషణాత్మకంగా వివరించిన గ్రంథం అంతకు ముందు రాలేదని చాలామంది అన్నారు. వీర రస విమర్శకు

ఇదే ప్రమాణ గ్రంథమన్నంత అభిమానం చూపి నన్ను 'వీర రసం సుబ్రహ్మణ్యం, ఘన వీర సుబ్రహ్మణ్యం' అని పిలిచేవారు కొందరు. కీర్తి మాట అటుంచి, సాహిత్య విమర్శకు ఆ రచన చేసిన దోహదం ఇక్కడ గమనించదగింది.

1. అంతకు ముందు శృంగార రస చర్చను గురించిన తెలుగులో రెండు మూడు గ్రంథాలు వచ్చాయి. అవీ సంస్కృతాలంకారికుల భావాలను తెలుగులో ఒక క్రమంలో చెప్పేయత్నాలే. కొత్త ప్రతిపాదన లేవీ అందులో అంతగా లేవు. ఈ నేపథ్యంలో నా వీర రస విమర్శ ఒక ప్రత్యేకతను సాధించింది. వీర రస విషయ సర్వస్వం అనదగినంత సామగ్రితో, శాస్త్రీయమైన అన్వయంతో, వినూత్నమైన విశ్లేషణలతో తెలుగులో వీర రస సిద్ధాంత విమర్శతో పాటు అనువర్తిత విమర్శను చేసిన గ్రంథం అప్పటికీ, ఇప్పటికీ అదొక్కటే.

2. రసవిమర్శలో ప్రక్రియా పరమైన అన్వయం చెప్పే గ్రంథాలు తెలుగులో మృగ్యం. పురాణేతిహాసాల్లో రసస్థితి ఏమిటి? దశ రూపకాల్లో రస స్థితి ఏమిటి?- శ్రవ్య కావ్యాలలో వెలువడే భిన్న భిన్న ప్రయోగాలలో, ప్రక్రియలలో రస నిర్వహణం ఎలా జరుగుతుంది? రస విమర్శను ఎలా సాగించాలి? అనే ప్రశ్నలకు సూత్రపరంగానూ, అన్వయపరంగానూ, అనువర్తిత పద్ధతులు తెలుగులో లేవు. అందువల్ల తెలుగులో నాటక విమర్శలో తప్ప కావ్య విమర్శలో ప్రామాణిక రస విమర్శ వెలువడలేదు. విమర్శకులు చేసిన విమర్శలలో తలాతోకలకు సంబంధం లేనివే ఎక్కువగా ఉన్నాయి. తెలుగులో అవ్యవస్థితంగా ఉన్న రస విమర్శలో ఒక వ్యవస్థిత మార్గాన్ని చూపి విమర్శ పద్ధతులకు వెలుగుబాటలు చూపిన గ్రంథం వీరరసం.

3. అలంకార సంఖ్యలాగా రసభేదాలు పెంచుకుంటూ పోయే పద్ధతి ఒకటి ఉంది. భేదా లెన్ని ఉన్నా అవి నిమిత్తాలను బట్టి ఏర్పడేవే నని, మూలమైన రసం ఒకటేననీ చెప్పే పద్ధతి ఒకటి ఉంది. ఈ రెండూ ఒకే నాణేనికి బొమ్మ బొరుసుల్లాంటివి. వీటిని సమన్వయించి చెప్పినప్పుడే ఆ విమర్శ సమన్వయాత్మకంగా రూపొందు తుంది. ఈ కీలకాన్ని గుర్తించి ప్రతిపాదించటం ఆ గ్రంథంలో విశేషం. ధర్మబద్ధమైన ఉత్కటోత్సాహమే రసస్థితి పొందుతుందని వీరరసపరంగా చెపుతూ. అన్ని రసాలకు

కూడా ఈ ధర్మం వర్తిస్తుందని అన్వయించటం గమనార్హం. రసం ఒకటైనా శృంగారాది రసాలు నిమిత్త భేదాన్ని పట్టి ఏర్పడినట్లుగానే- శృంగారాదులన్నీ నిత్య లక్షణాలు కాకపోయినా, రసానికి నిత్యలక్షణం మాత్రం ధర్మమౌతుందని ప్రతిపాదించటం వీర రస గ్రంథ సిద్ధాంత ప్రత్యేకత. ఈ సత్య ప్రతిపాదన రస విమర్శలో నెలకొన్న గందరగోళాన్ని, అస్పష్టతను, క్లిష్టతను తొలగించి అవగాహన సౌలభ్యాన్ని పెంచింది.

4. అప్పటి సాహిత్య విమర్శలో ఒక అవాస్తవిక ఆలోచన ఉండేది. సాహిత్యంలో కొన్ని రచనల్లో రసం ఉండదనీ, వాటికి రసవిమర్శ చెల్లదనీ. అసలు వాస్తవం అది కాదు. ప్రతి ప్రక్రియకూ ఒక రస విమర్శ సూత్రం ఉంటుందనీ. అన్నింటికీ ఒకే పద్ధతి పనికి రాదనీ, రసం అన్నిట్లోనూ ఉంటుందని అయితే నా వీర రస గ్రంథం ఈ అంశాన్ని విపులంగా వివరించి చెప్పలేకపోయి ఉండవచ్చు (దాని లక్ష్యం అది కాదు కాబట్టి). కాని, రస విమర్శకు పనికిరాని ప్రక్రియ తెలుగులో లేదని చెప్పడానికి ఆ గ్రంథం యత్నించింది.

5. స్వాతంత్ర్య వీరం, మానవీరం, యశోవీరం- అనే భేదాలు నేను చెప్పినవి. అప్పుడు వాటి విలువను గుర్తించిన వారు కొద్ది మందే కాని, నేడు స్వాతంత్ర్య సమరానికీ, జాతీయోద్యమానికీ, విప్లవోద్యమానికీ, ఆధ్యాత్మిక ప్రస్థానానికీ సంబంధించిప అనేక కావ్యాలలో ఈ వీర రసభేదాలు అనువర్తిత విమర్శకు తోడ్పడుతున్నాయి. కాలం గడిచిన కొద్దీ వాటి విలువ పెరగటం హర్షించదగిన అంశం.

6. ఆంధ్ర మహాభారతంలో అంగిరసం ధర్మవీరమనీ, సంస్కృత మహాభారతంలో శాంతమనీ, ఆ రెండింటినీ నిరూపించే పద్ధతులు ప్రక్రియలను పట్టి మారుతాయనీ విడమరచి చెప్పింది వీరరస గ్రంథమే.

7. సంస్కృత రామాయణం కరుణ రస ప్రధానమనే వాదానికీ, రామాయణం ధర్మవీర ప్రధానమనే వాదానికీ మౌలికంగా రస విమర్శ పద్ధతులలోనే తేడా ఉంది. అందులో కరుణ రస వాదానికి సంబంధించిన రసపోషణ విధానం తెలుగులో రామాయణాలకు పొసగదని చెప్పటం వీర రస గ్రంథతాత్పర్యం. చాలామంది ఈ సంగతి పట్టించుకోకుండా నా నిర్ణయాలమీద దాడి చేస్తూ ఉంటారు.

8. వీర రసవాదాన్ని పెద్ద లంగీకరించారు. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారి మాటల్లో- "ప్రస్తుత గ్రంథ రచయితయైన సుబ్రహ్మణ్యంగారు పిన్నవారయ్యు ధీరచింతనులు, స్వతంత్రాలోచనా పరులు. వీరి మతమున వీరమే సర్వమానసిక ప్రవృత్తులకును బీజభూతము. వీరమునకు స్థాయిభావము ఉత్సాహము. కామమే మానవుని యెల్ల యిచ్ఛాక్రియాశక్తులకు పునాదియని యంగీకరించినవారు కూడా వీరము లేనిదే కామము శోభావిహీన మగునని యొప్పుకొందురు. కావున కామముకంటెను మూలప్రవృత్తి యుత్సాహరూపమైన వీరమని అంగీకరింపక తీరదు. ఇట్లు వీరమే 'రసానాం రసః! "(వీర రసం. పీఠిక పు. viii )

9. వీరమే 'రసానాం రసః' అనే వాదాన్ని సంగ్రహంగా, బీజప్రాయంగా, ధర్మవీరమే వీరరసమనే వాదానికి పోషకంగా 'వీర రసం'లో చెప్పటం జరిగింది. ఆ తరువాత దాన్ని ఒక సమగ్ర సిద్ధాంతంగా రూపొందించి "ధర్మ వీర ఏవ రసానాం రసః" అని స్థాపించటం జరిగింది. ఈ పని 1980 నాటికి పూర్తయింది. ఆ కారణాలు వేరు, పరిస్థితులు వేరు. ముందు మనవి చేస్తాను.

నా సాహిత్య విమర్శ ప్రస్థానంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక (1955-1960) సాహిత్య (రస) దర్శనం కోసం చేసిన ప్రస్థానం. సాహిత్య విమర్శలో ఒక సిద్ధాంతాన్ని స్థాపించటానికి సాహిత్యాన్నంతా అనుశీలించి ఎన్ని సమన్వయాలు సాధించే ప్రయత్నం విమర్శకుడు చేయాలో- ఆ బృహత్ప్రయత్నాన్ని చేసి చూపించిన కృషిఫలితం 'వీర రసం'. విమర్శలో నన్ను ఒక ప్రస్థాన కర్తను చేసిన ప్రసిద్ధ రచన 'వీరరసం'.

## కావ్య కళా విమర్శలో కలం నడిపిన కాలం: (1961-65)

1960లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు గిడుగు వేంకట సీతాపతి గారికీ, నాకూ వచ్చాయి. ఆయన అరవై అయిదేళ్ల వారు జ్ఞానవృద్ధులు. నేను ఇరవై అయిదేళ్ళవాడిని. ప్రస్థానం మొదట్లో ఉన్నవాడిని. ఇద్దరికీ పోలిక లేదు. నా మిత్రులు నవ్వుతూ అనేవారు- ఆయనా జీవియస్, నీవూ జీవియస్. ఇద్దరూ జీనియస్‌లే కాబట్టి బహుమతులు అని. అదే సంవత్సరంలో 'పగిలిన గోడలు' అనే నా నాటకానికి ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు నిర్వహించే అంతర్విశ్వవిద్యాలయ నాటక పోటీల్లో ప్రథమ బహుమతి

వచ్చింది. ఆ జోడు గుర్రాల స్వారి చేయాలా? ఏదో ఒక దానికి అంకితం కావాలా? అన్న వితర్కం నాలో మొదలైంది. పెద్దల సలహాతో, అంతరంగ ప్రేరణతో విమర్శరంగానికే అంకితమవ్వాలని నిర్ణయించుకున్నాను. నాటక రంగంలో కంటె విమర్శరంగంలో నేను చేయవలసినవి, చేయగలిగినవి అయిన అంశాలు ఎన్నో కనపడ్డాయి. కాలం కలిసివస్తే వాటిల్లో కొత్త ప్రయోగాలు చెయ్యవచ్చు. కొత్త విశేషాలు కనుగొనవచ్చునని సాహిత్య విమర్శనే నా ప్రధాన ప్రస్థానంగా ఎన్నుకొన్నాను. సృజనాత్మక రంగంలో కీర్తి, ప్రతిఫలం అరటి గెలలాగా తొందరగా వస్తుంది. విమర్శరంగంలో సరివితోటలాగా కాలం పడుతుంది. ఫలం దొరుకుతుందన్న ఆశ కూడా అంతంత మాత్రమే. అయినా 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన'- అని ఆ ప్రస్థానంలోనే ముందుకు సాగాను- ఆత్మవిశ్వాసంతో.

'చిన్న వయసులోనే విమర్శలో పెద్దకీర్తి వచ్చింది. అది జీవితాంతం నిలుపుకో' అన్నది ప్రతివారి నోటా నాకు హితవుగా వినిపించేది. దానితో నా భవిష్యత్ విమర్శ ప్రస్థానంలో ఎత్తుకోవలసిన బరువు అర్థమయింది. నా కున్న అవకాశాల్లో నే నప్పుడు నా ప్రస్థానాన్ని ఈ విధంగా నిర్ణయించుకున్నాను.

ఒక రసం గురించి ఒక గ్రంథం వచ్చింది. ఒక యుగకర్త గురించి, ఒక బృహత్ ప్రక్రియను గురించి, ఒక ఉద్యమాన్ని గురించి - ఇలా భవిష్యత్తులో ప్రామాణిక విమర్శ రాయాలనీ, ఆయా రంగాల్లో అంతవరకు వచ్చిన విమర్శలో కంటె వినూత్నాంశాలను, వినూత్న సమన్వయాలను, అనుశీలనాలను, సిద్ధాంతాలనూ ప్రతిపాదించాలనీ నిశ్చయించుకొన్నాను. రస విమర్శ తరువాత నే నెన్నుకొన్న రంగం కావ్యకళా విమర్శ. నవ్య కావ్యకళా ప్రస్తారానికి యుగకర్తలుగా నేను భావించిన వారు తిరుపతి వేంకటకవులు. అందువలన 1962లో 'తిరుపతి వేంకటకవుల కావ్య సమీక్ష'- అనే గ్రంథాన్ని రాశాను.

నలభైయేళ్ళ క్రిందటి మాట. ప్రాచీన సాహిత్య చరిత్రను ఏదో ఒక పద్ధతిలో యుగవిభజనం చేసికొని అధ్యయనం చేస్తున్నా, ఆధునిక సాహిత్య చరిత్ర నేవిధంగా నిర్మించుకోవాలో స్పష్టమైన అవగాహన కుదురుకోని రోజులు. కందుకూరి, గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి మొదలైన కవులు నిర్వహించిన పాత్రలను బట్టి చరిత్రలో కొన్ని మైలురాళ్ళు నాటుకొంటున్న రోజు లవి. ఈ మైలురాళ్ళను కలుపుకొంటూ వాటిని సరైన

కుదుళ్ళలో పెట్టి ఒక రహదారి వేసిన గ్రంథం డా॥ సి. నారాయణరెడ్డి గారి 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు'. అది 1962లో పుట్టింది. 1967లో ప్రచురించబడింది. ఆ గ్రంథం ఆధునిక సాహిత్య చరిత్రాకాశంలో చంద్రోదయం లాంటిది. దాదాపు అదే కాలంలో వెలువడిన నా గ్రంథంలో ఆధునిక సాహిత్య యుగకర్తల మీది నా నిశ్చితాభిప్రాయాలను కొన్నింటికి తిరుపతి వేంకటకవుల కావ్య సమీక్ష అద్దంపడుతుంది. ఈ రెండు గ్రంథాలు సరళగ్రాంథిక భాషలో రావటం ఒక చారిత్రక వాస్తవం.

నవ్య సాహిత్య యుగంలో సామాజిక స్పృహ ప్రస్థానానికి పితామహుడు వీరేశలింగం పంతులు. సాహిత్య స్పృహ ప్రస్థానానికి పితామహులు తిరుపతి వేంకటకవులు. ఈ రెండు కళ్ళతో ఆధునిక యుగాన్ని చూస్తే ఎన్నో వాస్తవాలు, సమన్వయాలు సాహితీ పరులకు లభిస్తాయని నా ప్రతిపాదన.

పంతులుగారు ఇంటి విత్తనాలు ఎండిపోతే, సీమనుండి కొత్త వంగడాలను తెచ్చి మెట్ట పైరులను పండించి సాహిత్య క్షేత్రంలో కరువు రాకుండా కాపాడిన కర్షకుడు. తిరుపతి వేంకటకవులు అవధాన, ఆశు, కావ్య నాటక కవితాధారలతో తెలుగు నేలను తడిపి, భారతీయమైన తెలుగుదనం ఉట్టిపడే వరివంగడాలను ఆ తడినేలలో నాటి ధాన్య రాసులను పండించి సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నం చేసిన వారు. మెట్టపంటల సీమ వంగడాలు వచనంలో పంతులు గారు పండించినవి. మాగాణి పంటల దేశి వంగడాలు పద్యంలో జంటకవులు పండించినవి. సాహిత్యం ప్రజల కందుబాటులో ఉండాలంటే 'నవల' ఉపకరిస్తుం దనుకున్నారు పంతులుగారు. అవధాన, ఆశు, కావ్య, నాటక కవితలు ఉపయోగపడతాయని నిరూపించారు తిరుపతి వేంకటకవులు. పంతులుగారు గద్య బ్రహ్మలైతే, జంటకవులు పద్య బ్రహ్మలు. పంతులుగారు ఎన్ని రకాలైన పాశ్చాత్య ప్రక్రియలను తెలుగున నిలిపారో, జంటకవులు అన్ని రకాలైన దేశి ప్రక్రియలను తెలుగులో జీవింపచేశారు. వీరిద్దరూ నవ్య సాహిత్య ప్రస్థానానికి రెండు రెక్కల వంటివారు.

నేను మొదటి నుంచీ సాహిత్య స్పృహ ప్రస్థానానికి చెందినవాణ్ణి కాబట్టి ఆ మార్గానికి ఆచార్యులైన తిరుపతి వేంకటకవుల సాహిత్యాన్నంతా ఈ దృక్పథంతో సమీక్షించటానికి పూనుకున్నాను. ఆ సమీక్షలో ఆనాటికి అభినవంగా సాగుతున్న కావ్య కళా విమర్శ పద్ధతిని ఎన్నుకొన్నాను.

తెలుగు సాహిత్య విమర్శ వికాసంలో కావ్యానుశీలనయుగం (1914-48) ముగిసి, శిల్పానుశీలనయుగం (1948-63) బాగా ప్రచారంలో ఉన్నకాల మది. కట్టమంచి వారూ రాళ్ళపల్లి వారూ, దువ్వూరి వారూ కావ్యానుశీలన యుగచైతన్యాన్ని పోషించారు. విశ్వనాథాదులు శిల్పానుశీలన విమర్శ చైతన్యాన్ని బలపరచారు. ఆ రోజుల్లో మూడు మాటలు బాగా ప్రచారంలో ఉండేవి. అవి- కవిత్వతత్త్వం, కావ్యకళ, కవితా (కావ్య) శిల్పం. ఈ మూడూ మూడువాదాలలో నుంచి పుట్టిన పారిభాషిక పదాలు. కాల్పనిక వాదులు ప్రచారం చేసింది కవిత్వతత్త్వం. సాహిత్య సౌందర్య వాదులు ప్రాచుర్యంలోకి తెచ్చింది 'కావ్యకళ'. రసవాదుల దృక్పథానికి ప్రాతినిధ్యంవహించేది కవితా (కావ్య) శిల్పం. ఈ మూడింటినీ జోడించి ఒక సమన్వయ ప్రస్థానాన్ని సాగించాలని యత్నించినవారు పింగళి లక్ష్మీకాంతం ప్రభృతులు, సమన్వయవాదుల దృష్టిలో కావ్యకళా విమర్శ అనే పారిభాషికపదంలో కవితాతత్త్వం, కవితా శిల్పం అంతర్భవించి పోతాయి. కావ్య మొక కళాఖండం. దాని సమైక్య, సమగ్ర (unity and totality) అస్తిత్వాన్ని దర్శించి అనుశీలించటం విమర్శ ధర్మం. కావ్య కళా విమర్శతో విశ్లేషణం, సమన్వయం, అనుశీలనం అనే అంశాలు ఉత్తరోత్తర బలీయాలుగా ఉంటాయి. కావ్యకళానుభవశక్తిని విలువకట్టి వివేచించటమే విమర్శ ప్రధాన ధర్మంగా సమన్వయవాదులు భావించేవారు. 1962 నాటికి ఈ అభిప్రాయం విమర్శలో బలం పుంజుకుంటోంది. తెలుగు విమర్శలో ఇది శిల్పానుశీలనయుగ చైతన్యం నుంచి పుడుతున్న అభినవధోరణి. సి. నారాయణరెడ్డి గారి సిద్ధాంత వ్యాసం ఆ ధోరణికి చెందిందే. దాన్ని ఆవిష్కరించిన తరంలో నేను కూడా ఒకణ్ణని సవినయంగా మనవి చేస్తున్నాను. నా అంచనాప్రకారం ఆ మార్గం బలపడి 1963 నుండి 1970 దాకా విమర్శ చైతన్యాన్ని పాలించింది. ఈ పరిణామాన్ని చారిత్రికంగా గమనిస్తే 'తిరుపతి వేంకటకవుల కావ్య సమీక్ష'లో చేసిన విమర్శ స్వభావంలో ఉన్న అభినవత్వం, నా విమర్శ ప్రస్థానంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో (1961-65) సాధించిన పురోగతిగా స్పష్టమౌతుంది.

కావ్యకళా విమర్శలో పాటించే మౌలికాంశాలు మూడు:

1. కవిత్వాతత్త్వం సాహిత్య దర్శనం మీద ఆధారపడి ఉంటుంది. దర్శన శక్తి యొక్క కళాభివ్యక్తియే కవితాతత్త్వం.

2. కావ్య కళ ప్రక్రియల పరికల్పన మీద ఆధారపడి ఉంటుంది. కావ్య ప్రక్రియా ప్రయోగాలలో కవులు ప్రదర్శించే ప్రతిభనుబట్టి కావ్యకళ రూపుకడుతుంది. ప్రయోగాలకు తగిన సాపేక్ష కళానుశీలన సూత్రాలను నిర్మించుకొని, అనువర్తిత విమర్శలో వాటిని అన్వయించి కావ్యంయొక్క అఖండకళానుభవాన్ని ఆ విష్కరించటం కావ్యకళావిమర్శ.

3. కవితా (కావ్య) శిల్పం- కావ్యం అఖండ కళాఖండం, సమగ్ర కావ్యానందం. దానికి పోషకంగా కావ్య ద్రవ్యాలు, అంగాలూ, రచనా విశేషాలూ ఉండటం శిల్పం. దాన్ని నిరూపించి విలువ కట్టటం శిల్ప విమర్శ.

తిరుపతి వేంకటకవుల కావ్య సమీక్షలో పై మూడు మౌలికాంశాలు ముడిపడి ఉన్నాయి. ఈ మూడింటిని సమన్వయించి కావ్యకళానుశీలనం చేయటమే సమన్వయ యుగచైతన్యం. ఆ చైతన్యాన్ని పుష్కలంగా పండించుకొన్నది నా విమర్శ ప్రస్థానంలో రెండవ దశ.

**తెలుగు పురాణాలపై వెలుగులు చిమ్మిన కాలం : (1966-70)**

నా సాహిత్య విమర్శ పరిశోధన పార్శ్వాన్ని బలపరుచుకున్న బంగారు కాలమిది. 1964లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'మారన మార్కండేయ పురాణం: ప్రబంధ కథా మూలం' అనే అంశం మీద పరిశోధన ప్రారంభించి, 1967లో సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి, 1969లో పి.హెచ్.డి. డిగ్రీని పొందాను. 1969 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి సంక్షిప్త బసవపురాణాన్ని సంపాదించి పీఠిక రాశాను. అందులో బసవపురాణ నిర్మాణం మీద కన్నడ జైనపురాణ నిర్మాణ ప్రభావం ఉన్నదని మొదటి సారి నిరూపించాను. ఈ సందర్భంలోనే తెలుగులో పురాణ ప్రక్రియా పరిణామ వికాసాలను గురించి ఒక అంతర్గతి సూత్రం ఆధారంగా చేసికొని ఒక చిన్న గ్రంథం రాశాను. అది 1974లో ఒకసారి, 1975లో మరోసారి ప్రచురించబడింది. ఈ కృషి నాకు తెలుగులో పురాణ ప్రక్రియా విమర్శపై మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది.

దీనికీ ఒక చారిత్రిక భూమిక ఉంది. ప్రేరణ ఉంది. తెలిసి తెలిసి చేసిన ప్రయత్నముంది. కాలం కలిసి వచ్చింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో సాగిన పరిశోధన ప్రకటించబడని ఒక ప్రణాళిక ననుసరించి సాగినట్లు తోస్తుంది. సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణాన్ని లక్ష్యంగా పెట్టుకొని తొలి నాళ్ళలో పరిశోధనాంశాలను ఎంపికచేసి పరశోధకులకు ఇచ్చినట్లు తెలుస్తుంది. ఆ ఎంపికలలో సాహిత్య ప్రక్రియలకూ, యుగాలకూ, భాషా చారిత్రిక సాంస్కృతికాంశాలకూ ప్రాధాన్యం ఇవ్వటం చూస్తాం. జానపద సాహిత్యం, ప్రాఙ్నన్నయ యుగం, కవిత్రయయుగం, శ్రీనాథయుగం, ప్రబంధయుగం, దక్షిణాంధ్ర యుగం, ఆధునిక యుగం, నాటక ప్రక్రియ, శతక ప్రక్రియ, నవలాప్రక్రియ - ఇలా పరిశోధనాంశా లివ్వబడ్డాయి మొదట్లో . ఆ తరువాత ప్రసిద్ధ కవుల కావ్యాలపై పరిశోధన మొదలయింది. ఆ తరుణంలో నాకు పరిశోధనావకాశం దొరికింది.

పరిశోధనాంశం ఎన్నిక చేసుకోవటం ఒక యజ్ఞం. ఆచార్య లక్ష్మీరంజనం గారూ, ఆచార్య దివాకర్ల వేంకటావదాని గారూ నన్ను పరిశోధనాంశం ఎన్నుకోమన్నారు. 'తెలుగులో శాంతరసపోషణం' అని పేర్కొన్నారు. ఆచార్య లక్ష్మీరంజనం గారు- మీరు వీర రసం మీద చేశారు, ఒక గుర్తింపు పొందారు. మళ్లీ ఆ రసమార్గంలోనే ఎందుకు పయనించటం? మరో పర్వత మార్గాన్ని ఎన్నుకొని మీ ప్రస్థాన ప్రత్యేకతను చూపరాదూ?' అని అడిగారు. 'శాంతరసచర్చ వీరరసచర్చ కంటే కష్టతరమైనది. ప్రాచీనుల అభిప్రాయాలకంటే క్రొత్తగా చెప్పే రంగాలు తక్కువ; కాబట్టి మరొక అంశం ఎన్నుకో' మన్నారు అవధానిగారు. శాంత రస పరిశోధన ప్రతిపాదన మానుకున్నా, శాంత రస చర్చ మాత్రం నేను మానలేదు.

నా మనస్సులో మరొక ఆశ ఉండేది. జానపదసాహిత్యంలో ఆచార్య బి. రామరాజు గారు, నాటక సాహిత్యంలో డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు గారు, శతక వాఙ్మయంతో డాక్టర్ కె. గోపాలకృష్ణరావు గారు, నన్నయ మీద ఆచార్య అవధాని గారు, తిక్కన కావ్య కళాశిల్పం మీద డా॥ రామకోటి శాస్త్రి గారు- ఇలా అటు ప్రక్రియల్లో కొందరు, ఇటు ప్రత్యేక కవుల మీద పరిశోధనలు చేసి కొందరు ప్రామాణిక పరిశోధకులుగా కీర్తి గడించారు. నేనూ ఆ రెండిట్లో ఒక మార్గంలో కాని, రెండూ కలిసిన మిశ్ర పద్ధతిలో కానీ పరిశోధన చేయాలని సంకల్పించుకొని 'పురాణ ప్రక్రియ మీద చేస్తా'నని అభిప్రాయాన్ని వ్యక్తం చేశాను. 'అది చాలా విస్తృతమైన అంశం. పురాణవాఙ్మయం ఏ ఒక్క యుగానికి సంబంధించింది కాదు. వెయ్యేళ్ళ సాహిత్యమంతా పరుచుకొన్నది. పరిమితకాలంలో పరిశోధన ముగించటం

కష్టం. ఒక పురాణం మీద చేయండి' అని అవధాని గారు సూచించారు. 'తెలుగులో మారన మార్కండేయ పురాణం ప్రథమాంధ్ర మహాపురాణం, దానిమీద చేస్తా'నాన్నను. దాని నుండి ఎన్నో కావ్యాలు వస్తుభిక్ష పొందాయి. కొన్ని ప్రబంధ కథలకు అది మూలమైన విధానాన్ని కూడా పరిశీలిస్తా నన్నాను. దానితో పురాణ విమర్శ, తులనాత్మక పరిశీలనం, కావ్యానుశీలన విమర్శ విధానం- అనే శాఖలతో సంపన్నమైన పరిశోధనను చేయవచ్చునని భావించాను. పరిశోధన సమస్యలో ఉన్న బలాన్ని గుర్తించి వారు నాకు పరిశోధనావకాశం కలిగించారు.

నా అదృష్టం ఏమిటంటే - అంతవరకు తెలుగులో మార్కండేయ పురాణం మీద కాని, తెలుగులో ప్రవర్తిల్లిన మహా పురాణ సంప్రదాయ ప్రవృత్తిని గురించిగాని పరిశోధనలు ఆధునిక విమర్శ పద్ధతిలో సాగలేదు. నా కా అవకాశం దొరికింది. ప్రథమాంధ్ర మహాపురాణం ప్రభవ ప్రాభవ ప్రభావాలను గురించి పరిశోధించి ఫలితాంశాలను సప్రమాణంగా ప్రతిపాదించిన ప్రథమాంధ్ర సిద్ధాంతగ్రంథం అయింది నాది. తెలుగులో పురాణ వాఙ్మయ వికాసాన్ని దర్శించాలంటే నా గ్రంథం ముఖద్వారం లాంటిదని చాలామంది పండితులు మెచ్చుకొన్నారు. విషయ సమగ్రత, విశ్లేషణ, సమన్వయ కౌశల్యం, కావ్య కళానుశీలనం అనే గుణాలు ఆ గ్రంథ ప్రశస్తికి ప్రాతిపదికలు. పురాణ విమర్శకునిగా తెలుగులో తిరుగులేని కీర్తిని తెచ్చిపెట్టింది నా పరిశోధన.

'వీర రసం' రస విమర్శలో ఒక విశిష్ట రచన !

'ప్రథమాంధ్ర మహాపురాణం' పురాణ విమర్శలో ఒక ప్రామాణిక రచన!

తీగ కదిపితే డొంకంతా కదిలిం దన్నట్లయింది మార్కండేయ పురాణ విమర్శతో. తెలుగులో వెలసిన పురాణాలన్నీ మార్కండేయం లాంటి పురాణాలేనా? కాకపోతే అవి ఎటువంటి పురాణాలు? మన తెలుగు పురాణ కవులందరూ అనువాదకులేనా? పురాణాలలో ప్రక్రియావైవిధ్యం, ప్రయోగ వైశిష్ట్యం మొదలైనవి ఉంటాయా? పురాణ కవులందరిదీ ఒకే రకమైన కవితాశైలులు లేవే? కొందరి పురాణ రచనలు కావ్య కవితల కంటె అందంగా ఆకర్షణీయంగా ఉండటానికి గల కారణా లేమిటి? అసలు మన పురాణాల ఆవిర్భావం వెనుక ఒక సాహిత్య దార్శనిక స్పృహ, ఒక సమాజిక ప్రయోజన దృష్టి, సమకాలీన పరిస్థితుల ప్రభావం మొదలైనవి ఉన్నాయా? పురాణ ప్రక్రియా వికాస చరిత్రలో ఒక పరిమాణ క్రమం

ఉందా? చివరకు-పురాణం పేరుతో రాసినవన్నీ పురాణాలేనా?- ఇలా ఎన్నో ప్రశ్నలు నాకు ఎదురయ్యాయి. వాటికి సమాధానాలు చెప్పవలసిన బాధ్యత బుజం తట్టింది. పరిష్కారం కోసం పండిత మిత్రులతో చర్చిస్తూండేవాణ్ణి. గ్రంథాలు చదువుతూ ఉండేవాణ్ణి. అనుభవం మీద తెలిసిందేమంటే నా పురాణ విమర్శ ప్రస్థానంలో 'ప్రథమాంధ్ర మహా పురాణం' గ్రంథం మొదటి మజిలీ మాత్రమేనని, ఆ బలమైన పునాదులపై మరోభవనం నిర్మించవలసిన అవసరం ఉందని. సంస్కృత మహాపురాణ సంప్రదాయంలోని ప్రయోగాలన్నీ తెలుగులోకి రూపాంతరం చెంది వచ్చాయి. సంస్కృత ప్రక్రియలతో పోల్చిచూస్తే వాటి ప్రత్యేకత బైటపడుతుంది. అయితే మహాపురాణ సంప్రదాయం కంటే భిన్నమైన మరోమర్గం తెలుగులో సమాంతరంగా సాగుతూ వచ్చింది. అది కొన్నేళ్లు మహాపురాణంతో చేయికలిపింది, మరి కొన్నేళ్ళు పూర్తిగా విడిపోయింది. ఈ ఆటుపోట్లు పురాణ ప్రక్రియలో ఎందుకు ఎలా కలిగాయో తెలుసుకోవలసిన అవసరం ఉన్నదని గుర్తించి, పురాణ వాఙ్మయాన్ని గురించిన అవగాహనను లోతుగా పెంచుకుంటూ పోయాను. అదొక అయిదేళ్ళ నా విమర్శ ప్రవృత్తిని వదలిపెట్టకుండా అనుసరించింది. ఆ కాలంలో ఎన్నో క్రొత్త అంశాలను సమన్వయాలను వెలుగులోకి తెచ్చాను. సాహిత్య చరిత్ర కర్తలు వాటిని ప్రామాణికంగా గ్రహించారు.

వాటన్నింటిలో అగ్రగణ్యం బసవపురాణం మీద జైనపురాణ నిర్మాణ ప్రభావాన్ని నిరూపించి చెప్పిన విమర్శ. 1969లో అది సంక్షిప్త బసవపురాణ పీఠికలో కనబడుతుంది. ఆ పైన ఆ అంశం ఒక సమగ్ర వ్యాసంగా నా 'సాహిత్య సౌరభం' (1970)లో ప్రచురించబడింది. దానితో బసవపురాణం తెలుగులో ప్రథమ దేశి పురాణమనీ, మార్కండేయం ప్రథమ మహాపురాణమనీ ఒక వాస్తవం బయట పడటంతో సాహిత్య చరిత్రలో పురాణాలను గురించి రాసే పద్ధతిలోనే మౌలికమైన మార్పు వచ్చింది. నా 'పురాణ వాఙ్మయం' అనే చిన్న గ్రంథం ఆ బాటలో బావుటాగా నిలిచింది.

**వస్తు సంవిధాన కళా రహస్యాలను అన్వేషించిన కాలం. (1971-75)**

పురాణ విమర్శ నా కొక కొత్త పుంత చూపించింది. తెలుగులో ఏకకథాకావ్యాల కంటె అనేకకథాకావ్యాలకే ఎక్కువ ప్రచార ప్రాచుర్యా లున్నాయి. నన్నయ తరువాత కథాకావ్య స్పృహ బాగా పెంపొందింది. నన్నయ యుగంలో కథాకథన శిల్పానికే గౌరవముండేది. ఆ

తరువాత శివకవి యుగంలో కథా గ్రథన కౌశలానికీ, తిక్కన యుగంలో కథా నిర్వహణ ప్రౌఢికి, ఎఱ్ఱన యుగంలో కథానిర్మాణ మర్మధర్మాలకూ, దక్షిణాంధ్రయుగంలో కథల్లో జాతి వార్తా చమత్కారాల ప్రదర్శనకూ ప్రాముఖ్యం ఏర్పడింది. వస్తుగతమైన ఈ అంతర్గత వికాస సూత్రాన్ని గుర్తిస్తే ఎన్నో రహస్యాలు బయట పడతాయి.

నే నీ దృష్టితో కావ్యాలను అధ్యయనం చేశాను. కొన్ని అపూర్వాంశాలను వెలికి తీసి చెప్పాను. అవి పండితుల మన్నన లందుకున్నాయి. నా సాహిత్య విమర్శ ప్రస్థానంలో వస్తుసంవిధాన కళారహస్యాల అన్వేషణం కొన్ని కావ్యాల సమగ్ర సమైక్య కళావ్యక్తిత్వాలను దర్శించటంలో కొత్త పుంతల ఆవిష్కరించింది. మరొక విశేష మేమంటే ఎందరో మహామహులు ఎన్నో విషయాలు చర్చించిన తరువాత చెప్పటానికి కొత్త విషయాలేవీ ఉండవని సాధారణంగా పండితు లనుకుండే చోట్ల అసాధారణమైన అంశం నేను చెప్పి చూపించే సరికి సాహితీలోకానికి కళ్లు జిగేలు మనేవి. వాటివలన కొన్ని అపూర్వ కావ్య నిర్మాణ శిల్పాల (Structural Technics) అనుశీలన పద్ధతులు సాహితీ విమర్శకు సమకూరాయి. మచ్చుకు ఒకటి రెండు మనవి చేస్తాను.

**'నన్నయ రచనలో నాటకీయత' : (వ్యాసం) (నవ్యాలోకం 1973)**

ఆంధ్రమహాభారతంలోని సభాపర్వ ద్వితీయాశ్వాసంలో ఉన్న శిశుపాలవధ కథా ఘట్టంలో కథా కథన శిల్పంలో ప్రతిఫలించిన 'వ్యాయోగ' లక్షణాలను సాంగంగా సోదాహరణంగా నిరూపించాను. తిక్కన కవిత నాటకీయతకు ప్రసిద్ధి. నన్నయే తిక్కన కామార్గం చూపించిన మహర్షి. అయితే, నన్నయ కథా కథనంలో నాటకీయ నిర్మాణశిల్పం ఎక్కువ. తిక్కనకవితలో అభినయశిల్పం ఎక్కువ. నన్నయ నాటకీయతనుగురించి నా వ్యాసానికి పూర్వమే మూడు నాలుగు వ్యాసాలు వచ్చాయి. (చూడు: తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'నన్నయభారతి' సంపుటాలు). కాని, వాటిలో నాటకీయతలోని సంభాషణ శిల్పాన్ని మాత్రమే వ్యాసరచయితలు స్పృశించ గలిగారు, పరిశీలించి చూస్తే నన్నయ నాటకీయతలో నిర్మాణమర్మాలను సోదాహరణంగా నిరూపించి మొదట చూపించింది నేనే. ఆ వ్యాసం అందుకు నిదర్శనం.

ఈ అన్వేషణ అంతటితో ఆగలేదు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు

ప్రచురిస్తున్న వ్యాఖ్యాసహిత కవిత్రయ మహాభారత సభాపర్వ పీఠికలో (అముద్రితం) ఈ మార్గంలో మరికొన్ని నిర్మాణ మర్మాలను చెప్పాను. శ్రీకృష్ణుడు చేసిన శిశుపాలవధను నాట్యశాలలో ప్రదర్శించిన సమగ్ర సుందరమైన వ్యాయోగంగానూ, కుమారాస్త్ర విద్యా సందర్శనను బహిరంగ ప్రదేశంలో ప్రదర్శించిన వ్యాయోగంగానూ నన్నయ తీర్చిదిద్ది ప్రకరణ గౌరవాన్ని సమున్నతంగా నిలిపాడు. ఆ తరువాత భీమనాయకమైన రాక్షసవధ ఘట్టాలను వీర రౌద్ర రస రమ్యంగా సమవకారాలుగా చిత్రించాడు. మాయాద్యూత ఘట్టంలో డిమలక్షణాలను సమగ్రంగా నిలిపి రసవత్తరంగా నాటకీయతను పోషించాడు. అంతేకాదు. స్వతంత్రోపాఖ్యానాలుగా లెక్కించదగిన యయాతి, దుష్యంత, నలమహారాజుల చరిత్రలలో నాటక లక్షణాలను యథావకాశంగా అచ్చు పడేటట్లు నన్నయ రూపొందించాడు. ఈ విధంగా నన్నయ తన రచనలో తొమ్మిది ఘట్టాలలో దశరూపక నాటక శిల్పాన్ని దర్శనీయ మయ్యేటట్లు స్పష్టంగా చిత్రించి తెలుగు కావ్య రచనలో నాటకీయతను పోషించటం ఒక అనివార్య లక్షణంగా భావితరాలకు సూచించాడు. తిక్కనాదులకు త్రోవచూపించాడు. ఇంతేకాక దుర్యోధనుడు మయసభను దర్శించి భంగపడిన ఘట్టం తెలుగువారికి ' 'ఏకపాత్రాభినయ' మనే ప్రక్రియకు పురుడు పోసింది. అందులో వర్ణ్యవస్తువు, రచనా శైలి నన్నయ చూపించిన బాటలోనే నడవటం ఒక సంప్రదాయమైపోయింది.ఈ విధంగా రెండున్నరపర్వాలలో పది దృశ్యకావ్య శిల్పాలను ప్రదర్శించటం సామాన్యమైన విషయం కాదు. వీటిని అన్వేషించి ఆవిష్కరించిన అదృష్టం మాత్రం నా విమర్శది.

**హంసడిభకోపాఖ్యానం: సంవిధాన శిల్పం : (వ్యాసం. 1973)**

క్రీ.శ. 14వ శతాబ్దంలో ఎఱ్ఱన 'హరివంశం', నాచనసోముని 'ఉత్తర హరివంశం' వెలువడి సాహిత్య క్షేత్రంలో కథా సంవిధాన చమత్కారాలకు సంబంధించి అనేక ప్రశ్నలు రేకెత్తించాయి. ఎఱ్ఱన హరివంశంలోని కథలు- తిక్కన యుగంనాటి కథా నిర్వహణ ప్రౌఢిని ప్రదర్శించాయి. నాచన సోముని ఉత్తర హరివంశ కథలు నవీన గుణంతో కథా సంవిధాన చమత్కారాన్ని ప్రదర్శించాయి. నాచనసోముని బిరుదాల్లో 'నవీన గుణసనాథుడు' 'సంవిధాన చక్రవర్తి' అనే వాటిని గురించి అనేక మంది ప్రసిద్ధ విమర్శకులు వివేచన చేశారు. అలనాటి నడకుదుటి వీర రాజుపంతులు గారి నుంచి, వేటూరి, రాళ్ళపల్లి, విశ్వనాథాదులు తమతమ సమన్వయాలు చెప్పారు. అయినా, వారెవ్వరూ స్పృశించనదీ, వారందరి వాదాలకంటె నూత్న

సమన్వయం కుదిరించేది అయిన ఒక పరిశీలన నా విమర్శ ద్వారా సాహితీలోకానికి అందింది.

సంగ్రహంగా చెప్పాలంటే- ఉత్తర హరివంశం మూలంకంటె భిన్నమైన ప్రక్రియలో నిర్మించబడిన కావ్యం. ఆ ప్రక్రియకు నేను పెట్టిన పేరు- వంశకథాకావ్యం. అందులో మూడు తరాలకు సంబంధించిన శ్రీకృష్ణవంశ వృత్తాంతం వర్ణితం. పెద్దనాదులు చిత్రించిన మూడు తరాల కథలకు ఇది మార్గం చూపించింది. ఉత్తర హరివంశంలోని కథలు ఆ వరుసలో అమర్చటంలో సంవిధాన శిల్పం ఉంది. సంవిధాన మనే కావ్యాంశానికి విశ్వేశ్వరుని చమత్కార ప్రస్థానంలో ప్రముఖ స్థానం ఉంది. భారతీయ సాహిత్య ప్రస్థానంలో అది అప్పటికి అభినవం. దక్షిణాది ప్రస్థానాలలో అది విశిష్టం. చమత్కార దర్శనానికి సంబంధించిందే నాచన సోముని నవీనగుణసనాథత్వం. వంశకథాకావ్యం నవీన ప్రక్రియ. దానిలోని వస్తుసంవిధానం ఆయన అభినవ శిల్పం. ఆ కథాక్రమ సంవిధానంలో ఉన్న అంతస్సూత్రం నా విమర్శలో ఆవిష్కరించబడింది. దుష్టవంశాంకుర విచ్ఛేదనం (నరకాసుర వధ), శిష్టవంశాంకుర పరిరక్షణం (బ్రాహ్మణబాలునిణ్ణి బ్రతికించటం), సంత్సంతానలబ్ధి కోసం ప్రయత్నం (శ్రీ కృష్ణుడు సంతానార్థి అయి శివుణ్ణి గూర్చి తపస్సు చేయటం), సంతాన పోషణకై ఆస్తిని రక్షించుకోవటం (పౌండ్రక వాసుదేవ సంహారం చేసి రాజ్యాన్ని రక్షించుకోవటం), స్వీయ సంతానం ఇతరులకు సామంతులుగా బ్రతకకుండా వారికి స్వతంత్ర జీవితాన్ని ప్రసాదించే ప్రయత్నం చేయటం (హంసడిభక సంహారం), కన్న కొడుకుల కోసం, మనమల కోసం బలవంతులైన శత్రువులతో పోరాడి వారికి సంరక్షణం కలిగించటం, మనుమని వివాహం, మునిమనమని ముఖదర్శనం (బాణాసురవృత్తాంతం) మొదలైన అంశాలను ఆక్రమంలో పేర్చి వంశకథాకావ్య వస్తు గౌరవాన్ని కల్పించి చూపించిన మహాకవి నాచన సోముడు. ఇంతటి సంవిధాన కళారహస్యాన్ని నా విమర్శే మొదటి సారి తెలుగు వారికి తెలియచెప్పింది.

**కలభాషిణీ కథామూలం.(వ్యాసం)(సారస్వత సౌరభం 1970)**

ఆధునిక సాహిత్య విమర్శలో కళాపూర్ణోదయ కావ్యం ఒక అపూర్వ కళాఖండంగా ఎందరో మహానుభావులు దర్శించి, విశ్లేషించి విమర్శించారు. కట్టమంచివారికి ముందునుంచే సాగిన ఆ కావ్య విమర్శ కవిత్వ తత్త్వ విచారంలో ఒక శిఖర స్థాయికి చేరుకుంది. ఆ

తరువాత ఆ కావ్యాన్ని గురించి స్పృశించని విద్వద్విమర్శకులు లేరు. డాక్టర్ జి.వి. కృష్ణారావు గారి సిద్ధాంత వ్యాసం ఆ కావ్యానికి మరో వన్నెను తెచ్చిపెట్టింది. ఎందరు ఎన్ని చెప్పినా ఎవరిదృష్టికీ రానిది, పింగళి సూరన కథానిర్మాణంలో ఒక కీలకమైనది, రహస్యమైనది కలభాషిణీ కథా మూలం. శీర్షిక వినగానే ఈ కథకు ఏ పాత పురాణంలోని కథనోమూలంగా చెప్పే వ్యాసమని చాలా మంది అనుకుంటారు. అయినా, ఆ సంగతీ ఏవిమర్శకుడు చెప్పలేదు. కల్పితకథకాబట్టి సంస్కృతమూలాన్ని అన్వేషించి ప్రయోజనం కూడా లేకపోవచ్చు. అయితే నేను చెప్పిన అంశం ఏమిటి?.

కళాపూర్ణోదయ కావ్యవృక్షానికి సరస్వతీ చతుర్ముఖుల విలాసకేళి స్కంధం. వాణీముఖ ప్రతిబింబ వర్ణనంలో 'వాచ్యతఁ దోచినట్టి నామజాతి క్రియాది సకల పదార్థ వాక్యార్థాంతరములలోఁ దోచిన' కళాపూర్ణుని వృత్తాతం ఆ తరువుకు ఒక శాఖ. రెండవ శాఖ కలభాషిణీ వృత్తాంతం కావాలి. ఈ శాఖాద్వయానికి స్కంధమే ఆధారం. కాని, కళాపూర్ణుని వృత్తాంతం వాచ్యంగా సూచించబడినట్లు, సరస్వతీ చతుర్ముఖుల రహస్యకేళీ ఘట్టంలో కలభాషిణీ వృత్తాంతం సూచించబడలేదు. ఇదొక కథా కల్పన శిల్ప మర్మం. మణిస్తంభబింబిత వాణీముఖబింబ ప్రతిబింబాదుల సంచనాలలో, వాణీచతురాననుల ముఖబింబ వీక్షణాది చేష్టావిశేషాలలో కలభాషిణీ కథా కల్పన రహస్యాలు పొదిగిపెట్టాడు పింగళి సూరన. ఈ గూఢ కథా నిర్మాణ శిల్పాన్ని అన్వేషించి వెలికితీసి వెలుగులోకి తెచ్చింది జీవియస్ విమర్శే. (దీన్ని వివరించటం ఇక్కడ న్యాయం కాదు. ఆ వ్యాసం చదువుకోవచ్చు.)

ఈ వ్యాసాన్ని చదివిన పండితులు చాలామంది ప్రశంసల వర్షాన్ని కురిపించారు. మచ్చుకు ఇద్దరి అభిప్రాయాలను నివేదిస్తాను.

"కళాపూర్ణోదయమందలి సరస్వతీ చతురుర్ముఖుల ప్రణయకలహాంశములకు వీరు చెప్పిన నూతన వ్యాఖ్యానము అపూర్వమును, అద్భుతముగా నున్నది".

*- ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు.*

"కలభాషిణీ వృత్తాంత కల్పనకు మూలములైన బీజములు వాణీముఖ ప్రతిబింబవర్ణనా ఘట్టమున నిక్షిప్తములై యున్నవని అనుమానించి, నిశితముగా పరిశీలించి, వాణీ చతుర్ముఖ

బింబముల యొక్కయు, మణిస్తంభమునందలి తత్ప్రతిబింబముల యొక్కయు కదలికలయందు కలభాషిణీ కథయందలి సర్వకథాంశములును కదలలాడుచున్నట్లు కనిపెట్టెను, సూక్ష్మాతి సూక్ష్మ వివరములతో ఆ కథాంశములకు మూలములైన బీజములను ఎత్తిచూపెను. కళాపూర్ణోదయ పరిశీలనమున సరిక్రొత్తదైన మార్గమును త్రొక్కి అనితరసాధ్య మైన రహస్యమును సాధించి చి॥ సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మఱియొక మెట్టు పైకెక్కించెను".

- డాక్టర్ పాటిబండ మాధవ శర్మగారు.

## సిద్ధాంత రాద్ధాంతాల కాలం (1976-80)

సాహిత్య విమర్శ ఎక్కగలిగిన శిఖరం సిద్ధాంత దర్శనం లేదా సిద్ధాంత ప్రతిష్ఠాపనం. 'ధర్మవీర ఏవ రసానాం రసః' అనే సిద్ధాంతం నే నీ కాలంలో ఒక మూలరసవాదంగా (రససమీకరణవాదంగా) ప్రతిపాదించాను. భారతీయ సాహిత్య ప్రస్థానాలలో అది ఒకటిగా పరిగణించదగిందని సమకాలీన విమర్శకులు భావిస్తున్నారు.

ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి మాటలు గమనించండి: "నవరసాలలో వీర రసం ఒకటి అలా ఉండగా రస సమీకరణ వాదాలకు తలమానికంగా ఉత్సాహస్థాయికమైన వీరరసాన్ని శ్రీ జి.వి.యస్. గారు ప్రతిపాదించారు. రసనిర్వహణకూ, రసచర్వణకూ అనువైన చిత్తస్థితిని సమకూర్చేది ఉత్సాహమే కనుక సర్వరసాలకూ ఇదే జన్మభూమి అని వీరు చేసిన ప్రతిపాదనా, సాంగోపాంగంగా చర్చించిన తీరూ అలంకార శాస్త్రానికి ఆంధ్రులు చేసిన పరివస్యలో అగ్రభాగాన నిలుస్తుంది",

ఈ శతాబ్దిలో తెలుగులో వచ్చిన సాహిత్య దర్శనాల్లో ముఖ్యముగా మూడు అఖిల భారత స్థాయిలో ఆంధ్రులకు అఖండ కీర్తిని తెచ్చిపెట్టగలిగేవిగా ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్‌గారు పేర్కొన్నారు. అవి- రాయప్రోలు వారి అమలిన శృంగార సిద్ధాంతం, విశ్వనాథవారు కరుణరసానికి ఇచ్చిన నూతన వ్యాఖ్యానం. జీవియస్ ప్రతిష్ఠాపించిన 'ధర్మ వీర ఏవ రసానాం రసః' అనే సిద్ధాంతం, ఆంధ్రులు రసాన్ని గురించి ఎప్పటికప్పుడు అభినవ దర్శనం చేస్తూ భారతీయ ఆలంకారిక సాహిత్య ప్రస్థానాలను సజీవంగా నవీనంగా దర్శించే చైతన్యాన్ని రక్షిస్తున్నారని ఆచార్య నాగేంద్ర గారన్నారనీ, 'ఏకోరసః వీరేవ' అని

ప్రతిపాదించిన జి.వి. సుబ్రహ్మణ్యం గారిని భారతీయ కావ్యశాస్త్ర చరిత్రలో 'ఆచార్యులు' గా గుర్తించడం సమంజసంగా ఉంటుందని ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్‌గారు పేర్కొన్నారు.

ఈ అయిదేళ్ళ కాలంలో నేను చేసిన రససిద్ధాంత విమర్శకు అద్దం పట్టేది నా 'రసోల్లాసం' (1980) అనే వ్యాస సంపుటి. సృజనాత్మక సాహిత్య విమర్శగా నా రససిద్ధాంతం పండితుల మన్ననలు పొందింది. 1983 సం॥ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఉత్తమ సాహిత్య విమర్శ పురస్కారాన్ని నాకు అందించింది.

ఈ రసోల్లాసానికి వెనుక ఎంతో సిద్ధాంత రాద్ధాంతాల కథ ఉంది. అది ఇక్కడ ప్రస్తుతం కాదు కాని నాలో జరిగిన అంతర్మథనం గురించి నాలుగు మాటలు చెప్పుకోవాలి. మహాభారతంలో, రామాయణంలో అంగిరసం ధర్మవీరమనే నా ప్రతిపాదనలు కొందరి ఖండలనకు గురి అయ్యాయి. వాటి మీద కొందరు విమర్శకులు చర్చించారు. సదస్సుల్లో ఆ ప్రతిపాదనలపై అనేక ప్రశ్నలూ ఎదురయ్యేవి, ప్రశంసలూ వచ్చేవి. నెల్లూరులో 1976లో ఒక విద్వద్గోష్ఠిలో ఈ విషయం మీద చర్చకూడా జరిగింది. చర్చానంతరం వారు నా వాదాన్ని అంగీకరించి అభినందించటం విశేషం. ఒకసారి దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు నా వాదం విన్నతరువాత "అలంకార శాస్త్రాలలో ముడివడని ఎన్ని అంశాలను ఒక చోటికి తెచ్చి ముడివేశావయ్యా! రస విషయంలో ఇంత సమన్వయాన్ని సాధించిన సిద్ధాంతిని ఈకాలంలో నేను చూడలేదు. నీకు నా ఆశీస్సులు" అంటూ నన్ను కౌగిలించుకొని ఆశీర్వదించారు. రస చర్చల్లో నేను వివరించాలసి వచ్చే అంశాలను వ్యాసాలుగా రాశాను. చివరకు నా వాదాన్ని ఒక శాస్త్ర గ్రంథకర్త ప్రతిపాదించినట్లుగా తెలుగులో రూపొందిచాను.

1. శాంత రస విచారాన్ని గురించి నా సమకాలీన పండితుల్లో ఒక నిశ్చితమార్గంగాని, అనువర్తిత విధాన వివేచనగాని ఉండేది కాదు. డాక్టర్ వి.వి. రాఘవన్ లాంటివారి గ్రంథాలు చదివితే తప్ప ఆ వివేచన కొంత బోధపడేది కాదు. అయినా, అఖిలభారత స్థాయిలో కూడా శాంత రసస్థితులను వివేచించి అనువర్తన సూత్రాలను నిర్మించిన రసవిమర్శకులు తక్కువ. ఆ పరిస్థితుల్లో నా సిద్ధాంతానికి మొదట పెద్ద అడ్డుగా నిలిచింది శాంత రస నిరూపణ విధానం. ఆ అంశం మీద పండితుల అనుమానాలు తీర్చి నా సిద్ధాంతంపట్ల సుగమమైన అవగాహన పెంచటానికి నేను వ్రాసిన వ్యాసం 'భారతంలో శాంతరస సాధన- పరిశీలనలో మరొక వివేచన' (1977). ఇందులో

నవ రసంగా, ప్రకృతిరసంగా శాంతరస నిర్వహణాన్ని, అనుశీలనాన్ని, తేటపరిచే పద్ధతులను వివరించాను. ఆనందవర్ధనాదుల శాంతరస ప్రస్తారాన్ని అభినవగుప్తుడు పరిష్కరించిన పద్ధతిని వివేచించాను. డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారు, డా॥ శలాక రఘునాథశర్మ గారు మొదలైన వారి రస విమర్శల్లో నవమరసంగా ప్రకృతి రసంగా శాంతాన్ని విడమరచి చూడలేకపోవటం వలన కలిగిన ఇబ్బందులను ఎత్తి చూపాను. సిద్ధాంత స్థాపనంలో పండితుల రాద్ధాంతాలకు సమాధానాలు చెప్పటమే కాకుండా, వారి అనుమానాలు తీర్చగలిగిన మౌలిక వివేచనను అందించటం నా కర్తవ్యమైపోయింది. సిద్ధాంత ప్రతిష్ఠాపనంలో ప్రతిబంధాలు తొలగించుకోటానికి ముందుగా ప్రయత్నించాను.

2. ఆంధ్ర మహాభారతం శాంతరస ప్రధానం కాదు. ధర్మవీర ప్రధానమైనదే-అన్న అంశాన్ని స్థిరీకరించుకొనే ప్రయత్నంలో ఒక బలమైన సాధనంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన శాంతి పర్వానికి రాసిన పీఠికను రూపొందించాను. దాని పేరు 'శాంతనవగీత'. ఆ పేరే నా మనస్సులోని మాటలు వ్యంగ్యంగా ధ్వనింపచేసింది. ఆంధ్రభారత నాయకుడైన ధర్మరాజు చిత్తవృత్తిలోని ధర్మవీరాన్ని పరిపోషించేటట్లుగా శాంతిపర్వంలోని అంశాలు ఎలా తోడ్పడ్డాయో చెప్పి, ధర్మజుడు కర్మరుడుగా చిత్రించబడ్డాడని, జ్ఞానిగా రూపొందించబడలేదని, కాబట్టి ఈ ఆంధ్రమహాభారతం ధర్మవీర ప్రధానమే అవుతుందనీ నిరూపించాను. 'శాంతనవగీత' మహాభారతంలోని ధర్మ వీరవాదానికి క్రాంతినవగీతగా తోడ్పడింది. పండితులు చాలామంది ఈ పీఠికను ప్రశంసించారు.

3. నేను ప్రతిపాదించిన 'ధర్మవీర ఏవ రసానాం రసః' అనే సిద్ధాంతం సమీకరణ వాదాల కోవకు చెందుతుంది. సాహిత్య శాస్త్రంలో శాంత, శృంగార, కరుణ, అద్భుత సమీకరణ వాదాలు ప్రసిద్ధాలై ఉన్నాయి. వాటి వరుసలో నా 'ధర్మవీర సమీకరణ వాదం' చేరుతుంది. దీనినే మూలరసవాదమని కూడా అంటారు. మూల రసవాదాల స్వరూప స్వభావాలను వివేచించే వ్యాసం రాస్తే, దానివలన నా వాదం ఏ కోవకు చెందుతుందో విమర్శకులు గ్రహించగలరని 'రస సమీకరణ వాదములు : విమర్శలో వాని వినియోగము' అనే వ్యాసం ప్రత్యేకంగా రాయవలసివచ్చింది. సిద్ధాంత

ప్రతిష్ఠాపన దశల్లో పరమత ఖండనం, స్వీయమత సమర్ధనం, సిద్ధాంత భూమిక, సిద్ధాంత ప్రతిష్ఠాపనం-అనేవి వరుసగా ప్రవర్తిల్లుతాయి. వాటిల్లో మూడవ దశ ఈ వ్యాసం. దీని తరువాత ఇక సిద్ధాంత ప్రతిష్ఠాపనమే మిగిలింది.

4. 'రసానాం రసః'- అన్నది నా సిద్ధాంత ప్రతిపాదన వ్యాసం. ఇదొక చిన్నపాటి లక్షణసూక్తం. వాదకుశలత్వంతో కూడిన పారిభాషిక పదగుంపనం ఇందులో దండిగా ఉంటుంది. దాన్ని వివరించి రాస్తే ఒక గ్రంథమౌతుంది. సిద్ధాంతాన్ని వ్యాసంలో కుదించాను. ఏనుగును సర్కస్‌లో ముక్కాలు పీట మీద కెక్కించినట్లు బరువుగా ఉన్నా ఆ వ్యాసాన్ని పండితులు అర్థం చేసుకోగలరు. కాని, సంగ్రహంగా, సారవంతంగా సవిమర్శకంగా, సలక్షణంగా, సాధికారికంగా చెప్పేది సారవంతమైన సిద్ధాంతం. ఇది లక్షణగ్రంథ కర్తల సంప్రదాయం. నా తెలుగు వ్యాసాన్ని సంస్కృతీకరిస్తే లక్షణగ్రంథ గౌరవాన్ని పొందవచ్చు. ఈ సత్యాన్ని గుర్తించిన సహృదయులు ఆ అంశాన్ని చెప్పారు కూడా. ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారిలా అన్నారు. గమనించండి.

"శ్రీ జి.వి.యస్. గారు . . . . స్వతంత్రంగా వివేచన చేసి నాయకాశ్రితమైన ఉత్సాహస్థాయి నిమిత్తంగా సహృదయుడు అనుభవించేరసం నవరసాల్లోని వీరం, నాయకాదుల నాశ్రయించిన ఎట్టి స్థాయిభావాన్నైనా నిమిత్తంగా చేసికొని సహృదయుడు సాధించే రసం. మూలప్రకృతి అయిన రసం వీరం" అని తేల్చి చెప్పారు. ఇక్కడ సాధించడం అనే మాట చాలా సాభిప్రాయం. ఇది రసస్థితిని కలిగించే మనోవ్యాపారమనీ, రసాల అస్తిత్వానికి అదిమూల మనీ, రసానాం రసం: అనీ, కట్టకడపటికి ధర్మవీర ఏవ రసానాం రసః అనీ, శాంతానికీ వీరానికీ ఉన్న విరోధాన్ని తొలగించిన వివేకసూత్రం ఈవాదమనీ' వీరు ఆత్మీయతా ముద్రతో పారిభాషికాల బరువుతో, కర్తృపదబహువచనతా సంప్రదాయంతో సహా ప్రతిష్ఠాపించారు. . . . చలోక్తిగా అంటున్నమాట- సవయస్కుల మధ్య వీరు మా దర్శనాచార్యులు".

5. 'రామాయణంలో అంగిరసం' అనే వ్యాసం ఆ కావ్యంలో ధర్మవీర రసస్థితిని వ్యాఖ్యానించేది నావాదాన్ని అనువర్తిత విమర్శ ద్వారా మరింత వివరించి చెప్పింది.

1980 నాటికి నా సిద్ధాంతం ప్రతిష్ఠాపితమైంది. పండితలోకానికి చాల వరకు నా దర్శనం ఆమోదయోగ్యంగా మారింది.

"వీరరస విమర్శకు నా మొదటి పురస్కారం

'అచ్యుతరాయల తరువాత వీర రసవివేచనాన్ని విస్తృతపరచింది నేనే.

స్వాతంత్ర్యవీరాన్ని ప్రతిపాదించింది నేనే.

'ధర్మ వీర ఏవ రసానాం రసః' అన్నది నా సిద్ధాంతం

అఖిల భారత లాక్షణిక సార్వభౌముల వరుసలో నాకు ఒక స్థానం!

ఆలంకారికులలోని ఆంధ్రులలో ఇప్పటికి చివరి కుర్చీ నాదేనేమో!

ఉండేల విజ్ఞన కళాపీఠం ప్రప్రథమ సాహితీ పురస్కారాన్ని (1994 ఆగస్టు 23) అందించినప్పుడు అన్న మాట లివి!

రసవిమర్శలో నే నెక్కిన రజతాద్రి రసోల్లాసం!

శతాబ్ది విమర్శకునికోసం దశాబ్ది తపస్సు:

వీరరససిద్ధాంతం విజయవంతం కావటంతో మరిన్ని విజయాలకోసం ఉత్సాహపడ్డాను. ఏదో ఒక ఎత్తైన శిఖరం ఎక్కాలి, నా విమర్శ జెండా నాటాలి. నా లైఫ్ టైం అఛీవ్‌మెంట్ చూపాలి అని ఉరకలెత్తాను. ఆ రోజుల్లో నా మనసునిండా టి.యస్. ఎలియట్ ఈ మాటలు మారుమ్రోగుతుండేవి. "From time to time, every hundred years, it is desirable that some critic shall appear to review the past of literature and to set the poets and poems in a new order. This taste is not one of the revolution of re-adjustment ". ఎలియట్ మాటల్లో 'శతాబ్ది విమర్శకుడు' అన్న భావన నా మనసులో బాగా నాటుకున్నది. అంతర్మథనం రేపింది. అదొక ఆదర్శ భావనం కావచ్చు. వాస్తవం కావచ్చు. వేగంగా అనేకమైన మార్పులు చోటుచేసుకుంటున్న ఈ యుగంలో శతాబ్ది విమర్శకుణ్ణి కాకపోయినా 'దశాబ్ది విమర్శకుణ్ణి' అయినా కావాలని కోరుకుంటుండేవాణ్ణి.

అయితే దశాబ్ది, శతాబ్ది అనే పరిమితుల కంటె మరొక ముఖ్య విశేషం ఉంది. వెయ్యేళ్ళ

సాహిత్యాన్ని ఒక కొత్త కొలమానంతో, లేదాకొత్తపద్ధతితో, లేదా కొత్త దృక్పథంతో పునఃపరిశీలించాలి, అన్వయించాలి, ఒక కొత్త చరిత్రగా వ్యవస్థీకరించాలి. కవులను, కావ్యాలను, వాటి విలువలను బేరీజు వేసే ప్రమాణాలను అభినవంగా శాస్త్రీయంగా రూపొందించాలి. సాహిత్య చరిత్రనంతా తిరగదోడే ఆ సూత్రం ఆ ప్రయోగం జీవియస్‌దే కావాలి. అది గతంలో తెగత్రెంపులు చేసికొనే విప్లవపంథా కాకూడదు. అవిచ్ఛిన్న సాహిత్య సంప్రదాయాన్ని మన్నించేదిగా ఉండాలి. అయినా స్వతంత్రంగా సాగాలి. పాశ్చాత్యాన్ని దేశీయంగా పరివర్తనం చేసికొన్న భారతీయత విమర్శదృక్పథానికి వెన్నెముకగా నిలవాలి. నా జాతి విమర్శ అనుకరణం కాదనీ, అభినవమనీ చాటి చెప్పాలి. నా తెలుగు కవులు అనువాదకులు కారు, అనుకర్తలు కారు, అభవనవ దర్శనం చేసి తెలుగుదనాన్ని చాటే సృజనాత్మక చైతన్యాన్ని పండించిన ప్రతిభామూర్తులని నిరూపించాలి. విమర్శ కొక వ్యక్తిత్వముందనీ, దర్శనం ఉంటుందనీ, శాస్త్రస్వభావం కళాసౌందర్యం దాని స్వరూపమనీ నా విమర్శ ద్వారా ప్రదర్శించి చూపించాలని ఉవ్విళ్ళూరుతుండేవాణ్ణి. ఒక్కోసారి నా ఆశలన్నీ కలల్లాగా అనిపించేవి. కాని కలల్ని కలంతో కాగితాలమీదకు దింపాలని ప్రయత్నించాను. ప్రయత్నం నా చేతుల్లో ఉందికాని ఫలం నా చేతుల్లో లేదు.

ఆ కాలంలో నా మార్గాన్ని నేనే సమీక్షించుకొని, కొన్ని కొత్త నిర్ణయాలు తీసుకున్నాను.

1. అంతవరకూ నా విమర్శ ప్రస్థానం ప్రాచీన సాహిత్య రంగంలోనూ లక్షణ శాస్త్ర మర్యాదలలోనూ ఎక్కువగా సాగింది. ఇకమీద ప్రాచీన సాహిత్యంతోపాటు ఆధునిక సాహిత్యం మీద కూడా పట్టు సాధించి, పట్టుదలతో గట్టి విమర్శ రాయాలి-అని అనుకున్నాను.

2. ఆధునిక సాహిత్య విమర్శలో పాశ్చాత్య విమర్శ సూత్రాల అవగాహన ముఖ్యం. వాటిని గుడ్డిగా తెలుగు రచయితల ప్రయోగాలకు వర్తించకుండా, వారి దేశీయ అస్తిత్వాలకు అనుగుణంగా సాపేక్ష ప్రమాణాలను కల్పించుకోవాలి - అని భావించాను.

3. ఏ కాలంలో పుట్టిన ఉత్తమ రచన అయినా తెలుగు సాహిత్య పరిణామ వికాసాల అవిచ్ఛిన్న ప్రవాహ చైతన్యంలో ఒక కొత్త ప్రయోగమే కావాలి. గతానుగతికంగా వస్తున్న ప్రవృత్తిలో ఒక కొత్తదనం తేవాలి. అది ఆ ప్రవాహంలో ఒక కొత్త విలువను

సృష్టించి, భవిష్యత్తు కొక నూతనోత్తేజాన్ని కలిగించాలి. మార్పులో కూడా ఒక అంతర్గతి సూత్రం ఉంటుంది. దాన్ని వ్యాఖ్యానిస్తే తప్ప రచన యొక్క అస్తిత్వాన్నీ, విలువనూ, సాహిత్యాని కది ఇచ్చిన కొత్త ప్రమాణాన్ని నిరూపించలేం- అని ఆలోచించాను.

4. ఈ మార్గంలో నడవాలంటే ఒకే పద్ధతి అనుసరించాలి. వెయ్యేళ్ళ సాహిత్యాన్ని ఆకలింపు చేసుకోవాలి. నా దైన చూపు దానిపై సారించాలి. దానికి కొన్నేళ్ళ తపస్సు తప్పదు.

5. ఇక భవిష్యత్తులో సాహిత్య చరిత్రనంతా అభినవ దృక్కోణంతో వ్యాఖ్యానించే ప్రవృత్తిని ప్రదర్శించాలని, దాని కనుగుణంగా మహాకవుల రచనలను వ్యాఖ్యానించాలనీ వారి ప్రయోగాలను అన్వయించాలనీ అనుకున్నాను. సమష్టిగా సాహిత్యానుశీలనం ఒక వైపు, వ్యష్టిగా కావ్యానుశీలనం మరొక వైపు సాగే కృషిని సమన్వయ శీలంతో సాధ్యమైనంత మేరకు నిర్వహించాలనీ దృఢంగా నిశ్చయించుకున్నాను.

6. శతాబ్ది విమర్శకుడు ఒకడే కాకపోవచ్చు. ఒక సమష్టి చైతన్యం కావచ్చు. లేదా ఒక ఉద్యమం కావచ్చు. అటువంటి దాన్ని ప్రేరేపించిన, నిర్వహించిన లేదా గుర్తించి వ్యాఖ్యానించిన గౌరవమైనా దక్కించుకుందామని ఉత్సాహపడేవాణ్ణి. (నేను కృషి చేసిన యువభారతిలో గాని, అభినవ భారతిలోగాని, నవోదయంలోగాని, మా విరసంలోగాని (మానవ వికాస రచయితల సంఘం), కృషిచేస్తున్న జీవియస్ సాహితీ కళాపీఠంలోగాని ఈ చైతన్యాన్ని వ్యష్టినుండి సమష్టిపరం చేద్దామనే నానిరంతర యత్నం). ఈ ఉత్సాహమే నా విమర్శ ప్రస్థానానికి కొత్త ఊపిరి పోసింది. ఒక దశాబ్ది నా సాహిత్య విమర్శ శతాబ్ది విమర్శక సాక్షాత్కారం కోసం తపస్సు చేసింది. అందులో 1981 నుండి 85 వరకు నా విమర్శను అనేక శాఖలలో విస్తరింపచేశాను. అందులో ప్రభావ పరిశీలనం ఫలించింది. 'ఆంధ్ర సాహిత్య విమర్శ: ఆంగ్లప్రభావం' గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 1985 నుండి 90 దాకా- ప్రక్రియా విమర్శసూత్రంతో వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యాన్ని పునర్వ్యాఖ్యానించాను,పునర్మించే బాటలు వేశాను. ఇంతవరకు సాహిత్య చరిత్రల్లో

ప్రయోగించని ఒక సమన్వయసూత్రంతో ఏకవాక్యతను కల్పించి వికాసచరిత్ర నిర్మాణ ప్రణాళికను అందించాను. అదే నా 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు! ఆంధ్రప్రభ దిన పత్రికలో 138 ఆదివారాలు ధారావాహికంగా 'కాలమ్'లో సాగింది. సాహిత్యేతర ప్రమాణవాదుల దాడులను తిప్పికొట్టే సాహిత్య ప్రమాణవాది స్వతంత్ర సంగ్రామంగా నా విమర్శ ప్రస్థానం రూపొందింది.

**ప్రభావ పరిశీలనం పురస్కార మందుకొన్న కాలం : (1981-85)**

ఈ కాలంలో నా విమర్శ వైవిధ్యంతో విస్తరిల్లుతూ తులనాత్మక వివేచనతో ప్రభావ పరిశీలనాన్ని చేసి కేంద్ర సాహిత్య అకాడమీ 1986 పురస్కారాన్ని అందుకొన్నది.

1. <u>ప్రాచీన సాహిత్యాన్ని ఒక కొత్త చూపుతో పునర్వ్యాఖ్యానం చేయటం-</u> 'తెలుగు కవిత్వపు తీరు తెన్నులు' అనే శీర్షికతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన సారస్వత వ్యాస సంపుటి, ద్వితీయ ముద్రణ (1981)కు రాసిన పీఠికలో జరిగింది. అదొక కొత్త ప్రయోగం. కవి కవిత్వంలో ఒక కొత్త రుచి సృష్టిస్తాడు. అది లోకానికి కొత్త ఆస్వాదన శక్తిని కలిగించి సాహిత్యంలో ఒక మార్పును తీసికొని వస్తుంది. కాబట్టి సాహిత్య చరిత్రలో మార్పు తెచ్చేద కవితాస్వాదన శక్తికి మూలమైన కవిత్వపు రుచి అని భావించి ఈ వ్యాసం ఆ దృక్కోణంతో రాయబడింది. మచ్చుకు కొన్ని ప్రతిపాదనలు:

(1). నన్నయ ప్రధానంగా గుణవాది. శబ్దగుణ సంయోజన శిల్పంతో కవితలో సౌందర్యాన్ని, ఆస్వాదనీయతనూ కల్పించటంలో ఆయన సిద్ధహస్తుడు.

(2). తిక్కన సోమయాజి శబ్దగుణాలకంటె అర్థ గుణాల సంయోజనంవలన కవితకు రుచిని కల్పించాడు.

(3). ఎఱ్ఱన తనకు ముందున్న నన్నయ తిక్కనల శబ్దార్థ గుణప్రధాన పద్ధతిని గమనించి యథావకాశంగా ఆ రెంటినీ తన కవితలో సంగమింపజేశాడు. అయితే ఆయన వాక్కుకు గుణాలను అలంకారాలతో అతిశయింపజేయాలన్న ప్రవృత్తి సహజాలంకారంగా సమకూరింది.

(4). కవిత్రయం వారు ప్రధానంగా ధ్వని ప్రస్థానాన్ని ఆదరించిన వారు. నన్నయ రచనలో

వస్తుధ్వని, తిక్కన రచనలో రసధ్వని, ఎఱ్ఱన రచనలో అలంకారధ్వని అధికంగా కనపడతాయి.

(5). నన్నెచోడుని కవితలో వర్ణ్యవస్తువులోని అలంకార చమత్కృతియే రుచి.

(6). పదాలతో ప్రజ్వలన శీలాన్ని కల్పించే భావవాహిని సోమనాథుని కవితలోని రుచి కున్న గుణమైతే, శబ్ద పునరావృత్తితో రచనా సౌందర్యాన్ని సృష్టించి భక్తి పారవశ్యాన్ని కలిగించే శిల్పం పోతన కవితాగుణం.

(7). రచనలోని చమత్కారచర్వణమే నాచనసోముడు కవితకు కల్పించిన కొత్తరుచి.

(8). రస గర్భమైన వైదర్భీరీతి శ్రీనాథుని కవితా సౌందర్యరుచి.

(9). ప్రబంధకవుల్లో పెద్దన్న శబ్దార్థ గుణ శ్లేషకు తన కవితలో పట్టం కట్టితే, రామరాజ భూషణుడు శబ్దార్థాలంకార శ్లేషకు సువర్ణాభిషేకం చేశాడు.

(10). తెలుగు కవిత్వంలోని రుచిభేదాలను సమీక్షించే ఒక వినూత్న వివేచన మార్గాన్ని తెలుగులో వెలయించాలన్న నా ప్రయత్నాన్ని ఈ పీఠికలో సహృదయులు గమనిస్తే చాలు- అని పీఠికలో చివర పేర్కొన్నారు. అంతేకాదు- 'క్రొత్తగా బాట వేస్తున్నప్పుడు కొన్ని ఎగుడు దిగుడు లుండవచ్చు. వివరించవలసిన అంశా లెన్నో మిగిలిపోవచ్చు. నలుగురు ఈ బాటను మెచ్చి నాలుగుసార్లు నడిస్తే అదే పథ్యమైన పథమౌతుంది.' అని మనవి చేసికొన్నాను.

'తెలుగు కవిత్వపు తీరు తెన్నులు' రవ్వల్లాంటి కొన్ని ప్రతిపాదనలను కుప్పగా పోసిన ఒక సంగ్రహ వ్యాసం. అందులోని ప్రతిపాదనలను ఆధారంగా చేసికొని హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో కొందరు పరిశోధక విద్యార్థులు నా పరివేక్షణలో కొన్ని సిద్ధాంత గ్రంథాలు రాశారు. ఉదాహరణకు కొన్ని :

| | | |
|---|---|---|
| 1. | డాక్టర్ అట్లా వెంకట్రామిరెడ్డి | ఆంధ్రప్రబంధ యుగం: అలంకార ప్రస్థానం : ప్రయోగం. |
| 2. | శ్రీ ఎస్. సీతాపతి | నాచన సోమన: చమత్కార ప్రస్థానం. |

| | | |
|---|---|---|
| 3. | శ్రీ జి.యన్.యస్. శాస్త్రి | నన్నయ కవితలో శబ్దగుణ ప్రస్థానం: ఒక పరిశీలన. |
| 4. | శ్రీ యం. సుబ్రహ్మణ్య శాస్త్రి | తిక్కన పద్య రచనలో అర్థగుణ ప్రాధాన్యం: ఒక పరిశీలన. |
| 5. | కుమారి ఎన్. మృదుల | తిక్కన కవిత: నాట్య శాస్త్ర మర్యాదలు. |
| 6. | కుమారి జె. భారతి | నన్నయ భారత రచనలో నాటకీయత. |

నా విమర్శ వ్యాసం కొన్ని సిద్ధాంత వ్యాసాలకు ఆలోచనలందించటంతో కృతార్థమయింది.

2. <u>తులనాత్మక పరిశీలనం- 'రామకథ :</u> సాయిసుధ' (1980-82) వాల్మీకి రామాయణాన్ని ప్రాతిపదికగా తీసికొని వివిధ రామాయణాలతో తులనాత్మక పరిశీలనం చేసే పది ఉపన్యాస వ్యాసాల సంపుటి ఈ గ్రంథం అందులో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి 'రామకథా రసవాహిని' 'ఆత్మారామమ్' ప్రధాన సమీక్ష భూమికలు కావటం విశేషం. తులనాత్మక విమర్శకు ఇది మంచి ఉదాహరణం. తెలుగులో రామాయణ సాహిత్యాన్నంతా పరిశీలించే అవకాశం ఇందులో అభించింది. సాహిత్యదృష్టితో ఆధ్యాత్మికదృష్టి ఈ విమర్శలో రంగరించబడి ఉండటం దాని వైశిష్ట్యం.

3. <u>ఆధునికాంధ్రకవుల కావ్యానుశీలనం:</u>

(1) అభినవ లోచనం (వ్యాస సంపుటి) (1983)

(2) అక్షరాల ఆలోచనాలు ( ,, ) (1985)

ప్రాచీన సాహిత్యంలో ప్రసిద్ధ కవుల మీద విమర్శ సాగించినట్లే ఆధునిక యుగంలో సాహితీస్పృహతో కవిత్వాన్ని రాసిన కవుల రచనలను అనుశీలనాత్మక పద్ధతిలో విమర్శించటం జరిగింది. అభినవలోచనంలో రాయప్రోలు, విశ్వనాథ, మధునాపంతుల, బెజవాడ గోపాలరెడ్డి మొదలైన వారి కవితావైశిష్ట్యాలను ప్రతిపాదించే వ్యాసాలివి. ఈ వ్యాసాలన్నీ నూత్న ప్రతిపాదనలతో కూడుకొని ఉండటం చేత నా విమర్శ కొన్ని కొత్త విలువలను పోషించింది. రాయప్రోలు వారి ఏడు కావ్యాలూ, ఆయనే యొక్క స్త్రీ కుండే సప్తసహజ గుణాలకు ప్రేమ స్వభావాలకు ప్రాతినిధ్యం వహించేవని చేసిన నా వివేచన కొత్తదే.

| | కావ్యం | పాత్ర | గుణం | ప్రేమ స్వభావం |
|---|---|---|---|---|
| 1. | లలిత | లలిత | ధృతి | అచంచల ప్రేమ |
| 2. | తృణకంకణం | నాయిక | క్షమ | అమలిన ప్రేమ |
| 3. | అనుమతి | అనుమతి | దయ | ఆర్ద్ర ప్రేమ |
| 4. | కష్టకమల | కమల | శౌచం | అనాసక్త ప్రేమ |
| 5. | స్నేహలత | స్నేహలత | కారుణ్యం | ఉద్విగ్న ప్రేమ |
| 6. | స్వప్నకుమారం | స్వప్నసుందరి | నాగనిష్ఠురత్వం | వాత్సల్య ప్రేమ |
| 7. | రూపనవనీతమ్ | వకుళమాల | మిత్రులకభిద్రోహం చేయకుండటం | దాక్షిణ్య ప్రేమ. |

రాయప్రోలు అమలిన శృంగార సిద్ధాంతాన్ని సామాజిక సిద్ధాంతంగా చెప్పి సాహిత్య సిద్ధాంతంగా అనువర్తనం చేసిన ప్రక్రియలోని విశేషాలు వివరించి చెప్పి ఆ సిద్ధాంతం అందించిన సాహిత్యపు విలువలను నిర్దేశించాసు.

విశ్వనాథ కవితా వ్యక్తిత్వాన్ని, విమర్శక వ్యక్తిత్వాన్ని వివేచనాత్మక విమర్శ ద్వారా వివరించాను. కవితలో కవిసమ్రాట్టు, విమర్శలో విమర్శక చక్రవర్తి ఎలా అయ్యాడో సోదాహరణంగా పేర్కొన్నారు. విశ్వనాథ వారిది శిల్పాను శీలన విమర్శ మార్గమని ఈ వ్యాసాల్లోనే పేర్కొన్నారు. చారిత్రిక కావ్య వివేచనం చేసి ఆంధ్ర పురాణ ప్రయోగ వైశిష్ట్యాన్ని వివరించిన వ్యాసం 'ఆంధ్రపురాణం'. బెజవాడ గోపాలరెడ్డి గారు రవీంద్ర ప్రభావంతో రాసిన కావ్యాలలోని భావుకతను మార్మికభావ సౌందర్యాన్ని విడమరచి చెప్పాను. 'అక్షరాల ఆలోచనలు లో విశ్వనాథ, శ్రీశ్రీ, వానమామలై, దాశరథి, కుందుర్తి పి.నారాయణరెడ్డి, ఉత్పల, బాపురెడ్డి, భరద్వాజ ప్రభుతలపై విలువైన వివేచన ఉన్నాయి. శ్రీశ్రీ పురాణ ప్రతీకల మీది నా వ్యాసం ఆ పద్ధతి పరిశీలనలో గుర్తింపు పొందింది. ప్రాచీన ప్రతీకల సంప్రదాయార్థాలను ప్రక్షాళణం చేసి మార్క్సిస్టు భావాల తొడుగులు వాటికి అలవరచాడనీ, ఉద్యమారంభంలో ఆ కవితాపద్ధతి బలంగా పనిచేసిందనీ ఆ పద్ధతిలో ఆయన్ను మించిన మహాకవి లేడని చేసిన నా వివేచన విమర్శకుల మన్ననలను పొందింది.

ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలో భావచైతన్య స్రవంతి మూడు పాయలుగా

ప్రవహిస్తోంది. ఒకటి: నవ్య సంప్రదాయ చైతన్యధార- దీనికి నాయకుడు విశ్వనాథ. రెండు: సాయుధ విప్లవ చైతన్య ధార- దానికి నాయకుడు శ్రీశ్రీ, శాంతి విప్లవ చైతన్యధార అభ్యుదయ దీనికి నాయకుడు దాశరథి- లాంటి భావాలు ఈ వ్యాసాల్లో చెప్పాను. విశ్వనాథ 'నర్తనశాల' ను ఉత్తమ విషాదాంతనాటకంగా వివేచించాను.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. పై వ్యాసాలన్నీ 1983-85 మధ్య వ్యాస సంపుటలుగా వెలవడ్డా అవి చాలావరకు 1971-80 మధ్య వ్రాసినవే. ఇవి కిందటి దశాబ్దంలోని అభిప్రాయాలే. ఆధునిక సాహిత్యం మీద ప్రామాణిక వ్యాసాలు రాయటం 1970 ప్రాంతం నుంచే ప్రారంభమైనదన్న సత్యం ఇవి చెపుతున్నాయి. అయితే అప్పటి నా అభిప్రాయాలు కొన్ని మారాయి, కొన్ని పరిణతి చెంది బలపడ్డాయి.

**ప్రభావ పరిశీలనం : ఆంధ్ర సాహిత్య విమర్శ : ఆంగ్ల ప్రభావం (1983)**

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఆధునిక యుగం ఆంగ్లప్రభావంతోనే ఆరంభమౌతుంది. ఆ ప్రభావ స్వరూప స్వభావాలను వివేచించే విమర్శ ఆధునిక సాహిత్యానుశీలనంలో కొన్ని ప్రమాణాలను ఏర్పరచుకోవటానికి బాగా తోడ్పడుతుంది. ఆసత్యం ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారి 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము, నిరూపించింది. అయితే విమర్శమీద పడిన పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించే విమర్శ గ్రంథం వెలువడలేదు. 'తెలుగులో పాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి' అనే డా॥కె. సంపత్కుమారాచార్యగారి గ్రంథం వెలువడింది. అంటే ఒక నాణేనికి బొమ్మ బయటపడిందన్నమాట: ఇక బొరుసు బైటపడాలి. ఆ బాధ్యత నామీద పడింది. ఈ అంశం మీద కొన్ని రచనలు వచ్చాయి. కాని సంతృప్తి నివ్వలేదు. ప్రామాణికతను పొందలేదు. అందువలన నా గ్రంథం తెలుగు సాహిత్య విమర్శ వికాస చరిత్ర రచనకూ, ప్రభావ పరిశీలన ప్రమాణాలను ఏర్పరచుకోవటానికి తోడ్పడే నిర్మాణాత్మకమైన పాజిటివ్ పాత్ర నిర్వహించింది. సాహిత్యలోకంలో మంచి గుర్తింపును పొందింది.

**ఈ గ్రంథం అందించే కొన్ని విలువైన ప్రతిపాదనలు :**

1. సాహిత్య విమర్శ స్వరూప స్వభావ వివేచనలో పాశ్చాత్య ప్రభావ పరిశీలనం సాక్షికమే అవుతుంది. ఏ సాహిత్యంలో నైనా విమర్శ గ్రంథాలు ఆయామనీషులు

సాహిత్యతత్త్వాన్ని మథించి వెలికితీసే అమృతభాండాలు వాటిమీద వివిధ సాహిత్య దర్శనాల ప్రభావం ఉండవచ్చు. అయినా ప్రభావం వేసిన గ్రంథాలకంటే విశిష్టంగా ఆ గ్రంథాలు స్వీయవ్యక్తిత్వంతో నిలవాలి. ఆ వ్యక్తిత్వమే వాటిని ఉత్తమ గ్రంథాలుగా సాహితీ క్షేత్రంలో నిలుపుతాయి. ప్రభావం వేసిన గ్రంథాలకంటె ఒకానొక విమర్శ గ్రంథం ఎంత ఉన్నతంగా పెరిగి ఉపజ్ఞను ప్రకటించిదన్నదే దాని ఉత్తమత్వాన్ని నిర్ణయించే ప్రమాణమని నిర్ణయించాను.

2. కట్టమంచిపై ఆంగ్ల కాల్పనిక విమర్శ యుగ ప్రభావం ఉన్నదనీ, దాని గుణదోషాలు ఆయన విమర్శలో కూడా ప్రతిఫలించాయని సోదాహరణంగా నిరూపించాను. ఆయనది కావ్యానుశీలన యుగమని నిర్దేశించాను.

3. రాళ్ళపల్లి దువ్వూరుల మీద పాశ్చాత్య సాహిత్య సౌందర్య మీమాంసా ప్రభావమున్నదని వివేచించాను.

4. విశ్వనాథ మీద ఎలియట్ నుండి న్యూక్రిటిక్స్ వరకు సాగిన పాశ్చాత్య విమర్శ ప్రభావం ఆయన భారతీయ దర్శనంలో విలీనమై దేశీయతను ప్రదర్శించిందని సవిమర్శకంగా ప్రతిపాదించాను. ఆయన తెలుగు విమర్శలో శిల్పానుశీలన యుగాన్ని ప్రారంభించా డని పేర్కొన్నాను.

5. సమన్వయ యుగ చైతన్యాన్ని పింగళి లక్ష్మీకాంతం, జి.వి. కృష్ణారావు, సి. నారాయణరెడ్డి, ఆర్.యస్. సుదర్శనం ప్రభృతులు ఎలా వైవిధ్యంతో పోషించారో ప్రస్తావించాను.

6. మార్క్సిస్టు విమర్శలో శ్రీశ్రీ సోషలిస్టు మానవతావాదాన్ని, కొడవటిగంటి కుటుంబరావు సామ్యవాద వాస్తవికతనూ, కుందుర్తి సామాజిక స్పృహనూ, కె.వి. రమణారెడ్డి విప్లవ వాద విమర్శనూ ఎలా పోషించారో సమీక్షించాను.

7. విమర్శలో గుంటూరు శేషేంద్రశర్మ గారి కనిసేన మేనిఫెస్టో తెచ్చిన కొత్త మలుపును వివరించాను.

8. ఆధునికాంధ్ర సాహిత్య విమర్శకులలో విశ్వనాథ సత్యనారాయణగా రొక అంచునా,

గుంటూరు శేషేంద్ర శర్మ గారు మరో అంచునా కావ్యరచనా శిల్ప ధ్వజాలను ఎగురవేశారు. అయితే విశ్వనాథ రసభావ దృక్పథాన్ని(Emotional assumption) అతీంద్రియతత్త్వదర్శన దృక్పథాన్ని (Transcendentalism) శిల్పానుశీలనంలో ప్రసరింపచేసి విమర్శను అనుభవదశదాకా తీసికొనిపోతే, శేషేంద్ర శర్మగారు అభివ్యక్తి దృక్పథాన్ని (Expressionistic assumption) నిర్మాణ సమైక్యతా భావ దృక్పథాన్ని ( Configurational assumption ) కవితాతత్త్వ విచారంలో ప్రవేశపెట్టిన విమర్శను సమన్వయ భావ దర్శనందాకా తీసికొని వెళ్ళారు. వీరిద్దరి విమర్శలకూ భారతీయాలంకారిక దృక్పథమే మూలాధారం.

9. తెలుగు కవిత్వంలో యుగకర్తల లాంటివారిమీద కూడా పాశ్చాత్య విమర్శ ప్రభావం ఎలాంటిదో పరిశీలించటమైంది. గురజాడ , రాయప్రోలు, త్రిపురనేని, దేవులపల్లి, చలం, గోపిచంద్, బుచ్చిబాబు ప్రభృతులమీది ప్రభావాన్ని అంచగా కట్టటం జరిగింది.

10. కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు, కవిత్వ చరిత్రలు, సాహిత్య విమర్శ వ్యాసాలు- అనే ప్రక్రియలమీది పాశ్చాత్య ప్రభావాన్ని అనుశీలించటమైంది.

మొత్తంమీద ఈ గ్రంథం పండితుల ప్రశంసల నందుకొన్నది. సాహిత్య విమర్శలోని ప్రభావ పరిశీలనశాఖలో ఒక ఉన్నత ప్రమాణాన్ని నెలకొల్పిందని విజ్ఞులు మెచ్చుకున్నారు.

"Subrahmanyam has sucessfully focussed the attention of Telugu scholars and intellectuals on the need for a viable tradition of literary criticism which can cope even with the avant -grade movement in Telugu literature" అని కేంద్ర సాహిత్య అకాడమీ వారి Indian Literature పత్రిక పేర్కొన్నది.

" A work in Telugu dealing with the impact of English on Telugu literary criticism was a long-felt necessity and it is gratifying that Dr. G.V. Subrahmanyam, who is well-known in literary circles as a first rate thinker, a noted essayist and a critic of high standing has stepped into this void and undertaken this task and ably accomplished it" అని త్రివేణి పత్రిక సమీక్షించింది.

"సుబ్రహ్మణ్యంగారి 'ఆంధ్ర సాహిత్య విమర్శ, ఆంగ్ల ప్రభావం' అన్న పరిశోధనాత్మక గ్రంథమే కనుక రాకపోయి ఉన్నట్లయితే అనేకులైన తెలుగు విమర్శకుల విమర్శవ్యక్తిత్వాలు మనకు సమగ్రంగా తెలిసి ఉండేవి కావు." అని డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారన్నారు. (జీవియస్ విమర్శ దర్శనం. పు.7)

ఆధునిక యుగంలో -అంటే ఈ శతాబ్దంలో - వెలువడ్డ తెలుగు సాహిత్య విమర్శను ప్రభావ పరిశీలన సూత్రంతో అనుశీలించటం జరిగిం దీ గ్రంథంలో. దీనితో అటు ప్రాచీన సాహిత్యాన్నే కాక ఇటు ఆధునిక సాహిత్య విమర్శను కూడా సమీక్షించి విలువల వివేచనతో సాహిత్య మూల్యాంకనంతో విమర్శ వికాస చరిత్రను పునర్వ్యవస్థీకరించే కృషిలో కొంతవరకు కృతకృత్యుణ్ణయ్యా ననిపించింది. దానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం (1986) లభించింది. అదొక మంచి గుర్తింపు నందించింది. దానితోపాటు నా బాధ్యతలను కూడా పెంచింది.

## ప్రక్రియా విమర్శలో ప్రథమస్థానం కోసం ప్రయత్నించిన కాలం : (1985-1990)

1985 సం॥ నా విమర్శ జీవితంలో మరో మంచి మలుపు నిచ్చింది. పరిశోధన విమర్శ వ్యాస గ్రంథ వ్యాసంగం నుండి మారి ఒక్కసారిగా దినపత్రికల్లో ' కాలమ్' రచనకు పూనుకోవలసి వచ్చింది. ఆ మార్పుకు కారకులు అప్పటి ఆ ఆంధ్రప్రభ సంపాదకులు మాన్యులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావుగారు. దినపత్రికల్లో చేరాతల వంటి పరసనల్ కాలమ్స్ ప్రచారంలో ఉన్నాయి. అయితే వాటివల్ల సాహిత్య విమర్శ మరీ పల్చబడిపోతోంది- అని భావించేవారు కొందరు ఉన్నారు. సబ్జెక్టివ్ పరిశీలన కూడా ఆబ్జెక్టివ్ ప్రతిపాదనగా చేసి, వివాదాత్మక అంశాలను నిర్మాణాత్మక స్పృహతో ప్రతిపాదించి ఒక కవికో, ఒక రచనకో సంబంధించిన అంశంమీద కాకుండా ఒక చైతన్యాన్ని సమీక్షించే సాహిత్యాంశాల మీద కాలమ్ సాగాలనీ, అది పరిచయాత్మకంగా కంటె పరిశీలనాత్మకంగా ఉండాలనీ, రాజకీయాల ముసుగుతో దోషాలు చెప్పి దూషించేదాని కంటె, సహృదయ దృక్పథంతో గుణాలను చెప్పి లోపాలను చూపి హెచ్చరించే లాగుండాలనీ సాహితీలోకం కొందరు భావించేవారు. నేనూ ఈ వర్గానికి చెందినవాణ్ణి. పొత్తూరి వారూ అటువంటి ఆలోచనలు కలవారే. దాంతో 'తెలుగులో వెలుగు' అనే పేరుతో 1985 జనవరి 21 వ తేదీన ఆంధ్రప్రభలో

కాలమ్ రచనకు ఆరంభం చేశాను. ఒక సంవత్సరం పాటు వారం వారం నడిపాను. ఆ వ్యాసాలను 'కలంతోకాలమ్' అనే గ్రంథంగా 1990 లో వెలువరించాను. 1986 కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం వచ్చిన తరువాత కొన్నాళ్ళు నేను పనుల ఒత్తిడిలో ఉండిపోయాను. మరొక మహాప్రయత్నంలో మునిగిపోయాను.

తెలుగు సాహిత్య క్షేత్రంలో ప్రక్రియా పరమైన సాహిత్య వికాస దృక్పథంతో మన వెయ్యేళ్ళ సాహిత్యాన్ని ఒక సమన్వయ దృక్పథంతో దర్శించి, వివేచించి, విశ్లేషించిన గ్రంథం అంతవరకు రాలేదు. ఈ పరిస్థితి మన తెలుగులోనే కాదు. భారతీయ భాషా సాహిత్యాలలో కూడా నెలకొని ఉంది. ఈ తరుణంలో తెలుగులో ప్రక్రియా వికాస సూత్రంతో సాహిత్య చరిత్రను నిర్మించే ఒక ప్రణాళికను రూపొందించుకొనే యత్నంలో రెండు మూడేళ్ళు గాఢంగా అధ్యయనం చేశాను. T.S. Eliot, I.A. Richards, F.W. Bateson, Morton W. Bloom Field, E.F. carrit, Christopher Caudwell, Northrop Frye, Georg Lucd, Harol Osborne, George Santayana, K.K. Ruthaven, Rerne Welleck, Austin Warern, Winsatk Cleanth Brooks, Alstair Fowler మొదలైన పాశ్చాత్య విమర్శకుల గ్రంథాలను చదివాను. మనకు కొత్త రకం సాహిత్య చరిత్ర కావాలి, రావాలి అనే తపనకు గురి అయ్యాను. నా ఆవేదనను 1985 మే 13 వ తేదీన ఆంధ్రప్రభ కాలంలో 'సాహిత్య చరిత్ర పునర్నిర్మాణం' అనే వ్యాసం ద్వారా వ్యక్తం చేశాను. 'కలంతో కాలమ్' లో సాహిత్యంమీద దాడి, విమర్శ పారిభాషిక పదజాలం, సంవాద సాహిత్యం, అనుమానం: అన్వేషణ, వినాదం-నిర్వచనం, సంప్రదాయవాదుల సమస్య-మొదలైన వ్యాసాలు ఆ మథనంలో నుండి పుట్టిన మనసులోని మాటలే.

ప్రపంచ ఆధునిక భాషా సాహిత్యాల్లో ప్రక్రియ వికాస సూత్రాన్ని ప్రాతిపదికగా చేసికొని నిర్మించే సాహిత్య చరిత్రే వికాస చరిత్రగా పరిగణించబడుతోంది. అయితే దానికి ఏక సూత్ర,త, ఏకవాక్యత అవసరం. తెలుగులో ప్రక్రియలమీద పరిశోధనలు దాదాపు నాలుగు దశాబ్దాలుగా జరుగుతున్నా ప్రక్రియ వికాస సూత్రంతో ఒక సాహిత్య చరిత్ర నిర్మాణం చేయాలన్న స్పృహ సాహిత్య లోకంలో ఏర్పడలేదు. ఆ స్పృహకు ఒక రూపకల్పన చేసే యత్నంలో నేను నిమగ్నుడనై ఒక ప్రణాళికను ఏర్పరచుకొన్నాను. దానిని శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావు గారికి చెప్పాను. వారు సహృదయతతో 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' అనే శీర్షికతో కాలమ్ వ్యాసాలు వారం వారం రాసే ఏర్పాటు చేశారు.

136 వ్యాసాల్లో నా ప్రతిపాదనలను ప్రకటించాను. వాటిని పండితులు ఆదరంతో స్వీకరించారు. కొందరు మొదట్లో అర్థంకాలే దన్నారు. కొందరు అభ్యుదయవాదులు మొదట్లో ప్రతిఘటించారు. ప్రక్రియ అంటే ఏమిటో స్పష్టమైన అవగాహన లేని కొందరు వాటిని మొదట్లో అనుసరించలేకపోయారు. అందుకని ప్రక్రియా పరిజ్ఞానాన్ని కూడా కలిపి కాలమ్‌లో వివరించవలసి వచ్చింది. ఆ పని చేసిన తరువాత కాలమ్ మీద అందరికీ గౌరవం పెరిగింది. సిద్ధాంతాలతో భేదించే మిత్రులు కూడా ప్రక్రియా ప్రస్థానాన్ని ప్రతిఘటించలేకపోయారు.

ఆంధ్ర సాహిత్య చరిత్రను కవుల చరిత్రగానూ, కాలక్రమగతిలో చెప్పే సాహిత్య పరిణామచరిత్రగానూ అధ్యయనం చేసే పాతపద్ధతి మారి సాహిత్య వికాస దృష్టితో సవిమర్శకంగా, సశాస్త్రీయంగా ఆలోచించి, అధ్యయనంచేసి, రచించే నవీన పద్ధతికి ఈ వ్యాసపరంపర ఒక నిర్దిష్టమైన మార్గాన్ని చూపిస్తున్నది. ఇది ముందెవ్వరూ చెయ్యనిపని. అందువల్ల ఇది-జీవియస్ తెలుగు సాహిత్య విమర్శ కందించిన ప్రక్రియాపరిశీలన ప్రస్థానం.

(ప్రక్రియా పరిజ్ఞానం సాహిత్య విమర్శకూ, సాహిత్యానుశీలనానికీ ప్రాణప్రదం. ప్రక్రియ సాహిత్య వివేచనకు కేంద్రబిందువు. ప్రక్రియకు మూలం కవియొక్క సాహిత్య దర్శనం. కాబట్టి విమర్శకుడుకాని, ఉపాధ్యాయుడుకాని కావ్యాన్ని గురించి, కావ్యప్రక్రియను గురించి, కవితాశైలినిగురించి, ఒక కాలంలో ఒక సాహిత్య రచన వెలువడడానికి కారణమైన అంతర్గతిసూత్రాన్ని గురించి అవగాహనను పెంచుకోవడానికి సాహిత్య దర్శన వివేచన ముఖ్యమౌతుంది. తెలుగులో ప్రక్రియాపరమైన స్థూలపరిజ్ఞానం మాత్రమే ఇంతవరకు వ్యాప్తిలో ఉన్నది. దానివలన తెలుగు కవుల సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలను వ్యక్తిత్వ విశేషాలను గురించి వివేచించటంలో ఉన్నత ప్రమాణాలు ఏర్పడకపోవడమే కాకుండా కొన్నిసార్లు అస్పష్టప్రతిపాధనలు చేయడం కూడా జరుగుతున్నది. ఫలితాంశంగా చాలామంది విద్యార్థులకు విమర్శకులకు ఉపాధ్యాయులకు పరిశోధకులకు ప్రక్రియా పరమైన నిర్దిష్ట విజ్ఞానం శాస్త్రీయంగా ఏర్పడలేదు; సాహిత్య వికాసం రచయితల సాహిత్య దర్శనాలలో ఏర్పడే అంతర్గతి సూత్రంమీద ఆధారపడి ఉండేదనే స్పృహ నేటికీ సమగ్రంగా ఏర్పడలేదు. ఈ లోపం తీరి ఒక సక్రమమైన శాస్త్రీయ అవగాహన ప్రక్రియా పరంగా ఏర్పడటానికి ఈ గ్రంథం తోడ్పడుతుందని నేను గట్టిగా నమ్ముతున్నాను.

తెలుగు కవులు ప్రయోగించిన, ప్రయోగిస్తున్న ప్రక్రియలు శుద్ధమైన ప్రాథమిక

(ముడి) ప్రక్రియలు కావు; ప్రౌఢమైన మిశ్రప్రక్రిలు. తెలుగు కవులు భారతీయ సాహిత్య దర్శనాలను, దేశీయ దర్శనాలను, దేశీయ ప్రాదిపదికలను, భూమికలను విస్మరించకుండా విశిష్ట సముశ్లిష్ట మిశ్రప్రక్రియలను సృష్టించటం తమ ప్రత్యేకతగా ప్రకటించుకొన్నారు. ఈ సూత్రం భారత కవులైన కవిత్రయానికి ఎంత వర్తిస్తుందో, అంత ప్రబంధ కవులకు, భావకవులకు, నవ్యసంప్రదాయ కవులకు, అభ్యుదయ కవులకు, నవలా రచయితలకు, నాటక కర్తలకు, అంతదాకా ఎందుకు అత్యంత ఆధునిక రచయితలకు కూడా వర్తిస్తుంది. ప్రాథమిక ప్రక్రియలకు సంబంధించిన పరిజ్ఞానంతో మిశ్ర ప్రౌఢప్రక్రియలను ప్రయోగాలను పరిశీలించే ప్రవృత్తి మన తెలుగు విమర్శ రంగంలో తీండ్రించుకొని ఉండటంచేత నన్నయ నుండి నేటివరకు ప్రక్రియలలో ప్రయోగాలు చేస్తున్న రచయితల ప్రతిభా ప్రభావాలలోని సృజనాత్మకత తగినంతగా వెలుగుచూడటంలేదు. ప్రాచీన కవులు సంస్కృతాన్నీ, ఆధునిక కవులు ఆంగ్ల సాహిత్యాన్నీ అనుసరించటం, అనుకరించటం, అనువదించటం తప్ప సృజనాత్మకతను తెలుగు కవులు ఈ వెయ్యేళ్లలో ఎక్కడ ప్రదర్శించగలిగారు? - అని అధిక్షేపించుకొనే అజ్ఞాన స్థాయికి కొందరు దిగజారగలిగారు. ఈ ఆత్మవినాశక విమర్శ మార్గంనుంచి నిర్మాణాత్మక శాస్త్రీయ దృక్పథం వైపు విమర్శను మళ్ళించగలగే చైతన్యం ప్రక్రియా వికాస చరిత్ర స్పృహవలన ఏర్పడుతుం దనటంలో అనుమానం లేదు. ఆ మార్గాన్ని నిర్దేశించి, నిరాఘాటంగా పయనించటానికి సదుపాయాలు కల్పించి, మైలు రాళ్ళను బాటలో నిలిపి, ఆధునిక వికాస దృక్పథాన్ని ఈ వ్యాస పరంపర కలిగించగలుగుతుందని విశ్వసిస్తున్నాను.

ఈ వ్యాసపరంపరవలన సాహితీ జిజ్ఞాసువులకు కలిగే కనీస లాభాలను పఠితల సౌకర్యార్థం యిక్కడ వరుసగా పేర్కొంటాను.

1. ప్రక్రియలంటే ఏమిటి? ఉపప్రక్రియలు, అనుప్రక్రియలు అంటే ఏమిటి? వాటి స్వరూప స్వభావా లెలా ఉంటాయి? ప్రక్రియా పరిశీలనంలో విమర్శపాత్ర ఎటువంటిది? సాహిత్య వికాస చరిత్రకూ ప్రక్రియా వికాసానికీ ఉన్న సంబంధం ఏమిటి? యుగవిభాగంలో ఏకసూత్రతను, అంతర్గతి సూత్రంలో ఏకవాక్యతను ప్రక్రియా వికాససూత్రం వలన ఎలా సాధించవచ్చు? మొదలైన అంశాలకు సంబంధించిన పరిశోధనాత్మకమైన పరిజ్ఞానం కలుగుతుంది.

2. సాహిత్యం ప్రక్రియలకు దూరంగా తొలగిపోతున్నదనే తిరుగుబాటువాదులద ధోరణుల వలన సాహిత్యపువిలువలు సాహిత్యేతరదర్శనాదులవలన నిర్ణయించబడే దృక్పథాలు ఏర్పడి, అవి ప్రపంచ సాహిత్య విమర్శకుల తీవ్రఖండనలకు ఎలా గురి అయ్యాయో తెలుపుతూ, సాహిత్య దర్శనమూలమైన ప్రక్రియా వికాసం సూత్రమే అత్యంత ఆధునిక సాహిత్య విమర్శలక్షణంగా వివరిస్తూ, నేటి సాహిత్య వికాస చరిత్రకు ఆ విమర్శపద్ధతి ఎలా ఉపయోగపడుతుందో అనువర్తితమార్గంలో ఈ వ్యాస పరంపర నిరూపిస్తున్నది.

3. సాహిత్య చరిత్రలు రాసే పద్ధతు లెన్ని ఉన్నాయో పేర్కొంటూ, సాహిత్య చరిత్రను ఏకసూత్రంతో అన్వయిస్తూ నిర్మించటానికి చేసిన ప్రయత్నాల శక్తియుక్తులూ, పరిధులూ, పరిమితులూ, జయాపజయాలూ వివరిస్తూ, సాహిత్య వికాస చరిత్ర ఆ పద్ధతులన్నిటిలో ఉత్తమమైనదనీ, ఆధునికమైనదనీ ప్రతిపాదించటమే కాకుండా, ప్రపంచంలో ఆ పద్ధతికి ప్రాచుర్యం ఉన్నదని వివరించటమైంది.

4. సాహిత్య చరిత్ర అధ్యయనంలో, అధ్యాపనంలో డిగ్రీస్థాయిలోనూ, స్నాతకోత్తరస్థాయిలోనూ పాటించవలసిన ప్రమాణాలను గురించి సూచించటమైంది.

5. కవిత్రయ మహాభారత ప్రక్రియనూ, వారి సాహిత్య దర్శనాన్నీ, వారి కవితా వ్యక్తిత్వాలనూ, అవి ఆయాకాలాలలో ఆ విధంగా వెలువడటానికి కారణాలైన సాహిత్య దర్శనాలలోని అంతర్గతి సూత్రాన్నీ నిర్దిష్టంగా నిరూపించటమైంది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల ప్రయోగాలు ఏయే ప్రక్రియలో గుర్తించి, పేర్లు పెట్టి, ఆయాకవుల సృజనాత్మక ప్రతిభాశక్తులను వివరించటమైంది.

6. శివకవులలో నన్నెచోడుని రచనలను, పాల్కురికి సోమనాథుని రచనలను విశ్లేషించి, ప్రక్రియాపరమైన నవీనాంశాలను మౌలికంగా ప్రతిపాదించి ప్రపంచించటమైంది. వస్తుకావ్యం, దేశిపురాణం, చరిత్రకావ్యం అనే ప్రక్రియలకు లక్షణాలను నవ్యదృక్పథంతో సమర్పించటమైంది.

7. తిక్కన, ఎఱ్ఱన, మారన, నాచనసోముడు, శ్రీనాథుడు, పోతన - మొదలైన ప్రసిద్ధకవుల రచనలకు ప్రక్రియాపరమైన వివరణం ఈ గ్రంథంలో లభిస్తుంది -

కథాకావ్యం, మహాకావ్యం, ప్రబంధపురాణ కావ్యం, వంశకథాకావ్యం, మార్గరసకావ్యం, జాతివార్తాచమత్కార కావ్యాలు, మహాపురాణం మొదలైన ప్రక్రియలకు నామరూపలక్షణ నిర్దేశ సమన్వయాలు విస్పష్టంగా ఈ వ్యాస పరంపర అందిస్తున్నది.

8. పదకవితాశాఖలనూ, శతకప్రక్రియనూ, యక్షగాన నాటక భేదాలనూ ప్రక్రియాపరమైన వివేచనతో విపులంగా పరిచయం చేయటమైంది.

9. భక్తి సాహిత్య ప్రక్రియలు, ఇతర సాహిత్య ప్రక్రియలకంటె ఎలా ప్రత్యేకతను సంతరించుకొంటాయో సమీక్షించటమైంది.

10. తెలుగు సాహిత్య ప్రక్రియ లన్నింటిలో తెలుగువారు సగర్వంగా చెప్పుకొనేది ప్రబంధం. ఇంతవరకూ ప్రబంధాన్ని గురించి ప్రక్రియాపరమైన విమర్శనం శాస్త్రీయంగా వెలువడలేదు. పైపెచ్చు ప్రబంధప్రక్రియను నిరసించే విమర్శలు కూడా విరివిగా వచ్చాయి. ఈ వ్యాస పరంపర శ్రీనాథయుగానికీ, ప్రబంధయుగానికీ, దక్షిణాంధ్రయుగానికీ గల ప్రక్రియా వికాస పరమైన పరిణామ వివేచనను బలంగా అందిస్తున్నది. ప్రబంధప్రయోగాలకు ఒక ప్రత్యేక ప్రతిపత్తిని కల్పిస్తున్నది. నాచనసోముని చమత్కార ప్రస్థానదర్శనం, శ్రీనాథుని రసోన్ముఖమైన రీతి ప్రస్థానం, ప్రబంధ కవుల అలంకారప్రస్థానం - మొదలైన సమన్వయాలు సాహిత్యచరిత్రను దర్శించే చూపునే నవ్యంగా సవ్యంగా మార్చివేస్తున్నాయి. ప్రబంధ ప్రయోగాలకు బాట చూపింది అలంకార ప్రస్థానంలో అగ్రగణ్యంగా భావింపబడే 'వక్రోక్తి జీవితం' . ప్రబంధాలలోని వర్ణనలకూ, వస్తువులకూ, అలంకార ప్రయోగాలకూ, పాత్రకల్పనలకూ, రసచిత్రణలకూ, శ్లేష ప్రయోగాలకూ, ద్వ్యర్థి చమత్కారాలకూ అన్నింటికీ వెనుక వ్యక్రోక్తి జీవితం చైతన్యసూత్రంగా, మార్గదర్శకంగా ఉన్నదని సవిమర్శకంగా ఈ వ్యాస పరంపర సమీక్షించింది. నాకు తెలిసినంతవరకు సాహిత్య దర్శన పరంగా, ప్రక్రియాపరంగా ప్రబంధానికి ఇంతటి శాస్త్రీయ సమన్వయం ఇంతకు ముందు ఇవ్వబడలేదు. కొత్తబాట చూపిస్తున్నది ఈ గ్రంథం.

11. శ్లేష కావ్యం, శృంగార కావ్యం, చిత్రకవితా కావ్యం, త్యాగరాజకృతి, వేమన పద్యం మొదలైన అంశాలమీద ప్రక్రియాపరంగా సాగిన చర్చ ఇంతకు పూర్వం స్పృశింపబడని అంచులకు చేరుకొని నవ్య సమన్వయాలను అందిస్తున్నది.

12. ఆధునిక సాహిత్య వికాసాన్ని ప్రక్రియాపరంగా, ఏకసూత్రతను పాటిస్తూ పరిశీలించిన మొదటి గ్రంథం ఇదే ననుకుంటాను. వీరేశలింగంపంతులుగారి కాలంనుండి పాశ్చాత్య ప్రాథమిక (మూల) ప్రక్రియలు తెలుగు సాహిత్య రంగంమీద ఎలా తమ ప్రభావాన్ని చూపి ప్రయోగాలకు తోడ్పడ్డాయో ఈ వ్యాస పరంపర వివరిస్తున్నది.

13. తెలుగు నాటక ప్రయోగాలను ప్రయోగ దృష్టితో పరిశీలించి విషాదాంత నాటకాలూ, విషాద గంభీర రూపకాలూ అనే విభాగం చేసి, క్లాసిక్, ఎపిక్ ప్రమాణాలు సంతరించుకొన్న సంప్రదాయ సాంఘిక సమస్యానాటకాలను సమీక్షించి నాటక యుగాన్ని సాహిత్య చరిత్రలో దర్శించింది ఈ వ్యాస పరంపర.

14. 'లిరిక్కు' తెలుగు సాహిత్య ప్రక్రియను ప్రభావితం చేసిన వైఖరిని నిశితంగా పరిశీలించి, పునరుజ్జీవన యుగ ప్రకృత్తి కలిగిన ఇంగ్లీషు లిరిక్కులు గురజాడ రాయప్రోలులను ఉత్తేజితులను చేస్తే, ఆంగ్లకాల్పనిక యుగ లిరిక్ కృష్ణశాస్త్రి కవితకు ప్రేరకమయిందని పేర్కొనటం జరిగింది. (చూడు. లిరిక్కు లెగరేసిన రెండు జెండాలు (73వ వ్యాసం) పు. 368, 369).

15. లఘుకావ్యం, ఖండకావ్యం, కవిత, కవిత్వం, కావ్యం, గీతం, గేయం, గేయకావ్యం, పాట, మొదలైన కాల్పనిక కవితాయుగ ప్రక్రియల స్వరూప స్వభావాలను గురించి సమన్వయాత్మక విమర్శ సాగింది; నవ్యదృక్కోణాలు ప్రసరించాయి.

16. 'నవలాయుగం' - అని ఆ ప్రక్రియను గౌరవించి, విశ్లేషించింది ఈ వ్యాస పరంపర.

17. నవ్య సంప్రదాయ కావ్యయుగ చర్చ ఈ గ్రంథంలో ప్రత్యేకంగా చెప్పుకోతగింది. 89వ వ్యాసం నుంచి 105వ వ్యాసం వరకూ ఈ యుగ చైతన్యం కావ్యాలలో, నవలలలో, నాటకాలలో, విమర్శలో ఎలా ప్రతిఫలించిందో, ఎంత ఉదాత్తమైన ఉజ్జ్వల సాహిత్యం ఈ యుగంలో సర్వప్రక్రియలలో వెలువడిందో వివరంగా నిరూపించటమైంది.

18. సాహిత్యోద్యమాలూ, సామాజికోద్యమాలూ, వాటి స్వరూప స్వభావాలూ, ఆయా ఉద్యమాలలో వెలువడే సాహిత్య ప్రయోగాలూ ఎలా ఉంటాయో విశ్లేషించటమైంది.

19. ఆధునిక కావ్యేతిహాస యుగాన్ని గురించి వ్రాసిన వ్యాసాలు (110 వ్యాసం నండి

131 వ్యాసం వరకు) సమకాలీన సాహిత్యాన్ని ప్రక్రియాపరంగా వర్గీకరించి, విలువ కట్టిన ప్రథమ ప్రయత్నం ఇది. ఆధునిక సాహిత్య చరిత్ర ఇందులో రూపుకట్టుకొన్నది. మినీ కవిత, ఖండకావ్యం నుంచి మహాకావ్యం, ఇతిహాస మహాకావ్యం, కావ్యేతిహాసం మొదలైన ప్రక్రియలను వినిర్మించిన సమకాలీన ప్రసిద్ధ కవుల రచనలను అనుశీలించటమైనది.

20. నేటి పత్రికలు సమీక్షా వ్యాసాన్ని ఎలా పోషిస్తున్నవో పేర్కొని, కడచిన అయిదేళ్ళుగా సాహిత్య విమర్శ పత్రికారచనా స్వభావంతో బహురూపాలలో ఎలా పరవళ్ళు తొక్కుతున్నదో విశ్లేషణాత్మకంగా వివేచించటమైంది.

ఈ విధమైన ఆలోచన కొత్తది. దానికి స్వయంగా రూపకల్పన చేసికొని ఈ చర్చనీయాంశాలను నిర్వహించాను. సాహిత్య చరిత్ర కూడా ఒక ప్రక్రియగా పరిగణించవచ్చునని 3వ వ్యాసంలో ప్రతిపాదించాను. నేనీ వ్యాసపరంపరను పత్రికా రచనా స్వభావంతో రూపొందించి, దాని కొక ప్రక్రియా గౌరవాన్ని కల్పించా నని భావిస్తున్నాను. నే నిచ్చిన ప్రణాళికను ఆధారంగా చేసికొని సాహిత్య వికాస చరిత్రను వినిర్మిస్తే అదికూడా ఒక విశిష్ట ప్రక్రియ కాగలదని నేను విశ్వసిస్తున్నాను. అందువల్లనే ఈ వ్యాసవాహిని ఈ రకమైన ప్రయత్నానికి భరతవాక్యం కాదు నాందీవాక్యం కావాలి! అని ఆశిస్తూ చివరి వ్యాసాన్ని రాశాను.

ఈ రచన మూడుదశాబ్దాల సాహిత్యాధ్యయనం వలనకలిగిన సంస్కారఫలం. ఈ సంపుటిలో నవ్య ప్రతిపాదన లేని వ్యాసం లేదు. ప్రక్రియలను గుర్తించి పేర్లు పెట్టటంలో నవ్య పారిభాషిక పదాలను కొన్నింటిని కల్పించాను. అయినా, అవి సాహిత్య వ్యవహారానికి దగ్గరగా ఉండేటట్లు, పేరు వింటేనే దాని తీరు, సొరు గమ్యమానమయ్యేటట్లు చూచాను. ప్రాచుర్యంలో ఉన్న కొన్ని పారిభాషిక పదాలకు నిర్దిష్టమైన అర్థాలను నిర్ణయించాను. ఇతర భాషలలోనుంచి తెచ్చుకొనే పారిభాషిక పదాలకు రూపంలోనూ, అర్థంలోనూ, ఆచరణంలోనూ, అవగాహనలోనూ మార్పు వచ్చి, అవి దేశీయతను సంతరించుకొంటే, వాటి స్వరూప స్వభావాలను సమీక్షించాను. అవసరమున్నచోట తులనాత్మక అధ్యయన పద్ధతిలో పారిభాషిక పద నిర్ధారణం చేశాను. ప్రక్రియల పేర్లే తెలుగులో స్థిరపడని కాలంలో ఉపప్రక్రియల పేర్లను గురించి చర్చించటం కష్టం. అయినా, ఎడనెడ ఆ పని కూడా చేశాను.

ఈ వ్యాసాలను రెండేళ్ళకుపైగా ఆంధ్రప్రభ ఆదివారం సారస్వతానుబంధంలో చదవటంవల్లా, 1991లో తెలుగు ఆకాడమీ ప్రచురణగా వెలువడిన నాటినుంచి గ్రంథంరూపంలో అధ్యయనం చేయటంవల్లా ఈ రచన సాహిత్యలోకంలో క్రమంగా ఆదరగౌరవాలను సంపాదించింది. ఈ గ్రంథచరిత్ర తలచినప్పుడేల్లా నాకు Johan Hayward మాటలు మనసులో మెదలుతూ ఉంటాయి. "The influence of a critic capable of understanding the periodical task of revaluation, may not be impressive at first, for cannons of literary taste are not altered suddenly by revolutionising any methods. Their alteration can only be affected gradually and in accordance with the evolutionary process by which habits of the minds of educated men and women are changed from time to time".

ఈ రోజు ఈ గ్రంథాన్ని గురించి స్పందన తెలుసుకోవాలంటే డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారి ఈ మాటలు చాలు: "ఆంధ్రసాహిత్యాన్ని ప్రాఙ్నన్నయ కాలం నుంచి నేటి వరకు చూడ్డం వల్ల నేటికాలంలో వచ్చిన అనేకానేక ప్రక్రియలనూ సాహిత్యచరిత్రలో చర్చించి, సాహిత్య ప్రమాణాలనూ యుగాలనూ ఏర్పరచటానికి సుబ్రహ్మణ్యంగారు సముచిత కృషి చేశారు. ఇలాంటి కృషి వల్ల జరిగిన మేలేమిటంటే - వేమన 'కవి' నుంచి గురజాడ 'కవి' వరకు నడుమన మహాకవి లేడన్న నిర్ణయాలను సశాస్త్రీయంగా తొలగించటం, "మధ్య ఎందరు మహాత్ములున్నా వారు ఎన్ని ప్రక్రియలు నిర్వహించినా, కవితాప్రయోక్తలు కాకపోతే యుగకర్తలు కారు. ఇటువంటి భ్రాంతిమూలక ప్రమాణాలను బద్దలు కొడితే తప్ప మన విమర్శగాని, మన సాహిత్యచరిత్రలుగాని, బాగుపడవు". (సా.చ.చ.పు.338)

ప్రక్రియా వివేచనద్వారా సాహిత్య చరిత్ర సమగ్ర వికాసపరిశీలన చేయటం వెనుకన సుబ్రహ్మణ్యంగారు ఏర్పరచుకొన్న ఆలోచనా విధానం ఇది. వారు చేస్తున్నది కేవలం మార్గదర్శనమే కాదు. ఈ మార్గంలో చాలా దూరం పయనించి చక్కని వికాస చరిత్రను ప్రక్రియాపరంగా రచించి, జిజ్ఞాసువులకు వారు ఇవ్వనుగూడా ఇచ్చారు. వారు ఏ పూర్వచరిత్రకారుని మీదా నేరారోపణలు చేయలేదు. వాళ్ళను సగౌరవంగా చూస్తూనే వారి కృషిమీద జరగాల్సిన కృషిని, చేపట్టాల్సిన బాధ్యతను ఎవరిమీదనో పారవేయక వారే దాన్ని వహించి సాహిత్యచరిత్ర రచనను ఈ దృక్కోణంతో రచించడంవల్ల ఆలోచనకూ,

ఆచరణకూ జార్పాటులు లేకుండా నిండైన సాహిత్య చరిత్ర వచ్చింది." (జీవియస్ విమర్శదర్శనం పు. 32-33)

ప్రక్రియా విమర్శతో నేను నిర్మించిన సాహిత్య వికాస చరిత్ర రేఖాచిత్రం 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'. ఆ శాఖా ప్రస్థానంలో అది అగ్రగణ్యం.

**నవ్యసంప్రదాయోద్యమ విజయభేరి మ్రోగించిన కాలం: (1991-1995)**

నా పేరూ నవ్యసంప్రదాయం పేరూ కలిపిచెప్పటం ఇప్పుడు సాహిత్యలోకంలో పరిపాటైపోయింది. ఇది కాకతాళీయం కాదు. రెండు దశాబ్దాల కృషి ఫలితం.

ఆధునిక సాహిత్య చరిత్రలో యుగవిభాగం విషయంలో గాఢంగా ఆలోచన చేసినవారు లేరు. ఉద్యమాలను పట్టి యుగాల పరిగణనం పరిపాటిలో ఉంది. అందులోనూ ప్రధానంగా పాశ్చాత్య ప్రభావంతో వచ్చిన కవిత్వోద్యమాలను, కొన్ని సాహిత్యేతర ఉద్యమాలనూ దృష్టిలో పెట్టుకొని చరిత్ర నిర్మించే పద్ధతి ప్రచురంగా ఉంది. నవ్యకవిత్వం, అభ్యుదయకవిత్వం, దిగంబరకవిత్వం, విప్లవకవిత్వం, స్త్రీవాద కవిత్వం, దళిత కవిత్వం... ఇలా విభాగం చేయటం ఒక రోకంటి పాట అయిపోయింది. 1930 నుండి 1985దాకా స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో బలంగా వెలువడ్డ దేశీయ ఉద్యమాలనుకాని, సాహిత్యోద్యమాలుగాని మార్క్సిస్టులు పరిగణనలోకి తీసుకోకుండా అది సంప్రదాయ మార్గమని త్రోసివేయటం మొదలుపెట్టారు. తెలుగుజాతి గర్వించే ఎన్నో మహాకావ్యాలు, ఎన్నో ఆలోచనధారలు, దేశీయప్రస్థానాలు వెలుగుచూడకుండా చీకట్లోకి త్రోయపడ్డాయి. సంప్రదాయ మంటే ఒక నెగెటివ్ భావం సాహిత్యక్షేత్రంలోకి మార్క్సిస్టులు తెచ్చిపెట్టారు. దానితో తెలుగు సాహిత్యచరిత్రలో ఎన్నో విలువలు అస్తవ్యస్తమైపోయాయి. చరిత్రలో జరిగిన ఈ అన్యాయాన్ని సహించలేక 'సాహిత్యంలోని కొన్ని వాస్తవాలను బయటపెట్టి, విలువలనుబట్టి సాహిత్యచరిత్రలో యుగవిభాగం ఏర్పడాలనే లక్ష్యంతో ఒక న్యాయమైన పోరు మొదలైంది. అది వీచి వీచి క్రమంగా తుఫానుగా మారింది. అదే నవ్యసంప్రదాయోద్యమం. గతంతో విచ్ఛిత్తి కోరే సిద్ధాంతవాదుల మతంలో సంప్రదాయం తిరోగమనమార్గం. అవిచ్ఛిన్న సంప్రదాయాన్ని సాహితీక్షేత్రంలో గౌరవించే వారి దృష్టిలో అభ్యుదయవాదుల ప్రస్థానం పాక్షికం. సంప్రదాయం అభ్యుదయాన్ని తనలో పెంచి

పోషించగలుగుతుంది. అభ్యుదయమనే పేరనున్న మార్క్సిజం సంప్రదాయాన్ని ధ్వంసం చేస్తుంది. అందువల్ల ఒక మహాసంప్రదాయ ప్రస్థానాన్ని ధ్వంసం చేసి ఏకైక మార్క్సిస్టు మహాప్రస్థానాన్ని సాహిత్యక్షేత్రంలో కొనసాగించాలన్న అభ్యుదయవాదుల వ్యూహాన్ని విజయవంతంగా భేదించటానికి ఏర్పడిన సాహిత్యసత్యాగ్రహోద్యమం నవ్యసంప్రదాయోద్యమం. ఇది రాజకీయోద్యమం కాదు, సామాజిక సాహిత్యోద్యమం. అంతర్జాతీయం అనే పేరు ఈ వాదంలో ఉండదు. విశ్వజనీనం అనే స్పృహ దేశీయం. అదే దాని స్వభావం. అంతర్జాతీయ మనే పేరుతో దేశీయాన్ని ధ్వంసంచేసే రాజకీయంపై నవ్యసంప్రదాయం ఒక తిరుగుబాటు.

నవ్యసంప్రదాయోద్యమ ఉత్పత్తి వికాసాలను గురించి తేదీలవారీగా చెప్పటం ప్రస్తుతం కాదు గాని దశలవారీగా దాని ప్రగతిని గుర్తిస్తే అందులో నా పాత్ర స్పష్టమౌతుంది.

1. పునరుజ్జీవన యుగంలో సంప్రదాయం అవగాహన ఆచరణల సంయుక్త జ్ఞాన రూపంగా ఉండేది.

2. సంస్కరణ చైతన్యయుగంలో సంప్రదాయం జ్ఞానంగా గౌరవించబడింది. సంప్రదాయజ్ఞానం లేని ఆచరణ మూఢాచారంగా పరిగణింపబడేది. ఆ కాలంలో సంప్రదాయం సమాదరణీయమే, మూఢాచారం సంస్కరింపదగింది. మొత్తంమీద సంస్కరించబడిన సంప్రదాయం జ్ఞానమయమైన సంస్కారంగా భావింపబడేది. సంప్రదాయం కాలానుగుణంగా సంస్కరింపబడుతుందన్న స్పృహతో పాటు అది అవిచ్ఛిన్నమనే భావం ఉండేది.

3. కాల్పనిక యుగ చైతన్యంలో - సంప్రదాయంలోని నాగరకత, సంస్కృతులు చర్చనీయాంశా లయ్యాయి. నాగరకతలో సంప్రదాయ పరంపరా విజ్ఞానం క్రమంగా మృగ్యమై యాంత్రిక భౌతికవాద హేతువాద దృక్పథాలు ప్రబలటంతో కాల్పనికవాదులు పరంపరాగతంగా వచ్చే సంప్రదాయానికి నెలవైన గ్రామీణసంస్కృతిని అభిమానించారు. అచ్ఛమైన ప్రకృతి అమరమైన సంప్రదాయానికి, నాగరక ప్రకృతి కృత్రిమ ప్రయోగాలలకూ ప్రతినిధులుగా భావించారు. ఆ భావన భారతీయ రచయితలందరినీ ప్రభావితం చేసింది.

భావకవులు సంప్రదాయ విరోధులు కారు. కట్టుబాట్లకు అతీతులు. స్వేచ్ఛ వారికి ప్రాణం. కాని, స్వేచ్ఛ సంప్రదాయాన్ని బహిష్కరించదు. అయితే, కొన్నిచోట్ల అది పాశ్చాత్య సంప్రదాయ వ్యామోహంగా మారటం ఈ యుగధర్మం.

4. నవ్యసంప్రదాయం - సంప్రదాయంలో ఉన్న దేశీయత సాహిత్యంలోని రసానుభూతికి మూలభూతం. దాన్ని రక్షించుకోవటమే సాహిత్యధర్మం. ఈ చైతన్యం ఈ శతాబ్దిలో ముమ్మరంగా సాగింది. సంప్రదాయం యొక్క ఆత్మ ఆధ్యాత్మిక, సాహిత్య, కళా, తత్త్వదర్శనాల్లో ఉంటుంది. దాన్ని పునరుద్ధరించుకోవటమే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు మూలం అని భారతీయ మేధావులు చెప్పారు. స్వామి వివేకానంద, రవీంద్రనాథ ఠాగూర్, అరవిందంఘోష్, విశ్వనాథ సత్యనారాయణ ఇలా ఎందరో మహానుభావులు-ఈ ప్రస్థానాన్ని ప్రచారం చేశారు. వివేకానంద పాశ్చాత్య సంప్రదాయంలోని భౌతిక దృక్పథాన్ని భారతీయ ఆధ్యాత్మిక దృక్పథంతో పోల్చి తులనాత్మకంగా చర్చించి భారతీయ సంప్రదాయ గౌరవాన్ని ప్రపంచానికి చాటి చెప్పాడు. రవీంద్రనాథుడు ఇండియా, చైనా, జపాన్, బర్మా మొదలైన ప్రాచ్యదేశాలన్నీ ఒక మౌలిక సంప్రదాయధారకు చెందినవనీ, దీన్ని ప్రాచ్య సంస్కృతి అంటారనీ, దాని విలువ గుర్తించి జీవన విధానంలో బలపరచుకొంటేనే పాశ్చాత్య సంప్రదాయపు ఉక్కుకౌగిలి నుండి ప్రాచ్యదేశాలకు స్వాతంత్ర్యం లభిస్తుందనీ విశ్వకవి ప్రబోధించాడు. అరవిందులు భారతీయ సంప్రదాయంలో ఉన్న ఆధ్యాత్మిక శక్తిని ఆవిష్కరించే ప్రవృత్తిని భారతీయరచయితలు కోల్పోరాదనీ, పాశ్చాత్యులు భారతీయంవైపు ప్రస్థానం చేస్తున్నారనీ, మనం పాశ్చాత్య సంప్రదాయానుకరణం చేస్తే మన సాహిత్యం తిరోగమనం పాలౌతుందనీ హెచ్చరించారు. విశ్వనాథ సత్యనారాయణగారు "నిజానికి శిల్పముగాని, సాహిత్యముకాని జాతీయమై యుండవలెను. విజాతీయమై ఉండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవారికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద పక్షి ఎగిరినను రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, సంప్రదాయము" అన్నారు. జాతీయతే సంప్రదాయమని విశ్వనాథ మతం. ఈ ఆలోచనధారను నవ్యసంప్రదాయమని పిలుస్తున్నాం.

4. మార్క్సిస్ట్ భావజాలం లేదా అభ్యుదయ దృక్పథం - నవ్యసంప్రదాయభావనకు

విరుద్ధం. జాతీయత, సంప్రదాయం, అవిచ్ఛిన్నత, సాహిత్యమూల్యాలు, ఆధ్యాత్మిక వారసత్వం మొదలైన భావాలకు వారు విరోధులు. గత తార్కిక భౌతికవాదం వారి ప్రాతిపదిక. అభ్యుదయ వాదానికి శత్రువులుగా వారు ఏయే విలువలను భావిస్తున్నారో వాటి నన్నింటిని కలిపి సామూహికంగా 'సంప్రదాయ'మనే పేరుతో చెప్పేవారు. ఆ పునాదులను ధ్వంసం చేసి మరో ప్రపంచాన్ని సృష్టించాలన్నది వారి ఆశయం. వారి ఆశయం పరిపూర్ణంగా ఆచరణలోకి రావటం అసంభవమని ప్రపంచ చరిత్ర చెప్పిన గుణపాఠం. వారు చెప్పే విప్లవం లేని సమసమాజం ఒక స్వప్నం అని తేలిపోయింది.

5. తెలుగు సాహిత్యంలో గతంతో తెగతెంపులు కోరుకుంటుంది, అభ్యుదయవాదం అవిచ్ఛిన్న సంప్రదాయంలో ప్రగతిని కోరుకుంటుంది. నవ్యసంప్రదాయవాదం. ఈ రెండూ కాల్పనిక యుగ చైతన్యానికి ప్రత్యర్థులుగా రంగంలోకి దూకాయి. కాని, గమనించదగిన సత్య మేమంటే, విశ్వనాథాదుల భావజాలం ఈ శతాబ్దిలో భారతీయ పునరుజ్జీవన చైతన్యంలో నుంచి పుట్టి తెలుగులో వెలుగులు నింపుకున్న సంప్రదాయధార. దీన్ని సంప్రదాయమనీ, అవిచ్ఛిన్న సంప్రదాయమనీ అనేవారు. అవిచ్ఛిన్నత, జాతీయత, పరిణామ వికాసాలు సంప్రదాయానికి సహజ లక్షణాలని భారతీయులకు వేరే చెప్పనవసరం లేదు. అయితే, ఈ లక్షణాలు లేని జడ సంస్కృతి సంప్రదాయమని అభ్యుదయవాదులు ప్రచారం చేశారు. దాని వినాశం అభ్యుదయానికి ప్రాతిపదిక, సంప్రదాయ విచ్ఛేదం చేసేవాడే అభ్యుదయవాది- అనే భావన ప్రచారంలోకి తెచ్చారు. సంప్రదాయ శబ్దానికి కలిగించిన ఈ వక్రీకరణాన్ని తొలగించవలసిన అవసరం ఏర్పడింది. వ్యూహాత్మకంగా దాని కొక ఉద్యమం కావలసివచ్చింది. విశ్వనాథాదులు దాన్ని అవిచ్ఛిన్నసంప్రదాయ మనే పేరున ప్రచారంలోకి తెచ్చారు. టి.యస్. ఎలియట్ సంప్రదాయ భావనను భారతీయ సంప్రదాయభావనలో సంలీనం చేసికొని, విశ్వజనీనమైన సంప్రదాయం ఎప్పుడూ అవిచ్ఛిన్నంగా ఉండేదే అని ప్రపంచించారు. Break with the Past అనే మార్క్సిస్టు చైతన్యానికి ప్రతినినాదంగా అవిచ్ఛిన్న సంప్రదాయాన్ని విశ్వనాథ పేర్కొన్నాడు.

6. అయితే మన విమర్శకుల్లో భారతీయ సాహిత్య ప్రమాణాలకు బదులు పాశ్చాత్య సాహిత్య సూత్రాలను పాటించటమే ఆధునికం అనుకునేవారు- ఇంగ్లీషు సాహిత్య

చరిత్రలో జరిగిన పరిణామాలకు వారు పెట్టుకున్న పేర్లే తెలుగు సాహిత్య చరిత్రలోని యుగాలకు పెట్టుకునే అనుకరణ మార్గం అనుసరించారు. సంప్రదాయవాదులను నియోక్లాసిసిజంకు చెందినవారుగా లేబెల్ తగిలించారు. దానితో ఆంగ్లసాహిత్య చరిత్రలోని నియోక్లాసిసిజం యుగానికి చెందని లక్షణా లన్నీ విశ్వనాథాదుల భావజాలాలకు పట్టకపోయినా, పట్టించటానికి యత్నం చేశారు. ఈ తప్పుడు మార్గంలో తెలిసి కొందరు, తెలియక కొందరు తలవంచుకొని దూసుకుపోయారు. అయితే, అందులో జరుగుతున్న అన్యాయాన్ని, అన్వయం కాని అంశాలను, వక్రీకరణలకు గురి అవుతున్న పారిభాషికపదజాలాలను, పొంతనలేని పోలికలను గమనించి,ఆ ఆలోచన విధానం మారాలని కొందరు ఉద్యమించటం మొదలుపెట్టారు. వీరికి అటు అభ్యుదయవాదులు, ఇటు నియోక్లాసిజం వాదులు, ఈ గొడవలన్నీ తెలియని అమాయక ఛాందసవాదులు- అందరూ కలిసి వీరికి విరోధులుగా వ్యవహరించేవారు.

7. తత్ఫలితః తేలిందేమంటే- ఆధునిక సంప్రదాయ స్పృహతో ఉద్యమిస్తున్న తరంలో చతుర్ముఖమైన ప్రస్థానం గోచరిస్తుంది. మొదటిది- సంప్రదాయ భావనకు మార్క్సిస్టులు చేసిన వక్రీకరణకు విరుగుడు పెట్టాలని చేసే ప్రయత్నం. రెండు- అనుకరణమే, అనువాదమే అవిచ్ఛిన్నత అనుకునే ఛాందస సంప్రదాయవాదులకు భిన్నంగా, సంప్రదాయ అవిచ్ఛిన్నతను గుర్తించి ఆవిష్కరించే ప్రగతిశీల సంప్రదాయవాదులను వేరుచేసి నిజమైన సంప్రదాయం అదే అని నిరూపించే యత్నం. మూడు- నియోక్లాసిసిజం అనే ఇంగ్లీషు పారిభాషిక పదాన్ని యథాతథంగా వాడాలా? ఆంధ్రీకరించి వాడాలా? అని యోచించేవారూ, తెలుగు పారిభాషిక పదాలను యథేచ్ఛగా వాడేవారూ ఉండేవారు. వారిలో అధికసంఖ్యాకులు నవ్యసంప్రదాయవాదమనే పారిభాషిక పదాన్ని బలపరచటం కనపడుతుంది. నిజానికి 'నవ్యసంప్రదాయం' అనేపదం 'నియో క్లాసిసిజం'కు సరి అయిన తెలుగు పరివర్తనమేనా? అని అనుమానాలు వ్యక్తం చేసేవారు కొందరుండేవారు. మొత్తానికి వీరికందరిదీ నియోక్లాసిజమంటే ఒక అనిశ్చిత అభిప్రాయంతో సందిగ్ధంగా చేసే యత్నం. నాలుగు- 'నవ్యసంప్రదాయం' అందంగా కుదిరిన పేరు. ఉద్యమస్ఫూర్తిని

మోసుకొనిరాగల అనుభవదీప్తి అందులో ఉంది. అయితే, దాన్నే ఎన్నికచేసికొని పై మూడు మార్గాల్లో ఉండే లోపాలను పూరించుకొని దాన్ని స్వతంత్ర పారిభాషికపదంగా భావించటం, అది అనువాదంకాని స్వతంత్ర్య సాహిత్య పారిభాషిక పదంగా స్థిరీకరించటం సముచితమని భావించి ఉద్యమించేయత్నం. చివరిపద్ధతి ఉద్యమకర్తలందరూ అనుసరించేదే. భావకవిత్వం, అభ్యుదయకవిత్వం, అనుభూతికవిత్వం మొదలైనవన్నీ అలా ఏర్పడిన పారిభాషికపదాలే. అందువలన 'నవ్యసంప్రదాయం' అనే పదం తెలుగు విమర్శకులు ఒక తెలుగు సాహిత్యోద్యమానికి పేరుగా స్థిరీకరించుకున్న పారిభాషిక పదం అని నిర్ణయించటం చివరిదశ. అది 1933-1985 సంవత్సరాల మధ్య తెలుగు సాహిత్యాన్ని ముంచెత్తిన అఖండ సాహిత్యోద్యమమనీ, అన్ని ప్రక్రియల్లో, ప్రయోగాల్లో అది వ్యాపించి, కొన్నిసార్లు సమకాలీన ఉద్యమాలను కూడా ప్రభావితం చేసిందనీ నిరూపించవలసిన అవసరాన్ని గుర్తించటం నవ్యసంప్రదాయోద్యమ విమర్శకుల కర్తవ్యం.

8. నవ్యసంప్రదాయం- అనే మాటలో 'నవ్య' శబ్దం మార్క్సిస్టులు సంప్రదాయ శబ్దానికి కల్పించిన వక్రీకరణకు విరుగుడు పెట్టే కొత్త మంత్రం. ఈ సత్యాన్ని చెప్పింది, వ్యాఖ్యానించింది నేనే. అనువాదాలూ, అనుకరణలూ అయిన కావ్యాలు రచించే, కవులకంటే, అభినవ దృక్పథంతో విశిష్టకావ్యాలను స్వతంత్రంగా నిర్మించే సంప్రదాయ కవులను ఏమని పిలవాలి? ఆ సాహిత్య ఎలా సృష్టిని ఏ ఉద్యమంలో భాగంగా వ్యాఖ్యానించాలి అని మథనపడి నియోక్లాసిసిజంగానే పేరుపెట్టిపిలుస్తూ, దానికి తెలుగు మాటగా నవ్యసంప్రదాయం అనవచ్చుననీ, అప్పటి కంతకంటె గత్యంతరం లేదని భావించినవారు కాకతీయ విశ్వవిద్యాలయాచార్యులు కేతవరపు రామకోటి శాస్త్రి, సుప్రసన్నగారలు. సుప్రసన్నగారు మొదట్లో కొన్నిచోట్ల ఇంగ్లీషు పారిభాషిక పదాలనే వాడారు నవ్యసంప్రదాయార్థంలో. అయితే, ఇంగ్లీషు పారిభాషిక పదం కంటె అది భిన్నమైనదనే స్పృహ వారికి బలపడుతూన్నకొద్దీ పారిభాషిక శబ్దంకంటె దాని స్వరూపస్వభావాలను తాత్త్విక భూమికనూ వ్యక్తీకరించే మార్గంలో పయనం చేశారు. అనిశ్చితస్థితిలో కేతవరపు వారు, నిశ్చితస్థితివైపు పయనించేస్థితిలో సుప్రసన్నగారు ఉండేవారు. ఇది చివరి దశ. నవ్యసంప్రదాయ భావనయొక్క సమగ్రావిష్కారం,

దాన్ని చేపట్టి ఆ ఉద్యమస్ఫూర్తికి ఒక ఆకృతిని, నామకరణాన్ని, స్వరూపస్వభావ వివేచనను, లక్షణసూక్తాన్ని, సిద్ధాంత ప్రాతిపదికను, అనుశీలన సూత్రాలను, సమకాలీన ప్రక్రియలలో అది ప్రవర్తిల్లిన విధానాన్నీ, ఆ ఉద్యమనాయకునిగా విశ్వనాథను నిరూపించటంలాంటి విస్తృత ఉద్యమ ప్రస్థానాన్ని నేనే పరిపూర్ణంగా సాగించాను. ఆ ఉద్యమాన్ని తన ఉపపత్తులతో, చారిత్రిక స్పృహ గల వ్యూహంతో డా॥ సంపత్కుమారగారు ఊతం ఇచ్చారు. డా॥ముదిగొండ వీరభద్రయ్యగారు దానిని సర్వజన సులభంగా విస్తరించి వ్యాఖ్యానించారు.

1960 నుంచి సాగుతున్న ఈ నవ్యసంప్రదాయ నామ్నీకరణంలోని విభిన్న దశలలో నేనూ పాల్గొన్న వాణ్ణే. ఆ నదిలో ఈదాను కాబట్టే దాని లోతు పాతులు తెలిశాయి. దాని తత్త్వావిష్కరణ నాకు సాధ్యమయింది. నవ్యసంప్రదాయ ఉద్యమం మొదలైన తరువాత దాదాపు 1985లో అసలు అర్థంలో నేను రంగంలో ప్రవేశపెట్టాను. ఉపన్యాసాల్లో చెప్పాను. ఆంధ్రసారస్వత పరిషత్తు సారస్వత వేదిక పక్షాన నేను మొదటిసారి నవ్యసంప్రదాయోద్యమం మీద సాటి విద్వాంసులతో 12 ఉపన్యాసాలిప్పించాను. (1989 సం.లో) నేను వ్యష్టిగా వ్యాఖ్యానించే నవ్యసంప్రదాయార్థాలకు సమష్టిగా సాహిత్య విమర్శలో ఒక ఉద్యమస్ఫూర్తిని కల్పించాను. 1989 డిసెంబరు 10వ తేదీనుండి 1999 ఏప్రిల్ 1వరకు వారంవారం ఒక వ్యాసం చొప్పున 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'లో 17 వ్యాసాలు రాశాను. నవ్యసంప్రదాయాన్ని అవజ్ఞ చేసేవారినీ, విమర్శించేవారినీ, అపహాస్యం చేసేవారినీ, అసలు విషయం తెలియకుండా తేలిగ్గా మాట్లాడేవారినీ, వితండవాదుల్నీ, సందిగ్ధవాదుల్నీ సాహిత్య రాజకీయ చతురులనూ నా వ్యాసాల్లో విమర్శించటమే కాకుండా, వారి వాదనలను ఎండగట్టాను. నా వాదాన్ని బలపరచే విద్వాంసులు రంగంలోకి దూకటం నాకు ఆనందాన్ని కలిగించింది. నాపని తేలికైంది. ఇదంతా 1990 నాటికే జరిగిన కథ.

ఆ తరువాత అయిదేళ్ళూ సదస్సుల్లో, గోష్ఠుల్లో, సమావేశాల్లో, ఉపన్యాసాల్లో నవ్యసంప్రదాయం చర్చనీయాంశమయ్యేది. మరీ నేను పాల్గొనే సమావేశాల్లో నవ్యసంప్రదాయోద్యమం గురించి వాదోపవాదాలు నడిచేవి. కొన్ని సదస్సుల్లో అయితే వాగ్యుద్ధాలే సాగేవి. నే నెప్పుడూ నేను నమ్మిన సిద్ధాంతాన్ని చెప్పటానికి నంగినంగిగా సణిగేవాణ్ణి కాను. ప్రతివాదిఎంత తీవ్రంగా దాడి చేస్తే నేనంత తీవ్రంగా వేగంగా ప్రతి

సమాధాన మిచ్చేవాణ్ణి. నేను కొందరు మార్క్సిస్టుల కన్నెర్రకూ గురి అయ్యాను. అయినా, నేను నా ఉద్యమంలో వెనుకాడలేదు. సత్యం క్రమంగా తెలిసివచ్చింది. పాఠ్యాంశాల్లో, సాహిత్యచరిత్రల్లో, పారిభాషిక పదాల్లో, సాహిత్యవిమర్శలో కాదనలేని వాస్తవంగా నవ్యసంప్రదాయం ఈనాడు నిలిచింది. సాహిత్య చరిత్రలో నవ్యసంప్రదాయ యుగం (20వ శతాబ్ది 2,3 పాదాలు) గుర్తించబడింది.

నవ్యసంప్రదాయోద్యమానికి పేరుపెట్టి ప్రచారం చేయటమే కాకుండా, ఆ యుగచైతన్యంలో భాగంగా ఒక క్రొత్త రససిద్ధాంతాన్ని స్థాపించి దాని విస్తృతికి తోడ్పడ్డాను. నా ధర్మవీర మూల రససిద్ధాంతం విశ్వనాథ నాయకత్వంలో నడచిన నవ్యసంప్రదాయ ఉద్యమంలో ఒక వెలుగుకాగడా!

వీరరస విజయం తరువాత నాకు సాహిత్యోద్యమపరంగా సత్యవిజయ సంతృప్తిని కలిగించింది నవ్యసంప్రదాయోద్యమ విజయం. 1995లో విశ్వనాథ శతజయంతి ఉత్సవాలు జరిగాయి. ఆ సందర్భంగా నేను అంతవరకూ నవ్యసంప్రదాయం మీద రాసిన వ్యాసాలనన్నింటినీ(22) కలిపి 'విశ్వనాథ నవ్యసంప్రదాయం' అనే గ్రంథాన్ని ప్రచురించాను. ఆ గ్రంథం ఈ ఉద్యమ విజయ పతాక!.

ఆ గ్రంథానికి ముందుమాట రాస్తూ డా॥ముదిగొండ వీరభద్రయ్యగారు ఇలా అన్నారు: "మొత్తం జాతీయోద్యమాన్ని నిర్లక్ష్యం చేస్తూ వచ్చిన అల్ప సంఖ్యాకుల ఉద్యమాన్ని కాదని, దాన్ని ఎదురొడ్డి నిలిచి దేశంలో నిర్మాణాత్మకమైన సాహిత్యసృష్టికి కారణమైన మహాసాహిత్యోద్యమాన్ని నడిపినవాడు విశ్వనాథ. ఆ మహారచయిత కేవల రచయితగానే కాక ఒక సాహిత్యోద్యమకర్తగా ఎట్లా సాహిత్యచరిత్రను సృష్టించాడన్నది ఈ గ్రంథం యొక్క కేంద్ర బిందువు. 'జాతీయోద్యమ స్పృహ సాహిత్యోద్యమంగా రూపొందటమే సామాజిక సాహిత్య స్పృహగా నవ్యసంప్రదాయవాదులు భావిస్తారు-' అన్న లక్షణం విశ్వనాథగారి ప్రత్యక్షరంలోనూ కన్పిస్తుంది. ఒక మహారచయిత ఒక మహాసాహిత్యపరంపరను పోషించి, పెంచి, కాపాడి, సాహిత్యస్రవంతిని పుష్టిపరిచినప్పటికీ, సాహిత్యద్రోహం జరగనే జరిగి సాహిత్యచరిత్ర వక్రీకరింపబడింది. దీన్ని నిర్మూలించగలిగిన మేధాశక్తి, విశ్లేషణ, సత్యదర్శనం, పాండిత్యం, సాహిత్యానుభవం దండిగా ఉన్న మేధావి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. ప్రౌఢిమా, స్పష్టతా అన్న రెండు లక్షణాలు వీరి రచనల్లో

ఉంటాయి. 'పద్యము వ్రాయుట యెట్టిదో, యొక వ్యాసము వ్రాసెడు శక్తియు నట్టిదే' అని విశ్వనాథవారే అన్నారు. సుబ్రహ్మణ్యంగారి వ్యాసాలన్నింటిలో ఈ శక్తి తొణికిసలాడుతుంది. అంతేకాకుండా, వీరి వ్యాసాలన్నీ విజ్ఞానదాయకాలు. తోటి విమర్శకులకు జరిగిన అన్యాయాలను కూడా వీరి వ్యాసాలలో తొలగించడం మనం గమనించగల్గుతాము. ఈ వ్యాసాలన్నీ ఆంగ్లభాషలోకి కూడా అనువాదం కావల్సి ఉన్నది. అప్పుడు కాని కూపస్థమండూకాలబోలు సిద్ధాంతాల అసలు రంగు బయటపడదు".

**సాహిత్యవికాస చరిత్రలో అంతర్గతి సూత్రాన్ని వివరించిన కాలం (1996-2000):**

1990లో సాహిత్య చరిత్రలో చర్చనీయంశాలు రాసినతరువాత 1993లో సాహిత్య ప్రగతిలో ఒక నిర్దిష్ట అంతర్గతి సూత్రం ఉంటుందని ప్రతిపాదించాను. (శ్రీనాథ యుగం- మరొక్కచూపు (వ్యాసం- సాహితీసంపద- ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య షష్టిపూర్తి అభినందన గ్రంథం). గతితార్కిక భౌతికసూత్రాన్ని అనుసరించి సాగే సామాజిక పరిణామాల చరిత్రలో అంతర్భాగంగా సాహిత్య చరిత్రను సమన్వయించిన దానికంటె సాహిత్యంలోని సహజ గతితార్కిక పరిణామ చైతన్యానికి ప్రేరణ కలిగించే సాహిత్య దార్శనిక సిద్ధాంతాల నాశ్రయించి రచనలు వెలువడతాయన్న వాస్తవాన్ని గుర్తించి, ఆయా సాహిత్య సిద్ధాంత దృక్పథాలతో వెలువడే రచనా ప్రక్రియల వికాస విధానమే మౌలిక సూత్రంగా సాహిత్య వికాసచరిత్రను నిర్మించే పద్ధతిని సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలలో ప్రతిపాదించాను.

ప్రక్రియా వికాస సూత్రంతో సాహిత్య చరిత్రలో వెలువడిన ప్రయోగాలకు కారకాలైన దార్శనిక శక్తుల భూమికను ఆ గ్రంథంలో వివరించాను. అయితే అందులో- ఆ మాటకొస్తే ఏ సాహిత్య చరిత్రలోనైనా, మిగిలే చివరిప్రశ్న ఏమిటంటే- చరిత్రలో కవుల దృక్పథాలు, రచనలు, ప్రయోగాలు కాలక్రమంలో అదే వరుసలో ఎందుకు వస్తున్నాయి? అనే పెద్ద ప్రశ్న. దానికి మార్క్సిస్టులు, చారిత్రక వాస్తవవాదులు చెప్పే సమాధానాలు ఆకుకు పోకకు పొందకుండా ఉన్నాయి. ఆ దృక్పథాలన్నీ ఒక కావ్యం ఏ పరిస్థితుల్లో పుట్టిందని చెప్పగలవు, ఆ ప్రక్రియ ఏ ప్రయోజనం కోసం పుట్టి ఆ రూపం తాల్చింది? అనే ప్రశ్నకు సాక్షికంగా సమాధానం చెప్పగలవు. అయితే ఒక కవి శైలి, కవితాదృక్పథం ఆ కాలంలో ఎందుకు అలా ఆవిష్కరించబడ్డాయి? అనే ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాయి. కాగా దాని

వెనుక ఉన్న అసలైన కారణం తర్కబద్ధమైన అంతర్గతి సూత్రం. దాన్ని ఆశ్రయించి సాగే సహజగతి తార్కిక పరిణామం కవుల సాహిత్య సిద్ధాంతాలపై, దృక్పథాలపై ఉంటుంది. దానిని ఆవిష్కరిస్తే సాహిత్య చరిత్రలో జరిగే వికాస దశలకు ప్రేరకమైన సాహిత్యదర్శన మూలశక్తుల సహజగతిలోని తార్కికత స్పష్టమౌతుంది. సాహిత్య వికాస చరిత్ర సమగ్రరూపాన్ని పొందుతుంది. 1993లో ఈ ప్రతిపాదనను చేసిం తరువాత మరిన్ని వివరాలతో సాహిత్య వికాస చరిత్ర రాయాలని పూనుకున్నాను.

నా ప్రయత్నానికి యుజిసి వారు ఆమోదించి ఎమెరిటస్ స్కాలర్ షిప్‌ను రెండేళ్ళు ఇచ్చారు (1998-2000). ఆ సమయాన్ని సాహిత్య చరిత్ర నిర్మాణానికి వినియోగించుకున్నాను. త్వరలో ఆ గ్రంథం వెలువడాలి. 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలలో' చర్చించిన అంశాలన్నీ ఈ గ్రంథంలో ఒక మౌలిక అంతర్గతి సూత్రంతో వ్యాఖ్యానించబడతాయి. నేను కొన్ని దశాబ్దాలుగా కలలుకంటున్న సాహిత్యవికాస చరిత్ర అక్షరరూపం ధరిస్తున్నది. అది నాకు ఒక ఆత్మతృప్తిని కూడా కలిగిస్తున్నది. భగవంతుని దయవల్ల అది నా లైఫ్‌టైం అఛీవ్‌మెంట్‌గా మిగలగలదని ఆశిస్తున్నాను.

"One of the functions of the scholar-critic is to demonstrate that the history of a literature is a gradual and continuous slope. And so the sense of fact serves to maintain a perfection of the literary tradition without which a citilised society cannot persist as such"- F.W. Bateson.

నవవిధ పంచవర్ష ప్రణాళికల్లో నా విమర్శ సాధించిన ప్రధానాంశాలను మాత్రప్రాయంగా పేర్కొన్నాను. ఇక పీఠికలో, వ్యాసాలూ మొదలైన వాటిల్లో చెప్పిన అనేక సమన్వయాలూ, తీసుకున్న నిర్ణయాలూ, చూపిన విశేషాలూ చెప్పితే ఈ వ్యాసమే మరొక గ్రంథమౌతుంది. అది మరొకసారి.

ఆచార్య లక్ష్మీరంజనంగా రాశించినట్లు అటు రసవాదంలో సముద్రాన్ని ఈదాను. ఇటు సాహిత్య వికాసచరిత్రలో శిఖరాన్నెక్కాను. ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో భారతీయాలంకారిక దర్శనానికి నే నిచ్చిన విలువైన కానుక వీరరసవాదం! ఆంధ్ర సాహిత్యచరిత్రకు నే నిచ్చిన అమూల్యమైన బహుమానం వికాసచరిత్ర నిర్మాణం!! సాహిత్యఉద్యమమూర్తికి నే నిచ్చిన ఉత్తమ ఉపాయకం నవ్యసంప్రదాయోద్యమం! ! !

నా విమర్శ ప్రస్థానంలో పాథేయాలుగా భద్రపరచుకొనే కొన్ని మంచి మాటలు

"కాలాన్ని జయించి నిలిచే రచనలు చేసిన లిటరరీ 'జీనియస్' డా॥ జీవియస్" **- ఆచార్య సి. నారాయణరెడ్డి**

"ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు అంధ్రసాహిత్యంలో మల్లినాధసూరి వంటివారు" **- డాక్టర్ గుంటూరు శేషేంద్రశర్మ**

"సద్విమర్శయందు సదసద్వివేచనయందు నీకు సాటి లేరు"

**- డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి**

"కవిత్వాన్ని తూచే రాళ్ళు తన దగ్గర లేవంటాడు చలం. సాహిత్యాన్ని కొలిచే 'కాలమానమ్' డా॥ జీవియస్ దగ్గర ఉంది"

**- డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు**

'సజీవసాహిత్య విజ్ఞాన సర్వస్వం జీవియస్. మా తరంలో వేళ్ళమీద లెక్కించదగిన పరిశోధకుల్లో సంయమనం, సమతౌల్యం ఉన్న స్కాలర్ ఆయన'. **- ఆచార్య చేకూరి రామారావు**

'వర్తమాన సాహితీరంగంలో పరిశోధకుడుగా, విమర్శకుడుగా, ఆచార్యుడుగా సమున్నత స్థానాన్ని అధివసించిన సాహితీవేత్త జి.వి. సుబ్రహ్మణ్యంగారు' **- ఆచార్య ఎస్వీ రామారావు**

"అభినవ ప్రస్థాన మర్మజ్ఞులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం"

**-ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**

"శ్రీ జి.వి.యస్. గారు ప్రతిభావంతులైన విమర్శకులు ఆధునికాంధ్ర సాహిత్య రంగంలో వీరి అభిజాత్యాన్ని నిర్ధారించవలసి వస్తే రాయప్రోలు - విశ్వనాథ - శేషేంద్ర - జీ.వి.యస్- కోవెలద్వయం- తమ్మాపూడి- ఇలా వీరిదొక పాఠశాల. చిన్న చిన్న మినహాయింపులను ఆమోదిస్తే సర్వశ్రీ ఆర్.యస్. సుదర్శనం - వడలి మందేశ్వరరావు - ముదిగొండ వీరభద్రయ్య ప్రభృతులు ఈబరి (డి) లోకే వస్తారు. ఇంకా చాలా మందే ఉన్నారు. వీరి బలగం పెద్దదే".

**-ఆచార్య బేతవోలు రామబ్రహ్మం.**

"నిర్ణయప్రకటనల్లో తార్కికతా, భయరాహిత్యమూ, సత్యప్రీతీ ఉండాలి. ఇవి సుబ్రహ్మణ్యం గారిలో దండిగా ఉన్నాయి"

**-డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య.**

-ooo-

# తెలుగు సాహిత్య విమర్శ

# నా ప్రయాణం-అనుదానం

కోవెల సంపత్కుమారాచార్య

తెలుగు సాహిత్య విమర్శ రంగంలో గత యాభయ్యేళ్లుగా అంతో ఇంతో నిరంతర కృషి నిజాయతీగా సాగిస్తూవస్తున్నందుకుగాను 'తెలుగు సాహిత్య విమర్శ: నా ప్రస్థానం-నా ప్రయోగం' అంటూ నిన్నూ, నీ కృషిని గూర్చి నువ్వే వివరించమని జీవియస్ సాహితీ కళా పీఠం నిర్వాహకులూ, ప్రత్యేకించి ఆత్మీయులు జి.వి. సుబ్రహ్మణ్యంగారు వత్తిడి కలిగించటంతో ఏం వివరించాలో, ఎట్లా వివరించాలో తోచక ఒక్కసారి వెనక్కి తిరిగి చూచుకోవలసి వచ్చింది. అట్లా ఇవాళ్ల-ఈ శతాబ్దం చివర, లేదా ఈ సహస్రాబ్దం, ద్విసహస్రాబ్దం చివరి అంచున నిల్చుని చూచుకుంటే, నా వెనుక వెన్నుదన్నుగా రెండు వేలేండ్లకు పయిబడి దేశీయంగా విస్తరించిన బహుముఖీన సాహిత్య మీమాంస; ఇంచుమించు వెయ్యేళ్లుగా మహానుభావులైన తెలుగు కవులు తమ కావ్యాల్లో సూత్రప్రాయంగా వెలువరించిన భావనల కావ్య దృక్పథాల పరిణతరీతి; వందేళ్లకు పయిబడి సాగిస్తున్న ఆధునిక సాహిత్య విమర్శ చైతన్యం; పాశ్చాత్య సాహిత్య విమర్శ విధానాల్లోంచి వచ్చిన తీసుకురావబడిన వివిధ ప్రతిపాదనల, సిద్ధాంతాల కదంబం, దాన్ని వెన్నంటి దూకుడుగా దూసుకువచ్చిన వివిధ 'వాదా'ల సాహిత్యాలోచనా విధానాల తీరు తెన్నులూ-ఇట్లా ఇదంతా ఒక మొత్తంగా వివిధ వర్ణ సంసృష్టిగా సాక్షాత్కరించింది. ఇదంతా నా సాహిత్య విమర్శ వారసత్వం. యాభయ్యేళ్లనాడు తొలిసారిగా తెలుగు సాహిత్య విమర్శ రంగం మీదికి అడుగిడుతున్నప్పుడు ఈ వారసత్వవిషయంగా స్థూలమయిన భావన మాత్రమే గాని, క్రమంగా అయిదు పదేళ్లలోని అధ్యయనం వల్ల మాత్రమే దాని ఔదాత్త్య, గాంభీర్య మహితమయిన విచిత్ర విస్తృతి అవగతం కాసాగింది. మరి, పూర్తిగా అవగతమయిందా? అంటే ఇవ్వాల్టికి గూడా 'అవు'నని చెప్పటం అతిశయోక్తి కావచ్చుగాని,

దానిలో గాఢమయిన సంలగ్నత మనోబుద్ధి నిష్ఠమయిపోయిందని మాత్రం ఖచ్చితంగా చెప్పవచ్చు. అనధ్యయనానికీ, వక్రీకరణలకూ పాల్పడకుండా ఎదిగిన ఈ గాఢత్వమే ఇక విలక్షణమయిన దర్శనాన్నీ స్పష్టమయిన దృక్పథాన్ని సాధించి సమర్థుడయిన ఒక సద్విమర్శకుడుగా గుర్తింపు సంపాదించి పెట్టి ఉంటుందని గూడా ఖచ్చితంగా చెప్పవచ్చు. ఇది కేవలం నా విషయంలోనే గాదు, అందరు సద్విమర్శకుల విషయంలోనూ యథార్థమే, ఎందుకంటే ఏ విమర్శకుడు గానీ హఠాత్తుగా ఆకాశంలోంచి ఊడిపడ్డట్టు కవిత్వ విషయంలో ఏమోగాని, విమర్శకత్వ విషయంలో 'ఆకస్మిక ప్రత్యవభాసా'నికి అవకాశం ఉండదు. గాఢమయిన అధ్యయనం సరయిన శిక్షణ అవసరం. కాగా ఒక విమర్శకుడు సద్విమర్శకుడుగా ఎదగటానికి గత వర్తమాన, సమ-సామయికాంశాలు అనేకం ప్రత్యక్షంగానో, అప్రత్యక్షంగానో తప్పక పని చేస్తుంటాయనేది వాస్తవం. కాగా,

గతంలోనూ, వర్తమాన కాలికంగా, సమ-సామయికంగానూ సాగిన ఇంతటి వైవిధ్యశబలితంగా ఔదాత్త్య గాంభీర్యాలతో విస్తృతమయిన సాహిత్య విమర్శ చిత్రం ముందు నిలబడి నన్ను నేను చూచుకుంటే - దాని ముందు నే నెంత, నా సాహిత్య కృషి ఎంత? అని ఒక విధంగా జంకు కలిగించే విచికిత్సకు ఎంతో కొంతసేపయినా గురికాక తప్పదు. అయితే ఆ విచికిత్స నుంచి బయటపడి కొంచెం తమాయించుకొని నా పరిధిలోనే కావచ్చు, నన్ను గమనించుకొంటే అంతో ఇంతో ఫలవంతమయిన కృషి చేయలేకపోలేదని, అందుకు నా వ్యక్తిత్వ నిర్మాణము సహకరించిందా అనిపించటమూ సహజమే కాని నాలో నాకు అట్లా అనిపించటంలేదు. ఆ అనిపించిందంతా 'నా ప్రస్థానం- నా ప్రయోగం' అని బహిరంగంగా చెప్పుకోవలసి రావటం మాత్రం ఇబ్బందే. 'ప్రస్థానం, ప్రయోగం' వంటివి నా వరకు నాకు పెద్ద మాటలు, 'ప్రస్థానత్రయం' అనటం భారతీయ వేదాంత దర్శన మార్గంలో విన్నాం. సాహిత్య ప్రస్థానాలని సాహిత్య విస్తరణ మార్గంలో విన్నాం.'రస ప్రస్థానం, ధ్వని ప్రస్థానం' అంటూ సాహిత్య మీమాంసా మార్గంలో విన్నాం. ప్రయోగాలని ఆధునికంగా వింటున్నాం. అందుకని ఆ విధంగా అవి పెద్ద పెద్ద మాటలు. కాగా విమర్శకుడుగా నా ప్రయాణం, నా విమర్శ కృషి అన్న సామాన్యమయిన మాటలు నాకు చాలు. కాని, అదయినాగూడా 'సమగ్రం'గా మనవి చేసుకోగలుగుతానా? అంటే అదీ కచ్చితంగా 'అవు' ననటం కష్టమే. అందుకని ఏదో విధంగా నన్ను నేనుగా వివరించుకోవటానికి, నా కృషిని ప్రస్తావించుకోవటానికి సాహసిస్తాను.

**సాహసయాత్రకు సన్నాహం:**

నిజానికి నాకున్న సాహసమెంత? దాని స్వరూప మేమిటి? అనేదట్లా ఉంచి, సాహసమంటే చిన్నప్పటి నుంచి నా కెంతో ఇష్టమని మాత్రం చెప్పగలను. రెండో ప్రపంచ యుద్ధం జరుగుతున్నప్పుడు మహా అయితే నా వయస్సు పది పదకొండేండ్లు. దేశంలో స్వాతంత్ర్యోద్యమమూ సాగుతున్నది. గాంధీజీ వంటి మహాత్ములు, మహానుభావుల గూర్చి వినికిడి తప్ప ప్రత్యక్షదర్శనావకాశం వరంగల్లులో ఉన్న నాకు లేదు. అయితే ఆ అందరిలోనూ సుభాష్ చంద్రబోసు, సావర్కార్, జయప్రకాశ్ నారాయణ అంటే ఎంతో ఇష్టంగా, ఆత్మీయంగా అన్పించేది. అందుకు కారణం బహుశః వారిలోని సాహసీ క్రియాశీలమే కావచ్చు. సుభాష్ కెప్టెన్ లక్ష్మి సైనిక వేషాలతో గుర్రాలమీద ఎక్కి వస్తున్నట్లు కొన్ని చిత్రాలు ఆ రోజుల్లో విరివిగా అమ్ముతుండేవారు, వాటిని కొనుక్కొచ్చుకొని ఎంతో ఇష్టంగా దాచుకొని, రోజుకు పది సార్లయినా చూస్తూ మురిసిపోతుండేవాడిని, ఉత్సాహోద్రేకాలకు-వాటి స్వరూప స్వభావాలు అవగతం కాకుండానే లోనయితూ ఉండేవాడిని. వాళ్లిద్దరూ నా కలలో వచ్చి స్వాతంత్ర్యోమంలో క్రియాశీలివి కమ్మన్న విషయాన్ని ఒక కథగా రాసుకొన్నాను. బహుశః అదే నా మొట్టమొదటి రచన కావచ్చు. అయితే అది కథ కాదనీ రచన కాదనీ తరువాత తరువాత తెలిసిందిగాని, అప్పటి ఉత్సాహోద్వేగాల తీరు అది. అట్లాగే బొటనవేలుకు సూది గుచ్చి, వచ్చిన రక్తం పిండి, ఆ రక్తంతో సంతకాలు, శపథాలు చేసే అజ్ఞాత సంస్థల్లోకి చేరుదామని సంతకాలు, శపథాల దాకా సాగటమయింది గాని, నా వయస్సు బట్టి నన్ను ఆ సంస్థల వారు లోపలికి రానీయలేదు. ఆ రోజుల్లో 'ఆర్యసమాజం' మా ఊళ్లో చాలా సాహసికంగా ఉండేది. ఈ విధమయిన ఒక విశిష్ట వాతావరణంలో పెరగటంతో నా దేశమన్నా, నా జాతి అన్నా, దేశీయ సంప్రదాయమన్నా, సాహిత్యమన్నా అభిమానం నా జీవలక్షణంగా అభివ్యాప్తమయింది. నా ప్రతి పనిలోనూ ఆ లక్షణం అనివార్యంగా అనుస్యూతమవుతూ ఉంటుంది. నా విమర్శనావిధానానికి గూడా అదే భూమిక. ఈ అంశాన్ని 'సంపత్కుమార విమర్శ. దేశీయ భూమిక'అన్న చిన్న సమీక్షాత్మక గ్రంథంలో ఇటీవల డాక్టరు ముదిగొండ వీరభద్రయ్య నిర్ధారించారు. దాదాపు ఇరవయ్యేళ్ల క్రితం అప్పుడప్పుడే మార్క్సిస్టు విమర్శకుడిగా ఎదగటానికి ఉత్సాహపడుతున్న ఒక సాహిత్య సహవిమర్శకునికి నా 'ఆధునిక సాహిత్య విమర్శ-సాంప్రదాయికరీతి' అన్న సిద్ధాంత గ్రంథాన్ని బహూకరించినపుడు 'మీకు సంప్రదాయమంటే చాలా అభిమానమున్నట్టుందే! అన్నా

డాయన. అది కొంచెం వెక్కిరింపని నాకు అర్థమయితూనే ఉంది. సంప్రదాయాభిమానం ఉండటం ఏదో ఉండరానిదని ఆయన తాత్పర్యంగా అర్థమయింది. అప్పుడు వెంటనే 'అభిమానం మాత్రమే కాదు, అది ఉండటం దేశీయుడిగా ఒక గర్వించదగిన విషయం. నేను నిజంగా గర్విస్తున్నాను. అన్నాను. 'సంప్రదాయం' విషయంలో మా భావనలు భిన్న మార్గాలకు చెందినవి కావచ్చు. వివిధ భిన్న భిన్న మార్గాలకు చెందిన పలువురు తోటి విమర్శకులు పలువురు ఆ భేదాలను మన్నిస్తూనే నన్ను ఆత్మీయంగా భావించటం, నాకు వారు ఆత్మీయులు కావటం నా సాహిత్య, సాహిత్య విమర్శ జీవితంలో ఒనగూడిన ఒక గొప్ప అదృష్టం అదట్లా ఉంచి-

మా నాన్నగారు కోవెల రంగాచార్యులు గారు గొప్ప విద్వాంసులు. ఉభయ వేదాంత నిష్ణాతులు, ప్రవర్తకులు. అన్ని ప్రస్థానాలతో వారికి గాఢమయిన అనుభవం ఉంది. వారే నాకు ప్రథమ విద్యాగురువులు. వారు ప్రస్థానత్రయం, భాష్య-భగవద్విషయాలూ, ఉపనిషత్తులూ, రామాయణ భారతాలూ నెలలకొద్ది ప్రవచనం చేస్తున్నప్పుడు, వారి దగ్గరే ఉంటుండేవాడిని. వారు గొప్ప వక్తలుగూడా. ఆ ఉపన్యాసాలు వింటూండేవాడిని. వారు నాకు కూర్చోబెట్టి చెప్పినదానివల్లకన్నా, వారి ప్రవచనాలు, ఉపన్యాసాలు వినటం ద్వారానే నా బుద్ధి వికసించటం మొదలయిందనుకొంటాను. వారు గొప్ప తార్కికులు. వారి విషయ వివేచనలోని తార్కికతా సమన్వయ లక్షణాలు, ఏ విషయంలోనయినా మూలందాకా వెళ్లి అనుశీలించే తీరు ఆ చిన్న నాటి నుంచే నా స్వభావంగా పరిణమించిందనీ అనుకుంటాను. అనేక పండితులు మా నాన్న గారి దగ్గరికి తరుచు వస్తూ ఉండేవారు. వారి సంభాషణలు, చర్చలు, సమన్వయాలు వినటం నాలో విమర్శ శక్తి విస్ఫోటం కావటానికి మూలకారణం కావచ్చునని నెమ్మది మీద తెలియవచ్చింది. ఈ నేపథ్యంలో బందరు దగ్గరి చిట్టి గూడూరు సంస్కృత కళాశాలలో 'భాషా ప్రవీణ' చదువటానికి మా నాన్నగారు పంపించారు. ఆ కళాశాల స్థాపకాధ్యక్షులు శ్రీమ త్తిరుమల గుదిమళ్ల వరదాచార్యులుగారు. ఆచారాల్లో ఆయన ప్రాచీనుడుగా కన్పించినా. ఆచరణలో ఆధునికులు తన విద్యార్థులంటే ఆయన కుండే ప్రేమ ఇంతా అంతా కాదు-చెప్పలేనంత. ఆ మహానుభావుడు, మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు, శరభయ్య గారూ 'తట్టా' సోదరులు తమ వాత్సల్యంతో నా బుద్ధిని వరిపిడి పెట్టి నా విమర్శకు పదునుపెట్టారు. ఆ పదునుతోనే ఆ రోజుల్లోనే వెలువడిన నండూరి రామకృష్ణమాచార్యులుగారి 'తారాతోరణం' గూర్చి విస్తృతమయిన ఒక సమీక్షాత్మక

విమర్శవ్యాసం రాసాను. బహుశః అదే గుర్తింపదగిన నా తొలి సాహిత్య విమర్శ వ్యాసమనుకుంటాను. దాన్ని కృష్ణాపత్రికకు పంపించాను. ఆ వ్యాసంలో ఆ సంకలనంలోని వివిధ ఇండికల విశేషాలనూ, అందచందాలనూ వ్యక్తీకరిస్తూనే 'శర్ణమేఖల' అనే ఖండికను గూర్చి మాత్రం తీవ్రంగా అభిశంసించాను. కర్ణదుర్యోధనుల మైత్రిని ఉదాత్తీకరించేందుకు ఆ ఇండికలో దుర్యోధనుని భార్య భానుమతిని అవమానించటం, దేశీయ సంప్రదాయాలను నిర్లక్ష్యం చేయటం వంటివి నన్ను తీవ్రంగా కలతబెట్టటమే అందుకు కారణం. ఒక లబ్ధ ప్రతిష్ఠితుని రచనను గురించి ఇట్లా రాయటం ఒక సాహసమే. అప్పటికి నా కింకా ఇరవయ్యేళ్లు కూడా లేవు. ఇది 1952లో జరిగింది. అయితే ఈ కారణంగానే కావచ్చు, కృష్ణాపత్రిక నా వ్యాసాన్ని ప్రచురించలేదు. బుట్టి దాఖలు చేసి ఉంటుంది. పత్రికలకు పంపేవ్యాసానికి 'కాపీ' ఉంచుకోవాలన్న పరిజ్ఞానం ఆనాటికి లేదు.

కొన్నాళ్లలోనే విచిత్రంగా ఒక సన్నివేశం సంఘటించింది. కర్ణుడికి సంబంధించి కరుణశ్రీ, రచించిన వాటిలో రెండుఇండికలు, ఈ 'శీర్ణమేఖల'-మూడింటి సంకలనం 'నవభారతం' పేర తెనాలినుంచో, గుంటూరు నుంచో వెలువడింది. .దాన్ని కృష్ణా పత్రికలో 'సవ్యసాచి' అన్న కలం పేరుతో విన్నకోట మాధవరావు గారు (సవ్యసాచి విన్నకోట వారని ఆ తరువాత నాకు తెలిసింది.) సమీక్షిస్తూ 'శీర్ణమేఖల' గూర్చి నా ఆక్షేపణలకు దగ్గిరగా వచ్చిన విధంగా రాసారు. దాని మీద పురాణ పండ దీక్షితులు 'సవ్యసాచికి సమాధానం' అని శీర్ణమేఖలను సమర్థిస్తూ రాసిన వ్యాసం కృష్ణాపత్రికలోనే వచ్చింది. అది చదివి 'సవ్యసాచికి సమాధానం, ఒక పరికింపు' అంటూ ఆ సమాధానంలోనూ లోపాలను వివరిస్తూ ఇండికలోని అనౌచిత్యాలను నా ధోరణిలో రాసి పంపితే కృష్ణాపత్రిక వెంటనే ప్రచురించింది. ఇది పత్రికల కెక్కిన నా తొలి 'విమర్శ' వ్యాసం. అది చదివిన మా గురువులు 'ఫరవాలేదోయ్! బాగానే రాసావే' అన్నారు. మాధవరావుగారు ఒకసారి వచ్చి కలిసిపొమ్మని కబురు చేశారు. చిట్టిగూడూరుకు బందరు అయిదు మైళ్ల దూరమే గదా- వెళ్లి కలుసుకున్నాను. అప్పుడు వారితో సాగిన సంభాషణలో, క్రమంగా పెరిగిన దగ్గరితనంలో తాత్కాలీన కవులు, విమర్శకులు, పత్రికలు ఆయా ఆలోచనా ప్రవృత్తి రీతులు. కొంత కొంతగా అవగతం కాసాగినయి.

చిట్టిగూడూరులోనే ప్రాచీన సాహిత్యాధ్యయనంతో బాటు సమకాలీన వివిధ

స్థాయులకు చెందిన కవుల కావ్యాలు, పలు నవలలు, విమర్శలు చదవటం, అభ్యుదయ రచయితల సాహిత్యంలోనూ పరిచయం సంపాదించుకోవటం, ప్రతిదాన్ని గూర్చి వివిధ కోణాల నుంచి పరిశీలించటం గాఢంకాసాగింది. ఆ నాళ్లల్లోనే విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షం బాల- అయోధ్య కాండలూ, నన్నయ గారి ప్రసన్న కథా కవితార్థయుక్తి చదవటం అటు కావ్యవిషయంగా, ఇటు విమర్శ విషయంగా నాలో నూత్నలోకాలకు కవాటాలు తెరచింది. అప్పటి నుంచి తెరచుకొన్న ద్వారాల్లోంచి ముందుకు సాగిపోవటమే.

భాషా ప్రవీణ పూర్తి చేసుకొని మళ్లీ వరంగల్‌కు వచ్చి ఉపాధ్యాయత్వంలో ప్రవేశించాక హైదరాబాదు-తెలంగాణా సాహిత్య ఉద్యమ వికాసంలో భాగస్వామ్యం కలిగింది. ఆ రోజుల్లో ఎవరో ఒకాయన 'ఉపాధి' అనే కలం పేరుతో కావచ్చు సి. నారాయణరెడ్డి (అప్పటికింకా ఆయన ఎం.ఏ. విద్యార్థి) 'విశ్వగీతి' అన్న చిన్న గేయ కావ్యాన్ని ' ఎద్దేవా' చేస్తూ రాస్తే దాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ కావ్యంలోని ఆధునికతను-వస్తుపరంగా, రచన పరంగానూ-విశ్లేషిస్తూ, నూత్నత్వాన్ని వ్యక్తీకరిస్తూ రాసిన వ్యాసం 'గోలుకొండ' పత్రికలో వెలువడింది. నారాయణరెడ్డి కావ్యాల గురించి వెలువడిన తొలివ్యాసం బహుశః అదే అనుకుంటాను.

అప్పట్లో హైదరాబాదు నుంచి 'దక్షిణ భారత హిందీ ప్రచార సభ' వేమూరి ఆంజనేయశర్మగారి సంపాదకత్వ (నారాయణరెడ్డి గారు మరొక సంపాదకులు, ఇద్దరి) నిర్వహణలో 'స్రవంతి' అనే మాస పత్రిక ప్రచురణ మొదలయింది. (ఇప్పటికీ నిరంతరంగా ఆ పత్రిక వెలువడుతూనే ఉంది.) నేను అప్పటికే ఆ సభవారు నిర్వహించే పరీక్షల్లో 'విశారద' దాకా వెళ్లాను. హిందీ సాహిత్యం, రామచంద్ర శుక్ల, నామ్‌వర్‌సింగ్ వంటి వారి రెండు తరాలకు సంబంధించిన సాహిత్య విమర్శ. జయశంకర్ ప్రసాద్ 'కామాయని' మహాకావ్యం వంటి వాటితో నాకు గాఢ పరిచయం ఉంది. అది 'స్రవంతి'కి నన్ను దగ్గర పరచింది. అది ఆ నాళ్లలో నా వ్యాసాలకు, కవితలకు (కవితలకు. 'తెలుగు స్వతంత్ర' కూడా) రంగస్థలం. 1956 ఆగస్టు నుంచి 'ప్రణయ కవితారథం' అన్న ప్రధాన శీర్షికతో కృష్ణశాస్త్రి, నాయని, వేదుల, రాయప్రోలు, విశ్వనాథల గూర్చి వారి ప్రణయ కవితా రీతుల్లోని వైవిధ్యాన్ని, విశిష్టతలనూ,విశ్లేషిస్తూ వరుసగా (1956 డిసెంబర్) 1957 జనవరి దాకా అయిదు వ్యాసాలను ధారావాహికంగా వెలువరించాను. ఇది సాహిత్య విమర్శకుడుగా నా పరిచయాన్ని గుర్తింపుకు

తెచ్చింది. 'ప్రణయ కవిత రథ సారథి' అంటూ నాయని సుబ్బారావుగారు ఆ రోజుల్లోనే వెలువడిన తమ 'నాయని సుబ్బారావు కృతులు' గ్రంథాన్ని ఆశీస్సులతో నా కందించటమే అందకు గుర్తు. అట్లాగే కేతవరపు రామకోటి శాస్త్రి నా 'కృష్ణశాస్త్రి' వ్యాసంలో 'ఎవ్వరని యెంతురో' అన్న ఖండిక ఉదాహరించి 'సతద్ విధా శోకమూర్తి కల్పనమపూర్వమయినది. ఒకానొక పతాకా స్థాయీగత శోకమూర్తి దర్శకమయిందీ ఖండిక' అని నేను రాసిందాన్ని ఉటంకించి- ఇది 'దర్శక'మయిందే తప్ప అనుభవానికి తెచ్చేది కాదు గదా అని ఆక్షేపించారు. అది మరో గుర్తు. అప్పటి కాయన నాకు తెలియదు. 1956లో తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవాలకు ఆయన వచ్చారు. పయి ఆక్షేపణను తన 'ఆత్మాశ్రయకవిత్వం' లో చేసింది గుర్తు చేసి పరిచయం చేసుకొన్నారు. ఆనాటి నుంచి ఆయన పరమపదించేదాకా అత్యంత ఆత్మీయ మిత్రుడు. ఆ అనుభవాలు వేరు.

ఈ విషయం అట్లా ఉంచి. 1957లో రాసిన 'రామాయణ కల్పవృక్ష చ్ఛాయలో ఊర్మిళ' అన్న వ్యాసం తులనాత్మకం. హిందీలో మైథిలీ శరణ గుప్త రచించిన 'సాకేత్' లోని ఊర్మిళను ప్రస్తావించి కల్పవృక్షంలోని ఊర్మిళ చిత్రణ విశేషాలు ప్రదర్శించిన వ్యాసం 'జాగృతి'లో వెలువడింది. ఈ వ్యాసం పునాదిగా ' రామాయణ కల్పవృక్షము: తులనాత్మక పరిశీలన' అనే ప్రసంగ వ్యాసం 1958లో 'రసధుని' ద్వారా నిర్వహించబడిన 'విశ్వనాథ సాహిత్య సమాలోచన' సభలో చదివింది స్రవంతి (58 నవం)లో వెలువడింది. తులసీదాస్ 'రామచరిత మానస్' కంబరామాయణం, తెలుగులోని పూర్వ రామాయణాలు ( రంగనాథ, భాస్కర, మొల్ల) తీసుకొని నిర్వహించిన తులనాత్మక వివేచన ఇది. బహుశః కల్పవృక్షం గూర్చి ఈ విధంగా తులనాత్మక విమర్శ సాగించిన వాటిలో నాకు తెలిసినంత వరకు మొట్టమొదటి వ్యాసం. ఈ వ్యాసం చివర కల్పవృక్ష మహాకావ్యాన్ని ఎన్నెన్ని కోణాలనుంచి అనుశీలించ వలసి ఉంటుందో సూచిస్తూ 'భాషయి అధికారం' మొదలు తాత్త్విక దృక్పథం దాకా పదిహేను అంశాలను ప్రకటించాను. ఈ అంశాలు, నిజానికి ఇంకా పెరగవచ్చు, అది వేరే విషయం కాగా, ఆ వివేచన, ఈ అంశాల సూచన నా విమర్శ విధానాన్ని, ఆలోచన రీతిని స్పష్టం చేస్తున్నదనుకుంటాను. ఇప్పటి దాకా నా రాసిన వ్యాసాల్లో (ఆ తరువాత రాసిన అనేక వ్యాసాల్లో గూడా) ఇది చాలా పెద్ద (స్రవంతిలో చిన్నచ్చులో 26 పుటల) వ్యాసం. ఈ అంశం చెప్పటానికి కారణం. విషయ వివేచన ఎంతగా విస్తరించిందనటానికే. అప్పటికి కల్పవృక్షం సుందరకాండ దాకే వెలువడింది.

దీని తరువాత నేను చెప్పటానికి ఉత్సాహపడే వ్యాసం 'చలం: పురూరవ' (జయంతి 1959 నవం.). ఇది మరొక విధంగా విశిష్టమయిన వ్యాసం. ప్రేమ, సౌందర్యాల ఆధ్యాత్మిక లక్షణం. ఈశ్వరీయత చిత్రించబడటం ఈ వ్యాసం విశిష్టత, చలంలోని ఈ పార్శ్వాన్ని అప్పటి దాకా ఎవరూ వెలుగులోకి తెచ్చినట్లు నాకు గుర్తులేదు. చలం రచనలు శశాంక, మ్యూజింగ్స్, ఉత్తరాలు వంటి వాటిని భూమికగా చేసికొని రాసిన వ్యాస మిది. ఈ వ్యాసం 'సృజన' చలం విశేష సంచికలో పునర్ముద్రితమయిప్పుడు ఆ సంచికను 'సంవేదన' (జూలై 1969)లో సమీక్షిస్తూ రాచమల్లు రామచంద్రారెడ్డి తన సహజమయిన దురుసుతనంతో నా వ్యాసాన్ని ఆక్షేపించారు. నా భాష చలం భాషలా సరళంగా లేదనీ, అది పురాతనమయిందనీ కాగా 'భాషలో ఇంత కృతకత్వం, ఇంత ఛాందసత్వం ఉన్నవాళ్లకు భావంలో మాత్రం చలంను అర్థం చేసుకొనే ఆధునికత ఎలా వస్తుంది?' ఇది ఆయన ఆక్షేపణ. శైలీ విభేదాల లక్షణం ఆయనకు తెలియదు, తా ననుకొన్నదే 'ఆధునికత' అనుకొంటారు. ఇంతకూ పురూరవనూ ఆయన వదిలిపెట్టలేదు. ఆ రచనా స్వభావం ఆయనకు అవగతం కాలేదు. పురూరవలోని దోషం చలం తన సిద్ధాంతానికి సాహిత్య రూపం ఇవ్వలేకపోవట మంటూ చలం గూర్చి చాలా రాసారు. నిజానికి అదంతా చదివితే 'రారా' అనుకొన్న విధంగా చలం లేకపోవటమే పెద్ద దోషంగా అన్పిస్తుంది. చలంలోని పరిణామ లక్షణాన్ని ఆయన జీర్ణించుకోలేక పోయారు. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, చలం 'పురూరవ' వ్యాసం 'ఆ' విధంగా 'దర్శించా' రన్నదే. ఇంకా ఈ విషయ విచారణ ప్రస్తుతాంశం కాదుగాని మరి కొందరు 'విమర్శకు'ల తీరు తెన్నులను చెప్పుకోవటం కోసమే ఈ మాత్రం. అదట్లా ఉంచి-

ఈ మధ్యలోనే జాను తెలుగు స్వరూపం గూర్చి, వ్యావహారిక భాషా వ్యాకరణం గూర్చి వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారితో పేచీపడట మయింది. 'జాను తెలుగు' అంటే, పలువురు భావిస్తున్నట్లు 'అచ్చతెలుగు' కాదనీ, వ్యావహారిక భాషకు చిన్నయసూరిగారి బాల వ్యాకరణంతరహాలో వ్యాకరణ గ్రంథం ప్రయోజనకారి కాదని నా ప్రతిపాదనలు. అయితే, విషయ చర్చకన్నా వ్యక్తి దూషణ ప్రధానం లేదా అధికం కావటం వల్ల, విషయాన్ని ప్రధానీకరిస్తే చర్చను ముందుకు సాగిస్తానని చివరి మాట చెప్పవలసి వచ్చింది.

ఎట్లాగూ చర్చలూ, వాదాలూ, పేచీల విషయం వచ్చింది కాబట్టి ఇక్కడే నా విమర్శక

జీవితంలో ప్రత్యేకంగా ఉత్సాహంతో హాయిగా ప్రస్తావించుకోవలసి ఉన్న సన్నివేశాన్ని మనవి చేస్తాను. అందుకు పూర్వరంగంగా-

**తెలుగు ఛందోవికాసం :**

'విద్యలలోపలనుత్తమ విద్య కవిత్వమ్ము,మరి, కవిత్వమ్ము ఛందోవేద్యము' అన్నాడు సుప్రసిద్ధ లాక్షణికుడు, ఉత్తమ కవి అయిన అనంతుడు. కవిత్వం ఛందోవేద్యం కాబట్టి ఛందస్సు కవితా వివేచనలో, అనుభవంలో ప్రధానపాత్ర వహిస్తున్నది. కవిత్వమన్నది ఛందోవిరహితంగా ప్రవర్తించదు. కాగా, నా విమర్శ ప్రస్థానంలో ఛందోవిషయ కృషి ఇంచుమించు తొలినాళ్లనుంచే ఉంది. అది సాహిత్య అకాడమీ వారి పుణ్యాన 'తెలుగు ఛందో వికాసం' గ్రంథంగా రూపుదిద్దుకొంది. ఛందోవిషయంగా అకాడమీ వారు ప్రకటించిన బహుమతి గిడుగు సీతాపతిగారి ఛందోవ్యాస సంకలనానికి లభించింది. కారణాలు అనేకం. అయితే, నా గ్రంథం పరీక్షకులుగా అబ్బూరి రామకృష్ణారావుగారికి ఎంతగానో నచ్చింది. ఆయన అకాడమీవారితో 'పోట్లాడి' నా గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందింపజేశారు. ఆ విధంగా తొలిగా అచ్చయిన నా విమర్శ గ్రంథం 'తెలుగు ఛందో వికాసం' (1962). తెలుగు ఛందో గ్రంథాలు, కన్నడ తమిళ ఛందో విషయాలు, సంస్కృత గ్రంథాల అధ్యయన ఫలితం ఆ గ్రంథం. తెలుగు ఛందో విధానాన్ని చారిత్రక పరిణామ క్రమంలో నన్నయ గారికి పూర్వం నుండి ఆధునికంగా నా వరకు వివరిస్తూ, పలు చర్చలు చేస్తూ పలువిషయాలను, ఛందో సమస్యలను వివేచించిన మరో గ్రంథం ఆనాటికే కాదు, ఈనాటికీ లేదని అందరూ అంటున్న మాటే, దాని ప్రామాణికత అందరూ గుర్తించిందే. ఆ తరువాత తెలుగు అకాడమీ వారి కోసం 'ఛందః పదకోశం' (1977) రచించటమయింది. ఈ మధ్యలోనే కూచిమంచి తిమ్మన 'లక్షణసార సంగ్రహం' పరిష్కరించి విపుల పీఠిక రచించటం (1971) తాళ పత్ర గ్రంథంగా ఉన్న కూచిమంచి వెంకటరాయని సుకవిమనోరంజనం పరిష్కరించి విపుల పీఠిక రచించటం (1976) వాటిని సాహిత్య అకాడమీ వెలువరించటం, ఆ పీఠికలు ఛందో వ్యాకరణవేత్తల ఆదరాభిమానాలు పొందటం ఎంతగానో సంతృప్తి కలిగించిన విషయం. ఈ కాలంలో ఛందో విషయంగా ఇంతటి విస్తృతమూ, గంభీరమయిన కృషి ఇతరత్రా కానరాదన్నది విజ్ఞుల అభిప్రాయం. ఛందోవిషయంగా పలుసమస్యలపై వ్యాసాలూ, పీఠికలూ రాసినవి తక్కువేమీకాదు. కొన్ని కొన్ని విషయాల్లో నిడుదవోలు

వెంకటరావుగారు, బండి నాగరాజు, వంతరాం రామకృష్ణరావు గారి వంటి వారితో పడ్డ పేచిలతో భాషా, లిపి పరిశీలనల ద్వారా నా కృషి మరింత గాంభీర్యాన్ని సంపాదించుకొంది. ఈ విధంగా సాగిన ఛందఃకృషినీ, ప్రతి పాదించిన అనేకాంశాలనూ విస్తరించటానికి ప్రస్తుతం అవకాశం తక్కువగా ఉంది కాబట్టి ప్రస్తుతాంశానికి మనవి చేస్తానన్న అంశానికి వస్తే -

**వచన పద్యం : లక్షణచర్చ.**

ఆధునిక కవితా రంగంలో 'వచన కవిత్వం' అనే ప్రక్రియ విశిష్టంగా ఆరంభమయి అతివేగంగా విస్తరించింది గదా! కాగా, ఈ ప్రక్రియను 'వచన పద్య' ప్రక్రియగా నిరూపిస్తూ 'ఆధునిక ఛ్ఛందస్సు' అంటే వచనపద్యమే నని ప్రతిపాదిస్తూ రాజమండ్రిలో (1963 ?) జరిగిన అఖిలభారత తెలుగు రచయితల ద్వితీయ మహాసభల ప్రత్యేక సంచికకు ఒక వ్యాసం 'తెలుగులో ఆధునిక ఛ్ఛందస్సు' అని రాసాను. అంతకుముందు తెలుగులో ఛందోవికాసంలో ఈ విషయం ప్రస్తావించాను. 'వచన పద్యం: దాని పేరు' అంటూ జనధర్మలోనూ, ఫ్రీవర్స్ ఫ్రంట్ వారి 'వచన కవిత' సంచికలోనూ, ఇతరత్రా వచన పద్యం గూర్చి చాలానే వ్యాసాలు రాసాను. ఆ రోజుల్లో వచన పద్యానికి లక్షణాలు చెప్పటానికి కుందుర్తి, అరిపిరాల విశ్వం వంటి వారు ప్రయత్నిస్తూనే ఉన్నారు. అయితే 'భావగుణ' నిరూపణంతో వచన పద్యానికి స్పష్టమయిన, కచ్చితమయిన ప్రతిపాదన నా వ్యాసాల్లోనే ఉంది. ఈ స్థితిలో-

'వచన పద్యం : ఆభాషలక్షణ నిరాకరణం' శీర్షికలో ఆంధ్రపత్రిక 1972 ఉగాది సంచికలో చేరా (చేకూరి రామారావు) కుందుర్తి మొదలయిన వారనేకులు వచన కవితను గూర్చి చెప్పిన అంశాల్లోని అస్పష్టతను, అశాస్త్రీయతనూ ప్రదర్శించి నిరాకరిస్తూ 'సంపత్కుమార ఒక్కరే ఈ కవితా స్వరూపానికి లక్షణాలు చెప్పటానికి సీరియస్‌గా ప్రయత్నించారు. ఆయన అభిప్రాయాల్నే ప్రధానంగా, నవిమర్శకంగా ప్రస్తావించదలచుకున్నాను. గనుక ఆయనకు నచ్చిన పేరే (వచన పద్యం) గ్రహించదలచుకున్నాను. అంటూ నేను చెప్పిన, చేసిన భావగుణ ప్రతిపాదన, పాదబద్ధత అనేవి చర్చించబడినాయి. ఇందుకు ప్రతిస్పందనగా 'వచన పద్యం : లక్షణ నిరూపణం' అంటూ భారతి (జూలై 72) లో నా వ్యాసం వచ్చింది. అక్కడి నుంచి వచన పద్యం ఛందో విభాగంలోకి రాదని ఆయన, వచన పద్యం పద్యమేనని నేనూ 'భారతి'లో వాదించుకున్నాం,

చర్చించుకున్నాం. ఈ వాదనల్లో, చర్చల్లో కేవలం వచన పద్యానికి సంబంధించి మాత్రమేగాక, గణాలు, వాటి స్వరూపం వాటి అవసరం, పాదం-దాని అంతర్నిర్మాణ, బహిర్నిర్మాణాలు ఈ విధంగా ఛందస్సుకు సంబంధించి భాష-వ్యాకరణ-అలంకార శాస్త్రాల భూమికపయి అనేకాంశాలు వెలుగులోకి వచ్చాయి. పద్యం, గద్యం, వచన పద్యం వగైరాల వివిధత్వాన్ని ఆయన వ్యక్తీకరించాక, అ నేపథ్యంలో ఆయా అంశాలను విశ్లేషించి చివరకు 'టెంటేటివ్'గా వచన పద్యానికి ఆరు అంశాలతో లక్షణ నిరూపణతో 'వాద సమాసనం' చేసాను.

ఎవరి వాదనలో వారు ఎంత 'సీరియస్'గా ఉన్నా, ఎక్కడా ఎదుటి వారిని దూషించే, కించపరిచే తీరు ఏ మాత్రం ఎక్కడా ఈ వాదాలను, చర్చలను స్పర్శించనయినా స్పర్శించకపోవటం ఈ 'వాద-వివాద-చర్చల' ప్రత్యేకత. ఈ వాదాలూ, అవి సాగిన తీరూ అందరినీ ఆకట్టుకున్నాయి. ఆలోచింపజేసినయి. వచన పద్యం విషయంగా లాక్షణికంగా ఎంతో ఆసక్తి పెరిగింది. అయితే ఇంత వాదాలయినా, ఇద్దరం ఏకాభిప్రాయానికి రాలేక పోయాంగాని, సహృదయ విమర్శకులుగా ఎంతో దగ్గిరయ్యాం. ఆత్మీయులమయ్యాం. చీల్చటానికి, ద్వేషించటానికీ అలవాటుపడ్డ వాద వివాద రీతి మా దగ్గర విశ్రాంతి తీసుకొని కలుసుకోవటానికి ప్రేమించి అభిమానించుకోవటానికీ దారి తెలుసుకుంది. కాగా, చివరకు మా వాదనలనూ చర్చలనూ జమిలిగా దేశం ముందు ఉంచిన వచనపద్యం గూర్చి మరిన్ని ఆలోచనలకు వీలుగా ఇద్దరం కలిసి 'వచన పద్యం-లక్షణ చర్చ' అనే పేరుతో పుస్తకంగా ప్రచురించి మా ఇద్దరికీ అభిమాన కవి (ఆయన వచన పద్య కవి కాదు) అయిన నాయని సుబ్బారావు గారి ఎనభయ్యో పుట్టిన రోజు కాన్కగా సాహిత్యలోకానికి 1978 అక్టోబర్ 26న సమర్పించాం. ఇట్లాంటి ప్రచురణ సాహిత్య విమర్శ చరిత్రలో ఒక అపూర్వమయిన సన్నివేశంగా సాహిత్యలోకం అభినందించి ఆదరించింది.

ఇంతకూ ఇక్కడ ప్రధానంగా గమనించవలసిన అంశం- మాకు తెలసినంతలో 'వచన పద్యం' ఛందస్సం విషయంగా దేశంలోనే కాదు, ఇతర భాషా సాహిత్యాల్లోనూ ఎక్కడా కృషి జరగకపోవటం. వచన పద్యం ఛందస్సం నా కృషి ఫలితం కావటం.

ఆ తరువాత గూడా వచన పద్యం గురించి మా ఆలోచనలూ, వ్యాసాలూ సాగుతూనే ఉన్నాయి. గురజాడ 'ముత్యాలసరం' లక్షణం గూర్చి పేచీపడుతూనే ఉన్నాం. ఆరుద్ర 'వాక్యకవిత' విషయంగానే పేచీతప్పలేదు. ఇట్లా ఇంకా ఎన్నెన్ని పేచీలు పడుతుంటే మా

అధ్యయనం మరింతగా గాంభీర్యం, విస్తృతీ జరుగుతూనే ఉంది. గౌరవాభిమానాలు పెరుగుతూనే ఉన్నాయి. అందుకు ఉపలక్షకంగా నా షష్టిపూర్తి సందర్భంగా 'తెలుగు ఛందస్సుపై కొన్ని వెలుగులు' (-కొత్త వెలుగులు అంటే ఎక్కడా అహంకారమయితుందోనని కొన్ని అన్నాను) చేరాకు అంకితం చేసాను. ఆ గ్రంథంలో తెలుగు ఛందస్సుకు సంబంధించి అపూర్వమయిన మౌలికాంశాలు అనేకం వెలుగులోకి వచ్చాయి. చేరా గూడా తన సహృదయతకు గుర్తుగా 'ముత్యాల సరాల ముచ్చట్లు' 1997లో అంకితం చేసి నన్ను గౌరవించారు. ఈ రెండూ ఛందో విషయంగా ఎంతో విశిష్టమని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. సహృదయులే ఇందుకు ప్రమాణం. మా ఈ చర్చలు యువతరానికి స్ఫూర్తినిచ్చి ఛంధఃపరిశీలన- పరిశోధనలకు ప్రేరకమయ్యాయనటానికి చెన్నకేశవ రెడ్డి, సంగనభట్ల నరసయ్య వంటి వారే సాక్ష్యం.

**ఆధునిక సాహిత్య విమర్శ : సాంప్రదాయకరీతి.**

ఒక వైపు ఈ కృషి ఇట్లా సాగుతుండగా మరోవైపు దేశీయమయిన అలంకార శాస్త్ర గ్రంథాల అధ్యయనం తీవ్రత సంతరించుకొంది. భరతుడు మొదలుకొని జగన్నాథ పండితరాయల దాకా ప్రసిద్ధ గ్రంథాలు, అప్రసిద్ధ గ్రంథాలు గూడా నా ఆలోచలనలకు పదునుపెట్టినాయి. నా విమర్శ విధానానికి మరింత చురుకుదనాన్ని , సూక్ష్మదర్శితనూ సంపాందించినాయి. కాగా ఈ నే పథ్యంతో Ph.D. కోసం పరిశోధన విషయంగా 'ఆధునిక సాహిత్య విమర్శ: సాంప్రదాయిక రీతి'ని ఎన్నుకోవటమయింది. అంతకుముందే మిత్రుడు ఎస్.వి. రామారావు 'తెలుగులో సాహిత్య విమర్శ' అన్న పరిశోధన గ్రంథం ద్వారా విశేషంగా సమాచారం సేకరించి, కొన్ని ప్రతిపాదనలు గూడా చేసారు. తెలుగులో పూర్వకవులు ఎందరో మహానుభావులు, వారిలో నన్నయ, తిక్కన, నాచన సోమనాథుడు, పాలకుర్కి సోమనాథుడు, శ్రీనాథుడు, పెద్దన, సూరన వంటి వారి కావ్యదృక్పథాలను పూర్వరంగంగా ప్రస్తుతీకరించి, ఆధునికులయిన పి. దక్షిణామూర్తి, కాశీభట్ల బ్రహ్మయ శాస్త్రి, తెన్నేటి రామచంద్రరావు, పనప్పాకం సుబ్రహ్మణ్య అయ్యరు, వింజమూరి రంగాచార్యులను పరామర్శించి కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, పురాణ సూరిశాస్త్రి, అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు, నండూరి బంగారయ్య, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీల ఆధునికత

లక్షణ లక్షితమయిన సాహిత్య విమర్శలో భారతీయాలంకారికుల ఆలోచనలు, ప్రతిపాదనల సిద్ధాంతాల ప్రభావ స్వరూపం విశ్లేషించటంగా ఈ గ్రంథం రూపొందింది. వీరిలో కట్టమంచి, రాళ్లపల్లి, విశ్వనాథలకు తప్ప మిగిలిన వారికి ప్రసిద్ధి లేదు. వీరందరి విమర్శక వ్యక్తిత్వాన్ని వెలుగులోకి తెచ్చి ఆధునికంగా తెలుగులో సాహిత్య విమర్శలోని అవిచ్ఛిన్నమయిన అనుస్యూతిని నిరూపించటం ఈ గ్రంథం విశిష్టత. నిజానికి ఒక్కొక్కరిని గూర్చి ఒక్కొక్క గ్రంథం రాయవలసినంత కృషి వీరిది. అయితే ఒక్కొక్కరు నిర్వహించిన విమర్శనంతా విశ్లేషించటం కాక వారి వారి విమర్శకు మూల భూతమయిన అంశాన్ని స్వీకరించి వివేచించటం ఈ గ్రంథంలో ఎన్నుకోబడిన విధానం. ఆయా అంశాలను సూత్రీకరించటం గుర్తించదగిన అంశం.

కట్టమంచి రామలింగారెడ్డి ఆధునిక తెలుగు సాహిత్య విమర్శకు ఆద్యుడన్నది రకరకాలయిన కారణాల వల్ల ప్రచారంలోకి వచ్చి స్థిరపడిన అంశం. కాని నిజానికి పి. దక్షిణామూర్తి (1892) తొలి ఆధునిక విమర్శకుడన్న నిరూపణ ఈ గ్రంథంలో చేయబడింది. కట్టమంచి పాశ్చాత్యసాహిత్యవిమర్శ విధానాలను నేరుగా తెచ్చి అనువర్తింపజేసి తెలుగులోని ప్రాచీన కావ్యాలనూ, ప్రబంధాలనూ వాటి విశిష్టతను గుర్తించటానికి వీలుకలుగనీయనంత కల్లోలం సృష్టించారు. అయినా ఆయన ప్రతిపాదించిన భావనాశక్తి దేశీయమయిన 'ప్రతిభ' లో అంతర్భవిస్తుందని, ఆయన కథా విషయంగా సాగించిన విచారణ విశిష్టమయిందే అయినా దేశీయ సాహిత్య విమర్శలో అందుకు మూలాలు కన్పిస్తాయి. కాగా, ఇట్లా అనేకంగా ఆయన ప్రస్తుతీకరించిన విషయాలను అనంతర సాహిత్య విమర్శకు ఒక 'కీ నోట్ పేపర్' గా ప్రదర్శించి రాళ్లపల్లి నుంచి సూత్రీకరణ ఆరంభించిం దీ గ్రంథం. ఆ సూత్రీకరణ లివి:-

రాళ్లపల్లి : కావ్యకళాదృక్పథం; దువ్వూరి రామిరెడ్డి: రసరామణీయ కములు; బసవరాజు, పురాణం: సమన్వయ దృక్పథం; అక్కిరాజు ఉమాకాంతం: ఉదాత్తరసభావన; నండూరి బంగారయ్య: నిర్మాణ శిల్పం; రాయప్రోలు: రమ్యాలోకం; విశ్వనాథ: కావ్య పరమార్థ దృక్పథం: జీవుని వేదన; శ్రీశ్రీ: సంవిధాన-సామాజిక దృక్పథం.

ఈ సూత్రీకరణలు ఆదునిక తెలుగు సాహిత్య విమర్శ గమన క్రమణ రీతిని గూడా వ్యక్తీకరిస్తుండటం గమనించదగిన అంశం. ఈ గ్రంథానికి శ్రీశ్రీ చివరి హద్దు. అందుకని కాలక్రమంలో ఆయన తరువాతి వారు ఈ పరిధిలోకి రా వీలుకాలేదు.

శ్రీశ్రీ దాకా ఆధునికంగా సాహిత్య విమర్శ పురోగమనాన్ని దర్శింపజేసే ఈ సూత్రీకరణలను గమనిస్తే నాటి నుంచీ రసవిషయం అనుస్యూతంగా సాగివస్తున్నదని స్పష్టపడుతుంది. రసవివేచన జగన్నాథ పండితరాయలతోనే ఆగిపోలేదు, ఆధునికంగా కొత్త కొత్త ఆలోచనలతో అనుభవాలతో మానసిక శాస్త్రాదుల పరవేషంలో విస్తరించింది. రాళ్లపల్లి అనంతరసభావన, భరతుడిని జగన్నాథుడినీ కలిసి ముడివేసిన దువ్వూరి వారి రస రామణీయకత, ఉమాకాంతం గారి ఉదాత్త రస భావన, బంగారయ్యగారి స్ఫుట-అస్ఫుట రసవివేచన, రాయప్రోలు రసత్రయ మౌలికతా ప్రతిపాదన, విశ్వనాథ వారి కావ్య పరమార్థంగా ఒక స్థాయిలో రసాన్ని, రెండవ స్థాయిలో వస్తువును దర్శించటం, శ్రీశ్రీ సంవిధాన వివేచనలో రసప్రాధాన్యం- ఈ అంశాలన్నీ రసాన్ని గూర్చిన ఆధునిక విచారణకు సాక్ష్యాలు. కాగా ఈ గ్రంథం ఆధునికంగా రస సిద్ధాంతం, రస ప్రస్థానంలో రస ప్రవృత్తి యొక్క బహుముఖీనతను ప్రతిపాదిస్తుంది. ప్రధానంగా రాయప్రోలు రసత్రయ భావన, ఉమాకాంతం గారి ఉదాత్త రస భావన విశేషంగా గమనించవలసినవి. ఈ రెండూ జీవితాన్నీ, రస భావనను, అనుభవాన్ని సంయోజింపజేసే విశిష్టమయిన ప్రతిపాదనలు. ఈ విధంగా ఈ గ్రంథం రసప్రస్థానాన్ని పరిశీలిస్తూ నూత్న విషయాలను వెలుగులోకి తెచ్చింది. దువ్వూరి రామిరెడ్డి, ఉమాకాంతం, రాయప్రోలుల విశిష్ట విమర్శ వ్యక్తిత్వాలను అందరి దృష్టికి తెచ్చింది.

'జీవుని వేదన' అన్నది విశ్వనాథ ప్రతిపాదన. అయితే, మహావిమర్శకుడయిన విశ్వనాథ అనేకానేక విషయాలను వివేచించారు గాని ఈ జీవుని వేదన గూర్చి ఎక్కడా ఒక్క మాట గూడా రాయలేదు. దాన్ని గురించి విచారించింది మొదట ధూళిపాళ శ్రీరామమూర్తి గారు కాగా తరువాత ఈ గ్రంథం శ్రీ రామమూర్తి గారి విచారణ అద్వైత వేదాంత మార్గాన సాగింది. ఈ గ్రంథం అలంకార శాస్త్ర మార్గాన సాగింది. రాజశేఖరుడు ప్రతిభావ్యుత్పత్తులకు ప్రేరకమయింది. 'శక్తి' అన్నాడే తప్ప ఆ శక్తిని గూర్చి ఏమీ చెప్పలేదు. పూర్వాలంకారిక మార్గంలో ఈ 'శక్తి' ప్రతిపాదన- ఎవరూ పట్టించుకోకపోయినా - అత్యంత విశిష్టమయింది. ప్రతిభాదులకు ప్రేరకమయిన ఈ 'శక్తి' విశ్వనాథ ప్రతిపాదించిన 'జీవుని వేదన' అని ఈ గ్రంథం నిరూపించింది. వాల్మీకి మొదలు కొని ఆధునిక కాలందాకా అనేకమయిన యుక్తి ప్రయుక్తులు, ఉదాహరణల ద్వారా స్పష్టపరచింది. ఈ గ్రంథం సాధించిన ఒక నూత్నత్వం ఇది. మరొకటి కావ్య పరమార్థ దృక్పథం. కావ్యార్థం రసమని పూర్వు లన్నారు. అయితే అన్ని కావ్యాలూ రస ప్రధానాలు కావు. అందువల్ల అన్నింటికి ప్రవర్తించే పద్ధతి ఇది. రస

ప్రధాన కావ్యాల్లో కావ్య పరమార్థం రసం కాగా, ఇతర కావ్యాల్లో వస్తువు కావ్య పరమార్థం, కాగా పూర్వాధునిక కావ్యాలూ, నవలలు మొదలయిన అన్నింటినీ అనుశీలించటంలో ఇది ప్రధాన ప్రమాణంగా ప్రవర్తిస్తుందని ఈ ప్రతిపాదనలోని ప్రామాణికతను, ఔచిత్యాన్ని నిరూపించటం మరొక కొత్త విషయం.

ఉదాత్త రసమని అచ్చంగా ఉమాకాంతంగారు ప్రతిపాదించలేదు. ఆయన ఆలోచనలనుంచి నిష్పన్నం చేయబడిన అంశమిది. రసానికి ఉదాత్త్యం వస్తు-నాయకపరంగా ఉంటుందనీ, వస్తువు జీవన ధర్మమూలకమయినప్పుడే ఈ స్థితి కలుగుతుందని, ధర్మేతర వస్తువు రసానుభవానికి దూరం చేస్తుందన్న మౌలికాంశాల నిరూపణ గుర్తింపదగిన విశేషం. భావకవిత్వాన్ని 'తిట్టిన'వాడుగానే ప్రచారం చేయబడిన ఉమాకాంతం గారి నిర్మాణాత్మకమయిన ఆలోచనలను సహృదయులకు వినూత్నంగా అందిస్తున్న దీగ్రంథం. మరి, కథ చెప్పే విధానం గూర్చి దండి, భామహులు ప్రతిపాదించిన 'బావికత్వం' అన్న అంశాన్ని సాహిత్య విమర్శలో ప్రచురంగా ఉండిన 'శిల్ప'మన్న అంశాన్నీదాన్ని ప్రయోజనాన్ని స్పష్టంగా నిర్ధారించటం వంటి అనేకానేక విషయాలను వెలుగులోకి తెచ్చింది. అయితే ఈ గ్రంథాన్ని సమీక్షించటం ఇక్కడ కుదురదుగాని, అనేకమయిన విషయాలను ప్రతిపాదించి అపూర్వంగా వెలుగులోకి తెచ్చిందన్నదే ఇక్కడ ఈ కొన్ని అంశాలను ప్రస్తావించటానికి కారణం.

**పూర్వ కవుల కావ్య సిద్ధాంతాలు :**

ఈ గ్రంథానికి పూర్వరంగమయిన 'పూర్వ కవుల కావ్య దృక్పథాలు' (1990) అన్న గ్రంథం నన్నయగారు ప్రతిపాదించిన కావ్య సూత్రాలను, తిక్కనగారి ఉభయ కావ్య ప్రౌఢిపాటించు శిల్పం, నాచన సోమనాథుని నవీనత, పోతన గారి జగచ్చైతన్య భావాలను సహృదయుల దృష్టికి వినూత్నంగా తీసుకువచ్చింది. ప్రసన్న కథా కలితార్థయుక్తి, వస్తు కవిత (నన్నచోడుని ప్రతిపాదన). అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తి నిధిత్వం, కథా లక్షణ నిరూపణం, కవియోగ్యత, కావ్య ప్రయోజనం గూర్చి నన్నయగారే తొలిగా సాహిత్య విమర్శ రంగంలో ప్రతిపాదించిన అంశాలలోని కొత్తదనం, ప్రత్యేకత, భారతీయ సాహిత్య విమర్శకు తెలుగువారి అనుదానంగా చర్చా పూర్వకంగా నిరూపించటం, 'ఉభయ కావ్యం' అంటే రాజశేఖరుని కావ్య మీమాంసను పరిగణలోకి తీసుకొని శాస్త్ర కావ్యం, కావ్యం అన్న ప్రక్రియల

సమ్మేళన రూపమన్న నూతన నిర్ధారణ, కుంతకుని నేపథ్యంలో నాచన సోమనాథుని సాహిత్య రసపోషణ, సంవిధానం, సంవిధాన చక్రవర్తిత్వం, నవీనగుణాలు మొదలయినవి కేవలం ఆయన బిరుదులు కావనీ అవి కావ్య సూత్రాలనీ వాటి స్వరూపస్వభావాలను నిర్ణయించటం, పోతనగారి జగచ్చైతన్య భావనలో ఉత్తమ కావ్యావతరణ స్వరూప స్వభావాలను వెలుగులోకి తీసుకురావటం ఈ గ్రంథంలోని కొత్తగా నిరూపితమయిన అంశాలు. ఇంకా శ్రీనాథాదులను గూర్చి చేసిన విచారణ గ్రంథంగా రావలిసే ఉంది. కాగా మహానుభావులయిన పూర్వకవుల కావ్య భావనలను గమనిస్తే పరిణామ క్రమంలో వచ్చిన వినూత్నాంశాలను, దాదాపుగా ఇంతకు పూర్వం గుర్తించబడని అనే కాంశాలను వెలుగులోకి తీసుకురావటం ద్వారా, తెలుగులో సాహిత్య విమర్శ చరిత్ర రచనకు ఎంతో సౌకర్యం సమకూర్చే గ్రంథా లివి. అంతే కాదు, పూర్వాధునికంగా భారతీయ సాహిత్య విమర్శకు తెలుగు విమర్శ తన అనుదానం ద్వారా పుష్టిమంతం చేయటాన్ని నిరూపించే గ్రంథా లివి. వాస్తవంగా సిద్ధాంత గ్రంథాలు. కొత్తగా ఆలోచించటానికీ నూత్నాంశాల ప్రతిపాదనలకూ దోహదం కలిగించే విధంగా సాగిన నా భారతీయ సాహిత్యాధ్యయన ఫలితాలు.

కట్టమంచి రామలింగారెడ్డి గారి ద్వారా పూర్వ సాహిత్య శాస్త్రం, పూర్వకవుల కావ్యాలు ఎంతగానో అప్రతిష్ఠపాలయినయి. రెడ్డిగారిని అనాలోచితంగా కొంతవరకు భావకవులు, చాలావరకు అభ్యుదయ కవులు అనుసరించటం వల్ల అనేకమయిన అపోహలు, ప్రమాదకరమైన ఆలోచనలు వ్యాప్తిలోకి వచ్చినాయి. అవి సాహిత్యానికి ఎంతో అపకాకరమయిపోయినాయి. ఉదాహరణకు రెండు అంశాల క్లుప్తంగానే ప్రస్తావిస్తాను. దండి మహాకావ్యానికి ప్రతిపాదించిన అష్టాదశ వర్ణనలు అనాలోచితంగా నిందింపబడినాయి. నిజానికి ఆ అష్టాదశవర్ణనలు సమగ్ర జీవితాన్ని కావ్యంగా మలచటంలో ఉపకరించే విధంగా చెప్పబడినాయి. కావ్యానికి స్వీకరించిన వస్తువుననుసరించి వీటిని కవులు ఉపయోగించుకున్నారు. అవసరమయిన మరికొన్నింటిని చేర్చుకొన్నారు. కవులకు దండి మార్గ దర్శనం చేశాడేతప్ప మార్గ నిరోధం చేయలేదు. ఇది గమనించకుండా గతానుగతికంగా ప్రవర్తించటం వల్ల కలిగిన అపకారాన్ని వ్యక్తీకరిస్తూ 'వర్ణనలు' అన్న వ్యాసాన్ని 'జయంతి'లో (1959) రాసాను. రెండవ అంశం ప్రబంధాల్లో స్త్రీ అంగాంగ వర్ణన పరమ ఏహ్యమన్న కట్టమంచి వారి అనాలోచిత విమర్శను తరువాత పలువురు ప్రాణప్రదంగా తీసుకొని కట్టమంచి కన్నా తీవ్రతను ప్రదర్శించారు. కవులు రాజుల కామభావ తృప్తికోసం ఇట్లాంటి

వర్ణనల చేసారని నిందించారు. అంతే తప్ప ఈ విధమయిన అంగాంగ వర్ణన ఎందుకు, ఎట్లా ఆరంభమయింది? ఎట్లా పరిణమించింది? అన్నే దాని మూలాలకు వెళ్లలేకపోయినారు. నిజానికి ఈ అంగ వర్ణన స్త్రీ విషయంగా ఆరంభంకాలేదనే విషయం వారికి తెలియదు. రామాయణం (సుందర)లో సీతాదేవి అడిగినప్పుడు ఆంజనేయుడు శ్రీరామచంద్రుని అంగాంగ వర్ణన చేస్తాడు. భారతీయ సాహిత్యంలో తొలిగా అంగాంగ వర్ణన కన్పించేది అక్కడ. ఆంజనేయుడు శ్రీరాముని దైవంగా సేవించే పరమ భక్తుడు. ఈ తరువాత కాళిదాసు కుమార సంభవంలో పార్వతీదేవి అంగాంగ వర్ణన చేస్తాడు. కాళీదాసు దేవీ భక్తుడు. దైవ పూజలో 'అంగపూజ' అనేది భారతీయమయిన ఒక సంప్రదాయం. గణపతి పూజా విషయంగా ఇది అందరికీ సుప్రసిద్ధమయిన విషయమే. కాగా ఈ వర్ణన పూజావిధానంలోని ఒక భాగం. ఇదే క్రమంగా అటు సంస్కృతంలోనూ ఇటు తెలుగులోనూ (ఇతర భారతీయ భాషల్లోనూ) విస్తరించింది. ఇది దేశీయమయిన సంప్రదాయం తెలిస్తే గాని అవగతం కాని విషయం. ఈ అంశాన్ని వివిధ సందర్భాల్లో వ్యాసాల్లో వివరించాను. కాగా దేశీయ సంప్రదాయ జ్ఞానం సాహిత్య విమర్శకు తప్పని సరి అయిన ప్రమాణం. అందుకే 'దేశీయత'ను సాహిత్య వివేచనలో ప్రధానాంశంగా 'ఆధునిక కవిత్వం; దేశీయత' (1987) అన్న వ్యాసంలో సిద్ధాంతంగానూ, అనువర్తనంగానూ నిరూపించాను.

**నా విమర్శ : దేశీయత.**

'దేశీయత' అంటే, వెంటనే అవగాహన కలుగదో ఏమోగాని, దాన్ని Nativity అని ఆంగ్లీకరించుకొని, దాన్నిబట్టి దేశీయతను గూర్చి ఆలోచించి అదొక సంకుచితమయిన భావనగా కొందరు అపోహల పాలు కావటం కన్పిస్తుంది. ఆంగ్లంలోకి అనువదించుకుంటే తప్ప అవగాహన కలక్కపోవటం ఒక దురదృష్టం. ఇట్లా దేశీయమయిన చరిత్రగల అనేక పదాలను ఆంగ్లంలోకి మార్చుకొని ఆలోచించటం పరాయి ప్రభుత్వ కాలంలో అలవరచబడిన దురభ్యాసం. అది ఈనాటికీ తొలుగకపోవట దేశాన్ని ఇంకా వదులని దౌర్భాగ్యం. కాగా, దేశీయత అన్నది సంకుచితమయిన భావన కాదు. 'దేశం' అనే పదం తెలుగులో రెండు స్థాయిల్లో ఉపయోగించబడుతున్నది. ఒకటి మొత్తం దేశం- భారతదేశం; రెండు: ఆ దేశంలోని ఒక ప్రాంతం. ఉదాహరణకు తెలుగుదేశం, వంగదేశం ఇత్యాది కాగా, ఈ రెండింటినీ కలుపుకొని రూపొందేది దేశీయత. వంద రెండు వంద ఏండ్లనాడు

ఈ దేశీయతను గూర్చి తర్కించుకోవలసిన అవసరంలేకుండింది. ఆనాటికి జీవితంలోనూ, అది పునాదిగా సాగిన సాహిత్యంలోనూ దేశీయతా భావన చావలేదు కాబట్టి. కాని ఈ దేశాన్ని బానిస దేశంగానే ఉంచాలనుకొన్న ఆంగ్ల ప్రభుత్వం తన విద్యా విధానం మొదలయిన అనేక విధానాలలో దేశీయతను చంపటానికి రకరకాలుగా చంపటానికి తీవ్రమయిన కృషి చేసింది. ఆ కృషి కొంత ఫలించకనూ పోలేదు. గురజాడ అప్పారావు వంటి వారు ఇందుకు ఉదాహరణ. ఈ దేశానికీ, దేశీయులకూ ఉండే అవినాభావ సంబంధాన్ని, సహజమయిన సంబంధాన్ని జీవితంలోనూ, సాహిత్యంలోనూ, తెంచివేయటానికి-వాస్తవం తెలిసో తెలియకో- తీవ్రప్రయత్నం చేసారీ 'మేధావులు'. 'నిన్న వచ్చారింగిలీషులు మొన్న వచ్చిరి ముసలుమను లటు మొనవచ్చిన వాడ వీనని మరచి వేరులు బెట్టకోయి' అని ఉద్బోధించారు. ఈ దేశములో ముసలు మనుసులు, ఇంగ్లీషువారివలె ఎక్కడి నుంచో వచ్చారని ఈ దేశంలోవారికి నిత్యసంబంధం లేదనీ ఉద్బోధం. దీనికి తోడువచ్చె నిదె బంగారు కాలము వాంఛలెల్లను తీరు, సుజనుల కాంగిలేయుల ధర్మరాజ్యము జ్ఞానమును స్వాతంత్ర్యమిచ్చుచు సంతతము వర్ధిల్లుగావుత' అని ఆశీర్వదించారు. గాఢంగా వాంఛించారు. 'కన్నుగానని వస్తుతత్త్వము కాంచ నేర్పరు లింగిలీజులు కల్ల నొల్లరు, వారి విద్యల, గరచి సత్యము నరసితిన్' అంటూ దేశయమయిన సర్వవిజ్ఞానాన్ని కించపరుస్తూ దేశాన్ని అనేకరకాల దోపిడీలకు గురిచేసిన ఆంగ్లేయ ప్రభుత్వాన్ని కల్లలెరుగరని, వారి విద్యలవల్ల సత్యం తెలిసిందని అన్నారు. ఈ విధంగా విదేశీయ మోహంతో దేశీయతను కోల్పోయే విధంగా చేసిన గురజాడను నెత్తికెత్తుకొని ఆయన తాత్పర్యానికి మరింత వన్నెలు చిన్నెలు సమకూర్చి 'అభ్యుదయ కవిత్వ' పరు లనేకులు దేశీయతా భావనా వినాశానికి ఈ నాటికీ ప్రయత్నం చేస్తున్నప్పుడు 'దేశీయతా' భావన యొక్క అవసరం ఏర్పడింది. ఆ అవసరాన్ని తీర్చేందుకే 'దేశీయత'ను జీవితానికీ సాహిత్యానికీ ప్రమాణంగా నిరూపించాను. ఈ నిరూపణ వ్యాసాన్ని చదివి ఒక తీవ్ర మార్క్సిస్టు విమర్శక మిత్రుడు 'మీ వ్యాసం అక్షరాక్షరం ఖండించటానికి యోగ్యంగా ఉంది' అని నాకు ఉత్తరం రాసాడు. 'మార్క్సిస్టు' మిత్రుడు అట్లా ఉద్రేకపడకుండా ఎట్లా ఉంటాడు? 'మిమ్మల్ని అంతగా ఉద్రేకపరచిన ఆ వ్యాసం నిజంగా సఫలమయింది' అని ఆయనకు రాసాను.

ఈ సందర్భంలో జాగ్రత్తగా అవగాహన పరుచుకోవలసిన అంశం ఒకటి ఉంది. 'దేశీయత' వ్యతిరేకముఖమయిన భావన కాదు. స్వత్వం కోల్పోకుండా సర్వదేశీయతలను మన్నిస్తూ విశ్వమానవతా భావానికీ వసుధైక కుటుంబ ప్రవృత్తికీ అనంత విశ్వ చైతన్యలయాను భవానికీ వ్యక్తినీ వ్యక్తి మయమయిన జాతినీ- సమాజాన్నీ ఎదిరించేందుకు అనుకూల ముఖంగా ప్రవర్తించే జీవన మౌలిక దృక్పథం దేశీయత. సంకుచితత్వానికి గానీ, కృత్రిమత్వానికి గానీ, కుత్సితత్వానికి గానీ, కుహనా విధానానికి గానీ, కఠోరత్వానికిగానీ ఈ దృక్పథంలో తావు లేదు. స్వశక్తితో తనను తాను సంరక్షించుకొంటూ ఇతరులను గౌరవించి సమాదరించే ధార్మిక ప్రవృత్తిని దేశీయత సర్వదామన్నిస్తుంది. నిజానికి ఈ విధమయిన దేశీయత కోసమే ఆధునికంగా ఈ దేశంలో అనేకోద్యమాలు ప్రత్యక్ష-పరోక్ష మార్గాల్లో నేరుగానూ కొంత తిరుగుడుగానూ ప్రయత్నించినాయి, ప్రయత్నిస్తున్నాయి గూడా.

ఇక్కడే మరొక అంశం మనవి చేయవలసిఉంది. 'ఆధునికత' అని ఈనాడు భావించబడుతున్నది-ఈదేశం స్వయంగా తన ఆలోచనలతో, ప్రవృత్తులతో సాధించుకొన్నది కాదు. ఈ దేశంపయి పరాయి ప్రభుత్వం చేత రుద్దబడింది. కాగా, నిజానికి దేశీయతామహితంగా 'ఆధునికత'ను సంపాదించింది. వివేకానందుడు, దయానందుడు, అరవిందుడు, గాంధీజీ, రమణ మహర్షి, జిడ్డు కృష్ణమూర్తి మొదలయిన మహానుభావులు. వీరివల్ల దేశపు ఆలోచన, ఆచరణ విధానంలో వాస్తవికమయిన ఆధునికత వ్యక్తమయింది. ఈ ఆధునికతకు పునాది దేశీయత. కాగా ఆధునికమయిన ఈ దేశీయతా భావన ప్రమాణంగా ఆధునిక సాహిత్యాన్ని, వివిధ కవిత్వోద్యమాలను పునస్సమీక్షించవలసిన అవసరం ఏర్పడింది. దేశీయతా భావనా రాహిత్యం కారణంగా సాహిత్య చరిత్ర, ప్రధానంగా ఆధునిక సాహిత్య చరిత్ర నిర్మాణంలో అనేక వక్రీకరణలు చోటు చేసుకొన్నాయి. వాటిని వెలుగులోకి తెచ్చి సాహిత్య చరిత్ర సరయిన విధానంలో నిర్మించటానికి నా పరిధిలో 'ప్రగతి వాద కవిత్వం పయి తిరుగుబాటు' (జనధర్మ స్వాతంత్ర్యోత్తర తెలుగు కవిత ప్రత్యేక సంచిక) మొదలయిన వ్యాసాలు.

సాహిత్యంలో 'విప్లవాలు' ఉండవు. 'తిరుగుబాట్లు' మాత్రమే ఉంటాయి. విప్లవం మూలచ్ఛేదాన్ని కాంక్షిస్తుంది. తిరుగుబాటు అనవసరమయిన, అనారోగ్యకరమయిన వాటిని

తొలగించి, పూర్వంనుంచి పరానికి ఒక అనుస్యూతిని తిరుగుబాటు సాధిస్తుంది. సాహిత్య కవిత్వ పరిణామం మూలాన్ని విచ్ఛేదించదు. అనుస్యూతి పూర్వకంగా నూత్నత్వాన్ని సాధిస్తుంది. కాగా, విప్లవం- తిరుగుబాటు అనే వాటిని సాహిత్య రంగంలో స్పష్టంగా నిర్వచించి ఈ వ్యాసాల్లో ముందుకు సాగట మయింది.

**నవ్య సంప్రదాయ విమర్శలో నా దారి :**

'నవ్య సంప్రదాయ' భావనకు దేశీయత పునాది. 'నవ్య సంప్రదాయ' మన్న' దాన్ని ఇంగ్లీషు సాహిత్య చరిత్రలో ప్రసిద్ధమయిన 'నియోక్లాసిజం'గా అనువదించుకొని చాలా మంది అపోహలపాలయ్యారు. 'సంప్రదాయ'మని ఉండగా 'నవ్య సంప్రదాయ'మేమిటి? అన్నవా రున్నారు. ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి ఉంది. దేశాన్ని , దేశీయతను, దేశీయభావధారనూ, సంప్రదాయాన్నీ మన్నించకపోవటం, దూరం చేసుకోవటం ఎంత అనర్థదాయకమయిందో, దేశం, దేశీయుల అస్తిత్వానికే ఎంత ప్రమాదం తెచ్చిందో అదంతా ఈ దేశం ఈనాటికీ తన తప్పేమీ లేకుండానే అనుభవిస్తూ ఉంది. ఈ విధమయిన అనుభవం పాలయిగూడా దానికయిన వాస్తవిక కారణాలను వక్రీకరిస్తూ, జాతీయోద్యమాన్నీ స్వాతంత్ర్యోద్యమాన్ని నీరుగార్చే విధంగా వక్ర భాష్యాలు చేస్తూ తమను తాము ఇతరులనూ మభ్యపెడుతూ ఆరోపితాధునికతలో తలమున్కలయిన వివిధ వర్గాలు దేశీయ భావధారనూ, దేశీయతా భావననూ మూర్ఖంగా నిరసిస్తూనే ఉన్నాయి. ప్రధానంగా ఈ వర్గాలే దేశీయ సంప్రదాయాన్ని వ్యతిరేకిస్తున్నాయి. ఈ వర్గాలు రక రకాలుగా నిర్వహిస్తున్న దుష్ప్రచారంలో విపరీతంగా అప్రతిష్ఠ పాలుచేయబడింది 'సంప్రదాయ భావన'. సంప్రదాయమన్న దాన్ని అభివృద్ధి, అభ్యుదయ నిరోధకత్వానికి పర్యాయపదంగా వ్యాప్తిలోకి తెచ్చింది ఆ దుష్ ప్రచారం. ఈ వ్యతిరేక ప్రచారానికి పునాదిలో దేశీయతా విచ్ఛేదక లక్షణం బలంగా పనిచేస్తున్నదనేది స్పష్టంగానే గుర్తించవచ్చు. ఎందుకంటే, ఈ వర్గాలు ప్రచారం చేసే అంశాలు నిజానికి సంప్రదాయంకాదు. సంప్రదాయం ఘనీభవించిన, జడీభూతమయి చైతన్య రహితమయిన ప్రవృత్తి కాదు. యాంత్రిక ప్రసారం కాదు. కాగా ఎన్నో శాతాబ్దాల, తరాల రకరకాల అనుభవాలు, ఆలోచనల నుండి రూపుదిద్దుకున్న జీవన తాత్త్విక భూమిక మీద విస్తరించిన, పటిష్ఠమయిన సంస్కృతి సంప్రదాయాల మీద భిన్న తాత్త్విక ప్రవృత్తి దాడి చేసినప్పుడు సహజంగానే తీవ్రమయిన సంక్షోభం ఏర్పడుతుంది. అనేకమయిన

దేశీయ జీవన మూల్యాలు, విలువలు రకరకాల ఇబ్బందులకు లోనయి తాము ఈ సంక్లిష్ట పరిస్థితులను అధిగమించేందుకు దేశీయత తన మీద దాడి చేసే భావ జాలాల స్వరూప స్వభావాలను ఉపయోగితను కొత్తగా ఏర్పడ్డ పరిస్థితుల నేపథ్యంలో పునస్సమీక్ష చేస్తుంది. పూర్వం నుంచి మన్నించబడుతున్న దేశీయ జీవన మూల్యాలను అన్వేషించుకొని ప్రయోజన, ప్రాసంగికతల నిగ్గు తేలుస్తుంది. ఈ విధంగా అన్వేషణ, నిగ్గు తేల్చటం అనే భావన-ప్రక్రియ 'నవ్య సంప్రదాయం'గా ఆ విష్కృతమయింది. ఈ నవ్యసంప్రదాయానికి ఆవిష్కారకారకులయిన మాలపల్లి, వేయిపడగలు మొదలయిన అనేకానేక రచనలు విశ్లేషణాలతో నవ్య సంప్రదాయ స్వరూప స్వభావ నిరూపణ దాని బలమయిన అభివ్యాప్తి నిరూపించటం పలు వ్యాసాల్లో సాగించాను. ఈ విషయంగానే సుప్రసన్న, జి.వి. సుబ్రహ్మణ్యం, తుమ్మపూడి కోటేశ్వరరావు వంటి సహవ్రతుల కృషికి ఆ వ్యాసాల ద్వారా తోడు నడిచాను. అయినా నా దారి నా దారిగా గుర్తించవచ్చు.

అభ్యుదయ సాహిత్యం పేర అనేక ప్రయోజనాలు జరిగినాయిగాని అందులో మార్క్సిజం పునాదిగా సాగిన భాగం ప్రగతి వాదకవిత్వం మాత్రమే. అసలుకు అభ్యుదయ కవిత్వం లేదా సాహిత్యం మొత్తాన్ని, న్యాయానికి రెండు భాగాలుగా గుర్తించి ఒక భాగం ప్రయోగవాద కవిత్వం, సాహిత్యం అనీ, రెండవ భాగం ప్రగతివాద కవిత్వం, సాహిత్య విమర్శగా గుర్తించవలసి ఉంటుందని నిర్ధారించాను. ద్రియలిజం మొదలయిన ప్రయోగాలపరమయింది మొదటి భాగం కాగా, మార్క్సిజం పునాదితో సాగింది ప్రగతివాదం. ఇది స్పష్టమయిన విశ్లేషణగా సాహిత్య చరిత్ర నిర్మాణానికి సరయిన దారి చూపిస్తుంది. కాగా ఈ ప్రగతి వాద కవిత్వంపై తిరుగుబాటు సాగటానికి కారణం దేశీయతా భావన అని గూడా నా వ్యాసాల్లో నిరూపించాను. ఇది విశేషంగా నా పరిశీలన నిరూపణలలో గమనించవలసిన అంశం. ప్రయోగ-ప్రగతివాద విభాగాన్ని వెల్చేరు నారాయణరావు వంటి విమర్శకులు గుర్తించటం విశేషం. సాహిత్య చరిత్ర నిర్మాణానికి, ఉద్యమాల విశ్లేషణలకు ఉపయోకరమయిన ఈ ప్రతిపాదనల విషయం అట్లా ఉండగా -

వివిధమయిన ఆధునిక కావ్యాల వస్తు నిర్వహణలకు సంబంధించి సాగిన విశ్లేషణ నా కృషిలో గమనించ వలసిన మరొక ప్రత్యేకాంశం విద్వాన్ విశ్వం, 'పెన్నేటి పాట' ఆరుద్ర త్వమే Z వాహం, సి. నారాయణరెడ్డి 'కర్పూర వసంతరాయలు', నగ్నముని 'కొయ్యగుర్రం'

, విశ్వనాథ వెంకటేశ్వర్లు గారి 'కాళిందీ పరిణయం', మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి 'శివ పంచాశిక' మొదలయిన కావ్యాలనుగురించిన వ్యాసాలు దీనికి సంబంధించివి. ఇవన్నీ కావ్యాలు. ఒక్కొక్క దాని ప్రత్యేకత, సాఫల్య వైఫల్యాలు ఈ వ్యాసాల్లో నిరూపించటమయింది. ఒక్కొక్క కోణం నుంచి ఈ కావ్యాల శిల్ప విచారణ సాగగా, రామాయణ కల్పవృక్షం, యుద్ధకాండ శిల్పానుశీలనం' వివిధ కోణాల నుంచి శిల్పానుశీలనం చేయబడిన విస్తృత వ్యాసం. నిజానికి కల్పవృక్షం అన్ని కాండలను విడి విడిగానూ, కావ్యంగా ఏక మొత్తంగా పరిశీలించవలసిన తీరుకు ఒక కొత్తదారిని వెలుగులోకి తెచ్చిన వ్యాస మిది. తాత్త్వికాంశాలను కావ్య వస్తు విలీనం చేయటం మొదలుకొని పద్యరచన శిల్పందాకా కావ్యసౌందర్యానికీ, కావ్యానుభవానికీ వివిధాంశాలు ఏవిధంగా సహకరిస్తున్నా యనేది అనేకానేకమయిన ఉదాహరణలతో ప్రదర్శిస్తుందీ వ్యాసం. కాళిందీ పరిణయం, శివపంచాశికా వ్యాసాలుగా చిన్న యెత్తులో ఈ మార్గానికి చెందినవే. మరి, త్వమేవాహం, కొయ్యగుర్రం కావ్యాల్లో అవి విఫలం కావటానికి మూలమయిన శిల్ప లోపాల విచారణ గమనించదగింది, 'త్వమేZవాహం' కవిత్వం కావటం కన్నా 'సైన్సు' కావటానికి ప్రయత్నించటం కాగా, ప్రతీకల నిర్వహణలోని లోపం కొయ్యగుర్రం వైఫల్యానికి కారణమన్నది గుర్తించవలసిన అంశాలుగా వెలుగులోకి తీసుకురాబడినాయి.

వచన (కవిత) పద్య ప్రక్రియలో మహాకావ్య స్వరూపం ఎట్లా ఉండాలన్న ఆలోచన ఒక విశిష్టమయింది. కథా వస్తువును నిరాకరించిన వచన (కవిత) పద్య ప్రక్రియలో ప్రతీకల ద్వారా సాధించవలసిన ఏకవాక్యతా విషయం, అది సాధించటానికి అనుకూలమయిన విధానం ప్రతిపాదించబడిన వ్యాసం ఈ దారిలో కొత్త వెలుగుల్ని ప్రసరించింది. పెన్నా శివరామకృష్ణ రచించిన 'జీవనది' కావ్య పీఠికలో ఈ అంశం సోదాహరణంగా నిరూపితమయింది. కథ లేకపోవటం ఈనాడు కవికి ఒక సౌకర్యంగా అనిపించవచ్చు. కథ లేనప్పుడు కావ్యంలో భావపరంపరకు ప్రాధాన్యం. ఇక్కడ భావం రస భావాల్లోని భావం కాదు. (అయినా అంతగా ఫరవాలేదు) కవి అభిప్రాయమనే తాత్పర్యం. 'భావ కవే రభిప్రాయః', అన్నాడు ప్రాచీన లక్షణికుడు. కాగా ఈ భావాల బాహుళ్యానికి ఒక అనుస్యూతిని, ఏకసూత్రత, వాక్యత సాధించటం చాలా క్లిష్టమయిన వ్యవహారం. అనుస్యూతి-ఏకవాక్యత మహాకావ్యానికి మౌలికమయిన లక్షణం. ఈనాడు కవితలో కావ్యరచనలో

ప్రతీకల ప్రాధాన్యం కన్పిస్తున్నది. కాగా ఈ ప్రతీకలను ఏక వాక్యతానుగుణంగా నిర్వహించటం, అది పాఠకులకు సులభగ్రాహ్యం కావటం అవసరం. ఈ విధంగా కథా రహితంగా, ప్రతీకాత్మకంగా మహాకావ్య నిర్మాణానికి- 'నిర్మాణ' ప్రాధాన్యాన్ని నిరూపిస్తూ సాగిన మార్గదర్శనం ప్రత్యేకంగా గమనించదగింది.

**కన్యాశుల్కం మరోవైపు :**

గురజాడ 'కన్యాశుల్కం' గూర్చి ఆంధ్రప్రభలో నా వ్యాస పరంపర ఆ రూపకానికి సంబంధించి వస్తు నిర్వహణ, రసవిషయం, ప్రక్రియ రూపం గూర్చిన అనేక రచనా- శిల్ప లోపాలను విశ్లేషించింది. 'కన్యాశుల్కం' గురించి, దాని గొప్పదనాన్ని గూర్చి అది మోయలేనంత కీర్తి ప్రతిష్ఠల ప్రచార భారం దాని మీద మోపబడింది. దాన్ని విమర్శించటంలో, వివేచించటంలో సాహిత్యేతర విషయాలను తెచ్చి చెప్పి దాన్ని అతిశయోక్తులతో అత్యుక్తులతో మింటి కెత్తటం ఏండ్ల తరబడినా సాగుతున్నది. ఇదంతా ఒక వైపు కాగా, మరో వైపు పాఠకుల మనసు కెక్కేటట్లుగా వెలుగులోకి రానీయటం జరగలేదు. ఇది అచ్చంగా సాక్షికవిత్వమే. దాని మరో వైపును వెలుగులోకి స్పష్టంగా తీసుకువచ్చి, 'కన్యాశుల్కం' గూర్చి పునరాలోచించవలసిన అవసరం యొక్క తీవ్రతను పాఠకుల మనస్సులకు, బుద్ధికీ అందించింది ఈ వ్యాస పరంపర. 'కన్యాశుల్కం' రూపక రసప్రధానమయిన రచన కాదనీ, అది వస్తువు ప్రధానమయిన రచన అనీ, 'నాటకం'గా-ప్రక్రియా పరంగా రచనా విధానంలో అది విఫలమయిందనీ, వస్తు నిర్వహణలో క్రమ వికాసం కన్పించదనీ, అనేక సామాజిక సమస్యల్ని నెత్తినెత్తుకొని ఏ సమస్యనూ సరిగా నిర్వహించలేదనీ, పాత్ర చిత్రణలో సాఫల్య-వైఫల్యాలున్నాయనీ, రచయిత సహజంగా సాగవలసిన పాత్రలకు అనాలోచితంగా అసహత్వం కలిగించాడనీ, అయితే, ఆ రచనలోని ఆకర్షణ కథకు అంతగా ప్రధానం కాని 'మధురవాణి' పాత్ర చిత్రణ, సమర్థవంతమయిన సంభాషణలు, వ్యక్తి, వర్గమాండలికాల ప్రయోగం వంటివనీ, అది ప్రదర్శన యోగ్యం కాదనీ, సంవిధాన లోపాలు చాలా ఉన్నాయనీ అనేకమయిన ఉపపత్తులతో ఈ వ్యాస పరంపర నిరూపించింది. ఈ నిరూపణలో కన్యాశుల్కాన్ని అత్యంతంగా అభిమానించే వారి అనేక వ్యాఖ్యలను సాక్ష్యంగా చేసుకుంది.

అయితే, కన్యాశుల్క వివేచనకు ఇప్పటి కున్న విమర్శ ప్రమాణాలు సరిపోవని, కొత్త ప్రమాణాలతో వివేచించవలసి ఉంటుందన్న వాదం ఒకటి ఉందిగానీ, అది రచించబడి

తొంభైయేళ్లు దాటినా, అది విమర్శల కెక్కి ఇన్నేళ్లయినా ఆ కొత్త ప్రమాణా లేమిటో మాత్రం ఎక్కడా వ్యక్తమయిన జాడ కన్పించదు. అయితే కన్యాశుల్కం జీవితమంత విశాలమయింది-వంటి అత్యుక్తులకు మాత్రం కొదువలేదు. కాగా ఈ విధమయిన అనేకానేకమయిన అత్యుక్తులను నిరాకరిస్తూ సాగిన ఈ వ్యాస పరంపర ఆర్.ఎస్. సుదర్శనం, కాకరాల వంటి భిన్న వర్గాలకు చెందిన విమర్శకుల దాడులను ఎదుర్కోవలసి వచ్చింది. బేతవోలు రామబ్రహ్మం, ముదిగొండ వీరభద్రయ్య వంటివారి అనుకూల స్పందనలనూ అనుభవించవలసివచ్చింది. ఆ విధంగా ఆ వ్యాస పరంపరను ఈ విధమయిన ప్రతిస్పందన, అనుస్పందన వ్యాసాలను వాటిపై నా విశ్లేషణను ఏక మొత్తంగా వెలువరించిన ఇటీవలి గ్రంథం 'కన్యాశుల్కం-మరోవైపు'. కాగా-

ఇట్లా చెప్పవలసిన వివరింపవలసిన విషయాలు తక్కువేమీ కాదు. అయితే ఇది విమర్శరంగంలో నా కృషి స్వరూపాన్ని దిఙ్మాత్రంగా వక్తీకరించవలసిన సందర్భమే తప్ప మొత్తంగా విశ్లేషించి వర్గీకరణలతో ప్రదర్శించాల్సిన సందర్భం గాదు. అట్లాంటి పని ముదిగొండ వీరభద్రయ్య వంటి సహృదయ విమర్శకులు చేస్తే మరింత సమర్థంగా ఉంటుంది.

ప్రస్తుతానికి చివరగా ఒకటి రెండు అంశాలు మనవి చేసుకోవలసి ఉంది. విమర్శ విషయంగా వ్యక్తి, వర్గాలు, వాదాల వంటి వాటిని అధిగమించి రచనా పరంగా ప్రవర్తించటమే నేను ఎన్నుకొన్న విధానం. ఆ విధానం నుంచి ఏమాత్రం పక్కకు తొలగటం ఎప్పుడూ నాకు అభిమతం కాదు. మరొకటి, సాహిత్య విమర్శ రంగంలో ఎంతోమంది మహానుభావులు నా కన్నా పూర్వం సాగించిన కృషి అనంతం. నాకు సహమతులుగా సమకాలంలో విశిష్టమయిన కృషిచేస్తున్నవారు ఎందరో ఉన్నారు. అనేకంగా చదవటం, వినటం, చర్చించుకోవటం, మాట్లాడుకోవటం వంటి వివిధ రీతులలో ప్రభావాలూ, విషయతినియమాలు, స్ఫురణలు వంటి వాటికి అవకాశం తక్కువేమీ కాదు. అందువల్ల ఈ అంశాన్ని నేనే మొదట ప్రతిపాదించాను. కొత్తగా వ్యక్తీకరించాను అనటం అంత సమంజసంగా అన్పించకపోవచ్చుగాని, వ్యక్తీకరించిన అంశాలు అంతర్మథనం నుంచి వెలువడిన వన్నది మాత్రం గుర్తించదగింది. దాన్నే కొత్తగా, మొదటగా ఇత్యాదిగా వ్యక్తీకరించుకోవటం. తెలిసిందానికన్నా తెలియందీ ఇంకా తెలుసుకోవలసింది ఉన్నదనేది

నాకు నేను తెలుసుకొన్న విషయం. సాహసించటం వేరు, అహంకరించటం వేరు. మొదటిది కర్తవ్యం, రెండవది త్యాజ్యం.

విమర్శ మార్గాన ముందుకు సాగుతున్నప్పుడు అనేకమందితో పేచీలు పడవలసి వచ్చింది. వాదనలు, చర్చలూ చేయవలసివచ్చింది. దూషణలు అనుభవించవలసి వచ్చింది. అయితే ఇవన్నీ ఎప్పటికప్పుడు ఆలోచనలనూ, పునరాలోచనలనూ కలిగిస్తూ నా విమర్శ రీతీ విధానమూ పదునెక్కి, సమర్థంకావటం నా అనుభవంలోని వాస్తవం. అ దట్లా ఉంచి నా అభిప్రాయాలను, ఆలోచనలను మన్నించేవారే కాక తీవ్రంగా విభేదించేవారిలో అనేకులు వాటిని అధిగమించి నన్ను ఆత్మీయుడుగా భావించటం, నాకు వారు ఆత్మీయులు కావటం నాకు కలిగిన గొప్ప అదృష్టం. వీరందరి ఋణం తీర్చుకోరానిది. తీర్చుకోవటానికి ప్రయత్నం చేయవచ్చుగదా! అది ఇప్పటి దాకా మాదిరిగానే వ్యక్తి, సమాజ, దేశ శ్రేయస్కరమయిన రీతిలో సాహిత్యవిమర్శ నిర్వహించటమే ననుకొంటున్నాను.

ఈ నా అభివ్యక్తికి ఈ విధమయిన అవకాశం కలిగించిన జీవియస్ సాహితీ కళాపీఠం నిర్వాహకులకూ, ప్రత్యేకించి మిత్రులు జి.వి. సుబ్రహ్మణ్యం గారికీ కృతజ్ఞతలతో - ప్రస్తుతానికి సెలవు.

- o o o -

# ఆంధ్ర సాహిత్య విమర్శ

# నాప్రస్థానం : ప్రయోగం

కోవెల సుప్రసన్నాచార్య

సాహిత్య సృజనకూ విమర్శకూ నడుమ భేదం అంతగా లేదని నే ననుకుంటాను. అనుభూతి, అంతఃస్ఫురణ విశ్వచైతన్యంతో సమన్వయం పొంది - కల్పన భావనలనే ఒడ్డుల నడుమ ప్రవహించినప్పుడు కవిత్వము, నాటకము మొదలైన రూపాలుగానూ, విశ్లేషణ సామాన్యీకరణ (Generalization) అనే ఒడ్డుల నడుమ ప్రవహించినప్పుడు సాహిత్య విమర్శగానూ వ్యక్తమవుతుంది. రెంటి నడుమ అత్యధికమైన భేదం లేనే లేదు.

నా సాహిత్య సాధన ఆరంభంనుంచే విమర్శగానూ, కవిత్వంగానూ రెండుగా వెలువడుతూ వచ్చింది. 1954లో గోలకొండ పత్రికలో (మే) ఉదాహరణ కావ్యాలను గురించిన నా వ్యాసమూ, తెలుగు స్వతంత్రలో (ఏప్రియల్) నా వచన పద్యాలూ వచ్చాయి. ఇంకా కొంచెం వెనక్కుపోతే హైస్కూలు పత్రికలో యుగకర్త శ్రీనాథుడు కాదు పోతన్నయే అన్న వ్యాసం అచ్చయింది.

నా ముంగిట సరస్వతీదేవి కాలిమువ్వలు చిన్నచిన్న సవ్వడులు చేసే వేళలో నా జీవితం-మనోభూమిక రూపొందుతున్న దశయే చిదచిదీశ్వరులకు విశిష్టైక్యాన్ని ప్రతిపాదించే తత్త్వం-శూన్యవాదాన్ని మాయావాదాన్ని అంగీకరింపనీయలేదు. అట్లాగే భౌతిక వాదం క్రమ్ముకొంటూ కమ్యూనిస్టు ఉద్యమమై చుట్టూ వ్యాపించినా నన్ను దేహాత్మవాదాన్ని అంగీకరింపనీయలేదు. 'పాదోస్య విశ్వా భూతాని'- జగత్తుఈశ్వరుని లీలావిభూతి అన్నభావం తదభిన్నమనే నిశ్చయం జగన్మిథ్యా వాదానికి దూరంగా నిలువరించింది. అప్పటికి పూర్తిగా

తెలియకపోయినా ఆళ్వారుల దివ్యప్రబంధాలు మోక్షంకంటే ఈ లోకంలో నిత్యం ఈశ్వరభావనతో కైంకర్యంతో - భాగవత ప్రతిపత్తితో జీవించటమే ప్రధానమన్న తాత్పర్యాన్ని వెల్లడించటం కూడా మరొక ప్రధాన కారణం కావచ్చును.

ఈ సందర్భంలో నా జీవితంలోకి యిద్దరు మహాపురుషులు ప్రవేశించారు. శ్రీ అరవిందులు (1950లో) శరీరం చాలించిన ఆ వార్త - దాని వెనువెంటనే భారతిలో వారి తత్త్వాన్ని గురించి శ్రీ వేలూరి శివరామశాస్త్రి వ్రాసిన వ్యాసాలు ఈ లీలావిభూతిలోనికే ఈశ్వరుని రప్పించి, దీన్ని దివ్యముగా పరిణమింపజేయవలసిన అంశాన్ని ఒప్పించాయి. 1951లో వరంగల్లుకు ఆంధ్రసారస్వత పరిషత్ శాఖ వార్షికోత్సవాలకు వచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ చేసిన నాల్గైదు ఉపన్యాసాలు సాహిత్యపు మంత్రనగరిలోకి ప్రవేశింపజేశాయి. ఈ ఇద్దరితోబాటు దివ్యజ్ఞాన సమాజ ధోరణులను చేరువకు తెచ్చిన మా హెడ్మాస్టర్ శ్రీ వై.కె. శాస్త్రి, భారతీయ చరిత్ర చిత్ర శిల్పకళా తత్త్వమును వ్యాఖ్యానించిన ఇంగ్లీషు మాస్టర్ శ్రీ సోమేశ్వరరావు, శ్రీవిద్యా సంప్రదాయ గంధాన్ని ప్రసరింపజేసిన మా తెలుగు మాస్టర్ శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులు నాలో సమన్వయ మార్గాన్ని తీర్చిదిద్దారు.

అప్పుడునాకుతెలిసింది జీవితమంతా సాధనయే నని. సాహిత్యం కూడా జీవితంలో కొనసాగించే సాధనలో భాగమని. వ్యక్తమైన జగత్తు బహుముఖమైంది. వైవిధ్యం గలది. దీని అంతస్సులో ఏకత్వాన్ని దర్శించగలిగితే క్రమంగా దానితోడి తాదాత్మ్యం కలుగుతుంది. 'అచట కిన్నెరసాని నాయాత్మ యందు నిప్పటికి దాని సంగీతమే నదించు', 'ఆకులో ఆకునై పూవులో పూవునై' ఇత్యాది సన్నివేశాలలో ఆ అనుభవం మనకు కలుగుతుంది.

జీవితానికీ, సాహిత్యానికీ ఈ అనుబంధం నిశ్చయమైనప్పుడు మనకు సాహిత్య సాధన ఒక పరిపూర్ణతను (Fulfillment) కలిగిస్తుంది. అది తపస్సు అవుతుంది. తిక్కనకూ, విశ్వనాథకూ, త్యాగరాజుకూ వాళ్ళ సంగీత సాహిత్య కృషియే తపోద్రవ్యమయింది. సాహిత్య తపోవేళలో తాను పొందిన తాదాత్మ్యంవల్ల మనలో ప్రచేతస్సు మేల్కొంటుంది. కనిపించే వ్యక్తరూపం కాకుండా అంతర్నిహితంగా ఉండే తత్త్వం కూడా మనకు స్పష్టంగా దర్శనమిస్తుంది. అందుకే 'రహస్యంచ ప్రకాశంచ' అని వాల్మీకి చెప్పటం జరిగింది. సాహిత్య జగత్తు ఏకముఖం కాదనీ, 'ప్రకాశించే' వ్యక్తమయ్యే వాచ్యప్రస్తరం దాటితే అవ్యక్తమైన రహస్య జగత్తులు ఎన్నో ఉన్నాయనీ తాత్పర్యం. ప్రచేతస్సు మేల్కొన్నవాడు ప్రాచేతనుడు.

౧

'నీవు పయనించే నిర్జన కాంతారంలో! ప్రతీసవ్వడి సరస్వతి కాలి అందె మువ్వ! ప్రతి గుసగుసా చైతన్యమండల సమీక్ష! ఉలికి శిలాభాష - పక్షికి చెట్టు భాష! ప్రాణానికి ప్రకృతి భాష - గగనానికి దేవభాష! నిత్య పరిచితాలు! ద్యావాపృథ్వుల మధ్య ఆదిత్య కిరణాలు! రోజూ కల్పించేది నిత్య మహాకావ్యం' (శతాంకుర-81). కవి ప్రయాణం ఒంటరిగానే. నిర్జన కాంతారం. ప్రతి గుసగుసా పట్టుకోవలసిందే. చేతన జగత్తులోని ప్రతిస్వరంలోనూ పరిచయం ఉంటే తప్ప - సులభంగా యాతాయాతములు చేయగలిగితే తప్ప సృజన వ్యాపారం సాధ్యంకాదు.

కావ్యాధ్యయన సందర్భంలో ఆధునిక కాలంలో కవికీ, అతని వ్యక్తిత్వానికీ ప్రాధాన్యం లభించింది. చారిత్రక దృష్టి దీనికి కారణం. మరోవైపు కవిప్రయోగించే వస్తువు సమకాలంలో దాని సందర్భం కూడా ముఖ్య స్థానం పొందింది. కావ్యాన్ని అనుభవించే పాఠకుడికి ప్రాధాన్యం తొలిగి పోయింది. చేతనావర్తం భూమిక చివర నేను ఈ విషయమే ప్రధానంగా చెప్పడం జరిగింది.

'నేటి విమర్శలో ఉన్న ప్రధాన దోషం అది పాఠకుడి దగ్గర కాక కవి దగ్గర ప్రారంభిస్తుంది. దానివల్ల అనుభూతికన్న శిల్పం ప్రాధాన్యం వహించింది. అభివ్యక్తి కన్నా వ్యుత్పన్నతకు కిరీటం వచ్చింది. ఇంకనైనా సహృదయుడు ఆధారంగా మన విమర్శ పునర్నిర్మించవలసి ఉన్నది (1967).

ఇందువల్ల కవినీ, ఆతని అవ్యక్త వ్యక్త జగత్తులనూ పట్టించుకోవద్దని తాత్పర్యం కాదు. అనుభూతి మార్గం కావ్యం విలువను సరిగ్గా అంచనా వేయటానికి ఉపకరిస్తుంది. ఆ కొలత వల్ల దేశకాలాల వ్యక్తిత్వ పరిమితులు నిబంధించే పరిమితులు మనం దాటగలుగుతాము. కొంచెం ముందుకు సాగగా నాకు మళ్లీ ఇట్లా తోచింది -

'సాహిత్యానికి ఒక అంచు కవీ- వేరొక అంచు సహృదయుడూ. ఈ రెండు బిందువులూ ఒక చోటికి వచ్చినప్పుడు సహృదయ చక్ర మేర్పడుతుంది. సాహిత్యానుభవమంతా దీనిలో అంతర్భవించిందే. ఇదే సరస్వతీ తత్త్వము.' (సహృదయ చక్రము - భూమిక 1983). ఈ సమన్వయంవల్ల కవిసహృదయులు నడిమి సామరస్యమే అన్వేషింపదగిందిగా తోచింది. భావయిత్రీ శక్తి యిరువురిలోనా సమానమై కారయిత్రి వల్ల

రచయిత - కవి రూపొందుతున్నాడు. అనుభవం కవిలో మథనం జరిగి శబ్ద రూపం గ్రహించితే ఆ శబ్దం సహృదయునిలో అనుభవంగా రూపాంతరం చెందుతున్నది. ఇరువురిని అనుసంధించేది శబ్దమే అవుతున్నది.

ఇందువల్ల సృజన మూలాలను గురించిన విచారణ చేయవలసివచ్చింది. మనస్తత్త్వ శాస్త్ర సహాయం ఇందుకు తోడ్పడ్డది. 'పాట పాడినా, పద్యం కట్టినా, బొమ్మ గీచినా, విగ్రహం చెక్కినా ఒక పరవశమైన వేళలో దానిమూలం ఉంటున్నది. ఆ పారవశ్య క్షేత్రం నుంచి అంకురించి ఈ సృజనశక్తి వ్యక్త జగత్తులో రూపుదిద్దుకుంటున్నది. అవ్యక్తమూ-వ్యక్తమూ, జ్ఞాతమూ-అజ్ఞాతమూ, అనుభవమూ-ఆలోచనా, ఇవి సంగమించి కళారూపం ఆవిష్కృతమవుతున్నది.' (భావుక సీమ- పే. 25).

ఈ విచారణలో క్రింది దశలను వివేచించటం జరిగింది.

జ్ఞాత మనస్సులోని సంకల్పాలు, అనుభవాలు, పరిజ్ఞానం, నిశ్చయాలు ఇవన్నీ వ్యక్తి అనుభవం. ఒక పార్శ్వం. అతని వ్యుత్పన్నత, కేవలము దీనిలోని భాగమే.

జాగ్రదనుభవంలో లేని రూపాలు, సన్నివేశాలు, దృశ్యాలు రూపొందటం. అవచేతన దశలో జరుగుతుంది. ఈ అవచేతనకు సంధానం. వ్యష్టి జీవనానుభవమును స్పృశిస్తుంది ఆ రెండూ కలిసే చోట కళాసృజన జరుగుతుంది.

అవచేతనానుసంధానం

వ్యష్టిరేఖ ..................✕.................. సృజనబిందువు

ఈ సంగమ స్థానంలో ఒక వైలక్షణ్యం ఉన్నది. వ్యష్టి జీవన పరిమితులు తొలిగిపోయి, అవచేతనానుసంధానంతో కావ్య సృజనవేళలో కవి సుప్తచేతనను దాటి సమష్టి అవచేతన దాకా ప్రయాణిస్తాడు. క్రమంగా అతని చైతన్యం దేశకాలపరిమితులను దాటుతోంది. విశ్వ చైతన్యాన్ని గర్భీకరించుకుంటుంది. 'విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ చేసే భారతంబు' అన్న దశ అది. విష్ణు లక్షణం సర్వతోభివ్యాపకత్వాన్ని సూచిస్తుంది. దానివల్ల విశ్వజనీనత కలుగుతుంది.

ఈ స్థితివల్ల కవి వాచ్య జగత్తును దాటి నూతన అభివ్యక్తి లోకాల కవాటాలను తెరుస్తాడు. అతని రచనలోని అనుభూతిలోని సూక్ష్మ సూక్ష్మ లక్షణాలను చెప్పటానికి బహుధా వ్యక్తీకరణను లభింపజేయటానికి బింబాలు, అలంకారాలు. ప్రాగ్రూపాలు, అన్యాపదేశాలు చేరుకొంటాయి ఇదంతా అంతర్జగత్తులోనికి కవి ప్రవేశించిన గాఢలక్షణంవల్ల దాదాపుగా అప్రయత్నసిద్ధాంగానే జరుగుతుంది.

లోకభాష కావ్యభాషగా పరివర్తన పొందినప్పుడు శబ్దం తనపరిమితులను విస్తరించుకొంటూ పోతుంది. సంపూర్ణంగా రూపాంతరంచెందుతుంది.

సృజన మూలాలను ఇట్లా తరుముకుంటూ పోగా ప్రతీకల ప్రపంచం, బింబాల జగత్తు ప్రాగ్రూపా లలోకం ఇత్యాదులన్నీ సాక్షాత్కరించాయి. ఇదంతా జాగ్రత్ చైతన్య పరిధికి అతీతమైంది. యూంగ్ ఒక చోట ఇలా అన్నాడు. 'ఈ ప్రతీకల ఏకతను సాధించటం మనచైతన్య పరిధికి అతీతమైంది. సమిష్టి అవచేతనకు జాగ్రత్ చైతన్య భాష అవగతం కాదు. పురాతనమైన జగత్తునకు సంబంధించిన పోలికలుగల ప్రతీకల ఇంద్రజాలం అవసరం. అదే సుప్రచేతనతో అనుబంధించగలుగుతుంది. ప్రతీక ఒకవైపు సుప్రచేతన యొక్క ప్రాథమిక వ్యక్తీకరణము. మరొకవైపు ఉన్నతమైన స్ఫూర్తి యొక్క వ్యక్తీకరణము. రెండూ చైతన్యపు పుట్టువులే. (quoted from Lotus Fire by George Arundale p. 47).

జ్ఞాతజగత్తు ఒక అద్దం లాంటిది. అలౌకికమైన జ్ఞానంచేత ప్రకాశిస్తుంటుంది. అగ్నిస్పర్శగల బొగ్గులాంటిది అది. ఆ సృజనశక్తిచేత క్రీస్తు ఒకచోట సింహమై, మరొకచోట కుక్కయై, మరొకచోట కీటకమై, వేరొకచోట మహా మకరమై, గండశిలయై దర్శనమిస్తాడు. ప్రతీక దర్శన మహిమ అలాంటిది.

కావ్యం ఒక యవనిక వంటిది. ఈ యవనిక ప్రతీకలచేత బింబాలచేత నిండింది. ఈ యవనిక వెనుకాల అనుభవ జగత్తు ఉన్నది. ఎక్కడో ఒక కొన్ని చోట్ల తెరిపి ఉంటుంది. ఆ తెరిపిలోంచి మనం చూచేది ఈ అలౌకికానుభవ రేఖయే.

ఇంతటి విచారణ వల్ల అలంకారాల తత్త్వం ఆధునికంగా వ్యాఖ్యానించే వీలయింది. కావ్యగర్భంలోనికి ప్రవేశించే వీలుచిక్కింది. సాధారణంగా హేతువున కందని సన్నివేశాలను ఈ ఆలోచన ద్వారా విశదీకరించే అవకాశం కలిగింది.

కవి సృజన వ్యాపారాన్ని వెల్లడించిన సందర్భంలోనే కవి పొందే ఉదాత్త స్థితిని వర్ణించవలసి వచ్చినప్పుడు అది విశ్వ చైతన్యంతో అనుసంధానం పొందుతుంది అని చెప్పడం జరిగింది. విశ్వచైతన్యానుసంధానం వల్ల అతని అనుభవం, దానిఫలమైన కావ్యం విశ్వలయను గర్భీకరించుకుంటుంది అవశ్యంగా. 'సాక్షాత్తు' విశ్వలయ'ను అనుభూతిలోకి తేవడంలో సహృదయులకు యోగులతో సామ్యం ఉన్నది. యోగుల అనుభూతి సాక్షాత్తు 'విశ్వలయే' అయినా సహృదయానుభూతికూడా దానికి సమీపవర్తి అయిందే. ఈలయానుభవమే రసానుభవము. సర్వకవులూ, రసోపాసకులైన ఇతర కళోపాసకులూ ఈ దశలోనే పయనిస్తూ వున్నారు. వారి కళారూపాలలో సర్వజీవ హృదయాంతరాలలోని అంతర్వేదన భావరూపాన్ని పొందుతూ వున్నది' (చేతనావర్తం. భూమిక)

ఈ వివరణ తరువాత వేయి పడగలకు అన్వయించి దానిలోని ఈ లక్షణాలను వెల్లడించాను. 'విశ్వలయ' భావనకు నాల్గు దశలున్నాయి. మానవుడు తన అంతర్జగత్తులోని చైతన్య పరిధులతో అన్వయం కలిగించుకోవటం. ఒక విధంగా ఈ పనిని భావకవిత్వం కొంతవరకు నిర్వహించింది. మానవుడు తనకూ తన చుట్టూఉన్న కుటుంబము. సమాజముతోడి సామరస్యాన్ని సాధించటం. ఈ విషయంలో సంఘర్షణ మార్గంలో సాగినా కొంతలోకొంత ప్రగతివాద ఉద్యమం, ప్రజాస్వామ్య కవిత్వోద్యమాలు. జాతీయోద్యమము, సంస్కారోద్యమాలు నొక్కిచెప్పాయి. మూడవది ప్రకృతితోడి సమన్వయము. పారిశ్రామికీకరణంవల్ల, నాగరికత వల్ల ప్రకృతిలో సాన్నిహిత్యం కోల్పోయిన మానవుడు చిత్తశాంతిని కోల్పోయి కుంచించుకుపోయినాడు. ఈస్థితిగురించి ఉద్గమింపజేసేందుకు నొక్కిచెప్పిందే ప్రకృతి సామరస్య తత్త్వం. వేయిపడగలు నవల నవల అంతా ఈ లక్షణానికి కిరీటం పెట్టింది. నాల్గవదీ చివరిదీ అయిన సమన్వయం ఈ మూడింటిలోని ఏకసూత్రాన్ని గ్రహించి తన చైతన్యాన్ని దానికి అనుబంధం చేసుకొని జగత్తులోని ఏకాత్మభావంతో తనకు అనుసంధించుకోవటం.

ఈ విశ్వలయతో అనుబంధించుకున్న సాహిత్యం సార్వకాలీనమౌతుంది. సర్వజీవ హృదయాంతరాలలోని వేదనను వ్యక్తీకరించ గలుగుతుంది.

'ఏ మహారచన అయినా మూడు భూమికలలో సువ్యక్తమౌతుంది. రచయిత రచన వైలక్ష్యం ఒకటి, తత్కాల చైతన్యంలోని ప్రధానలక్షణాలన్నింటినీ ప్రస్ఫుటంచేయగల గాఢత్వం

రెండోది, మూడవది దేశకాలాలకు అతీతంగా మానవీయచైతన్య లక్షణాలను రూపుకట్టించే శక్తి. మొదటి లక్షణం ఆరచన జీవించటానికి, సహృదయలోకానికి ఒక చైతన్యం అందిచటానికి అవసరమయ్యేది. ఇది ఏ మహాగ్రంథానికైనా ప్రాథమిక లక్షణం. ఇది లేకుంటే అది తెరమరుగుకు పోకతప్పదు ఇహ రెండో అంశం. రచనను ఆ కాలానికి ప్రాతినిధ్యం వహించేదిగా నిలబెట్టుతోంది. కాలాన్ని స్ఫురింపజేయడంతో పాటు ఆ జాతి జనుల గత జీవన తత్వాన్ని సంప్రదాయాన్ని తనకాల చైతన్యంతో అణుసంధించి చూపడంవల్ల ఈ రచన ఆజాతి జనులకు శరణ్యమైన మరొకతీర్థంగా నిలిచిపోతుంది. (సహృదయుచక్రం-2).

**మహా గ్రంథం వెనుక నిలిచి ఉన్న ప్రాథమికాంశాలు**

1. కవి ప్రతిభా వ్యుత్పత్తులు - శిల్పనైపుణి
2. సమకాలీన చైతన్యము
3. సార్వకాలీనత

ఈ మూడింటితోపాటు వివేచింపదగిన మరొక మూడు వస్తు సంగతులు

1. మానవుని మౌలిక ఇంద్రియానుభవాలు
2. మానసిక, భావుక సంఘర్షణలు
3. సృష్టిలోని వైరుద్ధ్యాన్ని, వైచిత్రినీ, మానవశక్తికి అసాధ్యంగా నిలిచిఉన్న విధి - ప్రకృతి దైవీశక్తులు.

మహాగ్రంథం ఆవిష్కృతమైనప్పుడు సాహిత్యరంగంలో నూతన మూల్యాల ఆవిష్కరణ జరుగుతుంది. తాత్పర్యం ఉన్న మాదిరులు (Models ) తొలిగి పోతాయి. ప్రక్రియలు కొత్తరూపాన్ని సంతరించుకుంటాయి. భాష తన పరిమితిని సరిహద్దులను విస్తరించుకుంటుంది. నూతనాభివ్యక్తితో భాషస్వరూపం మార్చుకుంటుంది.

లోకంలోనుంచి అనుభవాన్ని, శబ్దసంపుటులను, విశిష్ట వ్యక్తిత్వాలను లెక్కలేనంతగా పీల్చి తనలో లీనంచేసుకుంటుంది. జాగ్రదవస్థలో కవి ఎరిగిన, ఉద్దేశించిన అంశాలకే వ్యాసం పరిమితం కాదు. కావ్యార్ధము వ్యక్తి చైతన్యాన్ని అతిక్రమించి రూపుకడుతుంది. సహృదయంలోని సమష్టి అవచేతనలోని సుమాక్ష్మాంశాలకు స్పందించే సౌకుమార్యం మీద

కావ్యార్థము వికసిస్తూ ఉంటుంది. అందువల్ల మహాగ్రంథం ఎప్పుడూ వర్తమానంలో అసందర్భం కాదు. ఏఏ కాలంలోనైనా ఆకాలపు సంవేదలను వ్యక్తం చేయటంలో అనంతమైన సామర్థ్యం కలిగివుంటుంది.

సృష్టిలోని వైరుద్ధ్యాన్ని వ్యక్తీకరించే లక్షణం ఉండడంవల్ల, ముక్తజీవనస్థితి దుఃఖరహితమైన, తత్పర్యవసాయి కాని ఆకారాన్ని వ్యక్తీకరించే లక్షణం గల వస్తువు లేకపోవటం వలన ఎంతటి మహాగ్రంథమైనా విషాదంలో కరుణలో పర్యవసించవలసిందే. కారుణ్యం అన్నింటికీ మూలద్రవ్యం. కోర గలిగితే, చేరగలిగితే చిత్తశాంతిని కట్టుకునే ప్రయత్నంచేయటం. విశ్వనాథ చెప్పిన జీవునివేదన ఇంతేనని నేను భావించాను. జీవుడు స్వస్థితినించి ఆనంద స్థితినించి తొలగి మళ్లీ దాన్ని పొందే దాకా లోలోపల చేసే మూలుగు అది - దాన్ని ప్రతిభతో మరొకదానితో ఏకీభవింపజేసే ప్రయత్నంలో నాకు సామంజస్యం గోచరించలేదు.

౨

సృజన మూలాల అన్వేషణలో నిమగ్నమైయుండగా కావ్యస్వరూపాన్ని గురించిన అవగాహన మరింత లోతుగా 'ఎరుక' లోనికి వచ్చింది. అలంకారశాస్త్రం కవి కర్మను కేవలం జ్ఞాత చైతన్య క్రియగానే గుర్తించినట్లు గోచరిస్తుంది. స్పష్టంగా చెప్పలేని అంశాలను ప్రతిభా శబ్దంచేత - అపూర్వ నిర్మాణ శక్తిగా పేర్కొన్నట్లు తెలియవస్తుంది. అంతఃకరణంలోని భిన్నభిన్న స్వరాలను గురించి విచారణ సాగలేదు. కాళిదాసు శాకుంతలంలో 'తచ్చేతసాస్మరతి నూన మబోధపూర్వం, భావస్థిరాణి జననాంతర సౌహృదాని' అని తెలిపి ఈ అబోధపూర్వమైన అంశాన్ని తెలిసివుండటం సూచించాడు. విశ్వనాథ 'శాకుంతలం యొక్క అభిజ్ఞానత'లో పంచమాంక విశిష్టతను గురించి చెప్పే సందర్భంలో మనస్తత్త్వ శాస్త్ర పరిజ్ఞానంతో - చైతన్యంలోని అంతస్తుల యొక్క ఉనికిని వ్యాఖ్యానించారు.

రససిద్ధాంతం యొక్క మూలాలు మరోలోకంలోనివే. ఆధునిక విద్వాంసులు ఆ సిద్ధాంతాన్ని మనస్తత్త్వశాస్త్రపు వెలుగులో పరీక్షించటం ప్రారంభమయింది. కావ్యం నిర్మాణమయ్యే స్థితి మనోలోకపు వ్యక్తావ్యక్త చైతన్యాల సంధిబిందువు మీద జరుగుతున్నది. పూర్తిగా అవ్యక్తమే అయితే అది పిచ్చివాని ఆలాపనే అవుతుంది. కేవలం వ్యక్తమే అయితే

వాచ్యమై, ఆలోచనయై, శాస్త్రమైపోతుంది. కావ్యం వికాస క్రమాన్ని ఈ విధంగా భావన చేయవచ్చు.

అనుభవము

| | | |
|---|---|---|
| ప్రాగ్రూపాలు | - | భావచిత్రాలు |
| ప్రతీకలు | - | బింబాలు (Images) |
| అన్యాపదేశము | - | అలంకారాలు |

రెండు వరుసలను స్థూలంగా పరిశీలిస్తే ఒకటి అశబ్దాంశంగానూ రెండవది శబ్దం సమకూర్చుకునే క్రమంగానూ గోచరమవుతుంది. (ప్రాచీనుల విచారణలో అన్యాపదేశ రచనలు ఉన్నాయి. దాన్ని విచారించిన ధోరణీ ఉన్నది.) అనుభవాన్ని పొందిన దశలో అది ఒక స్వప్నం వంటిదశ. అది రూపం పొందే క్రమంలో భావచిత్రాలై, బింబరూపాన్ని పొందటం జరుగుతోంది. ఈ బింబములు బావశబలతను శక్తిమంతంగా, అపూర్వంగా అభివ్యక్తం చేసే ప్రయత్నంలో అవ్యక్త జగత్తు అనుసంధించే ఇంద్రియార్థాల సమాకలనం ఉపమారూపకాదులన్నీ దీనిలో అంతర్భవించేవే.

వస్తువిచారణకు వస్తే సమష్టి అవచేతనలో నిహితమైన ప్రాచీనతకు మూలాలైన అనుభవాల సంపుటి ప్రాగ్రూపం. అది అసంకల్పితంగానే రచనల్లోకి దారి తీసుకుంటున్నది. ఈ విశ్లేషణవల్ల పురాగాథలకు (Myths) అన్వయం కుదురుతున్నది. కేవలం హేతురహితములైన కట్టుకథలుగా వ్యాఖ్యానించుకునే పురాగాథలు ప్రాగ్రూపవిజ్ఞానంతో అన్వయం అవడం మొదలైంది.

కావ్యం నిండా ఒక బింబం అంతర్గతంగా పరచుకుని ఉన్నప్పుడు ఒక భావానికో, తత్త్వానికో, ప్రవృత్తికో ప్రాతినిధ్యం వహించినప్పుడు ప్రతీక నిర్మితమవుతున్నది. ఇదీ పురా సంస్కారాల సంపుటి బలం మీదనే అసంకల్పితంగానే ఏర్పడుతుంది. అన్యాపదేశ రచనలో వ్యక్తి మనస్సు యొక్క పాత్ర ఉండనే ఉన్నది. ప్రబోధ చంద్రోదయాది కావ్యాలు ఈ త్రోవలోనుంచి వెలువడ్డవే.

ఈ విధమైన విచారణవల్ల కావ్య వివేచనలో నూతన మార్గాలు ఏర్పడుతున్నాయి.

వేదార్థ విచారణలో యాస్కుడు వేదాన్ని మూడు అంతస్తులలో అర్థంచేసుకోవాలని స్పష్టంగా చెప్పాడు. అధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికములైన మూడన్తరాలలో వేదార్థాన్ని వ్యాఖ్యానించవలసి ఉన్నది. ఆధిదైవికార్థాన్ని ప్రధానంగా సాయణుడు వ్యాఖ్యానించాడు. అక్కడ యజ్ఞయాగములు, ఆచారవ్యవహారములు మాత్రమే తెలువబడ్డాయి.

వైదిక భాషను సమాధి భాష రహస్య భాష అని అన్నారు. పైపొరల్లో కనిపించే కావ్యవస్తువును గురించి మాత్రమే కాకండా లోతుల్లోనికి వెళ్ళి విచారణ సాగించటం ఈ ధోరణి.

వేదముల ఉద్గమాన్ని గురించి చెప్పినప్పుడు మహర్షులు వేదవాక్కును సమాధిస్థితిలో దర్శించేవారనీ, ఆ వాక్కు శ్రుతమయ్యేదనీ చెప్పిన సందర్భంలో ఆ వివేచన అంతా మనోలోకపు తెలివిడితో చేసినారని తోస్తున్నది. వేదార్థాన్ని నిర్ణయించే సందర్భంలో అనేకపొరలలో దానిని తెలుసుకునే ప్రయత్నం చేయటం యిందుకు ఉదాహరణం. కవి రచనావేళలో ఉండే స్థితి బాహ్య ప్రపంచంతో సంబంధంలేని దశ. ఒక రకంగా మేల్కొని స్వప్నాన్ని కంటున్నదశ. మరోలోకపు రహస్య స్తరాలలోనుంచి అననుభూతములైన అంశాలను ఆహ్వానించే స్థితి అది.

వేదార్థ విచారణ చేసిన సందర్భంలో ఈ 'రహస్యమయ వాక్' లక్షణాన్ని జాగ్రత్తగా విశ్లేషణ చేయడం జరిగింది. 'చత్వారిశృంగాస్త్రయో అస్యపాదాః' అనే శ్రుతిని మీమాంసకులు, స్ఫోట వాదులు వేరు వేరుగా అన్వయించుకున్నారు. అట్లాగే 'ఉగావా అశ్వస్య మేధ్యస్యశిరః' అని అశ్వమేధాన్ని ఉపనిషత్తు వ్యాఖ్యానించింది ప్రజాపతి - స ఆత్మనోవపాముచ్చినత్ అన్న శ్రుతి తాత్పర్యాన్ని బహుముఖంగా తెలియజేసింది. వేదార్థాన్ని - ప్రతీకార్థంతో నిమిత్తం లేకుండా అన్వయించి అపమార్గంలో ప్రయాణించారు.

వేదవ్యాసుని దాకా ఈ వేదార్థ వ్యాఖ్యానక్రమం సజీవంగా ఉన్నట్లు గోచరిస్తుంది. తరువాత ఈమార్గం మూతబడ్డట్లుగా ఉంది. వ్యాసుణ్ణి 'రహస్యవేదవాన్' అని వర్ణించటమే కాకుండా భారతంనిండా గ్రంథగ్రంథులు నిక్షేపించినట్లు సంప్రదాయం పేర్కొంటున్నది. భారత భాగవతాలలో సంకేతరూపంలో అనేక ఘట్టాలలో రచన కొనసాగింది. మరుగున బడ్డ ఈ సంప్రదాయం - ఆధునిక మన శాస్త్ర పరిజ్ఞానం వల్ల ఏర్పడిన కొత్తదారులు

'ఎరుక' లోనికి రావటంవలన, మళ్లీ మేల్కొన్నది. నేను నడచిన త్రోవలలో ప్రాగ్రూపదృక్పథం ఎంతగా కొత్త వైశద్యం కలిగించిందో, ఈ రహస్య కథన సంప్రదాయం కూడా అంతే వైశద్యం కలిగించింది.

నేను పరిశోధనకు పూనుకున్నప్పుడు రహస్య కథనంపట్ల అభినివేశం కలిగింది. (1959-61) అప్పుడే నాకు శ్రీ అరవిందుల 'సావిత్రి' తో పరిచయం ఏర్పడ్డది. దాన్ని ఆయన 'సావిత్రి, గాథ - ప్రతీక' అని పేరుపెట్టారు. పేరులోనే రెండంతస్తులలో స్ఫుట రూపంగల స్థితి నాకు గోచరించింది. వ్యాసగాథలో కేవలం సూచ్యార్థసూచకం వలె అస్ఫుట స్థగితంగా ఉన్న ఈ గాథలోని రహస్యాన్ని తమ ఇతిహాసంలో విస్తృతంగా వ్యాఖ్యానించారు. మహాయోగి శ్రీ అరవిందులు.

నేను వసుచరిత్రకు అర్థంచేసుకునే ప్రయత్నంలో ఆకావ్యం నాకు మూడంతస్తులలో వ్యక్తమయింది. మహాభారతం చెప్పిన ఉపరిచర వసువృత్తాంతముపై పొందింది. ఋగ్వేదం వర్ణించిన వృత్తగాథ రెండవఅంతస్తు. మూడవది మబ్బులలో దాగి ఉన్న వర్షజలం భూమి మీదకు ప్రసరించడం. త్రవ్వుకొంటూపోగా రచనా శిల్పం-కావ్యనిర్మాణం ఈ ఎరుకతోడనే జరిగినట్లు నాకు ఋజువులు దానిలోనే దొరికాయి. ఇందుకోసమే కవి బహ్వర్థ సంధాయక మైన శైలిని స్వీకరించటం జరిగింది. ఈ కావ్యగర్భంలోనికి ప్రవేశిస్తే వెల్లడి అయిన అంశాలు తరువాత తరువాత సా సాహిత్య విమర్శ ప్రస్థానంలో ఎంతగానో తోడ్పడ్డాయి.

1. కవి అవలంబించిన అభివ్యక్తి వ్యూహం బహ్వర్థ సంధాయకమైనవి.

2. వసురాజునకూ ఇంద్రునకు అభేదాన్ని స్పష్టీకరిస్తూ కావ్యంనిండా పరచుకొని ఉన్న వసురాజునకు సంబంధించిన విశేషణాలు, సంబోధనలు - మూడవ ఆశ్వాసం తొలుత ఇరువురికీ అన్వయించేవిధంగా ఎనిమిది విశేషణాలు కలిగిన సీసపద్యం.

3. కథా నిర్వహణలో అధిక భాగం ప్రకృతి ఒడిలో, నదీపర్వతాల నడుమ సంభవించటం.

4. ఈ గాథ పూర్వలక్షణాన్ని ఋగ్వేదంలో ఇంద్ర స్తుతులలో వర్ణించటం.

ఈ విస్తృతమైన వ్యాఖ్యానం తెలుగు కావ్య ప్రపంచంలో నూతనమైన త్రోవలు తీసింది. పరిశోధన వ్యాసం 1959-61లోదే అయినా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి

ప్రచుర ప్రకాశనము 1967లో వెలువడే దాకా ఈ వ్యాఖ్యానం ఎక్కువ మందికి అందుబాటులోనికి రాలేదు.

తరువాత మహాభారతంలోని గరుడోపాఖ్యానంలో, రుక్మిణీ కళ్యాణం (తెలుగు భాగవతంలో, 'వేయి పడగలు' లో ఈ రహస్య కథన సంప్రదాయం అన్వితమయింది. 'ప్రతీకాత్మకమైన ఈ రహస్య కథనంలోని ఆంతర్యం అంతా కథన వేళలో రచయిత వ్యక్తావ్యక్తమనోలోకాలలో వల్గనంచేస్తూ ఉంటుంది. వ్యక్త మనస్సుతో చేసిన ప్రయత్నంలో నిగూఢార్థానికే తప్ప ప్రకాశార్థానికి ప్రయోజణంకానీ ప్రాధాన్యంకానీ వుండదు. అలాంటి రచనలు ప్రబోధ చంద్రోదయం, సంకల్ప సూర్యోదయాలు. ఈ గ్రంథాలలో ప్రకాశార్థానికి ప్రయోజనం ఉండక పోవడం వలన నిగూఢార్థం స్ఫుటంకాక తప్పదు. ఒక పొడుపుకథ లాంటి దీ రచన. రహస్య కథనవిద్య దీనికి భిన్నమైంది. కథన వేళలో రచయిత వ్యక్తావ్యక్త చేతలలోనుండియేకాక సామూహిక అవ్యక్తచేతనలోన్నది కూడ దీనికి మూలమవుతుంది. వాసనా రూపంగా నిక్షిప్తములైన సంస్కారాలు రచయితకు తెలియకుండానే తన జాతీయ సంస్కారాల ముద్రలను తనను అపరిచితములైన వాటిని గూడా తన రచన ద్వారా ప్రకాశింపజేస్తాడు.' (సహృదయ చక్రము - 53, 54) ఈ వివరణలో రెండంశాలు ప్రస్ఫుటమవుతున్నవి. వ్యక్త మనస్సుతో సంకత్పంతో రచించే రచన అన్యాపదేశం (అలిగొరి). దీనిలో వాచ్యమైన వృత్తాంతానికి బలం ఉండదు. కేవలం ఆచ్ఛాదనగానే అది పనికి వస్తుంది. రహస్య కథనం మాత్రం సంకల్ప విరహితమైంది. అవ్యక్త మనః క్షేత్రం నుంచి మాత్రమే కాక సమష్టి అవచేతనలో నుంచి కూడా నిక్షిప్తములైన సంస్కారాలు ఇందులో వ్యక్త మౌతవి. చాలా సందర్భాలలో రచయితకు ఈ రహస్యార్థాల అవగాహన ఉండకపోవచ్చును.

ఈవిధానంలో పరిశీలించినప్పుడు గరుడోపాఖ్యానం రహస్య గర్భితమైంది. పక్షులు, పాములు పాండవ కౌరవులకు ప్రతీకలైనాయి. కర్ణుడు అసూరుడైనారు. ఈ ఉపాఖ్యానాన్ని చూచినప్పుడు ప్రతీకాత్మకంగా దేవాసుర శక్తులను పక్షులూ, పాములూ ప్రాతినిధ్యం వహించటం గమనించవచ్చును. మహాభారతకథను సూక్ష్మమైన ప్రాగ్రూపంగా కూడా దీన్ని భావన చేయవచ్చును. ఈ విచారణలో తిరుగులేని అనేకములైన సామ్యలక్షణాలు ఆవిష్కృతాలయినాయి. అయితే ఈ ఉపాఖ్యానానికి యాజ్ఞికమైన తాత్త్వికమైన అన్వయం కూడా ఉన్నది.

ఈ మార్గంలో ఇంకా పరిశీలిస్తూ పోవచ్చును. తిక్కనగారి హరిహరనాథోపాసనము పైనా సగుణ బ్రహ్మోపాసనంగా కానవచ్చినా వాస్తవానికి అది యోగసాధనము. ఆ స్వామి తాను అంతర్యాగవరోపాకణరూపము. హరిహరనాథ సాక్షాత్కారం వర్ణించేపద్యం కుండలినీవిర్యారహస్యాన్ని సూచిస్తున్నది. రూపం నుండి అరూపానికి చేరే సాధనంగా రూపుకడుతున్నది. 'విశ్వనాథ మధ్యాక్కఱ'లలో హరిహరనాథ తత్త్వము ఒకరూపం మీద మరొక రూపాన్ని ఆరోపిస్తూ రెంటినీ చెదరగొట్టి నిర్గుణధ్యానం చేసుకోనటానికి ఏర్పరుచుకున్న పద్ధతిగా కానవచ్చింది.

పోతన భాగవతంలో రుక్మిణీ కల్యాణంలో దేవీ ఉపాసనా తత్త్వం నిగూఢంగా ఉన్నది. ఈ గాథలో రుక్మిణీదేవి బాలాత్రిపురసుందరి. నిత్యకల్యాణశీలగా ధ్యానింపబడు తున్నది. రచనలో ఐదుచోట్ల 'బాలా' శబ్దము పోతన ప్రయోగించారు. ఉపాఖ్యానారంభం ఖగనాథ శబ్దం చేత జరిగింది. ఈ ఖగనాథుడు వేదాదిషష్ఠాత. ప్రాణాది పంచనాథపతియైన ఒక వ్యూహ విశేషం ఈ ఖగ లక్షణము చేతనే ఆమె సుధ అయినది. శ్రీకృష్ణునికొరకు వాడిన మరొక విశేషణము చక్రి అన్నది. అది షట్చక్ర సంచార శీలుడైన సాధకుని తెలియజేస్తున్నది. పోతన్నగారు 'గోపాలసుందరీ' మంత్రోపాసనం చేసినట్లు శ్రీనోరి నరసింహ శాస్త్రి 'కవిద్వయం'లో పేర్కొన్నారు. ఈ మంత్రం శ్రీకృష్ణ దశాక్షరి, పంచదశి మంత్రముల సంయోగముగా రూపొందుచున్నది.

ఇలాంటి అన్వయం వేయిపడగలు నవల విషయంలోను చేయడం జరిగింది. ఐతే ఈ రహస్య కథన సంప్రదాయం ప్రధానమైన వాచ్యమైన వృత్తాంతాన్ని భంగించదు. అలా భంగింపజేసే లక్షణం కేవలం అన్యాపదేశ రచనల్లోనే ఉంటుంది. ఈ విధమైన విలక్షణమైన వ్యాఖ్యానికి కవి ప్రయోగించిన శబ్దమే ప్రధానం. 'ఇంత అర్థము గాలిలో పుట్టదు'. 'మహాకవేః కావ్యగతాశ్చ శబ్దాః కేచిత కథాః మర్మభిదో భవంతి' అన్నది సత్యం. శబ్దస్వరూప అవతారంగా త్రవ్వుకుంటూ పోవటమన్నది ఈత్రోవకు ప్రధాన దోహదం. ఈ అన్వేషణలో ప్రాచీనాధుం నాతన సాహిత్యాలని విభజించుకోనక్కరలేదు. కవిచైతన్యం పురాగాథాకల్పన దశలోనికి ప్రవేశించగలిగి ఉండాలి. రచన రూపొందే అవ్యక్త స్వప్న ప్రాయ దశలో.

శబ్దం - మంత్రమయమైంది- వేదం ఎక్కడ నుండి పుడుతున్నది. అంటే శ్రుతియే 'సదనాత్ ఋతస్య' అని చెప్పింది. ఋతసదనం నుంచి ఈ ఋతం సామాన్యమైన

సత్యం కాదు. సమష్టి చైతన్య మూల స్థానం. సర్వమూ దిక్కాల రహితంగా అక్కడ అకలంకంగా ప్రకాశిస్తూ ఉంటుంది. జాగ్రద్దశలో నిద్రించి ఆ స్థితిలో మేల్కొన్న కవిలోకి ఆ వాక్కు ఆవిష్కృతమౌతుంది.

గురజాడ అప్పారావు పూర్ణమ్మ కథలో హిరణ్యవర్ణమైన శ్రీదేవి తత్త్వం ఉన్నదని నిజమైన గురజాడ చైతన్యం (సాధన, 1991) అన్న వ్యాసంలో నిరూపించడం జరిగింది. బంగారు దుర్గమ్మ అన్నచోట ఆమె హైరణ్యచ్ఛవినే గాక 'పూర్ణమ్మ' లో శబ్దంచేత పరదేవతా లక్షణాన్ని వ్యక్తం చేయటం జరిగింది. కొండలు, కోన , కొలను అన్న మూడు ఆవరణలు దాటితేనే కోవెల. ఆ దుర్గ సప్తశతిలో మూడు అవతారాలు ఎత్తింది. ఆ ఖండకావ్యం చివర 'కన్నుల కాంతులు' అన్న పద్యం పంచీకరణాన్ని ప్రస్తావించి, చివరకు పూర్ణమేవావ వశిష్యతే' అన్న ఋగర్థాన్ని వ్యాఖ్యానించింది.

రహస్య కథన సంప్రదాయం మీద జరిగిన పరిశీలన ఒక ఎత్తయితే ప్రాగ్రూప వివేచనం- దాన్ని భారతీయ సాహిత్యానికి అన్వయించడం మరొక ఎత్తు. మహాభారతంలోని స్వర్గారోహణ పర్వంలోని అంశం, ఖురాన్‌లోని అంశంలోని సామ్యాన్ని ఎత్తిచూపినప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ప్రాకృతులలోని ఏకమూలాన్ని దర్శించడమైంది. సూర్యోదయ గాథలలోను ఈ ప్రాక్కథాసామ్యం గోచరిస్తున్నది. అనుకూల వ్యతిరేక ప్రాగ్రూపాలు జయవిజయుల శాపగాథలో గోచరిస్తాయి. మాలపల్లిలో మహాభారతంలో సన్నివేశాల ప్రతిఫలనం ఈ ప్రాగ్రూప తత్త్వాన్ని ప్రకాశింపచేసింది. పురాణ శైవ గ్రంథమాలలోని జయద్రథుడు భగవద్విరోధ భావాన్ని ప్రకటించే ఆదిమమైన సైతాన్ ప్రాగ్రూపంగా గల వ్యక్తి. 'ఏకవీ..'లో రేణుకాదేవి కథ యొక్క ప్రతిఫలనం చూడవచ్చును. ఆమె ఛిన్నమస్తాదేవి. తెలుగు నవలల్లో - కాల్పనికోద్యమకాలంలో- సమాజనీతికి ప్రణయానికి నలిగిపోయిన నాయికలందరు రేణుకాదేవి ప్రాగ్రూప ప్రతిఫలనాలే. ఛిన్నమస్తలే.

ప్రాగ్రూపముల ఉత్పత్తి స్థానం 'సైకి' అంటే 'చిత్'. కల్పవృక్షంలోనూ ఈ ప్రాగ్రూపతత్త్వం నిబిడంగా ఉన్నది. అరణ్యకాండలో ఆదిమతమోవర్ణనంలో ఈ గాఢత్వం కానవస్తుంది. అది సీతాపహరణ వేళ. 'ఆపగాభమైన ఆదిమాసురశక్తి పెద్ద త్రవ్వి లక పెట్టినట్లు'న్నది.

విశ్వామిత్రుడు 'మేనక' సంసర్గం తరువాత అంటాడు 'అసలు కోకిల యేమో నాకర్థమయ్యే'నని. ఈ కోకిల సృష్టిలోని మూలమైన కామప్రతీక 'అనిమ' లేదా ఈక మానవుడు తనలో చీల్చుకుంటూ వెళ్లుతూ తన స్త్రీ భావ రూపకందాన్ని వెదుక్కుంటూ పోవడం, దానివలననే దాని స్వరూపాన్ని అవలోకించడం వల్ల ఒక రకమైన విడుదల కలుగుతుంది (liberation). ఈ అసలు కోకిల తెలియడం లంటే సృష్టి మూలమైన 'అనిమ'ను గుర్తించడమన్నమాట. ఈ గుర్తింపు వల్ల కామవిజయం సాధ్యమవుతుంది. (పు 77,78 విశ్వనాథమార్గము). ఈ కోకిల వేలయేండ్లుగా భారతీయ సాహిత్యంలో వాల్మీకి ప్రతీక. 'కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలం' అన్నది ప్రసిద్ధి. ఇక్కడ వాల్మీకి సృజనమూలం.

కొంచెం భారతీయ దృక్పథంతో పరిశీలించినప్పుడు మాండూక్యం వివేచించిన అవస్థాత్రయం జాగ్రత్ స్వప్నసుషుప్తులు చైతన్యదశలోకి మూడు భూమికలలో సంవదిస్తున్నది. సమష్టి అవచేతన కూడా సుభూమికలోనిదే అవుతుంది. తురీయావస్థ లక్షణం మనశ్శాస్త్రం యింకా స్పృశించలేదు. శ్రీ అరవిందులు ప్రకటించిన ఉన్నత మనో భూమికలను కూడా గుర్తించవలసి ఉన్నది.

ఈ వివేచన వల్ల కేవలం మస్తువును ఆధారంగా చేసుకొని చేసిన విమర్శ ధోరణి యొక్క బలహీనత బయటపడింది. మనోలోకపు కవాటాలను తెరిస్తే కావ్యగర్భంలోనికి ప్రవేశించటం సాధ్యంకాదనీ మౌలిక తత్త్వం అవగాహనకు రాదనీ విస్ఫుటం అయింది. వస్తు నవ్యత కంటే భావగాఢత విశ్వజనీనత ముఖ్యాంశాలని తేలిపోయింది. 'ఏ స్థితిలో సృజనాత్మక స్థితిలో తాను విశ్వచైతన్యంతో తన చైతన్యాన్ని అనుసంధించగలగటం సాధ్యమో- భాష, దేశం, జాతి మానవతా పరిధులను దాటి విశ్వచైతన్యంలో ఐక్యభావం పొందుతారో- అప్పుడే 'విశ్వలయ' అతని రచనలోనికి జలపాతంలాగానో, ఉప్పొంగే ఊటలాగానో అవతరణనో ఉద్గమాన్నో పొందుతుంది (విశ్వనాథ మార్గము పు 75)

3

ప్రక్రియా పరంగా చూచినప్పుడు ఇతిహాసం అతిప్రాచీనమైంది. భారత రామాయణాలను మనవాళ్ళు ఇతిహాసాలుగా పేర్కొన్నారు. ఈ ఇతిహాస రచన విశ్వచైతన్య

సంధానంగల మహారచయిత మాత్రమే నిర్వహింపగల ప్రక్రియావిశేషం. నిస్సందేహంగా మహాగ్రంథం.

మన విమర్శకుల్లో తమనాటి కాలంలోని ఇతిహాసాల ప్రసక్తి రాదు. ఆధునిక యుగంలో భారతీయ సాహిత్యంలో మహోన్నతమైన 'సావిత్రి' ఇతిహాసం వచ్చింది. సృష్ట్యారంభంనుంచీ ఈనాటి దాకా వచ్చిన జీవన పరిణామాన్నీ దాని భవిష్యద్దశనూ వర్ణించింది. తెలుగు సాహిత్యంలో ఆధునిక కాలంలో వెలువడ్డ ఇతిహాసాలు మాలపల్లి, వేయిపడగలు, శ్రీమద్రామాయణ కల్పవృక్షము.

మాలపల్లి మానవుడు ఉన్నత దిశలో అందుకొనే పరిణామమును స్పష్టంగా సూచించింది. రామదాసు తాను జీవన్ముక్తుడైనాడు. మహాభారతంలోని యుధిష్ఠిరునివంటి పాత్ర ఆయనది. సమాజ పరిణామంలోని వివిధ స్రోతస్సులను తనలో గర్భీకరించుకుని ఈ ఇతిహాసం జీవద్గ్రంథం అయింది.

వేయిపడగలు సమాజంలో కొత్త నాగరకత యొక్క పొంగులో ఆత్మలక్షణాన్ని కోల్పోతూ ఉన్న భారతీయ గ్రామీణ వ్యవస్థను చిత్రించింది. పరివర్తితం అయ్యే దశలో 'అస్మిత'ను కోల్పోయే దశలోని జాతి మూలుగులు ఇందులో వినిపిస్తవి. ఈ నవలలోని ప్రకృతి చైతన్యం పాత్రధారణ చేసింది. కథలో దివ్యాదివ్యతలు, వ్యక్తి అంతర్బహిర్జగత్తులు, చరాచరచైతన్యస్తరము, సమాజంలోని అల్లకల్లోలం నాల్గంశాలు విస్తృతంగా చిత్రింపబడ్డాయి.

-కల్పవృక్షంలో ఆధునిక కాల చైతన్యం పురాణగాథలోనికి ప్రవర్తించింది. సార్వజనీన మానవీయ సంవేదనలు సుస్పష్టంగా ప్రతిఫలించాయి. సృష్టితత్త్వం వ్యాఖ్యానం అయింది. జీవులందరిలోనూ నిగూఢమై యున్న దైవీ చైతన్యతేజస్సు వ్యక్తమైంది. సృష్టి ఉన్మేషనిమేషలకు కారణమైన దైవాసుర సంపద వాటి నడిమి సంఘర్షణ కేంద్రబిందువైంది. దీనిలోని పాత్రలు పురాతన కాలంనుంచి తరలివచ్చి సార్వకాలీనతను సంతరించుకున్నాయి.

ఇతిహాసంలో అనంతకాలం హ్రస్వీభూతమై కానవస్తుంది. మానవీయ చైతన్య వికాసమూ, సృష్టి పరిణామమూ వెల్లడి అవుతాయి. మాలపల్లిలో భూస్వాములు, ప్రభుత్వ వ్యవస్థ, వేయిపడగలలో వారితోబాటు ఆధునిక నాగరకత, కల్పవృక్షంలో రావణాదులు ఈ దైత్యభావానికి ప్రాతినిధ్యం వహించారు.

ఇతిహాసంలో అది ప్రాచీనగాథయైనా, ఆధునికగాథయైనా అది భావవ్యంజకమైన ప్రతీకాత్మకతను సంతరించుకుంటుంది. కథ ఏ కాలానిది, ఏ జనులకు సంబంధించింది అనే ప్రశ్న క్రమంగా తొలగిపోతుంది. దేశకాలాలు, సన్నివేశాలు అన్నీ కేవలం పరివేషాలైన వాస్తవికావాస్తవికతలతో, మతతాత్త్వికాంశాలతో సంబంధం లేకుండా సాధారణీకరణాన్ని పొందుతాయి.

వేయి పగడలలో గణాచారి కాలాన్ని సూచించగా, పసరిక ప్రకృతి ఆధునికకాలంలో పొందిన సంక్షోభాన్ని సూచించింది. గిరిక దివ్య జీవనాభిముఖమైన అభీప్సను సూచించగా రంగారావు పాత్ర అస్మితను కోల్పోయిన జీవనాన్ని సూచిస్తున్నది. అతడు దానికి తిరిగి పొందే దిశగా పరివర్తన చెందటం దీనిలోని భవిష్యదశాతరంగం.

కల్పవృక్షంలో రావణునికి సృష్టివిరోధియైన ఆదిమ తమస్సుతో ఏకీభవం చెప్పబడింది. వేదాంతం చెప్పిన 'మాయ' ఇదే. తరువాత రావణునిలోకి ప్రాణమయ దశలోని స్థితి ప్రసక్తమైంది. అక్కడ అతడు భావుకుడు. ప్రేమసిద్ధాంతానికి ప్రతిఫలనరూపం. దానికి క్రిందుగా అతనిలోకి సాత్త్వికప్రవృత్తి ఉన్నది. తపస్సు, శివభక్తి, లలితోపాసకత చివరకు గ్రంథిభేదనం జరిగి ఈశ్వరానుభవం కలిగింది. ఈ విధంగా రావణపాత్రముఖాన జీవపరిణామాన్ని అన్ని దశలలోనూ ఆవిష్కరించటం జరిగింది.

కల్పవృక్షంలో సీతారావణుల నడిమి ఘర్షణ కేంద్రంగా చేయబడింది. ఈ విధంగా ఆధునిక కాలంలో ఇతిహాసాలలో విస్తృతీ, గాఢత సర్వతో ముఖీనత, దిక్కాలాలకు అతీతమైన స్థితి సంభవించి వాటిని మహాగ్రంథాలుగా నిరూపించే వీలు దక్కింది. ఈ కాలంలోనూ ఇతిహాసం ప్రాదుర్భవించే సంగతిని ఋజువు చేయటం వాటి లక్ష్యలక్షణాలను నిరూపించటం నేను కొనసాగించిన సాహిత్య కృషిలో మరొక పార్శ్వం.

ప్రాచీన సాహిత్యాధ్యయనం విషయంలో గడచిన అరవైయేళ్ళుగా వ్యతిరేక ప్రచారం అత్యధికంగా జరిగింది. సాహిత్యానుభవం విషయంలో ఈ విభేదం విషమత అడ్డుగీతలను గీచింది. సాహిత్యానుభవం వాస్తవిక జీవితానుభవం కన్నా విలక్షణమైంది. ఒకటి స్వభావజగత్తు-వాస్తవమైంది. రెండవది విభావజగత్తు-కావ్యలోకంలోనిది. స్వభావజగత్తు రెండవదానికి ఆధారమే అయినా విభావజగత్తుగా పరిణమించేసరికి గొంగళిపురుగు

సీతాకోకచిలుక అయిన రీతిగా అది పరిణమిస్తుంది. ఒక దాని కొకటి ప్రతిఫలన రూపాలు కావు. అట్లాగే సమానానుభవం కలిగించేవీ కావు.

ిచివురుల గుబురుల్లోంచి పరిమళభరితమైన పుష్పం వస్తుంది. అట్లాగే జీవితంలోనుంచి సాహిత్యం వస్తుంది. అయితే ఇక్కడ కార్యాకరణ భావం ఆ రెంటి మధ్యన అభేదాన్ని అంగీకరించటం లేదు. సాహిత్యం జీవితంలో నుండి ఉద్గమించిన జీవితం కంటే విలక్షణమైంది. జీవితంలోని అవస్థాభేదాలు, జరామరణాది పరిమితులూ కావ్యవిధానాలకు ఉండవు. ఆ పాత్రలు వాస్తవానికి కట్టుబడక స్వభావ జగత్తులో నుండి విభావజగత్తులోనికి ప్రయాణం చేస్తాయి.'

'ఈ ప్రక్రియ సాధారణీకరణం ద్వారా జరుగుతుంది. ఈ పరివర్తన క్రమంలో దేహేంద్రియాలు తొలగి భావలోకం సృష్టింపబడుతుంది. వ్యక్తి ప్రతీక అవుతాడు. అనుభవం వైశ్విక మవుతుంది' (అధ్యయనం పు 15)

అందువల్ల ఇతివృత్తాన్ని బట్టి మాత్రమే దాని సందర్భోచిత లక్షణాన్ని నిర్ణయించటం అసమంజసమైన కార్యమే అవుతుంది.

కావ్యం మానవుని సమగ్ర జీవనానుభవ సంపుటి గా భావన చేయవలసి ఉంటుంది. ప్రాచీన మహాకావ్యరూపం ఈ దృష్టితో నిర్మింపబడ్డది. ఆలంబనోద్దీపన విభావాలు మానుష ప్రపంచాన్నీ దేశకాలాలనూ నిర్దేశిస్తాయి. సాత్త్విక సంచారి భావాలు వ్యక్తి శారీరక మానసిక పరిస్పందనలను తెలియజేస్తాయి. ఈ విధంగా రససిద్ధాంతానికి ఆధారం మానవ జీవితమే. అష్టాదశవర్ణనలూ జీవన సమగ్రతను నిరూపించేవే.

కావ్యంలో దేవతలు, పశుపక్షులు పాత్రలైనా వాళ్ళప్రవృత్తి అంతా మానవ ప్రవృత్తియే. అతిలోకస్థితికి అవకాశం యీయదు. రాజులు, ఋషులు మొదలైన వారు కూడా కావ్యవేదిక మీద సామాన్య మానవులుగానే వ్యవహరిస్తారు. ఈ సమన్వయం చేసుకోవటం ఈనాటి పాఠకునికి అవసరం. 'అధ్యయనం'లో ఈ దృష్టితో కావ్యపరిశీలన చేయటం జరిగింది.

మనుచరిత్రలో ప్రవరుడు తైత్తిరీయములోని ఆనందవల్లిలో ఆనంద స్వరూపాన్ని కొలిచేందుకు విధించుకున్న తొలి అంశం (Basic Unit) తో సంవదిస్తున్నాడు.

కావ్యకథాంతర్జగత్తులోనికి ప్రవేశించగలిగినప్పుడు ఈ రహస్యం వ్యక్తమవుతున్నది. (అధ్యయనం పే 40). ఇందువల్ల కావ్యతత్త్వం మరింత గాఢంగా అవగాహనకు వస్తున్నది.

స్వేచ్ఛాకానుభావము, గార్హస్థ్యజీవనము ఈ రెంటిమధ్య సంఘర్షణను చిత్రించడం చేత మనుచరిత్ర ఈనాటి పరిస్థితులకు సంగతంగా రూపొందింది. ప్రాచీన కావ్యమును అధ్యయనం చేయటంలో ఈ దృష్టి ఉండటం తప్పనిసరి.

ఇంక ఆధునిక సాహిత్యమును, దానిచరిత్రను, పరిణామాల్ని అధ్యయనంచేసే ప్రయత్నంలో చేసినకృషి విచారించవలసి ఉన్నది.

చేతనావర్తం భూమికలో ఆధునికతను గురించిన విచారణ మున్నది. 'సమసామయికమయిన సమాజగతికి అతీతంగా ఉన్నతంగా ఆలోచించి నూతన మార్గాన త్రొక్కిన ప్రతిసన్నివేశమూ ఆధునికమే వర్తమాన శతాబ్దం ఇతిహాసం యొక్క పరివేగానికి ఇతోధిక వేగము సమకూర్చింది... మానవుని చైతన్యసీమ సంపూర్ణంగా పరివర్తితం ఐనట్లు గోచరిస్తున్నది. లింగ, వర్ణ, వర్గవిచక్షణ లేకుండా సర్వమానవులూ ఒకటేనన్న సిద్ధాంతం సిద్ధాంతంగానైనా అంగీకృతం అయింది..... ఆధునిక చేతన ఒక విధంగా నిరంతరాన్వేషణ, అనంత దీర్ఘప్రయాణం. స్వప్నలోకంనుంచి యథార్థాలవైపు, ఆదర్శం నుంచి ఆత్మానుభావాలవైపు ఈ ప్రస్థానం'. సహృదయ చక్రంలో ఈ విచారణ విస్తృతంగా చేయబడ్డది. ఆధునికత పేర స్వీయసిద్ధాంతాలకు అమ్ముకునే కారడవిలో ఈ సూటియైన విశ్లేషణ ఒక సమతౌల్యాన్ని సంతరించే ప్రయత్నం చేసింది.

చేతనావర్తం పీఠికనాటికే ఆధునిక కవిత్వాన్ని గురించిన సాహిత్యాన్ని గురించిన స్పష్టమైన అభిప్రాయాలను చెప్పటం జరిగింది. 1935 ప్రాంతాన భావకవిత్వంమీద తిరుగుబాటుగా అభ్యుదయ కవిత్వ ప్రారంభమయింది. అభ్యుదయ కవిత్వారాభంతో పాటు ప్రయోగవాదం కూడా ప్రధానంనాకే గోచరిస్తున్నది అభ్యుదయ కవిత్వారంభంతో పాటు ప్రయోగవాదం కూడా ప్రధానంగానే గోచరిస్తున్నది. శ్రీశ్రీకన్నముందే భావకవిత్వంమీద తిరుగుబాటుగా నూతనాన్వేషణ ప్రారంభించిన శిష్ట్లాకవిత్వం ప్రయోగవాదదృక్పథానికి ఆరంభం నూతనత్వాన్ని గూర్చి అన్వేషణగా ప్రారంభమయిన ఈ కవిత రెండు శాఖలుగా

ప్రవర్తించింది. రెండు మార్గాలలోనూ కొందరు కవులు రచించడంచేత దీనిలో పృథగ్విభాగం జరగలేదు. ప్రగతివాదకవులు మార్క్సీయ దృక్పథాన్ని ప్రధానంగా స్వీకరించి రచన చేయగా వారి యందు యథార్థ వాదమ్ ప్రాధాన్యం వహించింది. ప్రయోగవాదులు కవితారూపంలో అభివ్యక్తిలో విపరీతమైన నూతనత్వానికి ప్రయత్నించగా ప్రగతివాదులు కేవలం వస్తువుకే ప్రాధాన్యం యిచ్చారు' అని రెండు మార్గాల పృథక్కరణం చేయటం జరిగింది. అప్పటి వరకూ కేవలం అభ్యుదయ నామంలోనే రెండు వాదాలూ వ్యవహరింప బడ్డాయి. నిజానికి ఈ రెండూ పరస్పర విరుద్ధమైనవి తాత్త్వికంగానూ అభివ్యక్తిలోనూ, ప్రయోజన దృష్టిలోనూ.

1955 నాటికి ప్రగతివాద కవిత్వం ఉద్యమం ఆగిపోయినదనీ, మానవోద్యమం దాశరథి నాయకత్వంలో చోటు చేసుకున్నదనీ ఈ పీఠికలోనే ప్రతిపాదించటం జరిగింది. తరువాత తరువాత నెమ్మదిగా అందరూ ఈ విషయాన్నే అంగీకరిస్తూ వస్తున్నారు.

ఈ భావానికి ఉపబలకంగా అబ్బూరి ఛాయాదేవి సంపాదకత్వంలో 1955లో వెలువడిన 'కవిత' తొలిసంచికలో అబ్బూరి రామకృష్ణరావు 'పొరపాటీ తిరుగుబాటు' అన్న రచన చేశారు. ప్రగతివాద కవిత్వం సాగిన పుష్కరకాలంలోనే సమకాలీనకవులు దాన్ని అంత తృప్తిగా చూడలేదు. నవ్యసాహిత్య పరిషదధ్యక్షోపన్యాసంబో కాటూరి వేంకటేశ్వరరావు ఇలా అన్నారు. 'ఈ దేహధర్మమే రాజ్యం చేస్తున్న దిపుడు రష్యాలో. తన సుఖానికి కావలసిన అర్థకాయ వ్యవస్థ నేర్పరచి, దానికి సామ్యధర్మము పేరిడి, ఆధర్మం విశ్వమంతా ప్రతిష్ఠింతునని రక్తపతాక మెత్తింది. ఈ ధర్మమునే వన్నెచిన్నెలతో - కాదు, కాదు వన్నెలూ చిన్నెలూ లేవు, దానినగ్నభీషణాకృతినే, దాని అద్భుత నియమ పాలనమునే ఈ నియమించే సాధించిన దేహ బలమునే కవులు ఓజస్సుతో నిండిన మాటలతో కీర్తిస్తున్నారు. ఆ రక్తపతాకం కాలిన కడుపులకు తారకమంత్ర మయినది (1945 ప్రతిభ). దేవులపల్లి కృష్ణశాస్త్రి 1949లో 'కొందరం ప్రజలు అంటూనే ప్రజాలోకానికి దూరంగా ఉంటూ దాని స్వరూపమూ సంప్రదాయమూ, జీవద్భాషా గ్రహింపలేక విజాతీయ సమాజంలో నుంచి వచ్చిన రచనలను మన కంఠాలనుంచి వదలుతాం (భారతి 1949) అన్నారు.

'ఈ శతాబ్దపు సాహిత్య పరిణామాన్ని జాగ్రత్తగా గమనిస్తే రెండు సంప్రదాయాలు రెండు ధోరణులు పాయలు గట్టి ప్రవహిస్తున్నట్లుగా కానవస్తుంది. ఒకభావం ఆత్మన్యూనతా భావంలోనుంచి పుట్టింది. అది ఆంగ్లేయులు మన నెత్తిన రుద్దిన సాంస్కృతిక

సామ్రాజ్యంలోనుంచి వచ్చింది. దేశీయమైన చరిత్రనూ, వ్యవస్థనూ, వాఙ్మయాన్నీ సంప్రదాయాన్నీ అనంతమైన సమన్వయిం చేసుకుంటూ ముందుకు పారే పరంపరను స్వాయత్తంచేసుకోలేక, దానిలోని దోషాలను గుర్తించి మొత్తంగానే తిరస్కరించేలక్షణం. పాశ్చాత్యులు నిర్మించిన వ్యూహాలకు లొంగిపోవటం, నకారాత్మక ప్రవృత్తిలో ప్రవర్తించటం ఇవీ దీని లక్షణాలు'.

రెండవ ధోరణి ఆత్మవిశ్వాసంలోనుంచి పుట్టింది. తానే మొత్తంగా దేశీయ సంస్కృతిగా భావించుకొని, దాన్ని సంస్కరించుకుంటూ, మూలాలను విచ్ఛేదం పొందకుండా రక్షించుకుంటూ, కాలక్రమాన తనలో ప్రకాశించిన దుర్లక్షణాలను తిరస్కరిస్తూ, తన భవిష్యత్తుకే కాకుండా వర్తమానానికీ తానే నాయకుడై ప్రవర్తించే లక్షణం, చరాచరజగత్తులోని ఏకత్వాన్ని భావన చేస్తూ మన జాతీయతను ఐరోపీయ జాతీయతలోని సంకుచిత లక్షణాలకు దూరంగా విశ్వజనీన దృక్పథంతో తీర్చి దిద్దుతూ మానవతావాదంకంటె విశిష్టం సర్వసృష్టిలోని ఏకాత్మభావాన్ని ప్రకటించే ధోరణి రెండవది (చందన శాఖ-34). ఈ తాత్త్వికచైతన్యంలో ఆధునికాంధ్ర సాహిత్యాన్ని రెండు సమాంతరంగా ప్రవహించే పాయలుగా చెప్పటం జరిగింది.

తొలి ధోరణికి ప్రముఖ ప్రాతినిధ్యం వహించేవారు కందుకూరి వీరేశలింగం గురజాడ అప్పారావులు. వీరి వెంట సాగినవారు కట్టమంచివారు. త్రిపురనేనివారు. తరువాత స్వేచ్ఛాప్రణయంకోరిన చలం, అనంతరం ప్రగతివాదకవులు, సంప్రదాయ విచ్ఛేదాన్ని కోరుకునే ప్రయోగవాదులూ, దిగంబర, విప్లవోద్యమాలవారు దళిత మైనారిటీ స్త్రీ వాదాల వారూ చేరిపోతారు.

రెండవ ధోరణి చిలకమర్తి, పానుగంటివారూ, వేదం వేంకటరాయశాస్త్రి రాయప్రోలు సుబ్బారావు, కాల్పనిక ఉద్యమకవులలో అధిక సంఖ్యాకులు, ఉన్నవవారూ, కాశీనాథునివారూ, కొమర్రాజువారూ, సౌందరనంద కర్తలూ, విశ్వనాథ సత్యనారాయణ, గడియారం, దుర్భాక, పుట్టపర్తి, జాషువా, దాశరథి, సినారెలు చేతనావర్త కవులు, తిలక్, కుందుర్తి, అనుభూతి వాదకవులు కొంతమంది, శేషేంద్రశర్మ, ముదిరాజు రంగారావు ఇత్యాదులు చేరతారు.

ఈ ప్రతిపాదన విస్తృతంగా పరిశీలించితే కొందరిలో ఉభయ లక్షణాలు కొంచెమో గొప్పగానో ఉండటం మనంచూడవచ్చును. అందువల్ల ఇది స్థూలమైన విభజనమే.

మరో వింతవిషయం మనం గమనించాలి. జాతీయస్వాతంత్ర్యోద్యమం పరిపాకదశలో ఉన్నప్పుడే ప్రగతివాద కవిత్వోద్యమాల విజృంభించటం. తెలుగు దేశంలో ఈ ఉద్యమంలో జస్టిస్ పార్టీ లక్షణాలు విక్షిప్తం కావటం. ఆర్యద్రావిడ, ఉత్తర దక్షిణ, బ్రాహ్మణ అబ్రాహ్మణ భేదాలు దానివల్ల వచ్చిన సంస్కృతి విరోధం ఈ ఉద్యమంలో భాగమైంది. ఈ పరిధులు కారణంగా ఈ ఉద్యమం కొద్ది కాలంలోనే మందబారిపోయింది.

సాహిత్య చరిత్రను అవగాహన చేసుకునే సందర్భంలో ఒకసారి ఒక విలక్షణమైన భావం కల్గింది. ప్రాచీన సాహిత్యచరిత్ర అంతా మూడుయుగాలుగా కానవచ్చింది.

1. కవిత్రయ కవితా యుగం. మూడువందలసంవత్సరాలు సాగించి కావ్యపరమార్థం విశ్వశ్రేయము. జగద్ధితబుద్ధి తెలుగు కవిత్వ చరిత్రలో సత్త్వగుణం పరిపాలించిన వేళ యిది.

2. శ్రీనాథుని- శ్రీకృష్ణదేవరాయల యుగం రజోగుణం ప్రాధాన్యం వహించిన యుగం. వక్తవ్యం కంటె అభివ్యక్తి ముఖ్యమైంది. కవిత్వం ఒక సమ్మోహన శీలాన్ని పెంచుకున్నది కవిత్రయ యుగంలో పాల్కుర్కి సోమన్న ఎలా రజోగుణ ప్రాధాన్యం ఉన్న కవో, శ్రీనాథయుగంలోనూ పోతన నత్త్వగుణం ప్రధానమైన కవి. అల్లసానిపెద్దన్న జగద్ధిత బుద్ధతో రచించినకవి.

3. తరువాతి యుగం తామోగుణాలు విజృంభించిన యుగం. మనిషిలోని పశువును మేల్కొల్పేశృంగారం, ప్రతిభా ప్రకాశం లేని కవితా ఈ యుగాన్ని ఆవరించింది.

ఈ గుణత్రయచక్రం ఆధునిక కాలంనాటికి తన పరివర్తన పూర్తిచేసుకున్నది. ఈ ఆలోచన అగ్నిగర్భ పీఠికలో చేసింది (1974). ఈ ప్రతిపాదనలను యింకా విస్తృతంగా పరిశీలించవలసి ఉన్నది.

సంస్కృత రూపకాల తెలుగు సేత మీద 1958లో కొంతకృషి చేశాను. అనువాదవిధానాన్ని ముఖ్యంగా రూపకాల విషయంలో పాటించ వలసిన ప్రధాన సూత్రాలను స్థూలంగా నిర్దేశించటం జరిగింది.

సంస్కృత రూపకాలు వాదన్నిబూతు దశలుగా విభాగం చేయటం జరిగి, ఆయా దశలలోని ప్రధాన లోనాలను పేర్కొనటం జరిగింది.

తరువాత పదిసంవత్సరాలకు కాళోజీ నారాయణరావు జీవనగీత గురించి (ఖలీల్

జిబ్రాన్ దిప్రొఫెట్ అనే రచనకు అనువాదం) వ్రాసిన వ్యాసాలలో ఇలా అన్నాను. సాధారణంగా ఇలాంటి కవితామయమైన తాత్త్విక గ్రంథాన్ని ఒక భాష నుండి వేరొక భాషకు తేవటం చాలా కష్టమైన విషయం. ఒక విధంగా పరకాయప్రవేశం జరిపించటము. కాని పరకాయ ప్రవేశం పూర్వకాయపు చైతన్య జ్వాలాతీవ్రతను భవించగలిగినదై యుండాలి. (జనధర్మ-వారపత్రిక 1968 మార్చి - ఏప్రియల్).

ఈశ్వరుని తేజస్సును భరింపలేక అగ్నిదేవుడే గంగలో మునిగాడు. ఆ తేజస్సు అనేక శకలాలయింది. అనువాదం చేసినప్పుడు మూలరచనకు ఆస్థితి రాకూడదు.

సాహిత్యాధ్యయనంలో నాకు తోడ్పడ్డవి చరిత్రను, సంస్కృతినీ, తత్త్వ శాస్త్రాలనూ ఇతరాంశాలను అద్యయనం చేయటం. దానివల్ల మహాగ్రంథంలోని అవ్యక్త దృశ్యాలు నాకు గోచరించాయి.

భారతీయ సంస్కృతిని గురించి సంక్షుబ్ధ వర్తమానంలో భారతీయ సంస్కృతి అన్న వ్యాసం దాని మౌలికాంశాలను తెలుసుకునే ప్రయత్నం చేసింది. మూల్యాలను ముందుకు తెచ్చింది. ఇలానే ఆధునిక భారతదేశంలోని పునరుజ్జీవ ఉద్యామం దానిలో పాల్గొన మహాపురుషులు ఉద్యమాలను గురించి అద్యయనం కూడా దారిని చూపింది.

స్వాతంత్ర్యోద్యమం చివరకు భారతదేశవిభజనతో పరిపూర్ణత పొందటంతో జాతి పరాభవం ఉన్నది. ఉద్యమమంతా అఖండమైన జాతీయ భావంతో అభిన్నభ్రాతృభావంతో సాగి చివరకు విభేదభావం గెలిచి జాతీయ చైతన్యాన్ని పరాభవించింది. ఈ లక్షణంవల్ల అభద్రతా భావం, ఆత్మన్యూనతాభావం ఆధునిక భారత దేశచరిత్రను కల్లోలితం చేస్తున్నది.

ఈ దృక్కోణంలో సాహిత్యాన్ని పరిశీలించినప్పుడు మనకు కానవచ్చే అంశాలు ఇవి. అంతవరకు ప్రేరణ నిచ్చిన జాతీయభావం క్రమంగా చెదరిపోయింది. విభజన శక్తులు భాషపేర, కాలంపేర ప్రాంతంపేర దేశ ఏకతను విక్షోభ పెట్టే ప్రయత్నం చేశాయి. సాహిత్యంలోనూ ఈ పరిస్థితి విభజన కారకాలయిన ఉద్యమాలకు కారణమవుతున్నది. అంతర్జగత్తులోని సంక్షోభం సాహిత్యంలో ఆత్మహనన కారకమైన మార్గాలను విస్తరిస్తున్నది. ఈ సందర్భంలో జాతిమూల్యాలను ఆధారంగా ఈ శతాబ్దంలో సాగిన సాగుతూఉన్న నవ్యసంప్రదాయ మార్గం ఒకటే శరణ్యంగా గోచరిస్తున్నది. ఇంక నవ్య సంప్రదాయమును గురించి చర్చించ వలసి ఉన్నది.

మేము చదువునే నాటికే ప్రగతివాదము, దాని అనుయాతిగానే వచనకవిత్వము అదే ఆధునిక కవిత్వమన్న ధోరణి ఉండేది. శ్రీపాదవారి దగ్గర నుంచి ఆనాటి దాకా ప్రాచీనచ్ఛందో మార్గాన్ని అనుసరించిన రచనలన్నీ సంప్రదాయ కవిత్వమన్న పరిభాషలోనే కొనసాగుతూవుండేది. శ్రీపాదవారి కావ్యమూ సౌందరనందమూ ఒకే ఉద్యమానికి చెందినవా? జనమంచివారి, వావిలికొలనువారి రామాయణాలూ, విశ్వనాథ కల్పవృక్షము ఒకటేనా? అన్న ప్రశ్నకు సరియైన సమాధానం లభించేదికాదు. రూపసామ్యం ఉన్నా ఇతిహాస పురాణాల తరువాత కావ్యప్రబంధయుగం ఎలా ఉందో ఆధునిక కావ్యాలకు కూడా వస్తునిర్వహణం చేత, భావ విస్ఫోటంచేత ఆధునిక చైతన్యాన్ని సంవదించుకొనటం వలన వీటిని ప్రత్యక్షంగా వ్యవహరించవలసిన అవసరం ఉందని తోచేది. దాశరథి తిలక్ మొదలైన కవుల పద్య ఖండకావ్యాలు సంప్రదాయ కవిత్వంలో చేరుతాయా? వస్తువు ప్రాచీనమైనంత మాత్రాన కృష్ణశాస్త్రి ధనుర్దాసు మొదలైన రచనలు ఆధునికం కాకుండా పోతాయా? ఇలాంటి ప్రశ్నపరంపర ఆలోచనల్లో చిక్కులు పెడుతూ వుండేది.

1960లో నేటి కవిత సంప్రదాయము అన్నవ్యాసం వ్రాశాను. దీనిలో సంప్రదాయం అన్న మాటను పునః నిర్వచించే ప్రయత్నం జరిగింది. 'నశించిపోయినవానికై దుఃఖించుట, వానికోసము వ్యర్థముగా ప్రాకులాడుట సంప్రదాయమనిపించుకొనదు. ఏవో కొన్ని ఆచారములు, పలుకుబడులు ఇవే సంప్రదాయమనిపించుకొనలేవు. కొన్ని పూర్వగాథలను మరలమరల పారాయణం చేయుటయును కాదు. ఇది జాతిలక్షణము. జాతియొక్క చరిత్ర సంస్కృతి ప్రధానధర్మముల నాశ్రయించి ప్రవర్తించినచో ఆయా ధర్మముల పునర్జాగరణ మొనర్చుటయే సంప్రదాయము., ఇది పరంపరలుగా మార్పులు పొందుచుండును... ఇది పలాయన వాదము కాదు. నేటి సాంఘిక పరిస్థితులకు జడిసి ఈ సమాజములు నిలువలేక వెరచి దీనినుండి పారిపోవుట కాదు... (ఇది) ఎడతెగని సాగు వంటిది.

'ఆత్మాశ్రయరచన, గీతికావ్యరచన ఖండఖండములుగా నలువదేండ్లు సాగినది. దాని యందలి వ్యామోహము తగ్గినది. వస్తు బలము లేని రచనలు కేవలము వైయుక్తికములైన భావములు, అన్నియు చాలవరకు అస్పష్టములు - ఎంతకాలము నిలుచును?' (చందనవాణి -20,21,పే).

తరువాత స్నాతకోత్తరకేంద్రము వరంగల్లులో ఆధునిక కవిత్వం ప్రత్యేక పత్రముగా అధ్యయనము చేయవలసి వచ్చినప్పుడు సౌందరనందము, కల్పవృక్షము, శివభారతము,

రాణాప్రతాపసింహ చరిత్ర మొదలైన కావ్యాలను ఏ పేరులో ప్రవేశపెట్టాలనే ప్రశ్న వచ్చింది. అప్పుడు కొత్తపేరు కోసం వెదుక్కోవలసివచ్చింది కొద్దిరోజులు నియోక్లాసిక్ అన్నా తరువాత దీన్ని నవ్యసంప్రదాయమనే పేర పిలువటం జరిగింది.

డా॥ అనుమండ్ల భూమయ్య నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన గ్రంథానికి వ్రాసిన పీఠికలో నియోక్లాసిక్ అనే పేరు ఉన్నది. అయితే 1987లో కాని నవ్యసంప్రదాయమన్న పేరు స్పష్టపడలేదు. కాని ఈ ఉద్యమపు నాడి అంతకు పూర్వమే క్రమానుగతిగా వ్యక్తమౌతూ వచ్చింది.

ఇటీవల 1998లో నవ్యసంప్రదాయ సాహిత్యం మీద వ్యాసం వ్రాసేటప్పటికి గాని దాని సమగ్ర స్వరూపం సాక్షాత్కరించలేదు. ఈ నవ్యసంప్రదాయోద్యమ స్వరూపాన్ని స్పష్టంగా వికసించి వ్యాఖ్యానించిన వారు శ్రీ సంపత్కుమాచార్యులు, శ్రీ జి.వి.సుబ్రహ్మణ్యం.

నవ్యసంప్రదాయం సజీవమైన విశ్వజనీనమైన భారతీయ మూల్యాలుగల ఆదర్శాల సంపుటి. సంఘర్షణ స్థానంలో సమన్వయం, బానిసతనం స్థానంలో ప్రేమతో లొంగిపోవటం , వైరుధ్యాలస్థానంలో ఏకీకరణం ఈ నూతన దృక్పథంతో ప్రకాశిస్తాయి. సాహిత్యానుభవంలో ఒక భావాతీతమైన విశ్వలయ సాక్షాత్కరిస్తుంది. ఆ సాహిత్యంలో ప్రకృతిలోని ప్రత్యణువూ అంతర్బహి ర్లోకాలు సూత్రీకరింపబడతాయి. మానవజీవన పరిణామంలోని అనంతరదశ ఈ సమన్వయం ద్వారానే సాధ్యమవుతుంది' (చందన శాఖ- 43పే). నవ్యసంప్రదాయోద్యమానికి శ్రీరామకృష్ణుల నుండి శ్రీ అరవిందుల దాకా వచ్చిన తాత్త్విక చింతన పునాదిగా నిలచిపోయింది. ఏపరిమితులవల్ల ఇది సంకోచం పొందలేదు.

నా సాహిత్య కృషి అంతా క్రమానుగతిలో వికాసం పొందినట్లుగానే గోచరిస్తున్నది. ఇప్పుడు ప్రస్తావించిన విషయాలేకాక మరింకెన్నో అంశాలు ప్రసక్తములై ఉండవచ్చును.

అయితే ముందుపేర్కొన్న అంశాలన్నీ అనిదంపూర్వములైనవి కాకపోవచ్చును. చాలాచోట్ల పూర్వుల కృషీ ప్రేరణా ఉన్నమాటా సత్యమే. నాప్రస్థానంలో రెండువైపులా దీపస్తంభాలై నిటాలుగా నిలబడి వున్న విశ్వనాథ సత్యనారాచయణ, శ్రీ అరవిందులు ముందుకు నడిపిస్తున్నారు.

ఇంతకాలంగా నేను చేసిన సాహిత్యాధ్యయనం భావవస్తు రచనాక్రమంలో భాషా దేశసీమలలో ఏహద్దులనూ నియమించుకోలేదు. ఏ సీమలకూ ఒదిగి పోలేదు.

-ooo

# 'అభినవ' భారతీ' దర్శనం

తుమ్మపూడి కోటీశ్వరరావు

మాత: నాత: పరమనుచితం యత్ ఖలానాంపురస్తాత్

అస్త్రాzశంకం జఠర పిఠరీపూర్త యే నర్తితాసి

తత్ క్షంతవ్యం సహజసరళే! వత్సలే! వాణి కుర్యాః

ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః

అని నీలాశుకులంత మహాత్ములు వేదన పడ్డారు!

తల్లీ! వాత్సల్య స్వరూపిణియైన సరస్వతీ! సరళస్వభావము. నేనిన్నాళ్ళు నా కడుపు నింపుకోవటానికి దుష్టులయందు నిన్ను నాట్యమాడించాను. ఇంతకంటే అనుచిత మేముంటుంది? నన్ను క్షమించు అ పాప ప్రాయశ్చిత్తంగా గోపవేషధారుడైన శ్రీకృష్ణుని గుణగణాలను సంకీర్తిస్తాను.

దీనికి ప్రస్తుత సందర్భమేమంటే- ఆ మహాభక్తకవి నిజంగా ఖలస్తుతి చేశాడో లేదో కాని కవియైన ప్రతివాడూ చేసే పని ఇదేనని మాత్రం జగద్విదితం.

ప్రస్తుత ప్రాసంగికుని మనోనేపథ్యంలో ఖలుడులేడు కనుక ఎవరి మెప్పుదల కోసం తన సర్వస్వతీ శక్తిని వెచ్చబెట్టలేదు. "చేతో మత్కృతు లీ పదార్పితములే శ్రీరాజరాజేశ్వరి' ' అని చిన్ననాడే చేసిన శపథ మలాగే నేటికీ కొనసాగించటం వల్ల అక్షరస్వరూపిణియైన సరస్వతి సమర్పనగానే తన విమర్శను రక్షించుకొన్నాడని వాని మనస్తత్వ ప్రదర్శనార్థం ఇది చెప్పక తప్పలేదు.

అభినవ భారతి అన్న బిరుదు ఈ ప్రాసంగికునకు 1996లో తిరుపతి సన్మాన సభలో బహూకరింపబడినది. ఈ పేరే ఈ వ్యాసంలో ఉపయుక్తమౌతుంది.

**విమర్శ**

ఈ శబ్దార్థ విచారణ చాలావరకు విస్మృతమైపోయినదన్నట్లు ఈ దర్శనం కాశ్మీర శివాద్వైతవాదం నుండి విచారణ సాగించినట్లు కన్పిస్తుంది. శబ్దార్థ వివేకం నుండి నిర్వచన మేర్పడితే దానిపైన తర్వాత నిర్మాణ మేర్పడటం ప్రాచీన శాస్త్రకారుల దృష్టి.

మన అలంకార శాస్త్రం అశివాద్వైత దర్శనం మీద సుప్రతిష్ఠితమైనది. ఉదాహరణకు ధ్వన్యాలోకాది గ్రంథ అధ్యాయాలు ఉద్యోత, ఉన్మేషాది శబ్దాలతో వ్యవహృతంకావటం చూస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. ఉన్మేషమంటే- సృష్టి ఏర్పడటం. భావం శబ్దంగా రూపవంతం కావటం. మనస్సుశబ్దరూప ధారణ చేయటమే కాక రెండు ఆలోచనల మధ్య నున్న శూన్యావస్థ మబ్బులు తొలగిన ఆకాశం. అదొక స్ఫురణ ఆ నిశ్శబ్ద స్థితిని వ్యాఖ్యానించేది కళ అని నాటి-నేటి దర్శనం. చమత్కారం-స్పందం-విశ్రాంతివంటి శబ్దాలు అలంకారశాస్త్రాల్లో విస్తారంగా వాడబడ్డాయి. ఈ తాత్త్విక దర్శనం ప్రకారం వాటిని విచారించటం ప్రథమ కర్తవ్యం. ఎవరికి? విమర్శకులకు.

విమర్శ అంటే పరమేశ్వరునియందున్న అకలుషిత అహం ప్రవృత్తి. దానినే స్పంద మంటారు. మనిషిలో అదే సంకుచితమైపోతుంది. సృష్టికర్తలోని అహంకారం విశాలం. సృష్టి బీజం కాగా మానవదశలో అదే బద్ధమైపోతున్నది. రసానుభవ దశలో భావుకుడైన ప్రేక్షకుడు ఆ తొలి బీజావస్థలో నిమగ్నుడౌతున్నాడు. సంకుచిత అహంకారం సృష్టికర్త అహంకారంగా పరిణామం పొందటం రసానుభవం. విమర్శ దర్పణంలో భగవంతుడు తనను తాను చూచుకొని తన శక్తిని స్మరిస్తున్నాడు. కనుకనే గుప్తపాదులు దర్పణోదాహరణ మిచ్చారు. అకలుషితాహం ప్రవృత్తి స్వచ్ఛదర్పణమని అందులో తన్మయీభావం పొందుతున్నాడనీ దాని తాత్పర్యం. విమర్శ అంటే ఇది కేవలానుభవం.

ఒకప్పుడు పాశ్చాత్యులు విమర్శను తార్పుగా భావిస్తే ఆధునికులు అనుభవ వ్యాఖ్యానమంటున్నారు. తనకుకలిగిన అనుభవానికి హేతువైన కావ్యశిల్ప వివేకం విమర్శ అని మరొకటి యూంగ్‌మనస్తత్త్వ దర్శన దృష్టితో 'చైతన్య విస్మృతి' కావ్యానుభవస్వరూపంగా వ్యాఖ్యానించారు. ఇదే విమర్శగా ఆలంకారికులకు తత్త్వ దర్శనం. విమర్శ శబ్దా న్నిదే అర్థంలో ప్రాచీనులు శివునిచైతన్యశక్తి-గా భావించారు. Creative Energy అని తాత్పర్యం.

2 ఈ దృష్టి పునాదిగా మరికొందరు ఆలంకారికులు కవి అంటే రసభావ ద్వంద్వ వివేకం కలవాడన్నారు. కనుక కవిత్వం విమర్శ. ఈ దృష్టిలో ఈ శ్లోకం చూడదగ్గది.

అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకళాం జగత్
గ్రావప్రఖ్యం నిజరసభరాత్ సారయతి-క్రమాత్ ప్రఖ్యో
ప్రఖ్యో పాఖ్యా ప్రసరసుభగం భాసయతిచ, తత్ సర
స్వత్యాస్తత్త్వం సహృదయాఖ్యం విజయతే.

సారస్వతావరణకు లేశమైనా భౌతికకారణం లేదు. ఈ సరస్వతీ ప్రసరణం రసస్వరూపం కనుక పాషాణతుల్యమైన జగత్పాత్రను నింపుతున్నది. అందువల్ల జగత్తు సుందరంగా సాక్షాత్కారం పొందుతున్నది. కళద్వారా జగత్తు సుందరావిష్కృతి పొందుతున్నది. అది కథాశబ్దాదుల ద్వారా క్రమవికాసం పొందుతున్నది. ఈ క్రమ ప్రసరణ సుందరంగా వున్నది. ఈ సరస్వతీ తత్త్వానికే కవిసహృదయ మన్న పేరు.

స్థూలంగా శ్లోక తాత్పర్యమిది, కవి విభావానుభావ రూపమైన కావ్యాన్ని సృష్టిస్తే అది ఆధారంగా భావుకునిలో వ్యభిచారి స్థాయి భావోత్పత్తి జరుగుతున్నది. కనుక ఈ సరస్వతి కవిద్వారా ప్రసరణం పొంది సహృదయని అనుభవరూపంగా పరిణామంపొందుతున్నది. రసము కవిద్వారా శబ్దమై అది సహృదయునిలో రసంగా పరిణామం పొందుతున్నందున కవి సహృదయు లుంటే కావ్య మున్నది లేకపోతే లేదు. ఎందువల్లనంటే.. రస నిర్మాణంలో నాల్గు భావాలుంటే రెండు కవి సృష్టిస్తున్నాడు. ( లిఖితాను భావాలు) రెండు వ్యభిచారి స్థాయి భావాలు సహృదయుడు కలుపుకొంటున్నాడు. స్త్రీ పురుష ద్వంద్వం సృష్టి కాధారమైనట్లు కవి సహృదయులు రససృష్టి కాధార మన్నమాట.

ఈ సరస్వతీ తత్త్వమే అభినవ దర్శన మనబడ్డది. దీని వ్యాఖ్యానమే విమర్శ తత్త్వంగా ఈ దర్శన మావిష్కృతమైనది.

శాంతసితబించు కర్ణికాచారు వగుచు
అష్టదళ పద్మ సిందూర వృష్టి యేదొ
ఆత్మ లోయల లోతులయందు కురియు
నీవు నే నన్న భేదమ్ము లేనిచోట

మనలో లోయలు అంతఃచైతన్యం. అక్కడ శబ్దార్థ ద్వంద్వం ఒకదానిలో ఒకటి సమ్మిశ్రణం పొందివున్నది. అక్కడకు చేసే ప్రయాణం పేరు 'రసయానం'. ఆ రసచక్ర మొక పద్మం. దానికి కర్ణిక శాంతసిత బిందువు. ఆ కర్ణిక అష్టదళావృతం. ఎనిమిది రేకులు అష్ట రసాలు. కర్ణిక పేరు శాంతరసం.

ఈ పద్మోదాహ్యలు ఉపాసనలో శ్రీ చక్రం. ఇందుకే శ్రీ చక్రంలోని నవకోణాల్లో నవరసారోపణం జరిగింది. గుప్తపాదుల దర్శనంలోనే ఈ ఆత్మతత్త్వోపాసనం రస విద్యగా సాక్షాత్కరిస్తుంది. ఆధ్యాత్మిక+భౌతిక సమన్వయమే రసవిద్యా రహస్యం. భారతీయ జీవనవిధాన రహస్యం. ఇది తెలిసినవానికి శాంతరసవాదంలో పట్టు దొరుకుతుంది. జీవన సౌందర్యావిష్కారమే కళ ప్రయోజనం. ఈ అలంకారిక ప్రస్థాన వ్యాఖ్యానమే ఈ అభినవ భారతీ దర్శనం.

భారతీయ జీవన విధానంలో ఒక బృహత్సమన్వయాన్ని దర్శించారు ఆధునిక ఋషితుల్యులు శ్రీ ఆనంద కుమార స్వామి శ్రీ అరవిందులు మొ॥ వారు ఈ సమన్వయాన్నే తిక్కన్నగారు హరిహరనాథ తత్త్వ మన్నారు. దానిభావ మేమంటే స్థిరమైన తత్త్వం-బిందువుగా వున్నది. దానిపేరు శివుడు-హరుడు. తదాధారంగా ప్రవర్తిస్తున్న విశ్వచక్రం-హరి,ఈ సమన్వయంలో దర్శనకు హరిహరనాధ తత్త్వంగా తిక్కన్నగారి అవతారిక రహస్యం. నన్నయ్యగారి అవతారికలో భారత సమగ్ర స్వరూప దర్శన మున్నది "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని". తిక్కన్నగారు ఆ మహాకల్ప వృక్షానికి ( అమితాఖ్యానకశాఖలం బొలిచి నన్నయ) మూలం హరిహరనాథ తత్త్వంగా సంఘటించి భారతతత్త్వాన్ని ఆవిష్కరించారు. ఇందుకే తిక్కన్నగారి పీఠిక స్వప్నం. నన్నయ్య గారిది సభాస్థానం. కాగా తిక్కన్నగారిది సమాధితుల్యమైన స్వప్నం భారతకథకు స్వప్నావస్థ హరిహరనాథ తత్త్వం పైన శాఖోపశాఖల వృక్షం జాగ్రదవస్థా రూపకథ.

తిక్కన్నగారు మంత్రి అంటే పుష్కలమైన బాహ్యజీవనం కలవారు. దాని కాధారమైనది- వైదికమార్గ నిష్ఠమగు వర్తనము, భేదము లేని భక్తితో ఏర్పడిన నిర్మలాంతః కరణం నిత్య భగవత్స్మరణ-ఈ ఆధ్యాత్మిక జీవనం. ఇది రాజకీయ, సామాజిక జీవనం. ఈ రెంటిసమన్వయమే ఆర్ష జీవనం ప్రవృత్తి · నివృత్తి సమన్వయంగా ఇదే చెప్పబడినది. ఈ సమన్వయ దర్శనం కావ్యరసము'. అంటే శాంతరసమే. తాత్త్వికంగా ఏది హరిహరనాథ

తత్త్వ మో అదే రసదృష్ట్యా శాంతంగా కవిబ్రహ్మ దర్శనం. ఈ రహస్య విద్యావ్యాఖ్యానమే అభినవ భారతీ దర్శన ప్రతిష్ఠ అంటేపునాది. అంటే భంగ్యంతరంగా గుప్త శ్రీవాణి వ్యాఖ్యానమే ఈ విమర్శ. ఈ తత్త్వ శాంతరస తత్త్వ విమర్శలుగా వచ్చిన గ్రంథాలు6. సంవిధానక చక్రవర్తి ఆనుశాసనిక పర్వపీఠిక మొ॥వి వ్యాసాలు. 1) రసవజ్రం Rase the Mythie Dimond 2) ప్రాక్పశ్చిమ రసమీమాంస వంచెలి (సాలభంజిక) దీనివల్ల ఏర్పడ్డ విమర్శసూత్రమేమంటే. ఆలంకారిక ప్రస్థానాన్ని వ్యాఖ్యానించట మొకటి. రెండవది పాశ్చాత్య భావన కూడా దీని కెలా అనుసంధిస్తున్నది చెప్పటం ఇది ఆధునిక అది ప్రాచీనం ఈ రెంటి సమన్వయం.

ఉదా॥ T.S. Eliot విశ్వనాథ ఇద్దరూ ఈ శాంతవాదులే. సాలభంజిక. అన్న గ్రంథంలో ఈ వ్యాస మున్నది. ఏది ఇందాక శాంతరసబిందు కర్ణిక అనబడ్డదో. దానినే Eliot Still Print అన్నాడు. స్థిరంలో చలనం అచల చలనం. ఒక నిష్పంద వాసంగా అయిన భావించినదే గుప్తరాయల శాంత రస స్థానంలో కన్పిస్తుందని అక్కడ చెప్పబడ్డది. మరొక పాశ్చాత్య భావన ఏమంటే విలియం జేమ్సు ప్రతిపాదించిన విషయం. దానిని వివరిస్తూ హెర్బర్ట్‌రాడ్ అన్నాడు.

"In other words there are perceptions which never become articulate to the conciousness and these too, we must assume are on essetial part of the Self. It is possible that one of the functions of the Art into bring these in articulate perceptions into consciousness

దీని భావ మేమంటే అంతశ్చైతన్యం స్వచ్ఛంగా వుంటే ప్రతిభావమూ ఒక మేఘశకలంగా వస్తూపోతున్నది. నిర్మలాకాశంలోలాగా చైతన్యం సితతంతువు. శాంతం-ఇతర రసాలు నీలశ్యామాది వర్ణమయ రత్నాలు మేఘాలు. మనోదశలో నిత్య స్పంద నలున్నా నడుమ నడుమ అంతశ్చైతన్యమైన సితతంతువు భాసిస్తున్నది. దానిపేరు జేమ్స్ ప్రకారం 'Totocuelo' (absense of feelings). ఈ సితతంతు ఆభాసలు- ప్రకాశానే ఉన్మేషమంటారు. సర్వభావరప సమున్మేష స్థానం శాంతమయ చైతన్యం. విస్తరంగ తటాకం=శ్వేతపద్మం ఏదన్నా ఒకటే (వివరాలకు శ్రీ అరవిందుల యోగదర్శనం చూచుకోవాలి).

ఈ శాంతరసప్రాధాన్య వాదస్థాపన కోసమే నాచన సోమన్న హరివంశకథలను కొన్నిటినే గ్రహించి సంవిధానక సృష్టియైన ఉత్తర హరివంశం వ్రాసింది. ఈ కావ్యం మన సాహిత్య చరిత్రలో ఒక మలుపు. ప్రవాహంలో ఒక ఘట్టం. ఇతిహాస ప్రక్రియను కావ్యవిద్యకు మళ్ళించిన స్థానంలో ఉంది. ఇతిహాసం లౌకికాలౌకిక వస్తు ప్రధాన ప్రక్రియ కావ్యంవేరు. రస ప్రస్థానం. రెంటిని కలిపి పేనిన ఘనత సంవిధానక కవి చక్రవర్తిదే. ఈ దృష్ట్యా ఈ కావ్య విమర్శలో 1) పౌరాణిక కథ తత్త్వం, 2) రస ప్రస్థానం. ఈ రెంటికి సంబంధించిన వివరణ కన్పిస్తుంది. ఒక పురాణ కథ నెలా వ్యాఖ్యానించాలి? దానిలో రస శిల్ప సమన్వయ మెలాగా? ఈ ప్రశ్నలకు సమాధానమే ఆ విమర్శ.

సంవిధాన మన్నమాట మృచ్ఛకటికంలో బయలుదేరి ఉత్తర రామచరిత్రలో మరల పాటమరించి వక్రోక్తి జీవితంలో అలంకారిక ప్రస్థానానికి మళ్ళింది. ఈయన సిద్ధాంత దృష్ట్యా విశ్వనాథవారు కల్పవృక్షావతారికలో , సరస్వతీ ప్రార్థన చేశారు. అది కేవలం కుంతకాచార్యుల మతానుసారంగా చేయబడ్డ వర్ణన. స్తుతి కాదు. ఇది పురాణ మార్గం. అది కావ్య మార్గం. ఈ రెంటిని వేరు చేసిన వాడు కుంతకుడే. ప్రథమాలంకారికుడు భామహుడు కావ్య నిర్వచనం చేయటంలోనే ఈ ధోరణి అంకురించింది. ఆయన ప్రకారం కావ్యమంటే శబ్దార్థ సహితత్వం. వేదం శబ్ద ప్రధానం. పురాణం అర్థ ప్రధానం. కనుక కావ్యంలో శబ్దార్థాల సమత- సంయోగమయిందనటంలో పురాణవాఙ్మయాన్ని కావ్యనాటక రూపసాహిత్యం నుండి వేరు చేసిన లక్షణం స్పష్టమే కదా.

## పురాణ విద్య

ఇతిహాస పురాణ విద్యను గురించి ప్రాచీనాలంకారికులు పెద్దగా పట్టించుకోలేదు. ప్రస్తుత దర్శనంలో దీని ప్రకాశ ప్రసరణం విస్తృతంగా గోచరిస్తుంది. హేతువాద యుగంలో పురాణ కథను కూడా వాస్తవిక చారిత్రక విషయంగా జాగృత చైతన్య కథనంగా- భావించినందువల్ల అర్థరహితంగా లేదా వారనుకొన్న అర్థానుకూలంగా వ్యాఖ్యానించుకొన్నారు. 20వ శతాబ్దంలో ప్రపంచ చింతనలో చాలా మార్పు వచ్చింది. భౌతిక హేతువాదం పోయి అహేతువాదం A Carnal Theory వచ్చింది. సుప్తచేతనకున్న ఆవివరణచ్ఛేదం జరిగినందువల్ల మానవ చైతన్య అగాధత- విస్తృతులు వ్యక్తమై అనేక చేతన రహస్యాలు బైటకు రావటంవల్ల వైజ్ఞానిక శాస్త్రరంగంలో పెద్దవిప్లవం వచ్చింది.

నేనూ నా చుట్టూ వున్న ప్రపంచం వేర్వేరు వస్తువులు అనుకొన్నది భౌతిక శాస్త్రవాదం. దాని స్థానంలో నేనూ విశ్వమొకే పదార్థం నుండి విడిపోయిన జంట అన్నవాదం. భావాఖ్య Mundus-Theory గా వచ్చింది. దీనిలో డార్విన్ భౌతిక పరిణామ వాద సిద్ధాంతం బీట్లివ్వటం మొదలుపెట్టింది. ఆ పరిణామం సహజ మన్నవాదం పోయి ఒక విశ్వచైతన్యం ఈజగద్భ్రమణం చేస్తున్నదనేవాదం. ఎడ్డింగ్టన్-లాంటి వారు ప్రతిపాదించారు. ఈ Comic mind/universal mind నే ఋగ్వేదం 'దేవం మనః' విరాట్పురుష వాదంగా చెప్పింది. ఈ దృష్టిలో పురాణ కథా విమర్శ ప్రాశ్చాత్య దేశంలో ఊడలు దిగిన దయ్యాల మఱ్ఱిగా వ్యాపించింది. ఇదంతా వ్రాసినది

The sceince of My thology వంటి గ్రంథాలు వచ్చాయి. పాశ్చాత్య పండితులు ఈ దృష్ట్యా భారతీయ పురాణ కథా విమర్శ చేసి దాని విశ్వజనీనతను ప్రకటించారు.

ఈ నూత్నకాంబలో ప్రాచీన భారతీయ పౌరాణిక సంస్థ చెప్పిన పురాణ విద్యాతత్త్వాన్ని అర్వాచీన ప్రాశ్చాత్య పౌరాణిక కథా వివరణలో కలిపి కట్టిన ఒక క్రొత్తంటు.

**'పురాణ విద్య' అన్న గ్రంథం**

హేతువాదం ప్రకారం భౌతిక చేతనా పరిణామం పురాణం. ఆధునిక మనస్తత్త్వ శాస్త్రం ప్రకారం, అలాగే ప్రాచీన భారతీయ చింతన ప్రకారం ఆ భౌతిక చేతనా వివర్తం పురాణం ఈ దృష్టిలో 20వ శతాబ్ద పోటి మదించటం జరిగితే అక్కడ బఁద్ర కళాకారుడు, శిల్పులు, కవులు తమకు తెలియకుండానే పురాణకథా వివరణాత్మక కళాఖండాలు సృష్టించారు. పికాసో, హెన్రీమూర్. మూర్ చెక్కిన స్త్రీ మూర్తులు పురాణ ప్రతిమలుగా ఆద్యశక్తియైన జగజ్జనని ప్రతిమా ప్రపంచంగా ఆయనే చెప్పాడు. ఈదృష్టి హెర్బట్‌రాడ్ విమర్శల్లో ప్రధానాంశం. ఆయన ప్రకారం, కళా ప్రతిమా మూర్తులు, విశ్వాంతరాళంలో భావాలుగా వుండి అవి కళాకారుల జీవచైతన్యంలోకి అవతరించి పురాణ ప్రతిమలుగా, శిల్పాలై, ఆవిర్భవిస్తున్నాయన్నాడు. ఇదేమీ మనకు క్రొత్త సిద్ధాంతం కాదు. శ్రీఅరవింద యోగ దర్శనంలోనూ, ప్రాచీన శిల్ప కళా శాస్త్రాల్లోనూ ఈ మాటలు కన్పిస్తాయి.

ఈ నేపథ్యం నుండి 'పురాణవిద్య', అన్న గ్రంథం కొన్ని పురాణ కథల నుదాహరణంగా గ్రహించి వ్యాఖ్యానించింది. ఇదే విమర్శధోరణి 'సంవిధానక చక్రవర్తి' అన్న గ్రంథం సోమన్న

ఉత్తర హరివంశ కావ్య తత్త్వ వ్యాఖ్యానంలోనూ కన్పిస్తుంది. కాకపోతే ఇది కావ్యం కనుక ఈ పురాణ కథను శాంతరసానుకూలసామగ్రిగా మలుచుకొన్నాడనీ ఈ భౌతిక, (కథ, అభౌతిక తాత్త్విక) సమన్వయాన్నే అతడు సంవిధాన మన్నాడనీ చెప్పబడినది.

ఈ సంవిధానకం నిర్వచనమేమిటి? బహువిరుద్ధ విషయ సమన్వయం. ఇదే కావ్య శిల్పం, జీవిత శిల్పమున్నూ, సుఖదుఃఖ ద్వంద్వ సమన్వయమే జీవిత శిల్పం. కావ్య శిల్పమూ ఇంతే. 1) ఇహ+పరలోక సమన్వయం. 2) వ్యష్టి సమష్టి విశ్వ సమన్వయం. 3) విరుద్ధ రస సమన్వయం.

1. ఇహపర సమన్వయమే తాత్త్వికంగా హరిహరనాథ తత్త్వంగా రూపించబడటం ద్రష్టవ్యం .

3. ఇదే రస దృష్ట్యా శృంగార+శాంత సమన్వయం. ఇదే వేదాంతంలో కర్మ+జ్ఞాన సముచ్చయవాదం. ఇదే సగుణ నిర్గుణ సమన్వయమున్నూ.

2. వ్యష్టి + సమష్టి సమన్వయమంటే, నేనూ+ఇదీ=ఒకటేనన్న రహస్యం మనసులో పెట్టుకొని నేను నీ చుట్టూ వున్న సమాజంలో, ప్రకృతిలో చెట్టు పుట్టా పక్షి, పాము-వాటిలో కూడి మాడి బ్రతకటం (ఇది పంచయజ్ఞ వాదంగా స్మృతి కర్తలు పేర్కొన్నారు.

ఈ దృష్టిలో వచ్చిన సంవిధానక చక్రవర్తి గ్రంథం, బహుశా విమర్శ సంవిధానకంగా భావించవచ్చునేమో.

మరొక గ్రంథం, 'ఎఱ్ఱన సోమన్నల కవితా తారతమ్య పరిశీలన' లేదా తులనాత్మక విమర్శ. వారిద్దరి మధ్యా ఒక గజకచ్ఛ యుద్ధాన్ని ఈ శతాబ్ది ప్రారంభంలోనే విమర్శకు లారోపించుకొని పక్షపాతవైఖరి నవలంబించారు. ఇది స్పష్టమైనదే. ఒక్క విశ్వనాథ మాత్రం 'ఒకడు నాచనసోమన్న' గ్రంథంలో కేవల సోమన కావ్య శిల్ప వివేచనం చేశారు. మిగిలినవారంతా 'ఏదో ఒక పక్షావలంబనం చేసారు. ఈ నేపథ్యంలో ఈ తులనాత్మక గ్రంథం చేసిన విమర్శ ధోరణి ప్రత్యేకమైనది. ఎఱ్ఱన్న హరివంశం మూలానువాదం అది పురాణ ప్రక్రియ.

ఎఱ్ఱన్న మూలమంతా అనువదిస్తే అది పురాణమే తప్ప అన్య ప్రక్రియాబద్ధం కావటానికి వీల్లేదు కనుక, సోమన్న పురాణ కథల్లో కొన్నింటినే గ్రహించి సంవిధానక శిల్పాత్మకంగా నిర్మించినందున ఉత్తర హరివంశం నాటకీయ కావ్యం కనుక ప్రక్రియా దృష్ట్యా రెంటి మధ్యా పోలికలేదు. తులనాత్మక ప్రక్రియా విమర్శ కది దృష్టాంతం.

ఉత్తర శబ్దం సర్వోత్కృష్టమన్న అర్థంలో వ్యాఖ్యానించాలి. వంశమంటే పాంచరాత్రాగమంలోని వ్యూహమని అర్థం చెప్పి కావ్యాన్ని వ్యాఖ్యానించింది. సంవిధానక చక్రవర్తి అన్న విమర్శ గ్రంథం.

వ్యూహాలు 5. పర, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నా అనిరుద్ధములు. ఈ దృష్టిలో కావ్య నిర్మాణం చేసినందున కావ్యం ఉత్తర=ఉత్కృష్టమైన కృష్ణతత్త్వ వ్యాఖ్యానమని స్పష్టం చేస్తుంది. ఇందుకే సంవిధానక చక్రవర్తి అంటే వ్యూహతత్త్వం=హరిహరనాథతత్త్వం, తాత్త్వికమైన భూమికగా శాంతరసాత్మక కావ్యంగా నిర్మించినవాడు సోమన్న. ఎఱ్ఱన్నది పురాణ చట్టంలోది.

కనుక ప్రక్రియా విమర్శ దృష్ట్యా చూడదగ్గవాటిని అలాగే చూడాలి. దేని అందం దానిదే.

ఈ యుగం ఐతిహాసిక కవిత లేదా ఇతిహాస కవితాయుగం తప్ప కేవలం కావ్య విద్యా ఆలంకారిక కవితాయుగం కాదు. ఈ ఆధునిక ఇతిహాస స్పృహ ఈ దర్శనంలో కొట్టి వచ్చినట్లు కన్పిస్తుంది. దీనికి సంబంధించిన విమర్శ ధోరణులు ప్రతిబింబించిన గ్రంథాలు వ్యాసాలు పూర్వోక్తములే. ఇతిహాస శిల్పము ఋతు శిల్పులనీ (వ్యాసుడు) భారత కవులు రసశిల్పులనీ ఒక వేర్పాటు గీత పరిషత్కృత అనుశాసనిక ప్రతిపీఠికలో చెప్పబడినది.

(సాహిత్య ఎకాడమీ ప్రచురణ, తర్వాత విస్తృతంగా 'సంవిధానక చక్రవర్తి' అన్న గ్రంథంలో, వ్యాసాల్లో ప్రతిపాదితమై చర్చింపబడినదన్న విషయం ప్రస్తావితమే కదా).

కల్పవృక్షంలో ఈ పద్య మాసంవర్థంలో స్మరించదగ్గది

ఈ ఋషులెవ్వరు చెప్పిన
సార కథా కథన మొక్క చాయనె నడచున్

వారంతర్ద్రష్టలు బహు
ధా రూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ. అని

గంగావతరణ కథా శ్రవణానంతరం శ్రీ రామచంద్రుడు లక్ష్మణునితో అన్నమాట. ఇక్కడ ఋషి శిల్ప విషయం ప్రస్తావించబడినది.

రామాయణం ఐతిహాసికత, కల్పవృక్ష ఐతిహాసికత అన్న రెండు వ్యాసాల్లో ఇతిహాసమంటే, భారతీయ ఇతిహాసదృష్టి వేరు, ప్రాశ్చాత్య దృష్టి వేరన్నది చర్చింపబడ్డది. (చూ. పురాణ విద్య).

ఇదే దృష్టి 'వేయిపగడల మణి ప్రభలు' అన్న విమర్శ గ్రంథంలోనూ కన్పిస్తుంది. ఆధునిక ఐతిహాసంగా వ్యాఖ్యానించిన గ్రంథ మది.

ఆధునిక నాగరకతలో సృష్టిలో సమతౌల్యం లుప్తమైనదన్న సంగతికానీ, వాతావరణ కాలుష్యం క్లుప్తమైనదన్న సంగతి కానీ తెలియని వారు లేరుకదా! ప్రాచీన సంస్కృతంలో ఈ సమతౌల్యం నిత్య జీవన విధాన సూత్రంగా వున్నదన్న సంగతి మాత్రం చాలా మందికి తెలియదు. వేయి పడగల్లో చెప్పిన దిదే.

ఆధునిక, ఆధిదైవిక (అంతరిక్ష=భావలోకం) ఆధ్యాత్మిక సమన్వయమే సంప్రదాయమని కథా సంవిధానకం ద్వారా నిరూపించిన మహేతిహాసం వే.ప.అని నిరూపించబడినది ఇదే ఇతిహాసకథా సూత్రం.

అధిభౌతిక దశలో పాత్రలు, భౌతిక సామాజిక జీవన సౌఖ్యాభిలాషతో జీవించిన రాజా రంగారావు, మంత్రి రామేశ్వరరావు మొ॥ వారు. ధర్మారావు, గిరిక అరుంధతీ వంటి పాత్రలు అన్నిటికీ సమన్వయ సూత్రాలు. ఈ సూత్ర నిష్పత్తి కైన సంఘటనలు.

## 1. వృషన్నిత స్నేహ

చెట్టూ, మబ్బూ సృష్టిలో సమతౌల్య ప్రతిపాదక సూత్రాలు, వాతావరణ కాలుష్య నివారణం చేసేది చెట్టే. ఆధునిక యాంత్రిక నాగరికత రాకతో పల్లీ నాగరికత పోవటం, చెట్టు పోవటమేనని ఈ సంవిధానకం ద్వారా కవి చెప్పింది.

సుబ్బన్న పేటలో విద్యుత్తు రావటంతో చెట్టూ దాని నాశ్రయించిన పిట్ట పోయింది ఈ పిట్ట మరణ వ్యావిర్భావ కారణం దానితో వర్షాభావం, సస్యలోపం జరిగింది.

2. ఏనుగు+మోటారు రంగారావు జమిందారు అభిషేకం కోసం మద్రాసు నుండి సుబ్బన్న పేట వస్తుంటే ఏనుగు లక్ష్మణస్వామి నలంకరించుకొని స్టేషనుకు వెళ్ళాడు మావటివాడు జమీందారు మోటారెక్కాడు తప్ప ప్రాచీన రాజుల్లోగా ఏనుగెక్కలేదు. అది అవమానంగా ఏనుగు చచ్చిపోయింది. మావటి దాని కపరక్రియలు నిర్వహించి, పోయిన పెద్దకొడుకుకులాగా దుఃఖంలో తిరిగివచ్చి మంచానబడి మరణిస్తాడు.

ఈ సంఘటన వ్యావసాయిక నాగరికతలోని జంతువు ఆధునిక యంత్రాగమనంలో చచ్చి పోయిందని చెప్పటం.

ఈ విధంగా జంతువు, చెట్టూ, పోయినవి అంటే సృష్టిలో జీవశక్తి ప్రాణ శక్తి పోయాయని భావం.

నవలలో ఈ ప్రాణశక్తి ప్రతీక పసిరిక చెట్టూ, పిట్టా, మనిషి, ఈ సమన్వయం ప్రాణశక్తి సూత్రం కాగా పసిరిక దీనికి ప్రతీక.

దాంపత్యం లేదా స్త్రీ పురుష సంబంధంలో మూడంచెలు.
1. ఆధ్యాత్మికం, 2. కళాత్మకం, 3. కేవల భౌతికం,

1. అరుంధతీ ధర్మారావులు, 2. శశిరేఖాకిరీటులు, 3. మంగమ్మ+రామేశ్వరావులు గిరిక కేవలం ఆధ్యాత్మిక శృంగారం కాగా దైవ జీవసమన్వయాత్మకం దానికి సామాజిక ప్రతిబింబం అరుంధతీ ధర్మారావులు.

రాజు ఈ మహా సమన్వయగోప్త. దీని నుండి రంగారావు భ్రష్టుడు కావటం. అతడు పక్షపాతం వాతపడటమే.

ఇలాగా సంపూర్ణ మానవుడు పోయి పాక్షిక మానవుడు రావటం, ఆధునిక నాగరికత ప్రభావంగా చిత్రించిన లోకోత్తర నవల వేయిపగడలు.

కాగా ఇందులో ప్రాచీన అధునిక శాస్త్ర సమన్వయమున్నదన్న సూత్రమే ఈ విమర్శ

సూత్రం.

పశువు, పక్షి, చెట్టూ, పుట్టా=ప్రకృతి+మనిషి=సమష్టి జీవితం ఆనందమయం కాగా పశువుకీ, మనిషికీ మధ్య యంత్రం వచ్చింది. దీనిలో ఈ బృహత్సమన్వయ రూపమైన ప్రాణశక్తి సమారాధన పోయింది. ఈ ప్రాణశక్తి సస్యరూపం నుండి మనిషికి సంక్రమిస్తున్నది. ఈ ప్రాణ స్వరూప సస్యమూర్తి పసిరిక అంటే పచ్చదనం. నేటికీ పల్లెల్లో ఈ మాట నిలాగే వాడటమున్నది.

ఇందుకని వేయిపడగ లని పేరు. సహస్రి విషయాతీతమైన మానవ జీవన ప్రవంతిలో ఏ పాయకాయగా కాక అన్నిటికీ సమన్వయముండాలి.

**ఇది భారతీయ సంస్కృతి.**

పాశ్చాత్యులు ప్రత్యేకించి మనస్తత్త్వ శాస్త్ర ద్రష్టలు, స్రష్టలు సమన్వయ సూత్రానికి భారతీయ గ్రంథాలనే ఉదాహరిస్తూవచ్చారు.

**ప్రబంధం**

శ్వేత పద్మం, సాలంభంజిక, అముక్త సౌందర్యం, ఈ మూడు విమర్శ గ్రంథాల్లోనూ ప్రబంధ విమర్శ సూత్రాలు విస్తృతంగా చర్చించబడ్డాయి.

ఈ విమర్శకు రెండు ముఖా లున్నాయి.

1. లక్షణ పరామర్శ. 2. లక్షణ సమన్వయం

సాలభంజిక గ్రంథంలో ఈ సూత్రం చర్చితమైనది.

అష్టాదశ లక్షణాలు. విశ్లేషిస్తే వచ్చే సమాధాన మేమిటి?

1). నగరార్ణవ శైలర్తు చంద్రార్కో దయవర్ణనలు.

2). ఉద్యాన, సలిలక్రీడలు, మధుపాన, రతోత్సవములు. విప్రలంభ, వివాహాలు, కుమారోదయం.

3). మంత్ర దూత ప్రయాణాజి నాయకాభ్యుదయాలు.

3వ లక్షణం భావుకుడు చెప్పింది ఈ ఐదింటికి పై 13 కలిపింది దండిభా మహాలక్షణం వీర రస సంబంధమైన వర్ణనలు.

1. వలక్షణం-ప్రకృతి వర్ణనలు

2. వలక్షణం-మానవుల చేష్టా విశేషాలు శృంగార రససంబంధమైనవి 3+(1+2)=వీర శృంగార రస సంబంధమైనవి.

ప్రకృతి వర్ణనలు-ఉద్దీపన విభావాలు

చేష్టావర్ణనలు-అనుభావాలు

నాయికా నాయకులు-అలంబన విభావాలు

ప్రాచీన సమాజ రక్షకుడు - రాజు అతడు పితృత్వ ప్రతీక. మాతృత్వ ప్రతీక రాణి. సంతాన ప్రతీక ప్రజలు. అంటే ప్రభుత్వ రాష్ట్రవ్యవస్థ కుటుంబ వ్యవస్థగా పరిణమింప చేయటం. దానివల్ల రాజు ప్రజలను శాసన బద్ధులను చేస్తున్నది కుటుంబంలో ప్రేమ పాశం ద్వారా. నిజానికి కుటుంబ వ్యవస్థ ప్రాచీనం. రాష్ట్ర వ్యవస్థ దాని పరిణామ రూపం కనుక అంతా కలిసి ఎవరి పనులు వారు సక్రమంగా నిర్వహించుకోవటం, ప్రేమ పూర్వకంగా రాష్ట్రపు బృహత్కుటుంబం వసుధైక కుటుంబమన్న సిద్ధాంతం ప్రతిపాదించిన భారత దేశ మనస్తత్వంలో రాజురాణి-అధికారిక వ్యక్తులే కాకుండా కుటుంబంలో తలిదండ్రులేనన్న సిద్ధాంతం దృష్ట్యా అలంకారికులు వీర శృంగార సమన్వయ రూప కావ్య సిద్ధాంతాన్ని రూపొందించారు. వీరమంటే రాష్ట్రవ్యవస్థ. మానవ బాహ్య జీవితం. శృంగారమంటే వైయక్తిక ఆంతరజీవితం. ఇది మనిషికి విశ్రాంతి స్థానం, అది సామాజిక జీవన భద్రతా రూపమైనది. ఇందుకే వీర శృంగార రస ప్రధానంగా ప్రబంధాన్ని నిర్మించిన ప్రాచీనుని కంటే ప్రపచంలో సామాజిక కవి ఎవ్వడు?

నగరంతో వర్ణనలు ప్రారంభం కావటంలో రహస్యం. రాష్ట్ర వ్యవస్థా కేంద్ర మదే కనుక. రామాయణ కాలంనుండి ఆదర్శ రాజ్యవ్యవస్థను గురించి మహాత్ములు చెబుతూనే ఉన్నారు. అక్కడ ప్లేటో రాజర్షి పాలకుడు కావాలన్నట్లుగానే మనకూ అదే చెప్పబడినది. ఆదర్శ రాజ్య ప్రతీక కావ్యంలో నగర వర్ణన. అయోధ్యా ద్వారకాదులు పురాణ కాలంలో, బుద్ధ దేవుని కాలంలో శ్రావస్తి, వైశాలి వంటి నగరాలు, చారిత్రక కాలంలో విజయనగరం

వంచెలి కేవల రాజధానులే కాక పుణ్యక్షేత్రాలు కావటంలో రహస్యమేమిటి ఇందుకే హంపి క్షేత్రమన్నాడు మహాకవి కొడాలి సుబ్బారావు అంటే శరీరం దేవాలయం, నగరం విశ్వం పరమాత్మ శరీర కోశాలు, అన్న బృహత్సమన్వయ సిద్ధాంతం ఇందుకే మహాకవులు నగర వర్ణనం చేస్తూ జనజీవనంలో సమిష్టి సమన్వయాన్ని చిత్రించారు.

ఈ అద్భుత ప్రణాళికను దృష్టిలో పెట్టుకొని ప్రబంధ ప్రక్రియ రసాత్మకంగా వెల్వడినది. ఇందులో శాఖలనేకం. మాహాత్మ్య కావ్యాలొకశాఖ. మనుచరిత్రాదు లోకకోవ. ప్రభావతి, కళాపూర్ణోదయం వంటివి, రాజశేఖర చరిత్రవంటి లౌకిక కావ్యాలొకతీరైనవి. ఆముక్తమాల్యద కవుల తాత్త్విక కావ్యం. (మత కావ్యం కాదు బసవపురాణాదుల్లాగా) దేనిమార్గం దానిదే. ఈ భేదపరిగణన విమర్శలోకి తెచ్చుకోవాలి.

ఆయా వర్ణన లేవిధంగా కథా దృష్టిలో ఔచితీమంతంగా రసవత్తరంగా చేయబడ్డాయో చూచి వ్యాఖ్యానించవలసిన బాధ్యత విమర్శకునిది కనుక విమర్శ కవిని సమాజంలోకి తెచ్చి వ్యాఖ్యానించటం.

పురాణం, నీతి, ధర్మ బోధకంగా కథలు చెబితే అదే కథను ఆలంకారికంగా (Aesthetical గా) చెప్పింది ప్రబంధం. కనుక, శైలి, వస్తువుల సమన్వయ రూపం ప్రబంధం. ఈ దృష్టిలో ఆముక్తమాల్యద సౌందర్యమన్న సిద్ధాంత గ్రంథావిష్కరణ జరిగింది.

ఈ గ్రంథ విమర్శ సూత్ర మేమంటే మనిషి బయటా లోపలవున్నాడు. (Psycho Social beings) బాహ్య జీవన భద్రతా వ్యవస్థ రాష్ట్రం. దీని కాధారం రాజధర్మం, అంతర జీవన భద్రతా సాధన దైవం, మతం. తత్త్వం. ఈ రెండు మానవ జీవన స్రవంతికి రెండొడ్లు. ఈ రెండు ఒడ్లను చెప్పినది ఆముక్తం. అందులో రాజనీతి, యోగం చెప్పటాని కిదే కారణం కనుక ప్రబంధం ఇతిహాసంయొక్క మరొక రూపమే (అన్నిటి కాసూత్ర మన్వయించక పోవచ్చు కాక. ఎందుకంటే పురాణ పంచలక్షణాల్లో

సర్గ ప్రతిసర్గ, మన్వంతర, వంశ, వంశానుచరితాల్లో

1. విశ్వ నిర్మాణ సూత్రం బ్లూ ప్రింటు Blue print or thought' plan
2. దాని వ్యక్తీకృతి దేశం Space ( దేశం)
3. కాలం (Time)

4-5. మానవ వంశ చరిత్రలు, ఋషులు అంతర జీవన ద్రష్టలు, రాజులు, బాహ్య జీవన రక్షకులు, వీరికథలే గానం చేయబడ్డాయి పురాణాల్లో.

ఈ ఐదింటిని దేశ-కాల-వ్యక్తులన్న త్రయము దానికి మూల కారణమైన సూత్రము. ఇదే ప్రబంధ లక్షణం. ప్రకృతి వర్ణనలు, దేశం కాగా కాలవర్ణనలు చంద్రార్కోదయాలు. నాయికా నాయకు లన్న వ్యక్తుల జీవన వర్ణనలే రసాత్మకంగా గానం చేసినది ప్రబంధం. కనుక పురాణమే ప్రబంధం. కాకపోతే ఇది ఆలంకారిక రూపం. అది బ్లూ ప్రింటు. ఆధునిక కళ వంటిది పురాణం కాగా అజంతాచిత్రం వంటిది ప్రబంధం. ఇది ఈ దర్శనంలో కన్పించే ప్రబంధ సూత్రం.

**ప్రాక్పశ్చిమ మత సమన్వయం.**

సంవిధానక చక్రవర్తి, గ్రంథంలో యూంగ్ సమన్వయ సిద్ధాంతానికి భూమికగా చైనీయులు ప్రతిపాదించిన YNG-YNG స్త్రీ పురుష సమన్వయాన్ని ఆధారంగా తీసుకొన్నాడు. కానీ ఆయన శూన్యం చూడలేదేమో. ఈశావాస్య మిదం సర్వమ్ అన్న సిద్ధాంతం గానీ అర్ధనారీశ్వర శిల్ప తత్త్వం కానీ ఏది చూచినా ఈ విరుద్ధాంశ సమన్వయ సూత్రం లభించివుండేది. భారతీయ సంస్కృతిలో సమన్వయమే సంప్రదాయం లేదా తిరగవేసి చూడవచ్చు. అదే సంప్రదాయం= సమన్వయం. దేనికి సమన్వయమంటే-విరుద్ధాంశములకు. దీన్నే శీతోష్ణశక్తుల సమన్వయంగా ఉపనిషత్తు లభివర్ణిస్తాయి. ఇదే సూత్ర దృష్ట్యా 'సాలభంజిక' అన్న విమర్శ గ్రంథం పుట్టింది.

సాలభంజిక ఒక శిల్పం. కేవలం భారతీయ దర్శనం నుండి పుట్టింది. హెన్రీమూర్ లాంటి మహాశిల్పులు మాతృత్వ మూర్తులు శిల్పించారు. వాస్తవమే యూంగ్ లాంటి వారు ANIMA-ANIMUD సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు తప్ప ఈ స్త్రీ పురుష తత్త్వ సమన్వయ సూత్రాలాధారంగా శిల్పాలు, కళలు ప్రాశ్చాత్యుడు శిల్పించుకోలేకపోయాడు.ఈ సూత్రమే సాలభంజికా, అర్ధనారీశ్వర శిల్ప సృష్టికి ప్రవస్తు భూమిక. సాలము= చెట్టు, భంజిక స్త్రీ, చెట్టు పురుష సంకేతం. స్త్రీకి తీగ సంకేతం. ఈ స్త్రీ పురుష తత్త్వమే, గీతలో క్షేత్ర క్షేత్రజ్ఞయోగంగా వర్ణింపబడినది. నాచన సోమన సంవిధానకమంటే ఇదేనని ఆ గ్రంథంలో చెప్పబడినది. సంవిధానక చక్రవర్తి సాలభంజిక అన్న నామకరణంలోని రహస్యం.

ఉపనిషత్తులు ప్రాచీన జీవ (సృష్టి) ఈశ్వర సమన్వయమే సాహిత్యసూత్రమైన రసవాదరహస్యంగా అభినవ భారతీ సిద్ధాంతంగా ఈ నవీనదర్శనము అభిప్రాయ పడుతున్నది.

రసంలో నాల్గు భావాలు స్థాయి, విభావానుభావాలు వ్యభిచారులు నాయికథా. మనిషిలో జీవ మనశ్శరీరాలు సంకల్పిత, అసంకల్పిత వ్యవస్థలున్నాయి. మనిషి చేష్టాదికం అనుభావసంపుటి మానవునకు ఆలంబనం. అతని చుట్టూ వున్న ప్రకృతి ఉద్దీపనం. సాత్త్వికాలు అసంకల్పిత చర్యలు (Action of in -voluntery system ) వ్యభిచారులు Concious mind మనస్సు నుండి పుట్టు అనుకూల ప్రతికూల భావసంపుటి. స్థాయి జీవుడు (శ్రీ అరవిందుల భాషలో చైతన్య పురుషుడు, అభినవుల భాషలో స్థాయి పురుషుడు). ఈ సమష్టి మానవుడు సంపూర్ణ మానవుడు. సాహిత్యం దీని జన్మ నుద్దేశిస్తుంది. మనిషి+ప్రకృతి=రసం. జీవుడు=శివుడు కనుకనే రసానుభవాన్ని పరమేశ్వర=స్పంద =చమత్కారానుభవంగా శ్రీగుప్తపాదులు ప్రతిపాదించారు. కేవలం మహాభైరవానుభూతి మత-యోగ ధ్యేయమైతే రసానుభూతి దీని దశలోనిది. అంటే శివదశ కేవలం తనలో తానున్న దశ. సృష్టి కుస్మూఖ దశ స్పంద. దేవీ తత్త్వ దశ. రసానుభూతి ఇక్కడ అన్వయించాడు. విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ దర్శనానుభవంలో ఉపలబ్ధమైన సత్యం. ఇక్కడే రసమన్నది జీవితంలో అన్వేషితవ్యయ మన్నది స్పష్టపడినది. విశ్వనాథ వారున్నూ సీతా దర్శనవేళ శ్రీ హనుమంతుని అనుభవాన్ని వర్ణిస్తూ సుందరంలో అన్నారు. "సర్వతేజఃఫలంబు తుదకు చూచినట్లుగ చూచితి క్షోణిజన్" ను అని . ఇదే శాంతరసమంటే లోకంలో మనిషి పొందే సర్వసుఖానుభూతులసారం రసమైతే రసభూమిక శాంతం. ఇదే శాంతరసవాదంలో శ్రీగుప్తులన్నారు. "ఉత్సాహవాదులు వివిధరత్నాల్లాగా అంతరాళంలోని సూత్రాన్ని ఉపరిక్తంచేస్తున్నట్లు శాంత (రస) సూత్రాధారంగా వివిధ స్థాయిభావా లున్నాయి. దీనిలో ఆత్మ రాగరంజితమౌతున్నది. ఇదే ఆత్మ దర్శనం. ఈ ఆత్మస్థితివల్లనే జీవితానందం లబ్ధమైనట్లు ఉత్సాహాదులకు శాంతం వల్లనే రసత్వ సిద్ధి" అని (ఈ స్థితినే శ్వేత పద్మ మన్నదీ దర్శనం. అదొక విమర్శ గ్రంథనామం). అంటే ఈ దర్శనంలో అభివ్యక్తమైన విమర్శ సూత్రం శాంతం. అదే భిన్న రసాలుగా అభివ్యక్తమైనట్లు గ్రంథనామా లున్నాయి. అవి చూచుకోవటం పాఠకుల వంతు.

ఈ దృష్టిలో ఇలియట్ చెప్పినదీ, రిచర్డ్సు వ్యాఖ్యానించిన అరిస్టోటిల్ కిథార్సిస్ వివరణ సమన్వయింపబడ్డాయి. (చూ. సాలభంజిక) ఇలియట్ లో "గతి స్థితులకు ఒక కేంద్రబిందు వున్నది. దానిచుట్టూ విశ్వ చక్రం భ్రమిస్తున్నది. ఆ స్థిర కేంద్రంలోనే నిత్యమున్నది. అక్కడే భూత భవిష్యత్తులు లీనమౌతున్నాయి. ఇత్యాది వాదమంతా రస సిద్ధాంత స్వభావమేనని నిరూపించడమైనది." (చూ. రస వజ్రం-సాలభంజిక)

ఈ రస సిద్ధాంతమే సేసానే లాంజర్ సాహిత్య సిద్ధాంతంలోనూ ఇలియట్ ప్రతిపాదించిన కోరిలిటివ్ అబ్జెక్టివ్ సిద్ధాంతంలోనూ, రిచర్డ్సు వ్యాఖ్యానించిన అరిస్టోటిల్ కెథార్సిస్ వ్యాఖ్యానంలోనూ కన్పిస్తుందని చెప్పబడింది. ఐనా భారత రస సూత్రంలోని బృహత్సమన్వయం మాత్రం వారిలో కన్పించదనీ చెప్పబడింది.

రిచర్డ్సు చెప్పిన కావ్య శబ్ద మీమాంస Emotive word- అంతా కుంతకాచార్యుల వక్రోక్తి, వక్రతావాదంలోనే గతార్థమౌతున్న దని కూడా ఈ దర్శనంలో కన్పించే మరొక కోణం.

ఈ విధంగా ఈ అభినవ భారత దర్శనం ప్రాక్పశ్చిమ సౌందర్య వాదాలను సమన్వయిస్తూనే భారతీయ సిద్ధాంతంలో నున్న విశ్వ, దైవ, మానవ సమన్వయం సాధించలేకపోయినదని తీర్మానిస్తున్నది. అంటే ఆలంకారిక వాదాలకు నిత్యత్వం సిద్ధిస్తున్నదని తాత్పర్యం.

-ooo-

# నా విమర్శ-ప్రస్థానం, ప్రయోగం

చేకూరి రామారావు

నా విమర్శ ప్రస్థాన ప్రయోగాల గురించి మాట్లాట్టానికి అందరికీ ఉండే ఉత్తమ పురుష ప్రయోగ సంకోచమేకాక నా విమర్శ పద్ధతిలోనే అంత్లరీనంగా ఉన్న ఆటంకాలు కొన్ని ఉన్నాయి. నా వృత్తి భాషా పరిశోధన. దానికి ఒక ప్రణాళిక ఉంది. సమకాలిక భాషా సిద్ధాంతాల ప్రమేయం ఉంది. సమకాలిక భాషావగాహన క్రమం అందులో అడుగడుగునా స్పష్టంగానే కనిపిస్తుంది. అట్లా నేను ప్రణాళికా బద్ధంగా చేసిన సాహిత్య విమర్శ తక్కువ. అప్పుడప్పుడు తెరలు తెరలుగా వీచే సాహిత్య పవనాలకు కొట్టుకువచ్చి పడ్డట్టుగా సాహిత్య విమర్శ చేశానా అనిపిస్తుంది. నా సాహిత్య విమర్శాంశాలను పోగుచెయటంలోనే పెద్ద ఇబ్బంది ఉంది. పాతకవుల పద్యాలను పరామర్శిస్తూ కొంత రాశాను. కొత్త కవులను పరిచయం చేస్తూ మరింత రాశాను. వ్యక్తులను ఉద్దేశించి రాసిన ప్రసంగ వ్యాసాల్లో కొంత విమర్శ ఉంటే కొందరు మరణించినప్పుడు రాసిన స్మరణ వ్యాసాల్లో మరికొంత సాహిత్య విమర్శ ఉంది. ఒకసారి ఒక కొత్త పుస్తకమో, పాత పుస్తకమో చేతికి వచ్చినప్పుడు సాహిత్య చరిత్ర దృష్టితో రాసిన వ్యాసాలున్నాయి. అన్నీ అట్టిపెట్టలేదుగాని పుస్తక సమీక్షల్లో చేసిన సాహిత్య విమర్శ ఉంది. పుస్తకాలకు రాసిన పీఠికల్లో చేసిన సాహిత్య విమర్శ ఉంది. ఇవికాక కేవలం సాహిత్య విమర్శ చేస్తున్నానన్న స్పృహతో రాసినవి ఉన్నాయి. వీటిని అన్నిటినీ గ్రహించి వేర్పరచి ఒక క్రమంలో పెట్టేపనిని ఆలస్యంగా మొదలు పెట్టాను. నా శేష జీవితకాలంలో పూర్తి అవుతుందన్న నమ్మకం కూడా లేదు.

అయినా దొరికినంతలో క్లుప్తంగా నైనా నా విమర్శ ప్రస్థానం ప్రయోగాల గురించి చెప్పమనే అవకాశాన్ని ఉపయోగించుకోదల్చుకున్నాను. సుమారు 1950 నుంచి సాహిత్యం చదివే అలవాటు ఏర్పడిందనుకుంటాను. ఆ సంవత్సరమే నరసరావుపేటలో స్కూల్ ఫైనల్ పూర్తి చేసుకున్నాను. అనిసెట్టి అగ్నివీణ, ఆరుద్ర త్వమేవాహమ్, సోమసుందర్ వజ్రాయుధం అనే కావ్యాలు, కొంచెం తరువాత నాయని సుబ్బారావుగారి సౌభద్రుని ప్రణయ యాత్ర

చదువుకున్నాను. 1950-52 ప్రాంతంలో అభ్యుదయ కవులను, భావకవులను సమాంతరంగా చదివాను. అందుకేనేమో మొదటి నుంచీ రెంటిపట్ల సమదృక్పథం ఏర్పడింది. అప్పటి నుంచీ ఛందస్తత్త్వాన్వేషణ, భాషా లక్షణ పరిశీలన, సాహిత్యానుభవగవేషణ మొదలయినాయి. 1952లో నా మొదటి ఇంటర్మీడియేట్ తప్పిన తరువాత దొరికిన కాలేజీ చదువుల విరామం, నాలో సాహిత్య విజ్ఞాన పెంపు అవకాశం ఇచ్చింది. బంధుత్వం ఏర్పడటం వల్ల కృష్ణాజిల్లా వీరులపాడులో రాకపోకలు సాగి ఆ ఊరి సీతారామ గ్రంథాలయాన్ని కొల్లగొట్టాను. ఆ ఊళ్లో పాటిబండ్ల ప్రకాశరావు అనే ఆయన ఒక రాత పత్రిక నడిపాడు. (పేరు గుర్తులేదు) దాని రెండో సంచికలో అనిసెట్టి అగ్నివీణ పై ఒక విమర్శ రాశాను. అప్పటికి నిండా 20 ఏళ్లు కూడా లేవు. అది విమర్శ అవునోకాదో తెలియదు. విమర్శ అనుకొని రాసిన మొదటి వ్యాసమది. ఇప్పుడు వ్యాసము దొరకలేదు, ఆ పత్రికా దొరకదు అందులో ఏం రాశానో గుర్తు కూడా లేదు. దాదాపు అర్థ శతాబ్దము కావస్తున్నదేమో. ఆ తరువాత చాలా కాలం సాహిత్య విమర్శ ప్రయత్నం చెయ్యలేదు.

1955 ఆంధ్ర ఉపఎన్నికలలో కమ్యూనిస్టులు చాల దారుణంగా ఓడిపోయారు. ఆ ఎన్నికల్లో శ్రీ శ్రీ కమ్యూనిస్టుల తరఫున ప్రచారం చేశారు. సాహిత్య లోకంలో శ్రీ శ్రీని ప్రతి..ాలు అనరాని మాటలు విన్నారు. అప్పుడు హైదరాబాదులో నిజామ్ కాలేజీలో చదువుతున్న వామపక్షరాజకీయాభిమానులం కొందరం కాలేజీ సాంవత్సరిక సాహిత్య సంచిక శ్రీ శ్రీ ముఖచిత్రంతో తీశాం. (1957-1958) దానిలో శ్రీ శ్రీ దేశభక్తి కవిత్వం అని ఒక వ్యాసం రాశాను. శ్రీ శ్రీ ని దేశ భక్తుడని నిరూపించే ప్రయత్నం చేశాను. చాలా ఉత్సాహంగా ఆ వ్యాసం శ్రీ శ్రీ కి పంపితే దేశ భక్తి విదేశ భక్తి అనే డిబేటింగ్ పాయింట్లకు ఇది సమయం కాదని ఆయన నన్ను సవరించారు. అప్పుడే 'తెలుగులో దేశభక్తి కవిత్వం' అనే బృహద్వ్యాసాన్ని బహుశ్రద్ధగా తయారు చేశాను. బహుశా శ్రీ శ్రీ హెచ్చరిక ప్రభావమో ఏమోకాని నాకు దేశ భక్తి కవిత్వం మీదనే కాదు, అసలు దేశ భక్తి అనే అంశం మీదనే ఆసక్తి పోయింది. అయితే ఆ సమయంలోనే మాత్ర ఛందస్సులపై నా విశ్లేషణను 1958 ఆగస్టు నెలలో అభ్యుదయంలో ప్రకటించిన తెలుగులో మాత్ర ఛందోరీతులు అనే వ్యాసం నాకు ఎక్కువ పేరుతెచ్చింది. శ్రీ శ్రీ, అబ్బూరి రామకృష్ణరావు, వరద రాజేశ్వరరావు, పఠాభి, వఝులవేంకటేశ్వర్లు వగైరా ఆధునిక గేయ ఛందస్సులలో చేసిన ప్రయోగాలను విశ్లేషించి మాత్ర ఛందోరీతులలో కొన్ని సాధారణ అంశాలను గమనించాను. అవి ఇప్పటికీ వెనుకపడ్డట్టు

కనిపించటం లేదు. అందువల్ల 1997లో విశాలాంధ్ర వారు అచ్చువేసిన ముత్యాల సరాల ముచ్చట్లు అనే పుస్తకంలో చేరింది. మొదటి పరిశోధన వ్యాసంగా దానిపై నాకు ఇంకా మోజుంది. ఆ తరువాత 1958-1961 ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ. ఆనర్సు చేసినప్పుడు గాని, 1962-1966 మధ్య అమెరికాలో విస్కాన్సిన్, కోర్నెల్ విశ్వవిద్యాలయాల్లో భాషా శాస్త్రం చదువుకొన్నప్పుడు కాని నేనేమీ రాయలేదు. దాదాపు 1968 వరకూ ఏమీ రాయనట్టే. అంటే 1958-1968 మధ్య ఒక పదేళ్ల కాలం చెప్పుకోదగిన రచన చేయలేదు. నా పరిశోధన పూర్తి అయిన తరువాత ఆ సారాంశాన్ని తెలుగులో నామ్నీకరణాలుగా 1969-70 సంవత్సరాల్లో ప్రకటించాను. 1969లో తెలుగు బహువచనాలమీద ఒక భాషా విమర్శ అందించాను. ఇవన్నీ తెలుగులో వెలుగులు అనే పుస్తకంగా ఆంధ్రసారస్వత పరిషత్తు వారు 1982లో అచ్చువేశారు. 1975లో హైదరాబాదులో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. ఆ సందర్భంగా సాహిత్య పరిషత్తు వారి కోరికపై తెలుగు వాక్యం అనే పుస్తకం రాస్తే మహాసభల సందర్భంగా 1975లో అచ్చయింది. సుమారు 1968 నుంచి ద్రావిడ భాషల వాక్యనిర్మాణంపై పరిశోధన చేస్తూనే ఉన్నాను. తెలుగు భాష ద్వారా ద్రావిడ భాషలకు అక్కడి నుంచి ప్రపంచ భాషలకు ప్రయాణించి భాషాతత్త్వ పరిశీలన చేసి సాధారణీకరణలు (Generalizations) చెయ్యటం నా భాషా పరిశోధన పద్ధతి. ఈ పద్ధతిలో చేసిన పరిశోధన ఇతర భాషావేత్తల మన్ననలు పొందింది. ఆ సందర్భంగా నేనే మొదటి సారి గమనించిన భాషాతత్త్వ విశేషాలున్నాయి. ప్రత్యక్ష పరోక్షానుకరణలను పరిశీలించి, ఇవి అన్ని భాషలల్లోనూ ఉంటాయని, వీటి పరస్పర వ్యాకరణ సంబంధాలు కూడా భాషాసామాన్యమని నిరూపించాను. అంతకు ముందు భారత భాషల్లో పరోక్షానుకరణ లేదనుకొనే వారు. అట్లాగే 'ఆమె స్నానం చేసి వారం రోజులయింది'. 'ఆమె వారం రోజుల కిందట స్నానం చేసింది'. అనే రకాలు వాక్యాలు అన్ని భాషల్లో ఉన్నాయని, వాటి మధ్య వ్యాకరణ నియమాలు కూడా అన్ని భాషల్లోనే ఒకే రకంగా ఉంటాయని నిరూపించాను. అప్పుడు ఈ వ్యాకరణ విశేషాలు తెలుగు పరిధిని విస్తరించి విశ్వవ్యాకరణంలో భాగమవుతాయి. తెలుగులో క్త్వార్థకవాక్యాలు గుప్త నిర్మాణంలో సంయోజనంగా గుర్తించాలనీ, వ్యక్త నిర్మాణంలో సంక్లిష్ట వాక్యాలుగా మారినయ్యని సూచించాను. ఏక కర్తృక కృర్ష భిన్న వ్యాపారాల కాలక్రమ బోధ కోసం క్త్వార్థక నిర్మాణం వస్తే, భిన్న కర్తృక కృతి భిన్న వ్యాపారుల కోసం చేదర్థక క్రియ వచ్చిందని సూచించాను. తెలుగులో కనిపించే

ధాతుజ విశేష నిర్మాణాలు పదనిర్మాణానికి సన్నిహితంగా ఉందని వీటిని ఉద్దేశ్య విధేయ నిర్మాణాలుగా ఊహిస్తే ఉద్దేశ్యానామానికి ధాతుజ విశేషణానికి కొన్ని కారక సంబంధాలుంటాయని అట్లా కొన్ని కారక సంబంధాలలోనే ధాతుజ విశేష క్రియతో వాక్యనిర్మాణం సాధ్యమని నిరూపించాను. ఈ నిర్మాణం, ఒరియా, బెంగాలీ భాషల్లో ఉన్నాయి. నేపాలీలో ఇవి బహువిస్తృతంగా తెలుగును మించి ప్రయోగంతో ఉన్నట్లు గమనించాను.

తెలుగు వంటి ద్రావిడ భాషల్లో కర్మణీ వాక్యాలపై మన తెలుగు పత్రికల్లో ఒక న్యూనతాభావం ఉంది. ఇది తెలుగుకు అసహజం అన్ని గిడుగు రామమూర్తి కాలం నుంచి వేధిస్తూ ఉన్నారు. వీటిని బడు వాక్యాలని వీళ్లు అంటారు. వీటిని తెలుగులో రాయటం మానెయ్యాలని అంటారు. ఈ వాక్య నిర్మాణాలు భాషా పరిణామంలో భాషావసరాలవల్ల భాషలు ఏర్పరుచుకున్నాయని, వాటిని నిర్మాణ పద్ధతిలో కాక ప్రయోగ పద్ధతిలో చూడాలని ప్రతిపాదించాను.

తెలుగు వంటి ద్రావిడ భాషల్లో క్రియా రహిత వాక్యపద్ధతి అని ఒకటుంది. ఇట్లాంటి వాక్యాల గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదించాలని కొందరు సూచించారు. అది చెల్లదని క్రియాస్తి నాస్తి విచికిత్స అనే వ్యాసంలో నిరూపించాను.

ఇతరేతరానేక భాషా విషయాలపై పరిశోధన చేసినా నామౌలిక భావనలు భాషా నిర్మాణ ప్రయోగాలమీదనే అందులో వాక్యాల మీద ఎక్కువగా ఉన్నాయి. ఇవి తెలుగులో వెలుగులు (ఆం.సా.ప.1983), తెలుగు వాక్యం (1975, 1999) భాషాంతరంగం (తె.వి.వి. 2000) భాషానువర్తనం (2000) అనే పుస్తకాలల్లో విస్తరించి ఉన్నాయి. తెలుగు పద వర్ణ నిర్మాణాలపైనా, అనువాద పద్ధతిపైనా, వచనశైలిపైనా నేను చేసిన పరిశోధనలు పై వ్యాసాల్లో విస్తరించి ఉన్నాయి. మొదటిసారిగా గుడిపాటి వేంకటచలం, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి వెంకట కృష్ణ శాస్త్రి గార్ల వచన శైలిపై వేరు వేరు వ్యాసాల్లోనూ, సార్వత్రిక విశ్వవిద్యాలయం వారికి రాసిన పాఠాల్లోనూ ఉన్నాయి.

భాషా శాస్త్రంపై పరిశోధనలు చేస్తుండగానే అప్పుడప్పుడు సాహిత్య విషయాలపై కూడా రాస్తువచ్చాను. 1968 భారతిలో కాళూరి హనుమంతరావుగారి సాహిత్య జగత్తుపై రాసిన సమీక్ష కొన్ని చర్చలను రేపింది. శ్రీ శ్రీని అర్థంచేసుకోవటంలో కొన్ని మార్గాలు

చూపించాను. పురిపండా అప్పల స్వామిగారి 'పులిపంజా' సమీక్షస్తూ శ్రీ శ్రీ ఛందః ప్రయోగంలో (పర్యాయ) ప్రయోగం ఒక పద్ధతి అని గుర్తించి చూపించాను.

ఛందస్సు విషయానికి వస్తే పద్య, గేయ వచన కవితారూపాలపై విస్తారంగా చర్చించాను. ప్రధానంగా ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యుల వారి ప్రతిపాదనలను కూలంకషంగా చర్చించి భావగణ ప్రతిపాదనను నిరాకరించాను. ఇక అంతర్లయ, ఊగు తూగు వంటి వాటికి శాస్త్రప్రతిపత్తి లేదని నిరూపించాను. ఈ చర్చలను మా సంయుక్త ప్రచురణగా 1978లో వచన పద్యం-లక్షణ చర్చ అనే చిన్న పుస్తకం వేశాను. తరువాత రాసిన వ్యాసాలలో విశాలాంధ్ర వారి ముత్యాల సరాల ముచ్చట్లు ఉన్నాయి. మరి కొన్ని ఇతర ప్రత్యేక ప్రచురణలలో ఉన్నాయి. ఛందస్సులో వరద, శ్రీశ్రీ, పఠాభి ప్రయోగాలపై రాసిన వేరు వేరు వ్యాసాలు కూడా "ముచ్చట్లు"లో ఉన్నాయి. కొన్ని వ్యాసాలలో పద్యనిర్మాణ చర్చను, కళారూపానికీ కళావస్తువుకీ ఉన్న సంబంధాల గురించి కొంత సిద్ధాంత చర్చనూ చేశాను. గేయఛందస్సులపై పరిశోధనలో లయను ప్రతిపాదిస్తూ దానికి ఊనిక విరామం ప్రధాన కారణాలని నిరూపించాను. ఈ ఊనిక, విశ్రాంతి స్థిరాంశాలు (Constants) గా కాక చర్యాంశాలు (Variable) గా ప్రవర్తిస్తాయి గనుకఛందో ఆఘాతం, (Metrical Stress) ను, ఛందోవిరామాన్ని (Metrical Silence) ని వేరుగాగుర్తించాలని ప్రతిపాదించాను. ఛందః ప్లుతి (Metrical Jump) ఛందస్సమీకరణం (Metrical assimibation) బహుళచ్ఛందః ప్రయోగత (Metrical ambiguity) వంటి కొత్త భావనలు ఛందశ్చర్చలలో ప్రవేశపెట్టాను.

భాషా ఛందోవిషయాలను కొంత సేపు ఆపి సాహిత్యవిమర్శ వైపు వెళ దాం. నిజానికి నా సాహిత్యవ్యాసాల్లో ఈ మూడింటిని విడదీయటం కష్టం. అంతేకాదు నా వ్యాసాల్లో చాలా విషయాలు ఒక దాని నుంచి ఒకటి వేరుపడవు. అన్నీ అతుక్కుపోతాయి అనముకాని ఎక్కడోచోట వేరు చేయలేనంతగా కలిసిపోతాయి.

ఈ విషయాలను ఇతరత్రా చర్చిస్తూ ఇందుకు నా ప్రపంచ దృక్పథం కారణమన్నాను. నాకు ప్రపంచం మనం విశ్లేషించిన అంశాలుగా కాక విడదీయరాని అంశాలుగా కనిపిస్తుంది. ఇందువల్ల నా ఎకడమిక్ జీవితంలో అనుకున్నంత ప్రయోజనం కూడా పొందలేకపోయాను. అయినా ఈ వయస్సులో నా దృక్పథాన్ని తగిన కారణాలు లేకుండా మానలేను. వచన పద్యంలో వ్యాకరణం పేరుతో భారతి 1980 ఫిబ్రరిలో ప్రచురింపబడిన వ్యాసంలో వాక్య

నిర్మాణ వ్యూహాలకు, వస్తువుకూ ఉన్న సంబంధాన్ని చర్చించాను. సావిత్రి కవిత్వంలో నిర్మాణ వ్యూహాలు అనే వ్యాసం (1991)లో కూడా ఈ రకమైన చర్చ జరిగింది. భాషా వ్యూహాలకూ కవిత్వ రూప నిర్మాణానికి ఉన్న సంబంధాన్ని ఈ వ్యాసాల్లో చర్చించాను.

పుస్తకాల పీఠికల్లో కొంత సాహిత్య చర్చ చేశాను. 1980లో నగ్నముని కొయ్య గుర్రానికి రాసిన పీఠిక బాగా వివాదస్పదమయింది. అందులో మొదటి సారిగా ఆధునిక మహాకావ్యం, అర్బేనిటీ అనే భావనలను సాహిత్య విమర్శలో ప్రవేశపెట్టాను.

వచన కవిత్వంలో మహాకావ్యం అనే భావన అంతకుముందు రాలేదు. మహాకావ్యం కలిగించే అనుభూతిని అందించే దీర్ఘకావ్యాన్ని ఆధునిక మహాకావ్యం అన్నాను. అట్లాగే చెరబండ రాజు జన్మహక్కు, శివసాగర్ ఉద్యమం నెలబాలుడు అనే కావ్యాల పీఠికలు కూడా చాలా కాలం చర్చనీయాంశాలయినాయి. అలా చేరా పీఠికలకు గిరాకి పెరిగి, 1964లో ఒక పుస్తకంగా వచ్చింది. వేసేవారుండాలేగాని రెండోది కూడా సిద్ధంగా ఉంది. బేతవోలు రామ బ్రహ్మంగారి కొత్త గోదావరికి రాసిన పీఠికలో దాన్ని శతకలక్షణాలున్న ఖండ కావ్యంగా అభివర్ణించాను. భారతీయాంగ్లకవితలను తెలుగు పద్యాల్లో అనువదించి పలుకు చిలుక పేరు వెలువరించారు. దానికి పీఠికలో పునస్సృజన అనే భావనను వివరించాను. ఆయనే ఆ తరువాత వెలువరించిన పద్య కవితా పరిచయం అనే పుస్తకానికి పీఠిక రాస్తూ ఆధునికులు పద్యకవిత్వాన్ని ఎందుకు అధ్యయనం చెయ్యాలో వివరించాను. పద్య కవిత్వాన్ని ఫ్యూడలిజంతో ముడిపెట్టటం అనాలోచితమని వాదించాను. ఆ తరువాత రాసిన కొన్ని వ్యాసాలలో కూడా ఈ అంశాలను విస్తారంగా వాదించాను.

నా సాహిత్య విమర్శ యాత్రలో ప్రధానమైన ఘట్టం 1986-1994 మధ్య కాలంలో ఆంధ్ర జ్యోతిలో రాసిన చేరాతలు అనే కాలమ్. నేనే క్లయిమ్ చేసినట్లుగా చేరాతలకు సిలబస్సులేదు. స్వీయానుభవాల నుంచి కావ్య విమర్శ వరకు చేశాను. యాజమాన్యంతో పోరాటం చేసి సాధించుకున్న స్వేచ్ఛవల్ల వస్తువరణానికి వ్యక్తీకరణ పద్ధతికి నియమ నిబంధనలు అడ్డు కళ్ళేలు తెగిపోయినై. దీని వల్ల నేను సాధించదల్చుకున్నవి సాధించగలిగాను.

నేను చేరాతలు రాసే కాలంలో కొత్త వ్యక్తీకరణ కోసం తహతహలాడే కొత్త తరం కవులు కవయిత్రులు విరివిగా బయలు దేరారు, అఫ్సర్, వసీరా, సీతారాం యాకూబ్, జయప్రభ, కొండే పూడి నిర్మల, ఘంటసాల నిర్మల, మరదరపు హైమావతి, పాటిబండ్ల

రజని, శివలెంక రాజేశ్వరీదేవి ఇట్లా చాల మంది కవులు, కవయిత్రులు ఆంధ్రజ్యోతి వారపత్రికలో కవితలు రాస్తే వాటిని అచ్చయీ కాకముందే నాకు ఘంటసాల ర్మల పోస్టులో పంపేది. వారపత్రిక మార్కెట్లోకి వచ్చిన మూడురోజుల్లో దానిమీద వ్యాఖ్య ఆదివారం సంచికలో వచ్చేది. ఈ పద్ధతి వల్ల కవితకూ-వ్యాఖ్యకు మధ్య అంత వ్యవధి ండేది కాదు. ఆ కవితల్ని వ్యాఖ్యానించే వాణ్ణి. పదప్రయోగౌచితిని చర్చించేవాణ్ణి. ఊహలబలాన్ని ప్రదర్శించేవాణ్ణి. ఈ పద్ధతిలో చాలా మంది కవులు కవయిత్రులను అనతి కాలంలో అశేష పాఠకులకు పరిచయమయ్యారు.

ఈ శతాబ్దపు పూర్వార్థ కవుల పద్యాలను కూడా కొన్నిటిని భావ చిత్రాల పద్ధతిలోనూ, మరికొన్నిటిని పదస్ఫూర్తి పద్ధతిలోను, మరికొన్నిటి జీవితానుభవాల స్పర్శతోనూ, ఇంకాకొన్నిటిని అర్థాంతర స్ఫూర్తి పద్ధతిలోను వ్యాఖ్యానించాను. అట్లా వ్యాఖ్యానించిన కొన్ని ఖండికలు:- విశ్వనాథ సత్యనారాయణ గారి అంధ బిక్షువు, కృష్ణశాస్త్రి గారి ఆమె కన్నులలో, నాయని సుబ్బారావుగారి వత్సలా ఫాలమున నెలవంక గురుతు అనే ఖండికనూ, శ్రీశ్రీ గారి "అవిధరాగర్భమున" అనే ఖండికను వ్యాఖ్యానించిచూపాను. ఒకే కావ్య ఖండికను విస్తారంగా భిన్న కోణాల నుంచి విమర్శించే విధానం ఈ పద్ధతి ద్వారా తెలుగులో వ్యాపించింది. అయితే ఇటీవల వారు ఈ పనిని సాగిస్తున్నట్టు కనపడటంలేదు. ఒకే వస్తువుతో వచ్చిన రెండు రచనలను తులనాత్మక పరిశీలన చేస్తుండేవాడిని. ఆంధగీతికీ-అంధబిక్షువుకీ మధ్య, శ్రీశ్రీ గారి శ్మశానం పద్యాలు, జాషువగారి శ్మశానం పద్యాలతోనూ పోల్చి చూస్తే భేదాలు చూపించాను. అట్లా వచన కవితలను కూడా పోల్చిచూపాను. ఇవన్నీ అచ్చయిన చేరాతల సంపుటంలో ఉన్నాయి. సంకలనం కానివి కూడా మరి కొన్ని ఉన్నాయి. ఇవికాక ఆయా సందర్భాల్లో రాసిన వ్యాసాలల్లోనూ సాహిత్య విమర్శ కనిపిస్తుంది. తెలుగులో అభ్యుదయ కవిత్వం భావ కవిత్వంపై తిరుగుబాటుగా రాలేదని విస్తరణగానే వచ్చిందని చాలా కావ్యాల ఆధారంగానూ, పాటిబండ మాధవశర్మ గారి M.A. ఆనర్సు వ్యాసాన్ని వ్యతిరేకంగానూ వాదించాను. సాహిత్య చరిత్ర అంటే మహాకవుల చరిత్ర కాదని కూడా వాదించాను. పాటిబండ మాధవశర్మ గారి వంటి వారి అక్షర శిల్ప ప్రతి పాదనలు అహేతుకాలని వాదించాను. ఇవేవి కొత్త సిద్ధాంతాలని చెప్పుకోవటం కాదు కాని, సాహిత్య చరిత్ర విషయంలో కొన్ని కొత్త కోణాలు చర్చించటానికి పనికి వస్తాయి.

కొందరు వ్యక్తులను ప్రశంసిస్తూ రాసిన రాతల్లో కొంత సాహిత్య విమర్శ ఉంది.

నాయని కృష్ణకుమారి, మల్లాది సుబ్బమ్మ, మోహనా, మోహనా అనే వ్యాసంలోనూ, నండూరి రామమోహనరావు, బేతవోలు రామబ్రహ్మంగారి మీద సుప్రసన్న మీద రాసినప్పుడు, వారి గ్రంథాలమీద సాహిత్య విమర్శ ఉంది.

కొందరు ఆత్మీయులు మరణించినప్పుడు రాసిన వాటిలోనూ సాహిత్య విమర్శ ఉంది. ఎ.కె. రామానుజన్, కేతవరపు రామకోటి శాస్త్రి, బొమ్మకంటి శ్రీనివాసాచారి, వరద రాజేశ్వరరావు వంటివారి మీద రాసిన వ్యాసాలు మామూలు స్మారక వ్యాసాల పరిధినిమించి సాహిత్య విమర్శకు విస్తరించాయి.

ప్రత్యేకంగా కవులమీద రాసిన వ్యాసాలు శ్రీ శ్రీ, నాయని సుబ్బారావు గార్ల గురించి ఉన్నాయి. శ్రీ శ్రీ వచన రచనల మీద, పద్య కవిత్వాలమీద, మహాప్రస్థానం నుంచి మరో ప్రస్థానం వరకు ఇట్లా చాలా రాశాను. వీనిలో స్మారక వ్యాసాలు కూడా ఉన్నాయి. నాయని సుబ్బారావు గురించి రాసిన వాటిలో ఆయన అలఘు కావ్యాల గురించి, లఘు కావ్యాల గురించి విడివిడిగా వ్యాసాలు రాశాను. శతక లక్షణ పరిశీలన చేసి నాయని సుబ్బారావుగారి వేదనా వాసుదేవము అనే కావ్యాన్ని శతకంగా నిరూపించాను. ఆయన కార్టూన్ కవిత్వాన్ని గురించి విశ్లేషించి చూపాను.

ఆ తరువాత త్రిపురనేని రామస్వామి గారి కావ్యాల గురించి కొన్ని వ్యాసాలు రాశాను. అందులో ప్రధానమైనది ఆయన హేతుకావ్య నిర్మాణ వ్యూహాలు కల్పన విచ్ఛితి (Myth destruction) కల్పన సృజన (Myth Creation) అనే పరస్పర విరుద్ధ వ్యూహాల ప్రవర్తనే ఆయన కావ్య నిర్మాణ రహస్యంగా నిరూపించాను. ఆయన ప్రధానంగా కవి, ఆ తరవాతనే హేతువాది అని వాదించాను. దువ్వూరి రామిరెడ్డి కావ్య సర్వస్వంపై రెండు సమగ్ర సమీక్షలు రాశాను. భాషా శాస్త్ర పద్ధతిలో కవిత్వ భాష అంటే ఏమిటని నిరూపించే ప్రయత్నం చేశాను.

ప్రాచీన సాహిత్యంలో సాహిత్య విమర్శ అనే వ్యాసంలో ప్రసిద్ధుల అభిప్రాయాలకు భాషాశాస్త్రం పద్ధతిలో వ్యాఖ్యానించాను. అక్షర రమ్యతను Syllabic balance గా వ్యాఖ్యానించాను. శుచిముఖి వచనాన్ని గురించి చేసిన వర్ణనలో ఆధునిక వచన రచనాలక్షణాలు నిక్షిప్తమై ఉన్నాయని చూపించాను.

నా విమర్శలు ఎక్కువ భాగం కవిత్వానికే పరిమితమైనా అరుదుగా అయినా వచనం

జోలికి పోయాను. అందులో భారతిలో ప్రచురితమైన ప్రజోద్యమ రధచక్రాలు, స్త్రీ విముక్తి పథంలో రంగనాయకమ్మ అనే వి ముఖ్యమైనవి, మొదటి వ్యాసంలో మహీధర రామోహనరావు గారు కమ్యూనిస్టు ఉద్యమాన్ని వర్ణించిన వైనాన్ని పరిశీలించాను.

రెండో దాంట్లో రంగనాయకమ్మ గారి రచనల్లో ప్రాగ్రూపాలను పరిశీలించాను. కథా సాహిత్యాన్ని గురించి ఎక్కువ రాయలేదుగాని కొన్ని కథా సంపుటులను సుప్రభాతంలో సమీక్షించాను. ఓల్గా రాజకీయ కథలపై విపుల సమీక్ష ప్రకటించాను. అక్కిరాజు ఉమాకాంతం గారి నేటి కాలపు కవిత్వానికి విపుల పీఠిక రచించే సందర్భంలో ఆయన కథలను సంపాదించి రాశాను. ఎలిగొరీ అనే కథాంతర కథా కథన పద్ధతికి ఆయన ఆద్యుడు కావచ్చునని అభిప్రాయపడ్డాను, కథా,కవిత్వం అనే కళారూపాల మూలతత్త్వ పరిశీలన చేశాను.

ఈ శతాబ్దపు పూర్వార్ధ భాగం గురించి విపులమైన సమీక్ష చేశాను. అందులో కట్టమంచి రామలింగారెడ్డి గారిని విమర్శలో ఆధునిక కవితా ప్రవర్తికునిగా సంభావించాను. అట్లాగే నేటికాలపు కవిత్వం పీఠికలో అక్కిరాజు ఉమాకాంతం గారి తర్కపద్ధతిని ప్రశంసించి ఆధునిక శాస్త్ర చర్చలతో దీటుగా నిలబడగలదని చెప్పాను. ఆయన నిర్ణయాలను కాలం నిరాకరించినా ఆయన వాద పద్ధతి గొప్పదన్నాను.

వెనక్కి తిరిగి చూచుకుంటే నా సాహిత్య విమర్శలో కొన్ని విషయాలు క్రోడీకరించవచ్చు.

1. నేను సాహిత్య సిద్ధాంతాన్ని కొత్తగా ప్రతిపాదించలేదు.
2. సాహిత్య విమర్శలో కొన్ని కొత్త భావాలను ప్రవేశపెట్టాను.
3. సాహిత్య సిద్ధాంతాన్ని గురించి విమర్శ పద్ధతులగురించి పుస్తకం రాయతలపెట్టలేదు.
4. ఎక్కువ కాలం మార్క్సిస్టు సిద్ధాంత పరిధిలోనే ఆలోచించాను. ఇటీవల కాలంలో దాని పరిమితులను కూడా గ్రహిస్తున్నాను.
5. తెలుగు సాహిత్య విమర్శలో ఏక ఖండిక పరిశీలనం భాషా వ్యూహాల పరిశీలనం, అనుభూతి మూలక విమర్శ వంటి వాటి మూలాలు పూర్వమే ఉన్నా, వాటికి ఒక ప్రమాణాన్ని కలిగించాను.

-ooo-

# తెలుగు సాహిత్య విమర్శ

# నా ప్రస్థానం - ప్రయోగం

వడలి మందేశ్వరరావు

దోషములు రెండు విధాలుగా ఉంటాయంటారు విజ్ఞులు. ఒకటి అనౌచిత్యం, రెండవది అపభ్రంశం. అనౌచిత్యంనుంచి మనల్ని రక్షించేది అలంకారశాస్త్రం, అపభ్రంశంనుంచి కాపాడేది వ్యాకరణశాస్త్రం. ఈ రెండు శాస్త్రాలను నేను ఏ గురువు దగ్గరా అధ్యయనం చేయలేదు.

మరి నేను చదువుకున్నవి: ఒకటి ఆంగ్లం, రెండవది గణితశాస్త్రం. ఆంగ్లం కూడా బి.యే. వరకే కాలేజీల్లో చదివింది. ఆ మీద అంతా ప్రైవేటుగానే. అయితే తర్వాత ది.ని.లో (ఇప్పుడది ది.ని.నీ.లి) ఆచార్య వి.కె. గోకక్ డైరెక్టరుగా ఉండగా ఒక P.G. Diploma ను చేశాను. అక్కడ అభ్యసించిన కొత్త అంశాలు Phonetics, కాస్త Linguistics.

గణితశాస్త్రంకూడా బి.యే.వరకే. ఆమీద శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కొన్నాళ్ళు Advanced Mathematics చేశాను. ఇది కనువిప్పును కలిగించింది. శాస్త్రాలన్నింటికీ గణితశాస్త్రం ఎందుకు మహారాజ్ఞి అయిందో అప్పుడు నాకు అవగతమయింది. అందులోని తర్కతీవ్రత నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

మరి తెలుగులో నేర్చింది ఎవరి దగ్గర, ఏమిటి? అంటే నిజానికి ఎవరి దగ్గరా, ఏమీ నేర్వలేదు. హైస్కూలులో 10వ తరగతిలో ఉండగానే, పెద్దన, పోతన పద్యాలూ, భర్తృహరి శతకంలోని పద్యాలు, మరికొన్నింటినీ, కమ్మగా ఉన్నాయని వల్లెవేసుకొనేవాడిని, అందులో అందం ఏమిటో తెలియకపోయినా, ఆనాడు నాకు అందంగా ఉన్నాయని తోచిన పద్యాలు నేటికీ అందంగానే కనపడుతున్నాయి. అంటే మంచి పద్యాన్ని గుర్తుపట్టే అభిరుచి కాదుకాని, instinct ఏదో ఉన్నదన్నమాట.

తర్వాత Intermediate చదువుతుండగా షేక్స్పియర్ నాటకాలు చాలా వరకూ చదివాను. కీట్స్ కవితల్ని చదివాను. A.C. Bradley 'Shakespeare Tragedy on షేక్స్పియర్ మీద Walter Raleigh వ్రాసిన పుస్తకాన్నీ, కీట్స్ ఉత్తరాలను, Sidney Celvin కీట్సు మీద వ్రాసిన పుస్తకాన్నీ, మరికొన్నింటినీ చదివాను. అరే! సాహిత్యం, విమర్శా ఇంత అందంగా ఉంటాయా అనిపించింది. తెలుగులో సాహితత్య విమర్శ ఎలా ఉంటుందో తెలుసుకోవాలని 1940లో కోరాడ రామకృష్ణయ్య గారి భారతంమీద విమర్శను చదివాను. విరాటపర్వం మీద వ్రాసింది అందంగానే ఉందికాని, ఆయన నన్నయ రచనను కించపరుస్తూ వ్రాశారు. అసలు నన్నయ భారత భాగాన్ని తిక్కన చదివే ఉండడనీ, లాంఛనంగా మాత్రం నన్నయను 'విద్యాదయితుడు' అన్నాడనీ అన్నారు. ఇది నాకు ఎంతో బాధను కలిగించింది. కాని, చాలాకాలం వరకూ భారతంమీద అంత ఆసక్తి కల్గించేటట్టు వ్రాసిన వారెవరూ లేరని అనిపించింది. తర్వాత ముస్నంగి శర్మగారి సంపాదకత్వంలో వెలువడిన తిక్కన భారతభాగాన్నీ, నండూరి బంగారయ్యగారి వ్యాసాలను చదివాను, విశ్వనాథ సరే సరి !

అయితే బి.యే.లో మాకు కోవల్లి శివకామేశ్వరరావుగారు గురువు. ఆయనతో సన్నిహిత సంబంధం ఏర్పడడానికి ఒక కారణం ఉంది. నేను 'కాళిదాసు డాంధ్రుడా?' అని శ్రమపడి వ్రాసిన వ్యాసాన్ని, కాలేజి మాగజైన్‌లో ప్రచురిస్తూ, ఆ విభాగానికి సంపాదకులుగా ఉన్న సంస్కృత శాఖలో ఉపన్యాసకులుగా ఉన్న ఈయుణ్ణి వీరవెంకట రాఘవాచార్యులు 'కాళిదాసు ఆంధ్రుడు కాడు!' అని వ్రాశారు. దీనివల్ల శివకామేశ్వరరావుగారికి నేనంటే ఆదరం పెరిగింది. నేను 'కాళిదాసు డాంధ్రుడే!' అని సమాధానం వ్రాశాను కాని, అది కొన్ని కారణాల వల్ల ప్రచురింపబడ లేదనుకోండి! అది వేరే విషయం.

శివకామేశ్వరరావుగారు నాకు నిజానికి తెలుగుకన్న ఆంగ్లానికే సాహిత్య గురువు అని చెప్పాలి. ఆయన షట్‌శాస్త్రాలనూ చదువుకున్న పండితుడు. ఆ మీద ప్రతీ సంవత్సరం మద్రాసు వెళ్లి, ఆయేడు వచ్చిన పాశ్చాత్య సాహిత్యాన్ని మథించేవారట ! వారు నన్ను, ఆంగ్ల విమర్శ క్షేత్రంలో ఆనాటికి - అంటే 1940 నాటికి కొత్తగా వచ్చిన పుస్తకాలను చదవమని చెప్పేవారు, Herbert Read, T.S. Eliot, I.A. Richards మున్నగువారి రచనలు అప్పటికి కొత్తవే. వానిని చదవమనేవారు. దురదృష్టవశాత్తు నా బిడియం వల్ల కాని, లేకపోతే వానిని ఆయనతో చర్చించి ఎంతో లబ్ధిని పొందేవాడిని. అయినా ఆయనను

కలిసికొన్నప్పుడు ఆయన చెప్పిన పది విషయాలు పదిజన్మలకు చాలు ననిపించింది. నాతొలి పుస్తకం 'అనుశీలన'ను వారికి అంకితమిచ్చాను. Posthimous గా.

**తొలి రచనలు**

అప్పటికే నాకు మౌలిక అంశాలమీద విమర్శ వ్రాయాలని ఉండేది. 'భావనాశక్తి' మీద తెలుగులోనూ, ఆంగ్లములో 'What is Poetry?', 'Keats as poet' వ్యాసాలనూ కాలేజి పత్రికలో వ్రాశాను. అప్పటికి నా అభిరుచి మీద కొంత నమ్మకం ఏర్పడి, 1942 మే నెలలో 'వరూథిని కలభాషిణులు' అన్న వ్యాసాన్ని- చివరి మూడు పేరాలు దక్క మిగతా దానిని -ఒక్క బిగిని ఎత్తిన కలాన్ని దించకుండా వ్రాశాను. పూర్తి అయిన వ్యాసాన్ని తర్వాత 'ఆనందవాణి' దీపావళి సంచికకు పంపగా, అప్పుడు ఆ పత్రికను చూస్తున్న ముద్దా విశ్వనాథం గారు 'ఇది భారతికి పంపవలసిన వ్యాస'మని, వారే భారతికి పంపారు. దానిని గురించి శరభయ్యగారు ఒక మాట అన్నారు. 'ఈ వ్యాసంలో వరూథినీ కలభాషిణులు పాత్ర చిత్రణానుశీలన ద్వారా, పెద్దన, పింగళి సూరల కళాతత్త్వాలు ఆవిష్కరింపబడ్డాయి, అని

సరే, ఈ లోగా మద్రాసులో ఉండి, 'ఆనందవాణి'లో 'సాహిత్య వీధి' శీర్షికను ప్రారంభించి, వారం వారం ఒక్కొక్క పద్యాన్ని తీసికొని, దానిలోని అందాన్ని సహృదయ రంజకంగానూ, సాధారణ పాఠకుని ఉత్సాహ పరుస్తూన్నట్టు గానూ వ్యాసాలను వ్రాశాను. అవి 'వరూథిని ఏడిచింది', 'ద్వారకలో సరసాలు', 'వట్టి గొడ్డు తాకట్టు', 'సీనయ్య విన్న శ్రీరంగనీతులు', 'ద్వితీయ యుద్ధరంగం', 'వెర్రి వేయి విధాలు' ఇత్యాదులు. తర్వాత ఆనందవాణిలో ఉద్యోగం. అందులో గిడుగు సీతాపతి, శ్రీశ్రీ, ఆంధ్రశేషగిరిరావు గారలతో పత్రికా నిర్వహణ, ఆ మీద ఉపాధ్యాయవృత్తిలోకి మారడం, 15 సంవత్సరాలు సాహిత్య ప్రవాసం. ఏమంటే కొన్ని పల్లెలలోనూ, పట్టణాలలోనూ ఉద్యోగం. దురదృష్టవశాత్తు అక్కడి అభావకులతో పరిచయంవల్ల అది నన్ను సాహిత్యపరంగా నిరుత్సాహపరచడమే కాక, నా ఆలోచనలు తప్పు అనుకునేటట్టు చేసింది.

ఆ మీద శరభయ్యగారితో పరిచయ మేర్పడింది. ఆయన నాలో భావుకుడొడున్నాడని గ్రహించారు. అది ఒక మలుపు.

**ఏది సాహిత్య విమర్శ?**

ఇక ఉండబట్టలేక 1969లో నా తొలి విమర్శ గ్రంథం 'అనుశీలన'ను ప్రచురించాను.

దానికి కారణం నాకు కనబడినంతవరకూ సాహిత్య విమర్శకు పరిమితులేమిలో విస్పష్టంగా లేకపోవడం! సాహిత్యంలో ప్రమేయమున్నవాళ్లు చాలామంది ఉన్నారు. తాళపత్రాది గ్రంథాలను పరిశీలిస్తూ, నూత్న కావ్యాన్ని వెలికి తీసికొని వచ్చేవారు కొందరు, వెలికి వచ్చిన కావ్యాన్ని పరిష్కరించి, శుద్ధ ప్రతిని తయారుచేసేవారు కొందరు, దానికి వ్యాఖ్యానాన్ని వ్రాసేవారు మరికొందరూ ఉంటారు. వీరుగాక కొన్ని కావ్యాలు వచ్చాక కవిజీవితాలను కొందరు వ్రాస్తారు. సాహిత్య చరిత్రను వ్రాయడానికి కొందరు ఉత్సహిస్తారు. వీరందరినీ మనం సాహిత్య విమర్శకు లనే అంటున్నాం. వీరు నిజానికి సాహిత్యబంధువులు. చాగంటి శేషయ్యగారివంటి కవిచరిత్రకారులు, కవి కాలాన్నీ, కావ్య కర్తృత్వాన్నీ నిర్ణయించడానికి ఎక్కువగా ఉత్సహిస్తారు. అలాగే కె.వి.ఆర్. ఆధునికాంధ్ర చరిత్రను చదువుతూంటే అది 'సాహిత్య' చరిత్రకాక, ఉద్యమాల చరిత్రలా కనబడుతుంది. ఇట్టి సాహిత్య బంధువుల కృషిని కావలిస్తే, సాహిత్య విమర్శకు పొలిమేరలలో ఉన్న 'విమర్శలోని కొన్ని విభాగాలు' అనుకోవచ్చు. కాని, అసలైన సాహిత్య విమర్శకుడు కావ్యానుశీలన చేసేవాడు, కావ్యతత్త్వ పరిశీలన చేసేవాడు, వీళ్ళే సాహిత్య విమర్శకు కేంద్రస్థానంలో ఉండేవారు.

అయితే ఈ విమర్శ ఎట్టిదో, ఎలా ఉండాలో, ఎట్టి దానికి విమర్శ అనాలో మొదట మనం నిర్ణయించుకోవాలి. సాహిత్య విమర్శ అంటే గుణదోషవిచారణ అన్నామనుకోండి. ఈ గుణదోషవిచారణ అలంకార శాస్త్రజ్ఞులు చెప్పిన దానికే అన్వయిస్తుందా? చారిత్రక పౌరాణిక అంశాలకు కూడా అన్వయించాలా? ఇందులో వ్యాకరణ ఛందో పరిధులలోని గుణదోషాలను చేర్చాలా? ఈ జాబితా పెరిగిపోయే ప్రమాదం ఉంది. అంచేత నేను భావుకునిగా, "సాహిత్యం మనసును స్పందింపచేస్తుంది. దానికి తూర్పు పడమరలు లేవు. ఆ స్పందనలను కొలిచే సాధనమే కాదు, ఆ స్పందనలు కల్గడానికి కారణమేమి టని ఆలోచిస్తుంది విమర్శ'. అలా ఆలోచించే విమర్శ స్వరూపం ఏమయి ఉంటుందని పరిశీలించ నారంభించాను.

## మరి సాహిత్య మంటే?

సాహిత్యం మనసును స్పందింప చేస్తుంది. అది కేవలము సమాచార స్థాయిలోనే ఉండిపోదు. శరీరం గగుర్పొడుస్తుంది, ఆహం పుట్టిస్తుంది, అలాగా అని ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది, కంట తడిని పెట్టిస్తుంది, జుగుప్సను కల్గిస్తుంది, క్రోధాన్ని కల్గిస్తుంది, చిత్తమున

కొక శాంతిని కల్గిస్తుంది. అలా కల్గించి మానవస్వభావ చిత్రణ వల్లనా, తాత్త్వికచింతనాశీలం వల్లనా రాజకీయ, విప్లవాత్మక రచనల వల్లనా, స్త్రీ, దళిత వాదాల నుంచి పుట్టిన రచనల వల్ల నా అన్నది ముఖ్యం కాదు. దాని ఉత్పత్తి సాధన మెట్టిదైనా దానిని సాహిత్యంగానే అంగీకరిస్తున్నాము.

ఇది బాగానే ఉంది కాని, ఇందులో ఒక చిక్కు ఉంది. ఇది సాహిత్యాన్ని నిర్ణయించకుండా, సాహిత్యం చేసే పనిని, దాని వల్ల కల్గే ఫలితాలను నిర్ణయిస్తోంది. ఇలా ఆహా పుట్టించేది సాహిత్యమైతే, సంగీతము, నృత్యము, నాట్యము, చిత్రలేఖనము, శిల్పము కూడా అట్టి అనుభూతినే కల్గిస్తాయి. కాని, సంగీతం సాహిత్యం కాదు, సాహిత్యం సంగీతం కాదు, రెండూ ఒక దాని కొకటి పరిపోషకంగా ఉన్నా, చిత్రలేఖనం, శిల్పం సాహిత్యమన్న భ్రాంతి కల్గనే కల్గదు.

సాహిత్యంలో ఇట్టి లక్షణాన్ని, రమణీయోదాత్తతను - (Sublime) ను తొలుదొల్త చెప్పిన పాశ్చాత్య సాహిత్య విమర్శకుడు లాంగినస్. అయితే ఆయన వల్లనా '(On the Subline)' అన్న వ్యాసాన్ని సమకాలీన వక్తృత్వ ప్రమాణాలు పడిపోవడానికి కారణాలను అన్వేషించడానికే వ్రాశాడు. ఆయన హోమర్‌నూ, డెమాస్తనీస్‌నూ ఒకే గాట కట్టివేసి, వారి రచనలను మహాశక్త మొనరిస్తూ, తటిల్లతలా వర్ణితాంశాన్ని, వస్తువునూ దేదీప్యమాన మొనరించే విశిష్ట లక్షణం రమణీయోదాత్తత అన్నాడు. అంటే రమణీయోదాత్తత ప్రత్యేక కవిత్వ లక్షణం కాదని స్పష్టమవుతూనే ఉంది. అది కవిత్వ స్థితిని / అస్తిత్వాన్ని నిర్ణయించడం లేదు.

సాహిత్యమే కాకుండా, చరిత్ర, శాస్త్రం కూడా కొన్ని కొన్ని అంశాలను వివరించేటప్పుడు, శ్రోతకు, చదువరికి గగుర్పాటు కల్గవచ్చు. అందుచేత ఇది కవిత్వాన్ని నిర్ణయించడానికి సరియైన మార్గం కాదు.

అంచేత కవిత్వాన్ని నిర్ధారించడానికి మరో మార్గాన్ని అన్వేషించాలి. కవిత్వం భాషాసంబంధి అనుకోవడానికి ఎట్టి అభ్యంతరమూ ఉండదు. అంచేత భాషమీద నెరపే పనితనం వల్ల మనకు లభించేది కవిత్వం అనుకోవచ్చు.

అయితే భాషలో కొన్ని నాదాల (శబ్దాల) విలక్షణ విన్యాసం వల్ల శబ్దాలు ఏర్పడగా,

ఆ శబ్దాల కూర్పుతో వాక్యాలూ, వాక్యాల సమాహారం వల్ల ఒక పాఠమూ (Text) ఏర్పడతాయి.

కాగా నాదం మీద కనబడే పనితనం వల్లా, శబ్దాల నెన్నుకోవడంలోని నేర్పరితనం వల్ల, వాని కూర్పులోని వైలక్షణ్యం వల్ల, వాక్యాల సమాహారంలోని నగిషీతనం వల్ల కవిత్వం ఏర్పడుతోందని అనుకోవలసి ఉంటుంది.

శబ్దాల నాద విన్యాసంలో శబ్దాలంకారాలు కనబడతాయి, కూర్పులో శైలీ విశేషం గోచరిస్తుంది. శబ్దాన్ని గురించి విచారించగా అందులో అబిధా, లక్షణా, వ్యంజనా వృత్తులు గోచరిస్తాయి.

భారతీయాలంకారికుల వివేచన అంతా ఇలా గణితశాస్త్రంలోలాగే మౌలిక అంశాలనుండే ప్రారంభమవుతుంది. మరొకటి శాస్త్రములో నీవు కొన్ని స్వయం సిద్ధములను ఏర్పరచుకొంటావు. స్వయం సిద్ధముల ఉనికిని ప్రశ్నించడం ఉండదు. వాని అస్తిత్వం ప్రత్యక్షమే - సిద్ధమే- కాని నిరూపణకు సాధ్యమైనవి కావు. దీనిని ఆధారంగా చేసుకునే శాస్త్రం నిర్మింపబడుతుంది. అయితే ఈ స్వయం సిద్ధములు ఎంత తక్కువగా ఉంటే శాస్త్ర మంత కట్టుదిట్టముగా ఉంటుంది.

అలాగే కవిత్వతత్వాన్ని పర్యాలోచన చేసేటప్పుడు కూడా మనం కొన్ని స్వయంసిద్ధాలను ఏర్పరచుకొన్నాము. ఒకటి కవిత్వం భాషా సంబంధి, రెండు భాషమీద చేసే పనితనం వల్లనే కవిత్వం పుట్టుకొని వస్తుంది. అయితే కవిత్వానికి భాష మీద పనితనం ఉండడం విధేకాని, ఆ పనితనం ఉన్న అన్ని తావుల్లోనూ కవిత్వ ముండకపోవచ్చును. కవిత్వం లేని- కావ్యం కాని చోట్ల కూడా ఈ పనితనం ఉండవచ్చును. ఉపన్యాసాలలో, తాత్త్విక సిద్ధాంతాల చర్చలలో, చరిత్రలో - తుదకు సంభాషణలో కూడా ఈ లక్షణం కనబడవచ్చు. ఈ పనితనం గోచరించిన తావుల్లో శైలి కాని, వాగ్వ్యవహారం కాని, కవిత్వం కాదు కాని, కవిత్వమంత హృద్యముగా ఉంటుందని అనుకుంటాము.

మరొకటి: మనం కవిత్వాన్ని పసిగట్టిన మీదట, కవిత్వమున్నచోట అలంకారం, వ్యంగ్యం, భావచిత్రం, Irony, Paradox, Tension మున్నగునవి ఉంటాయి. అన్నీ ఒక చోట కాకపోయినా, అక్కడక్క ! అయితే ఇవి అన్నీ కాని, ఇందులో ఏకొన్నో కాని ఉన్న

చోట కవిత్వం దొరుకుతుందనుకోవడం న్యాయమే కాని, కవిత్వేతరమైన రచనల్లో కూడా ఈ లక్షణాలు కనపడవచ్చు. కాగా ఈ లక్షణాలు ఆధారంగా చేసికొని కవిత్వ అస్తిత్వాన్ని నిర్ణయించ పూనుకుంటే ఈ సూత్రం అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు రెండింటికీ లోనవుతుంది. ఏమంటే ఇవి లేని చోట కవిత్వం ఉండవచ్చు. ఉన్న చోట అది కవిత్వేతరమైన భాషాపాఠం కావచ్చు.

**కావ్య రహస్యం నిర్ణయించే నాలుగో అక్షం:**

మనం ఒప్పుకోక పోవచ్చుకాని, నాటి సర్వజ్ఞుడైన Samuel Johnson ను Boswell "అయ్యా! కవిత్వమంటే ఎట్టిది?" అని అడగగా, ఆయన "అవునండీ, ఏది కవితో చెప్పడం కన్న ఏది కవిత కాదో చెప్పడం తేలిక! మన కందరకూ కాంతి అంటే తెలుసు కాని, కాంతి అంటే ఏమిటి? అవి అడిగితే ఏమి చెప్పగలం చెప్పండి?" అన్నాడట.

భౌతిక శాస్త్రాలలో జగత్తులో స్థిరంగా ఉన్న - Phenomena అంశాలను - పరిశీలిస్తూంటే, నేడు గుణించిన ఫలితాలను రేపటికి, మార్చుకోవలసి వస్తోంది - ఒకప్పుడు న్యూటన్ చెప్పింది శాశ్వత సత్యం అనిపించింది. ఐన్‌స్టీన్ వచ్చాక అది కాదు అనిపిస్తోంది. కొత్త సిద్ధాంతాలు వచ్చాయి. ఇప్పుడు శాస్త్రజ్ఞుడు ఇదే పరమమైన సత్యమని అనడు. నేటి వరకూ పరిశీలనలో కనపడిన విషయ మిది. అంతవరకే అది సత్యం అంటారు.

ఇక కవిత్వంలో పరిస్థితీ ఇలాగే ఉంది. కవిత్వానుశీలనలో నిన్నటికి వచ్చిన ఫలితాలను నేటి అనుశీలన తలక్రిందులు చేస్తోంది. నిన్నటి ఆర్నాల్డ్‌కు, పోప్, డ్రైడన్‌లు కవులు కారు, గద్యపీఠానికి వారిని ఆచార్యులుగా చేశాడు. ఇలియట్ వచ్చి అది సరికాదన్నాడు. Metaphysical Poets లో వెనుక నెవరూ చూడని Paradox ను నేటి విరమర్శకుడు చూశాడు. కవ్తిత్వంలో లోచూపు మారుతున్న కొద్దీ, నిశిత మవుతూన్న కొద్దీ, కవిత్వాన్ని గురించి కొత్త అంశాలు బయటపడుతున్నాయి.

అందుకే నే నొక ప్రతిపాదన చేశాను. Taine (1828'93) కావ్య రహస్యమంతా జాతి (race), సామాజిక పర్యావరణ (milien), కావ్యం పుట్టిన క్షణంమీద (moment) ఆధారపడి ఉంటుందంటాడు. నేను అనేది- కావ్య రహస్యం నిర్ణయించే నాలుగో అక్షం ఒకటి ఉన్నదంటాను. అది ఆ కావ్యం పఠింపబడుతూన్న క్షణం. ఒకానొక జాతిలో, ఒకానొక

సామాజిక వాతావరణంలో, ఫలానా కాలంలో పుట్టిన కావ్యం చదువుతున్న కాలాన్ని బట్టి కొత్త అర్థాలను సంతరించి పెడుతుంది. ఏమంటే భావుకుని జాతి, పర్యావరణం, కావ్యం పఠింబడుతూన్న క్షణం కావ్యానుశీలనకు కొత్త పరిమితులను నిర్ణయిస్తాయి. వసుచరిత్రకు 19వ శతాబ్దంలో ఉన్న పరపతి నేడు లేదు. షేక్స్పియర్ హామ్లెట్ నాటకంలోని నాయకుని సందిగ్ధ మనస్థితికి నిన్న చెప్పిన కారణాలు వేరు, నేడు సైకో అనాలిసిస్‌తో Dr. Ernest Jones చేసిన అనుశీలన వేరు.

అంతేకాదు; ఒకానొక కావ్యానికి, నిర్ణీతమైన అర్థం అనేది ఉండదు, నిరర్థకంగానూ ఉండదు, విస్పష్టంగానూ ఉండదు. అది Suspended Meaning అంటే ఈ క్షణాన ఇదమిత్థమని నిర్ణయింపరాని అర్థం. పాఠమందలి అర్థం విస్పష్టంగా – explicit గా ఉండదు. The meaning is not explicit, it is only suspended. పాఠం నిర్ణీతమైనదే - అర్థమే అవగాహనను కికురిస్తుంది.

**శిల్పం**

కవిత్వం అంటే భాష మీద చూపే పనితనం అనుకొన్నాం. ఏమిటి ఈ పనితనం? అంటే శిల్పానికి మరో పేరు. ఈ మాట తరచు వినవస్తున్నా, దీని స్వరూప స్వభావాలను గురించిన వివరణ దొరకదు.

మౌలికంగా కళలన్నీ ఒకే కుటుంబానికి చెందిన వనీ, అన్నింటా సామ్యలక్షణాలు కొన్ని ఉన్నాయనీ, అన్నీ అనుకరణాత్మకమైనవనీ, ప్లేటో నుంచీ ఒక భావం ఉంది. కవిత్వం పలుక నేర్చిన చిత్తరువు అనీ, చిత్తరువు మూగపోయిన కవిత అనీ ప్లూటార్క్ భావించాడు. ఇలా కొన్ని సూక్తులను చూసుకొంటూ, శిల్పము, చిత్రలేఖనము, సంగీతములోని లక్షణాలు కవిత్వానికి ఆరోపింపబడినట్టు కనబడుతుంది. అందులో ఎంత సత్యమున్నది అని చర్చించడం కాదు. అసలు మూడు పరిమాణాలలో ఉన్న శిల్పం, రెండు పరిమాణాలలో ఉన్న చిత్రలేఖనం స్థలావధికంగా ఉండే కళలు. కాగా శిల్పం కాని, చిత్రం కాని, మొత్తము రూపమంతా ఒక్కసారిగానే సహృదయునికి సాక్షాత్కరిస్తుంది. కవిత్వం, సంగీతం కళలు కాలావధికమైనవి. అవి క్రమక్రమంగా కొంత వ్యవధిలో మాత్రమే కావ్యం మొత్తం కాని, కృతికాని సహృదయుని హృద్గోచరమవుతాయి. మాధ్యమికాలలోని ఈ భేదం వల్ల ఆ కళల పరిమితులను గురించి Lessing - Leucoon లో చర్చించాడు.

అదీగాక - శిల్పానికీ, కావ్యానికీ కొన్ని పోలికలున్నాయి. రెండింటా సౌష్ఠవం (symmetry) ఉంటుంది. అంగాంగీభావం ఉంటుంది. వీని వల్లనే రచనలో balance, order- సమతౌల్యం, క్రమబద్ధత కనబడతాయి. ఉదాహరణకు కథాకథనంలో ఒక నాయకుడు, అతని కొక మంత్రి ఉంటే, ప్రతినాయకుని శిబిరంలో వీరికి ప్రతిగా ఉన్న ప్రతినాయకుడు, వాని కొక సచివుడు కనబడతారు. ఒక అధ్యాయం ఒక సర్గ నాయకుని గురించి చెప్పేదయితే, రెండవది ప్రతినాయకుని గురించి చెప్పేది అవుతుంది.

అలాగే కావ్యం ధ్వని ప్రతిధ్వనుల సంపుటి అవుతుంది. కల్పవృక్షంలో శూర్పణఖ కథకు ప్రతిధ్వని అయోముఖి సంఘటన. రామునితో ఖరుని యుద్ధానికి ప్రతిధ్వని మకరాక్షుని యుద్ధం. ఒక్కొక్కప్పుడు ప్రతిధ్వని ముందుగానే వస్తుంది. భారతంలో లాక్షాగృహ దహనం గురించి ద్రౌపదీ స్వయంవరం వరకూ జరిగిన కథ అజ్ఞాతవాస కథకు ప్రతిధ్వని. ద్రౌపదిని సైంధవుడు అపహరించడం కీచకునికథకు ప్రతిధ్వని. అసలు కీచకవధే ఊరుభంగ కథకు ప్రతిధ్వని. దీనివల్ల ప్రధాన కథకు పుష్టి చేకూరుతుంది.

అలంకారికులు ప్రాసంగికేతివృత్తములలో పతాకాప్రకరీ భేదములను సూచించారు. అందులో ప్రతాక అనేది ప్రధాన కథకు ప్రతిధ్వని కావచ్చు. ఉదాహరణకు సుగ్రీవ చరిత్ర. (విభీషణ చరిత్ర కాకపోవచ్చు. జటాయు కథ ప్రకరి. ఇది ప్రతిధ్వని కాదు).

కావ్యంలోని కార్యావస్థలును, అర్థప్రకృతులునూ ఆలంకారికులు చర్చించారు. దీనివల్ల కథ క్రమోన్మీలనమ వుతుంది. ఇది శిల్పం.

అలాగే రెండు మూడు పాయలుగా కథను నడుపుతూ, వాని నన్నింటినీ ఏకోన్ముఖంగా చేస్తూ రచనను సాంద్రమొనరించడం కూడా శిల్పమే. స్త్రీపర్వంలో, వేర్వేరు పక్షాలకు చెందిన గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీ పాండవులనూ సన్నిహితంగా చేసింది వారి శోకం. కల్పవృక్షంలోని కిష్కింధాకాండలో వాలికథలో, అటు వాలి అనుచరులూ, అంగదుడూ, తారా, ఇటు సుగ్రీవాదులు అందరిలోని వైరం సమసిపోయి, దుఃఖంలో ఎలా కలిసిపోయారో శిల్పావధికంగా నిర్వహింపబడింది.

ఏకకాలికంగా భిన్న స్థలాలలో జరిగిన సంఘటనలను cinematographic గా ప్రదర్శించడమూ శిల్పమే. ఇది కల్పవృక్షంలోని సంశయఖండంలో కనబడుతుంది.

ఒక చిన్న కవితలో కూడా సాధారణ అంశాలతో ప్రారంభించి, ఉదాత్త దర్శనంతో ముగించవచ్చు. శ్రీశ్రీ బుక్కులలో కుక్కపిల్లా, అగ్గిపుల్లతో ప్రారంభించి ప్రపంచమొక పద్మవ్యూహం, కవిత్వమొక తీరని దాహం అంటూ దర్శనాభిముఖంగా ముగింపును సాధించాడు.

ఇలా శిల్పం అనంతముఖాలుగా ఉంటుంది. ఇది ప్రధానంగా నిర్మాణ సంబంధి. పద్యంలోని నాదవిన్యాసం, పదాల కూర్పు అక్షర శిల్పానికి సంబంధించినది. దీనివల్ల లభించేది అక్షర రమ్యత. ఛందస్సులో కనబడే వైలక్షణ్యం ఛందోశిల్పం అవుతుంది. ఇవన్నీ కవిత్వానికి కారణ మవుతాయి.

ఇక కథా శిల్పానికి సంబంధించిన అంశాలవల్ల కవి తాత్త్విక దృక్పథం, జీవితాన్ని దర్శించిన తీరు వెల్లడి అవుతాయి. కావ్య మొక మహాకావ్యంగా ఎలా పరిణమిస్తుందో గ్రహించడానికి అవకాశం కల్గుతుంది.

నేను ప్రతిపాదించిన మరొక అంశం: ఏకావ్యమయినా చదువుతోంటే మనం తొలుతగా ప్రతిస్పందించేది కవిత్వాంశకు; కావ్యం చదువుతూన్న కొద్దీ కాలావధికంగా అందులో ఆవిష్కృత మయేది అందులోని శిల్పం. కవిత్వానికి రాపిడి పెట్టే శిల్పం వల్ల, శిల్పంలోని కవితాత్మ వల్ల, కవిత్వమూ, శిల్పమూ రెండింటి పరస్పరాశ్రయం వల్ల కావ్యానికి అస్తిత్వముంటుంది. కవిత్వం లోపిస్తే ఆ రచన కావ్యమవదు, వట్టి కథ కావచ్చు. కాలావధికంగా వెల్లడి అయే శిల్పం లోపిస్తే అది కావ్యమవదు, ఏ ముక్తకమో కావచ్చు.

'శిల్పి నన్నయ' లోనూ, 'ఇది కల్పవృక్షం' లోనూ నన్నయ, విశ్వనాధలు ఎన్ని విధాల శిల్పులో పరిశీలించ ప్రయత్నించాను.

## క్లాసిక్ - రొమాంటిక్

క్లాసిసిజమ్, రొమాంటిసిజమ్ అన్న పదాలు తరచు వినిపిస్తూ ఉంటాయి. వీనిని గురించి శ్రద్ధగా ఆలోచించవలసిన అవసరం ఏర్పడింది - ముఖ్యంగా భావకవిత్వాన్ని అర్థం చేసుకునేందుకు, విశ్వనాథవంటి కవి రచనలను అంచనా వేసుకొనేందుకు. క్లాసిసిజమ్, రొమాంటిసిజమ్, రెండూ సాహిత్య స్రవంతిలో ప్రధానమైన రెండు వెల్లువలు. తొలికవి వాల్మీకి రొమాంటిస్టు, అతని కావ్యానికి అస్తిత్వం ఏర్పడగానే, అది ప్రమాణికమైనది కాగానే,

అది క్లాసిక్ అయిపోతుంది. అందులోని నిర్మాణ సూత్రాలను అన్వేషించి, తర్వాతి రచయితలు రచనలు చేస్తారు. అలాగే కాళిదాసు తొలుత రొమాంటిక్, అతని రచనల కొక ప్రామాణికత్వం ఏర్పడగా, అందులో order, balance మున్నగు లక్షణాలు కనిపిస్తాయి. కాలాంతరాన వాని మీద తిరుగుబాటు వస్తుంది. మళ్ళీ రొమాంటిక్ రచన పుట్టుకుని వస్తుంది. ఇది వెనుకటి సాహిత్య సూత్రాలకు లొంగదు. కాని జవసత్వాలున్న కావ్యమయితే ఇందులోనూ కొన్ని సాహిత్యసూత్రాలను విమర్శకుడు దర్శిస్తాడు. అప్పుడు అదీ క్లాసిక్ అయి, దాని కొక సాహిత్య పీఠం లభిస్తుంది.

పూర్వకవులలో ఈ రెండు వెల్లువల పూర్వాపరాల వల్ల సూత్నముగా వెలువడే కావ్యాలలో కూడా క్లాసిక్, రొమాంటిక్ లక్షణాలు ఎలా ఉంటాయో ఆలోచించడానికి అవకాశం కల్గుతోంది. క్లాసిక్‌లో ప్రతిభతోపాటు, వ్యుత్పత్తి అభ్యాసాలకు ప్రాముఖ్యం ఉంటుంది. రొమాంటిక్‌లో కవితావేశం (inspiration) భావోద్రేకం, భావుకత కావ్యహేతువు లవుతాయి. రోమాంటిక్ స్వేచ్ఛా ప్రియుడు మానవుని పెరుగుదలకు ఆకాశమే హద్దు అనుకుంటాడు. క్లాసిసిస్టు సంప్రదాయాన్ని అభిమానిస్తాడు. పెరుగుదలకు కొన్ని హద్దులను చూస్తాడు. రొమాంటిక్‌లో తొలి మానవుని అద్భుతదర్శనాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటాడు. అతనికి ఉభయ సంధ్యలూ, ఆషాఢమేఘమూ, కమ్మని లతాంతముల కుమ్మొనసి వచ్చు మధుపమ్ముల సుగీతనినదమ్ములు, అన్నీ అద్భుత దర్శనాన్ని కల్గిస్తాయి. ఈ యాంత్రిక నాగరికత వల్ల, సాంకేతిక విజ్ఞానం వల్ల, మనిషిలోని అద్భుత దర్శనం రూపరిపోవడాన్ని రొమాంటిక్ నిరసిస్తాడు. క్లాసిక్ రచయితలోనూ ఒక అద్భుత దర్శనం ఉంటుంది. దీని అంతస్తు వేరు. వివేకానందుడు ఒకసారి అట్లాంటిక్ మహాసముద్రం మీద ప్రయాణంచేరస్తూ నాట్య విన్యాసాన్ని నెరపే వెన్నెలను తిలకిస్తూ, "ఓహో, ఈ మాయయే ఇంత సుందరమైన దైతే, దీని వెనుకనున్న సత్య మెంత సుందరమైనదో!" అన్నాడట. సుందర వస్తు దర్శనానికి ముగ్ధుడైన వివేకానందుడు రొమాంటిక్. దాని వెనుక నున్న సత్యదర్శనాభిలాషి క్లాసిసిస్టు అనుకోవచ్చు. మరొకటి: రొమాంటిక్‌కు మానవుడే మహోన్నతుడు. కాసిసిస్టుకు దేవుడు కూడా మనిషే. లోకాన్ని కుతకుత లాడించిన రావణుని సంహరించడానికి మాధవుడే మానవుడై అవతరిస్తాడు.

**ఉపదేశం: ఆనందం**

పాశ్చాత్యదేశాలలో చీకటి యుగాలలో క్రైస్తవ మతం విశేషంగా వ్యాపించింది. దానితో బాటు మత గురువుల క్రైస్తవసన్యాసుల ప్రాబల్యం పెరిగిపోయింది. క్రైస్తవ మతబోధనకు, బైబిలులోని అంశాలకు వ్యతిరేకంగా ఉన్నవానిని సహించలేకపోయారు. దీనివల్ల విజ్ఞానశాస్త్రంతో విభేదం ఏర్పడింది. భూమిచుట్టూ సూర్యుడు తిరుగుతాడన్న బైబిలులోని భావానికి వ్యతిరేకంగా, సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమిస్తోందన్న వాదాన్ని త్రోసిపుచ్చడమే కాక, ఆ వాదాన్ని ఆశ్రయించిన వారిని inquisition బారిన పడేటట్టు చేయడానికి, ఆ శాస్త్రజ్ఞులను సజీవంగా దహనానికి పాల్పడేటట్టు చేయడానికి వెనుకాడలేదు. Galileo తాను నమ్మిన సిద్ధాంతం తప్పని క్షమార్పణ చెప్పుకొని, బ్రతికి బయట పడ్డాడు. అయితే బయటకు వస్తూ, "నేను కాదంటే మాత్రం, భూమి సూర్యుని చుట్టూ అలా సూర్యుని చుట్టూ తిరగడం మానుతుందా ఏమిటి?" అని గొణుగుకున్నాడట Galileo.

ఈ దేశంలో మతానికీ, శాస్త్రానికీ ఇట్టి వైరం ఎప్పుడూ కనబడదు. అలాగే సాహిత్యమూ అలాటి నిర్బంధంలో లేదు. కాని క్రైస్తవసన్యాసులు సాహిత్యం లౌకికమైనదనీ, నాటకాలూ, నృత్యాలూ, వాద్యాలూ, మనోరంజనాన్ని కల్గిస్తూ, సైతాను ప్రభావాన్ని ఇనుమడింపచేస్తాయన్నారు. ప్యూరిటన్లు నాటకాల్ని నిషేధించారు కూడా. 16వ శతాబ్దం నాటి Stephen Gosson "School of Abuse" అన్న గ్రంథంలో సాహిత్యం కల్గించే అపచారాన్ని వివరించాడు. ఈ పుస్తకాన్ని Sir Philip Sidney కి అంకితమిచ్చాడు. Sydney పెద్దమనిషి, అంకితాన్ని తిరస్కరించలేదు కాని ఈగ్రంథానికి సమాధానంగా "Apologie for Poetrie" అన్న తొలి ఉత్తమ ఆంగ్లవిమర్శ గ్రంథాన్ని వ్రాశాడు. కవి వస్తువు ఉత్కృష్ట ఆదర్శ రూపాన్ని కావ్యంలో ప్రతిపాదిస్తాడు. కావ్యం మనోరంజనాన్ని కల్గించినా, కావ్యంలోని Poetic Justice ను (కావ్య న్యాయాన్ని) సాధించడం వల్ల, మానవులకు ధర్మం పట్ల ఆసక్తి కల్గడం సాధ్యమవుతుం దన్నాడు. అయితే ఆ ధర్మం ఏదో నిర్ణయించేది కవి కాదు. ఆధ్యాత్మిక నాయకుడు, నీతివాది, రాజకీయవేత్త. కాని అరిస్టాటిల్ కావ్యానికున్న స్వయం వ్యక్తిత్వాన్ని విస్మరించక, కావ్యం కల్గించే మనోరంజకత్వం విశిష్టమైనదన్నాడు. అంటే సిడ్నీ సమకాలీన మతఛాందస వాదులను తృప్తి పరచడానికి

కవి స్వాతంత్ర్యాన్ని పణంగా పెట్టి, కావ్యంలోని మనోరంజకత్వాన్ని బలపరచగా, అరిస్టాటిల్ కావ్యస్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు.

పాశ్చాత్య సాహిత్య విమర్శలో కావ్యానికి పరమార్థం మనోరంజకత్వమా? ఉపదేశమా? అన్న సమస్య చిరకాలం నుంచీ ఉంది. వస్తు ప్రధానమైన కావ్యంలో ఉపదేశం, ఆకృతి ప్రధానమైన కావ్యంలో మనోరంజకం ప్రాముఖ్యం వహిస్తాయి. హోరేస్ (658 తీది) రెండింటినీ ఏకకాలంలో సాధించే రచన గొప్ప కావ్యం అవుతుందన్నాడు. కాని, దాని నెలా సాధించాలి? అన్న దానికి హోరేస్‌లో సమాధానం లేదు. భారతీయాలంకారికులు కావ్యం కాంతాసమ్మితమైనదన్నారు. కావ్యం గుణాలంకారాల వల్ల సహృదయునికి వ్యంగ్యమార్గాన ధర్మాన్ని బోధిస్తుంది. ఇందులో వస్తు ప్రధానవాదానికీ, ఆకృతి ప్రధాన వాదానికీ పరిష్కారం ఉంది. కావ్యంవల్ల కల్గే మనోరంజకత్వం ధ్వనివల్ల కల్గుతోందని అనడం వల్ల, మనోరంజకత్వానికి ఒక ఆలంకారిక easthetic - పునాది ఏర్పడింది. హోరేస్ ఉపదేశం, మనోరంజనం రెండూ ఉన్న కావ్యం ఉత్తమమైన దన్నాడు కవి. కానీ ఎందుకు ఉత్తమమైన కావ్య మవుతుందో అన్నదానికి భారతీయాలంకారికులు తీర్పులో సమాధానం ఉంది. అట్టి మనోరంజకమైన కావ్యం అధర్మ ప్రవృత్తిని కల్గిస్తే, అట్టి కావ్యాలాపములను వర్జించాలి అన్నారు ఆలంకారికులు. అంటే అందులో కావ్యాంశను కాదనక పోయినా, అది అసత్కావ్యం అని మన ఆలంకారికుల మతం - పురుషులందు పుణ్యపురుషులు వేరయినట్లు, ఇందులో కవికీ, సహృదయానికీ స్వాతంత్ర్యాన్నీ ప్రసాదించారు భారతీయాలంకారికులు.

రినేజాన్సు తర్వాత నుంచీ, మరీ ముఖ్యంగా, 18వ శతాబ్దం నుంచీ పాశ్చాత్య సాహిత్య విమర్శ పలు పోకడలు పోయింది. సాహిత్య విమర్శలో నీతివాద ధోరణి, సామాజిక దృక్పథం, మనస్తత్త్వ శాస్త్ర దృక్పథం, ఆకృతివాద ధోరణి, ప్రాగూపవాదం మున్నగునవన్నీ బయలుదేరాయి. వీని అన్నింటితో పాటు భాషాశాస్త్ర పద్ధతుల్ని అనుసరిస్తూ కొన్ని విమర్శ మార్గాలు బయలుదేరాయి. Structeralism, Deconstruction మున్నగువానిలో వీని ప్రమేయం ఉంది. Harold Bloom వినిర్మాణ బృందపు విమర్శకులలో ఒకడు. అతడు లేవదీసిన అంశాలు Post-structeralismకు చెందినవే. అతడు 1973లో వ్రాసిన Anxiety of Influence లో ఫ్రాయిడ్ ప్రతిపాదించిన Oedipus Complex తో నేటి కవి మీద పూర్వకవుల ప్రభావాన్ని పరిశీలించాడు. ప్రతికవికీ జనక స్థానంలో ఎవరో కవి ఉంటాడు. ఈ కవి జనకుని సంహరిస్తే కాని తనకు విముక్తి లేదనుకుంటాడు. అంటే వాని బారినుండి

బయటపడా లనుకుంటాడు - కీట్స్ మిల్టన్ ప్రభావం నుంచి బయటపడాలనుకున్నట్టు. కాగా బ్లూమ్ దృష్టిలో ఏ కావ్యమైనా, అలా స్వయంభువముగా ఆకాశంమీద నుంచి ఊడిపడదనీ, ఆ కావ్యానికి పాఠమనేది ఉండదనీ, పాఠాలకు పరస్పర సంబంధాలే ఉంటాయనీ చెప్పదలచుకొన్నాడు. మనం ఇంకా అంత దూరం పయనించక పోయినా, శైలీశాస్త్రం (Stylestics) లో అడుగుపెట్టడం కనబడుతుంది. విడివిడిగా ఉన్న కవితల్ని భాషాశాస్త్రంలో అధ్యయనం చేయడం కన్న, మొత్తం కావ్యాన్ని ఇలా పరిశీలించ ప్రయత్నించిన పుస్తకాలు పరిమి రామనరసింహంగారి 'ఆంధ్రమహాభారత శైలీ పరిశీలనం' ఒకటీ, వారణాసి లక్ష్మిగారి 'కిన్నెరసాని పాటల వాక్యప్రయోగవై చిత్రి' ఒకటీ కనబడుతున్నాయి.

**విమర్శ: వస్తునిష్ఠము, ఆకృతినిష్ఠము**

నా దృష్టిలో విమర్శ వస్తునిష్ఠమై కాని, ఆకృతి నిష్ఠమైకాని ఉండవచ్చు. సాహిత్యేతరమైన విజ్ఞానాన్నీ, సిద్ధాంతాలనూ ఆధారంగా చేసికొని, అవి సాహిత్యాన్ని ఎలా ప్రభావితంచేస్తాయో చూడడమూ, వానిని పరికరాలుగా వాడి సాహిత్యాన్ని అధ్యయనం చేయడమూ, వస్తునిష్ఠమైన విమర్శ అంటున్నాను. చారిత్రక, కవిజీవిత అంశాలను, ఆధారంగా సాగిన విమర్శ (Historical, Biographical Criticism), మార్క్సిస్టు విమర్శ, మనస్తత్వశాస్త్రం భూమికగా గల సైకో అనాలిటికల్, ప్రాగ్రూప విమర్శలూ, ఇటీవల వస్తున్న స్త్రీవాద, దళితవాద విమర్శలూ ఈ విభాగానికి చెందుతాయి.

ఆకృతి నిష్ఠమైన విమర్శలో సాహిత్యాన్ని ప్రధానంగా సాహిత్యంగా పరిశీలింప బడుతుంది. ఇది సాహిత్యాన్ని స్వయం ప్రతిపత్తిగల కళగా చూస్తుంది. కావ్యంలో కవి ఏమి చెప్పదలుచుకున్నాడో అది ముఖ్యం కాదు. కావ్యం ఏమి చెపుతోందో అది ముఖ్యం. కావ్యం ఇట్టి చారిత్రక సందర్భాన పుట్టడం వల్ల, ఇట్టి భావజాలం ఇందులో ఉన్నది, ఇది నాటి చారిత్రక పరిస్థితులను ప్రతిఫలిస్తోంది అని చూడడం, వస్తునిష్ఠమైన పద్ధతి. ఇట్టి భావజాలం ఇందులో ఉన్నది, ఇది నాటి చారిత్రక పరిస్థితులను ప్రతిఫలిస్తోంది అనుకోవడం ఆకృతి నిష్ఠమైన వివేచన. ఇందులో కావ్యంలోని నిర్మాణ వ్యూహాల పరిశీలన, కావ్యంలోని వివిధ భాగాల సంబంధంలో ఒదిగి ఉన్న శిల్పం, అందులోని భాషా సంబంధమైన పదప్రయోగాలు, వాక్యవిన్యాసాలు, వక్రోక్తి అలంకారం, వ్యంగ్యం, భావచిత్రాలు, ప్రతీకలు మున్నగునవన్నీ పరిశీలింపబడతాయి.

అయితే ఏ విమర్శ అయినా కేవలము వస్తునిష్ఠమై కాని, ఆకృతి నిష్ఠమై కాని ఉండదు. ఒక్కొక్కప్పుడు అది వస్తునిష్ఠమై ప్రాంరంభించి, ఆకృతి నిష్ఠముగా పరిణమిస్తుంది. కావ్యానికి భూమిక అయిన పరిస్థితులను సమీక్షిస్తూ, అవి కవిత్వంగా ఎలా అనువర్తింపబడ్డాయో పరిశీలించబడతాయి. ఉదాహరణకు స్త్రీవాద సాహిత్యానికి గల భూమికను పరిశీలించి, ఆ మీద ఆ వాదాన్ని ప్రతిష్ఠిఃచడానికి అనుసరించిన నిర్మాణ వ్యూహాలు పరిశీలించబడవచ్చు. విపర్యంగా కావ్యనిర్మాణ పరిశీలన ఫలితంగా, స్త్రీవాద మందులో ఎలా ఉన్మీలితమైందో పరిశీలిస్తుంది ఆకృతి నిష్ఠమైన విమర్శ. ఇందులో ఏది ప్రాముఖ్యం వహిస్తుందో, దానిని బట్టి అది వస్తు నిష్ఠమైన విమర్శ అని కాని, ఆకృతి నిష్ఠమైన విమర్శ అని గాని నిర్ధారించవచ్చు ననుకుంటాను.

## సమకాలీన చైతన్యం

అయితే ఏ కావ్యమయినా, అందులోని కవిత్వ, శిల్ప అంశాల వల్ల అది కావ్యమని నిర్ధరింపబడినా, దాని ఔన్నత్యం, వైశిష్ట్యం, సాహిత్యంలో దాని స్థానం సాహిత్యేతర అంశాల వల్లనే నిర్ధరింపబడుతుందని ఇలియట్ అంటాడు. భారతాన్ని నన్నయ అది హృద్యమైనదనీ, అపూర్వమైనదనీ, సమగ్రవిజ్ఞాన ప్రదమైనదనీ, అఘనిబర్హణమైదనదనీ అంటాడు. అందులోని కవిత్వాంశవల్ల అది హృద్యమవుతోంది, శిల్పం వల్ల అపూర్వమైనదై మున్నెన్నడూ గోచరించని క్రొత్త సంబంధాలు అందులో గోచరిస్తాయి. ఈ రెండూ చాలు, అది కావ్యమని నిర్ధరించడానికి. అది సమగ్ర విజ్ఞానప్రద మవడం, అఘనిబర్హణ మవడం, అందులోని సాహిత్యేతరమైన గుణాలు, వీనివల్లనే అది వట్టి కావ్యంగా మిగలక, మహాకావ్యంగా నిలచిపోయింది.

అంటే సాహిత్యేతరమైన అంశాలు కావ్యాలు ఉంటాయి. నిజానికి సాహిత్యం సమకాలీన చైతన్యాన్ని ప్రతిబింబిస్తుంది. అయితే ఈ చైతన్యం ఏమయి ఉంటుంది. 1945లో 'నేటి కవితా చైతన్యం' అన్న వ్యాసంలో ఒక ప్రతిపాదన చేశాను.

కవి సమకాలీన విజ్ఞాన, మానవీయ శాస్త్రాలలో ఏ ఒక్క దానిలోనూ నిష్ణాతుడు కాకపోవచ్చు - ప్లాటో అన్నట్టు. కాని సమకాలీన ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక సిద్ధాంతాల పట్ల స్థూలంగా అవగాహన ఏదో ఉంటుంది. దీని అన్నింటి

రాపిడులకూ లోనయిన కవి హృదయంలో ఒక అమూర్తమైన చైతన్యం ఏర్పడుతుంది. అది ఏ ఒక్క అంశాన్నీ కాక, అన్నింటినీ ఇముడ్చుకున్న దవడం వల్ల, ప్రచండ వేగంతో పరిభ్రమించే సప్తవర్ణములూ, శ్వేత వర్ణముగా భాసించినట్లుగానే, అందులో అన్నీ సమ్మిశ్రితమైపోతాయి. కవి రసవాదశక్తి వల్ల వీటి నన్నింటినీ ఇముడ్చుకున్న శ్వేత కిరణ పుంజాన్ని పోలిన కావ్యాన్ని కవి లోకానికి అందచేస్తాడు. విమర్శ కటకం ద్వారా శ్వేత కావ్య కిరణ పుంజం పరివర్తనం చెందగా, అందులోని రాజకీయ, ధార్మికాది అంశాలు విస్పష్టమవుతాయి. ఏ కావ్యంలో ఇన్ని అంశాలూ గోచరిస్తాయో, అది మహాకావ్య మవుతుంది. అయితే విద్వాన్ విశ్వం గారి 'పెన్నేటి పాట' వంటి కావ్యంలో కూడా అంత విస్తృత పరిధిలో కాకపోయినా, సమకాలీన చైతన్యం ప్రతిఫలిస్తుంది. ఇలా సమగ్ర చైతన్యం కాకపోయినా, పాక్షికమైన జీవిత దర్శనమైనా, చాలా కావ్యాలలో కనబడుతూనే ఉంటుంది. అదే దానిలోని సాహిత్యేతరమైన విశిష్ట లక్షణం.

**తులనాత్మక పరిశీలన**

ఈ శతాబ్దపు ఆరంభం నుంచీ తెలుగు విమర్శలో ఒక ధోరణి ఏర్పడింది. అది కవులను గూర్చిన తులనాత్మక పరిశీలన. దీని ఆచరణలో నాకు అభ్యంతరాలున్న అంశాలున్నాయి. నన్నయ తిక్కనలను, ఎఱ్ఱాప్రగడ నాచన సోమనలను, పెద్దన తిమ్మనలను పోల్చడం - అందులో ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అని నిరూపించ పూనుకోవడం ఔతుంది. కనబడుతోంది. అసలు విషయం ఏమంటే ఈ పరిశీలన వల్ల సాహిత్యంలో ఒక 'హైర్కారీ'ని ఏర్పరచ పూనుకోవడం. ఈ హైర్కారీ తొలుతగా క్రైస్తవ మిషనరీలలో ప్రారంభమైంది. పోప్, అతని తర్వాత కార్డినల్, ఆర్చ్‌బిషప్, బిషప్, ప్రీస్టు, పాస్టర్, సెక్స్‌టన్ -ఇలా ఉంటారు. తర్వాత దీనిని ప్రభుత్వ యంత్రాంగానికి అన్వయించారు. ఇది ఇప్పుడు సాహిత్యంలోకి ప్రవేశిస్తోంది. దీని వల్ల సాహిత్య విద్యార్థులలో నన్నయ వర్గం వారు కొందరు, తిక్కన వర్గం వారు కొందరు, శ్రీనాథ పోతన వర్గాల వారు, విశ్వనాథ కృష్ణశాస్త్రి వర్గాల వారు, శ్రీశ్రీ నారాయణబాబు వర్గాల వారూ బయలుదేరారు. సజీవులైన కవుల ప్రసక్తి తేవడం న్యాయం కాదు. దీని వల్ల నన్నయలో అగ్నులు, దర్భలు దక్క మరేవీ లేదని ఒకరంటే, తిక్కనలో మాత్రం ఏముంది? శ్మశానం - బూడిద దక్క అని మరొకరు అంటే,

నావంటి వాడు రెండింటినీ నమ్మి, ఇర్వురిలోనూ ఏమీ లేదని, ఇర్వురూ కవులు కారని భావించే ప్రమాదం ఉంది. అందుకే తెలుగుకు రాదగిన గౌరవ ప్రపత్తులు లభించడం లేదు.

అయితే ఇలాటి వివేచనకు అవకాశమే లేదా, అంటే ఉన్నది. ఆయా కవులు పోషించిన సాహిత్యపు విలువలను అంచన వేసికొని, కవులను పోల్చిస్తే, అది ఉపకారమే అవుతుంది. నన్నయ తిక్కనలు విశ్వనాథను ఆవేశించడమంటే ఏమిటో వివరిస్తూ, వారు పోషించిన విలువలను 'ఇది కల్పవృక్షం'లో వివరించాను. స్థూలంగా చెప్పాలంటే నన్నయది రమణీయోదాత్త రచన, తిక్కన బహుముఖశిల్పి. నన్నయ హృదయద్వారాన మేధకు అందుతాడు; తిక్కన మేధద్వారాన హృదయాన్ని స్పందింపచేస్తాడు. నన్నయను కించపరుస్తే హృదయం ఘోషిస్తుంది, తిక్కనను కించపరుస్తే కావ్య శిల్పాన్ని డిందుపరచినట్టవుతుంది.

## అచ్చమైన విమర్శ

అచ్చమైన కవిలాగే అచ్చమైన విమర్శకుడూ ఉంటాడు. అయితే సర్దేశాయి తిరుమలరావుగారి కొక సందేహం వచ్చింది. అచ్చమైన నీరు అంటే రంగూ, రుచీ, వాసనా ఉండవు కదా, అలాగే అచ్చమైన కవిత అంటే రుచి లేని కవిత్వమవదా? అన్నారు (నేను అచ్చమైన కవితను గురించి వ్రాస్తున్నా నంటే!). కాని వైద్యంలో ఇంజక్షను చేసేటప్పుడు, వాడే మందును అచ్చమైన నీటిలో (distilled water) కలుపుతారు. అలాగే చెప్పేది ఏమయినా, దానికి అచ్చమైన కవిత వాహక మవడం సాధ్యమే. నన్నయ, పెద్దన, కృష్ణశాస్త్రి, తిలక్ అచ్చమైన కవులే. వారి ప్రతిపాదనలకు ఏమీ లోటు రాలేదు. ఏమి చెప్పినా కవులు చెప్పినట్టుగా ఉంటుంది కాని, తాత్త్వికుడుకాని, రాజకీయవేత్తకాని, చెప్పినట్టుగా ఉండదు. అలాగే ఎండ్లూరి సుధాకర్ 'వర్తమానం'లోనూ, మహీజబీన్ 'ఆకురాలు కాలం' లోనూ అచ్చమైన కవితలు కనబడతాయి. వాళ్ళ రచనలు రంగూ, రుచీ లేనివి కాదు.

సాహిత్య - కళా సిద్ధాంతాలు వేనిని మౌనంగా స్వయం సిద్ధములుగా అంగీకరిస్తాయో, వాని మౌలిక తాత్త్విక లక్షణాలను అచ్చమైన విమర్శ పరిశీలిస్తుంది. కావ్యం చదువరి మీద నెరపే రసాయనిక చర్చ రసము అయితే రసము ఎలా పుడుతోందని అచ్చమైన విమర్శ ఆలోచిస్తుంది. అంటే భారతీయ అలంకార శాస్త్రమంతా అచ్చమైన విమర్శ అవుతోంది.

అలాగే సౌందర్యం, ఆనందం, భావనాశక్తి, మున్నగువాని స్వభావాలకు చర్చిస్తుంది. ఈ ఆలోచనలనుంచే కళ కళ కోసమే, అన్నవాదమూ, అభిరుచి విమర్శ, అభివ్యక్తి వాదము మున్నగునవి పుట్టుకొని వస్తాయి. ఇలా వచ్చిన విమర్శ అంతా సౌందర్యశాస్త్రములోని భాగము కాని, దానికి సమీపవర్తి కాని అవుతుంది.

అచ్చమైన విమర్శకునికి ప్రత్యేక సాహిత్య సిద్ధాంతాలపట్లగాని, తాత్త్విక రాజకీయ సిద్ధాంతాల పట్ల గాని పక్షపాతం ఉండదు. షేక్స్పియరుకు జీవితాన్ని అర్థం చేసుకొనేందుకు గ్రంథాల కళ్ళజోళ్ళ అవసరం లేకపోయింది. ఆయన జీవితాన్ని చూసి దానికి ప్రతిస్పందించాడు. అలాగే విమర్శకుడూ సిద్ధాంతాల సులోచనాలతో కాక సాహిత్య దృక్పథంతో సాహిత్యాన్ని అనుశీలన చేయడం అచ్చమైన విమర్శకుని పని. ఈ ప్రక్రియలో సాహిత్యాది సిద్ధాంతాలన్నీ ఆయనకు పరికరాలే కాని, వానికి ఈతడు బందీ కాడు.

నీవు దేన్ని గురించి వ్రాస్తున్నావన్నదే కాదు ప్రధానం, దానిని కవిత్వంగా మలుస్తున్నావా? లేదా? అన్నదే ముఖ్యం అన్నట్టుగానే, నీవు ఏ సిద్ధాంతాన్ని ఆవిష్కరిస్తున్నావు అన్నది కాక, అది కవిత్వంలో నుంచి పుట్టుకొని వస్తున్నదా? లేదా? అనేదే అచ్చమైన విమర్శకుని పరిశీలనలో తేలాలి.

చెప్పమన్నారు కనుక చెబుతున్నాను; ఒక వేళ విమర్శకుణ్ణే అయితే నేను అచ్చమైన విమర్శకుణ్ణి.

-ooo-

# తెలుగు సాహిత్య విమర్శ

# నా ప్రస్థానం, ప్రయోగం

ఆచార్య ఎస్వీ రామారావు

ముందుగా తెలుగు సాహిత్య విమర్శలో విమర్శకుల ప్రస్థాన ప్రయోగాల గురించి ఈ విధమైన ఉపన్యాస పరంపరను ఏర్పాటు చేయాలన్న తలంపు కలిగినందుకు జీవియస్ సాహితీ కళాపీఠం వారిని అభినందిస్తున్నాను. సృజనాత్మక రంగంలో కవులుగా, రచయితలుగా కీర్తి గడించిన వారు మరొక రచయిత ప్రసిద్ధిని చూసి అసహనాన్ని ప్రదర్శించే వాతావరణం నెలకొనివున్న తరుణంలో ఒక విమర్శకుడు సాటి విమర్శకుల కృషిని గుర్తించి దాని ప్రకాశానికి దోహదం చేస్తున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాను. ఆ విమర్శకుల కోవలో నన్నుకూడా చేర్చినందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

తెలుగు సాహిత్య విమర్శలో నా ప్రస్థానం, ప్రయోగం ఏమిటని నన్ను నేను ఆత్మ విమర్శ చేసుకుంటే సూటిగా నాకు స్ఫురించిన సమాధానాలు ఇవి - తెలుగు విమర్శ ప్రక్రియా చరిత్ర నిర్మాణానికి ప్రామాణికమైన బాట వేయటం నా ప్రయోగం. కందుకూరి నుంచి విశ్వనాథ వరకూ కొనసాగిన విమర్శ స్వరూపాన్ని విస్పష్టంగా దర్శించి విశ్లేషించటం నా ప్రస్థానం.

బాల్యంలోనే విమర్శ బీజాలు నాలో నాటుకున్నాయి. సాహిత్య విమర్శకు మూలం గ్రంథ పఠనం. మంచి పాఠకుడిని కావటమే నేను చేసుకున్న అదృష్టం. పాఠశాల విద్యార్థిగా వున్నప్పుడే తెలుగు సాహిత్యాన్ని- ముఖ్యముగా నవలా సాహిత్యాన్ని విస్తృతంగా చదివాను. పుస్తకాలు, పత్రికలు, సినిమాలు, ఈ మూడింటిలోనే బాల్యం అంతా గడిచింది. అవి తప్ప మరో ధ్యాస లేదు. లైబ్రరీలలో వున్న పుస్తకాలన్నీ గాలించటం, మార్కెట్లో దొరికే పత్రికలన్నీ కొని చదవటం, విడుదలవుతున్న సినిమాలన్నీ చూడటం, ఆనాడు నేను చేసిన ముఖ్యమైన పనులు. నేను జీవించిన వాతావరణమూ, నా మిత్రవర్గమూ అందుకు ఎంతో

దోహదం చేశాయి.

స్వాతంత్ర్యానికి ముందు జన్మించటం చేత నాటి మహనీయుల స్ఫూర్తిని అందుకొని స్వాతంత్ర్యోదయం తర్వాత మారుతున్న విలువలను గమనిస్తూ, భవిష్యత్తుకు సాగిపోతున్నాను నేను. పాత కొత్త తరాల మధ్య వారధిగా ఒక సమీక్షకుడిగా సమన్వయంతో కొనసాగటం నా కర్తవ్యంగా భావించాను. అందుకే విశ్వనాథ 'వేయిపడగల'ను ఎంత ఆసక్తిగా పరిశీలించానో శ్రీ శ్రీ 'మహాప్రస్థానా'న్ని అంతే కుతూహలంతో పఠించాను. సమన్వయం నా వ్యక్తిత్వ గుణం. అదే నా సాహిత్య విమర్శకు ఊపిరిగా నిలిచిందని నా అభిప్రాయం.

విమర్శకునిగా నా దృష్టి మొదట చలన చిత్రాలపై ప్రసరించింది. పద్నాలుగేళ్ల ప్రాయంలో (1955) సినిమా సమీక్ష వ్యాసాలు వ్రాసి పంపితే మద్రాసులోని నాటి పత్రికలు (సినిమా రంగం, చిత్రసీమ) అచ్చువేశాయి. కాలేజీ చదువుకు హైద్రాబాదుకు వచ్చిన తర్వాత కూడా గోరాశాస్త్రి గారు సంపాదకులుగా వున్న స్వతంత్ర వార పత్రికలో 'తారాపథం' శీర్షికలో హిందీ, తెలుగు చిత్ర సమీక్షలు ప్రచురితమైనాయి.

1958 నుంచి 1962 వరకు నిజాం కళాశాల విద్యార్థిగా వున్న తరుణంలో సాహిత్యంపట్ల మక్కువ ఎక్కువైంది. విశ్వనాథ, రాళ్లపల్లి వ్యాసాలు పాఠ్యాంశాలుగా వుండటంతో విమర్శ ప్రక్రియపై అభిరుచి రేకెత్తింది. ఫలితంగా నాలో బీజరూపంగా వున్న విమర్శ మొగ్గతొడిగి సాహిత్య వ్యాసరచన ప్రారంభమైంది. నిజాంకళాశాల తెలుగు సారస్వత సంచిక 'విద్యార్థి'కి నేను వ్రాసిన సంపాదకీయం ఆనాడు కృష్ణాపత్రిక సమీక్షలో ప్రత్యేకంగా ప్రస్తావించబడింది. ఆధునిక యుగంలో వెలసిన మహాకావ్యాలలో రామాయణ కల్పవృక్షంతో పాటు ఆరుద్ర 'సినీవాలి'ని కూడా చేర్చటం ఆ సంపాదకీయంలో గమనించదగిన అంశం. తెలుగు ఎం.ఏ., పూర్తిచేసి పిహెచ్.డి., చేయాలన్న ఆకాంక్ష నాలో దృఢమైంది.

1964లో ఎం.ఏ., డిగ్రీ పొందగానే "తెలుగులో సాహిత్య విమర్శ, అవతరణ వికాసములు"అన్న అంశంపై పిహెచ్.డి.కి అప్లికేషన్ పెట్టాను. ఇది నా అంతట నేను ఎన్నుకొన్న అంశం. నా ఆసక్తిని గమనించి సెలెక్షన్ కమీటి వారు దాన్ని ఆమోదించారు. నా అదృష్టంకొద్దీ పి.యు.సి. నుంచి గురువర్యులుగా వున్న ఆచార్య సి. నారాయణరెడ్డి గారు నాకు పర్యవేక్షకులుగా లభించారు. వారికి అప్పుడే పరిశోధన పర్యవేక్షకులుగా గుర్తింపు

రావటంతో వారి దగ్గర పిహెచ్.డి. కి రిజిష్టర్ చేసుకొన్న మొదటి విద్యార్థిని అయ్యాను.

నా పరిశోధనాంశం విన్నవారు "అసలు తెలుగులో విమర్శ అన్నది వుందా" అని కొందరూ, "ఇంత మహావిషయం మీద పరిశోధన సులభసాధ్యం కాదు" అని మరికొందరూ భిన్న అభిప్రాయాలు వ్యక్తం చేశారు. వాటిని గమనిస్తునే పరిశోధన రంగంలోకి దిగాను. దిగిన తర్వాత కాని అందలి ఇబ్బందులు నాకు తెలిసిరాలేదు. అప్పటికి ఒకటి రెండు వ్యాసాలు తప్ప విమర్శను ప్రక్రియగా గుర్తించిన రచనలేవీ వెలువడలేదు. అందుచేత నేను గమించవలసిన బాటను నేనే నిర్మించుకోవలసి వచ్చింది.

నా పరిశోధనకు ఎంతగానో తోడ్పడినవి గ్రంథాలయాలు అన్న విషయం నేను ఏనాటికీ మరచి పోను. ముందుగా చేరువలో వున్న యూనివర్శిటీ లైబ్రరీ, నగరంలోని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు గ్రంథాలయాలను సంప్రదించి తర్వాత రాష్ట్రంలోని ప్రసిద్ధ గ్రంథాలయాలను సందర్శించాను. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు, వేటపాలెం శారదా నికేతనం, విజయవాడ రామమోహన్ గ్రంథాలయాలలో నాకు విలువైన సమాచారం లభించింది. అంతకు ముందు కనీ, వినీ ఎరుగని విమర్శ గ్రంథాలు చూడగలిగాను. 19వ శతాబ్దికి చెందిన వివేకవర్ధని, ఆముద్రిత గ్రంథ చింతామణి మొ॥ పత్రికలు స్పృశించే అవకాశం దొరికినందుకు ఎతో ఆనందించాను. తెలుగు సాహిత్య విమర్శ చాలా వరకు పత్రికా ముఖంగానే కొనసాగిందనటం అత్యుక్తి కాదు.

అటు తర్వాత పొరుగు రాష్ట్రమైన మద్రాసులోని కానిమెరా లైబ్రరీ నుంచి తంజావూరు సరస్వతీ మహలు దాకా నా పరిశోధనయాత్ర కొనసాగింది. ఈనాటివలె ఆ రోజుల్లో యు.జి.సి. మొ॥ సంస్థల ఆర్థిక సహకారాలు లేకపోయినా ఎంతో డబ్బును వెచ్చించి ముందుకు సాగానంటే విమర్శ పై నాకున్న అభినివేశం అలాంటిది.

నేను సేకరించిన సమాచారాన్ని సమీకరించిన ..ర్వాత విమర్శ ప్రక్రియ పై నాకు స్పష్టమైన అవగాహన కలిగింది. విమర్శ స్వరూపాన్ని గురించి ఖచ్చితమైన, నిర్దిష్టమైన అభిప్రాయాలు ఏర్పడ్డాయి. నా దృష్టిలో పరిశోధన వేరు, విమర్శవేరు. విమర్శకుని కావ్య తత్త్వ ప్రకాశనం చేయటమే సాహిత్యవిమర్శ లక్ష్యం. అందువల్లనే మానవల్లి రామకృష్ణ కవి,

నిడదవోలు వేంకటరావు మున్నగు పరిశోధకులకు నేను విమర్శక స్థాయి కల్పించలేదు. లక్షణ విమర్శకు (Theoritical criticism) కాక లక్ష్యవిమర్శకు (Applied criticism) మాత్రమే ప్రాధాన్యం ఇచ్చాను. భాష, వ్యాకరణం మొ॥ లక్షణ చర్చలు శాస్త్ర సంబంధమైనవి. వాటిలో భావనా వ్యాపారానికి అవకాశం లేదు. అందుచేత అనువర్తిత విమర్శను మాత్రమే కేంద్ర బిందువుగా చేసుకొని నా సిద్ధాంత గ్రంథ రచన కొనసాగింది. ఈ దృక్పథంతోనే వేయివత్సరాల తెలుగు సాహిత్యంలో విమర్శ స్పర్శ వున్న ఘట్టాలను నిరూపించి విశ్లేషించాను.

తెలుగులో సాహిత్య విమర్శ ఒక ప్రత్యేక ప్రక్రియగా ఆధునికయుగం (19వ శతాబ్ది ఉత్తరార్ధం) లోనే రూపుదిద్దుకొన్నది. ప్రాచీనాంధ్రకవుల కావ్యావతారికల్లో చాటుపద్యాల్లో విమర్శ సూత్రప్రాయంగా అగుపిస్తున్నది కాని విశ్లేషణ, వ్యాఖ్యానం మృగ్యం. తెలుగు లక్షణ గ్రంథాలు కూడా సంస్కృత అలంకార శాస్త్రాలను అనుసరించాయ్ కాని నూత్న సిద్ధాంత ప్రతి పాదకాలు కావు. రాజాస్థానాల్లో కొనసాగిన విద్వద్గోష్ఠులు, సాహితీ చర్చలు సైతం లిఖిత రూపానికి నోచుకోలేదు. ప్రాచీన యుగంలో విమర్శకు ప్రత్యేక రూపం లభించలేదు. అందుచేత నాడు కవులు, లాక్షణికులే కాని విమర్శకులు లేరు అన్న అభిప్రాయం నాలో ఏర్పడింది.

విమర్శకు స్వతంత్ర ప్రతిపత్తితో కూడిన గ్రంథ స్వరూపం కల్పించిన ప్రథమాంధ్ర విమర్శకుడు కందుకూరి వీరేశలింగం పంతులు, కొక్కొండ వెంకట రత్నం పంతులు విరచితమైన 'విగ్రహతంత్రము' పై గుణాగుణ ప్రదర్శన సామాజికుడు అన్న పేరులో 1876లో విమర్శను వెలువరించి ఆ ప్రక్రియకు శ్రీకారం చుట్టాడు. ఒక రచయిత గ్రంథాన్ని విమర్శనీయాంశంగా గైకొని దానిపై ప్రత్యేక విమర్శ గ్రంథం రచించే ప్రక్రియకు వీరేశలింగం గారి 'విగ్రహతంత్ర విమర్శనము' నాంది పలికింది. కందుకూరికి పూర్వం కావలి రామస్వామి, సి.పి. బ్రౌన్ మొ॥ వారు కవుల చరిత్ర పరిశోధనకు, కావ్య పరిష్కరణ పద్ధతికి పునాదులు వేశారు. ఆంగ్ల భాషలో మాత్రమే కొనసాగిన ఈ కృషిని విమర్శనావతరణకు పూర్వరంగంగా నేను భావించాను.

స్వీయచరిత్ర, జీవితచరిత్ర, దేశచరిత్ర మున్నగు వచన వాఙ్మయ ప్రక్రియలకు వలెనే విమర్శ ప్రక్రియకు కూడా మార్గ దర్శకుడైన కందుకూరి గద్య వాఙ్మయ బ్రహ్మగా వాసికెక్కాడు. తొలి విమర్శగ్రంథం భాషా పరమైన ఖండన గ్రంథమే అయినా,

ప్రామాణికమైన 'ఆంధ్రకవుల చరిత్ర' ఆయన విమర్శ దృక్పథానికి గీటురాయిగా నిలుస్తుంది
'సరస్వతీ నారద విలాపం' ద్వారా సమకాలంలో ప్రబలివున్న క్షీణ ప్రబంధ ధోరణిని నిరసించి
సాహిత్య ప్రగతికి దోహదం చేసిన, ఉత్తమాభిరుచి గలిగిన సద్విమర్శకుడు కందుకూరి.

సాహితీరంగానికి పరిచయం కాకుండా మరుగున పడివున్న 19వ శతాబ్దంలోని
విమర్శకులు ఎందరో సిద్ధాంత గ్రంథం ద్వారా వెలుగులోకి వచ్చారు. పి. దక్షిణామూర్తి
వెన్నేటి రామచంద్రరావు, నింజమూరి రంగాచార్యులు ప్రభృతుల ప్రత్యేకతను ప్రప్రథమంగా
చాటి చెప్పాను. నా పరిశోధనలో నిరూపితమైన ఈ క్రింది అంశాలు విమర్శచరిత్రపై కొత్త
వెలుగులు ప్రసరించాయి.

1. తొలి విమర్శ గ్రంథ రచయిత కందుకూరి వీరేశలింగం (విగ్రహతంత్ర విమర్శనము-1876)
2. తొలి కవి విమర్శకారుడు పి. దక్షిణామూర్తి (పింగళి సూరన-1892)
3. తొలి నవలా విమర్శకుడు కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి, (వివేక చంద్రికా విమర్శనము-1896)
4. తొలి తులనాత్మక విమర్శకర్త వెన్నేటి రామచంద్రరావు. (మను వసు చరిత్ర రచనా విమర్శనము-1899)
5. తొలి నాటక విమర్శ రచయిత వేదం వేంకటరాయ శాస్త్రి (ఆంధ్రప్రసన్న రాఘవ నాటక విమర్శనము-1898)
6. నన్నయపై తొలి విమర్శ గ్రంథకర్త పునప్పాకం సుబ్రహ్మణ్య అయ్యర్ (నన్నయ భట్టారకుడు - 1910)

1974లో నా సిద్ధాంత గ్రంథం ప్రచురితమైన తర్వాత వింజమూరి రంగాచార్యులు
గారు కోవెల సంపత్కుమారాచార్య గారికి 10-6-1976న ఒక లేఖ వ్రాస్తూ అందులో ఇలా
వ్రాశారు. "మీ మిత్రులు డాక్టరు S.V. రామారావు గారి విమర్శ గ్రంథంలో మీరు
చూచియేయుందురు. నా విమర్శ అవతరణ యుగమునకు భరత వాక్యమనియు, వికాస
యుగమునకు నాందియనియు వారు వ్రాసియున్నారు. . . . . . . . మా మిత్రమండలి

ప్రోత్సాహమున నేను ఆ ఉపన్యాసము వ్రాసి బాల్యచాపలమున ప్రకటింప సాహసించితిని. తర్వాత దాని విషయమైన పట్టించుకొనయే లేదు. నేడు రామారావు గారి గ్రంథము వలన అది తిరిగి వెలుగులోనికి వచ్చినది"(చూడుము-ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ: సాంప్రదాయికరీతి, డా.కె. సంపత్కుమాచార్యులు పుట. 320) నా గ్రంథం మూలంగా ప్రచారంలోకి వచ్చి అలభ్యంగా వున్న ఈ క్రింది విమర్శరచనలను సాహిత్యభిమానుల కోర్కెపై తెలుగు విశ్వవిద్యాలయం ముద్రించిందంటే విమర్శ ప్రకాశానికి నా గ్రంథం చేసిన దోహదం అవగతమౌతుంది.

1. కందుకూరి అధిక్షేపరచనలు.
2. పింగళి సూరన - పింగళి సూరనార్యుడు (పి. దక్షిణామూర్తి, వింజమూరి రంగాచార్యులు) 1995

తెలుగు సాహిత్య విమర్శ కందుకూరితో ప్రారంభం కాగా దాని మహారంభానాకి (వికాసానికి) మార్గదర్శకుడు కట్టమంచి రామలింగారెడ్డి. 1914లో ప్రకటితమైన 'కవిత్వతత్త్వ విచారం'తో కావ్య అంతరంగ వివేచనకు, కావ్యములోని భిన్నాంశముల ఐక్యతకు ప్రాధాన్యం లభించింది. ఈ గ్రంథం గురించి విభిన్నమైన అభిప్రాయాలు వ్యక్తమైనప్పటికీ, నేను నిర్మొగమాటంగా అందులోని గుణాలతో పాటు దోషాలు కూడా ఎత్తి చూపాను. అయినా పాశ్చాత్య సిద్ధాంత ప్రభావంతో హేతువాద దృక్పథంతో నవ్య కవిత్వ ప్రోత్సాహకంగా తెలుగు సాహిత్య విమర్శను ఆధునికమైన మలుపు తిప్పిన గ్రంథంగా దాని ప్రత్యేకతను నిరూపించాను.

తెలుగు విమర్శ వికాసం విశ్వనాథలో పరిణత స్థాయిని అందుకొన్నదని నేను దృఢంగా ప్రతిపాదించిన సిద్ధాంతం. కట్టమంచిలోని ఆత్మాశ్రయ ధోరణిని అధిగమించి వస్త్వాశ్రయ ధోరణితో, వాక్యైక్యతను మించిన ఏక వాక్యత పై దృష్టిని ప్రసరించిన విమర్శకుడు విశ్వనాథ సత్యనారాయణ, చాలామంది విమర్శకుల వలె విశ్వనాథ దోషైకదృక్కు కాడు. గుణపక్షపాతి, సహృదయుల దృష్టిని కవి హృదయంపై లగ్నం చేసి కావ్యతత్త్వ వివేచన వైపు మరలించిన మార్గదర్శి సత్యనారాయణ గారు. నన్నయ, నాచన, పెద్దన, కాళిదాసు మున్నగు మహాకవులపై, భారత రామాయణాలపై, భాసుడు మొ॥ నాటక కర్తల పై, రసానందంపై ఆయన

వెలువరించిన విమర్శ గ్రంథాలు. వ్యాసాలే అందుకు ప్రత్యక్ష సాక్ష్యాలు. సృజనరంగంలోవలెనే విమర్శ క్షేత్రంలో కూడా రేడియోనాటికలు, పీఠికలు, పత్యవ్యాఖ్యలు మొ॥ వివిధ రూపాలలో విమర్శను వెలయించి ఆ ప్రక్రియకు వినూత్న ఉత్తేజం కలిగించాడు విశ్వనాథ. నా సిద్ధాంత ప్రతిపాదనకు ముందు సృజనాత్మక సాహిత్యంలో ఆయనకు లభించినంత కీర్తి విమర్శ రంగంలో వ్యాపించలేదు. నా గ్రంథం ఆ లోటును తీర్చగలిగింది. విమర్శకునికి స్వంత స్సిద్ధమైన భావుకత ఆయనలో పరమావధికి చేరటం వల్లనే నేను విశ్వనాథకు పెద్ద పీట వేశాను.

వికాసయుగంలో బహుముఖంగా పరివ్యాప్తమైన విమర్శరూపాలను 'విస్తరణ' ప్రకరణంలో విశ్లేషించి భావి పరిశోధకులకు దారి చూపాను. వ్యాస సంపుటులు, సాహిత్య చరిత్రలు, పీఠికలు, వ్యాఖ్యానాలు, లక్షణ గ్రంథాలు, భాషా పరిశోధనలు, విజ్ఞాన సర్వస్వాలు, ప్రత్యేకసంచికలు మున్నగు వానిలో చోటుచేసికొన్న విమర్శనంతా ఒక చోట గుదిగ్రుచ్చి సహృదయుల ముందుంచాను. చివరకు స్వీయ చరిత్రలు, డైరీలు, లేఖలు కూడా విడిచిపెట్టలేదు. చూడటానికి ఇది జాబితాలాగా అనిపించినా సూక్ష్మదృష్టితో పరికిస్తే వాని క్రమ పరిణామాన్ని సంక్షిప్తంగా విశ్లేషించిన తీరు ద్యోతకం అవుతుంది.

"వేయి వత్సరాల తెలుగు సాహితిని విహంగ దృష్టితో వీక్షించడమే కాకుండా వలసిన పట్టులను కుశాగ్రబుద్ధితో విశ్లేషించి, ఇంతవరకు పాయలు పాయలుగా ఉన్న విమర్శనా రీతులను ఒక చోట గుదిగ్రుచ్చి చూపి ప్రామాణిక మతితో ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించిన డా॥ రామారావు కృషి ప్రశంసనీయం" అని ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు ఈ గ్రంథ 'ఆముఖం'లో పేర్కొనటం వారి సహృదయతకు నిదర్శనం.

నా సిద్ధాంత గ్రంథం విషయ పరిమితికి లోబడి నేను సంక్షిప్తంగా అందించిన సమాచారం అనంతర విమర్శకులకు ఉపయోగకరంగా నిలచింది. ఈనాడు పీఠికలపై, వ్యాఖ్యానాలపై ప్రత్యేకమైన పరిశోధన గ్రంథాలు వెలువడ్డాయి, వెలువడుతున్నాయి. పత్రికలో ప్రచురితమైన కొన్ని వ్యాసాలను పుస్తకరూపంలో తీసుకురావలసిన ఆవశ్యకతను గురించి నేను చేసిన సూచనను గమనించి తెలుగు విశ్వవిద్యాలయం వారు 'భారతి'లో ప్రచురితమైన శ్రీపాద గోపాలకృష్ణమూర్తి వ్యాసాలను 'అర్ధశతాబ్ది ఆంధ్రకవిత్వం' (1994) అన్న గ్రంథంగా ప్రకటించారు.

సమదృష్టితో విరచితమైన విమర్శ గ్రంథంలో నా అభిప్రాయాలను విస్పష్టంగా, నిర్మొగమాటంగా వెల్లడించటానికి నేను శంకించలేదు. సాహిత్యాభిమానులు సహృదయంతో వాటిని స్వీకరించారు. కొందరు తగిన సూచనలు చేశారు. వారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. సరళ సుబోధకమైన గ్రాంథికశైలిని అవలంబించటం వల్ల నా గ్రంథం పఠనీయంగా రూపొందిందని పలువురు అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. సాహిత్య పరిశోధకులేకాక సాధారణ పాఠకులు సైతం గ్రంథాన్ని ఎంతో ఆసక్తితో చదివారు. "స్థూల దృష్టికి శుష్కంగా తోచే ఆంధ్రసాహితీ విమర్శ చరిత్రను రసాత్మకంగా సమీక్షించటం వల్ల విమర్శను గూర్చిన ఈ విమర్శ సాహిత్యేతరులకు కూడా చవులు పుట్టించే పోతలో తయారైంది" అని సి. నారాయణ రెడ్డి గారు ఉగ్గడించారు. సాహిత్య విమర్శపై అభినివేశంతో నేను చేసిన ఈ కృషి ఈ విధంగా సఫలమైనందుకు నేను ఎంతో ఆనందిస్తున్నాను.

తెలుగు సాహిత్య విమర్శ అవతరణ వికాసాలను విస్పష్టంగా వివేచించిన ప్రప్రథమ గ్రంథం కావటం వల్ల విశ్వవిద్యాలయ స్థాయిలో దీనికి ఆదరణ లభించి ప్రథమ ముద్రణ (1974) ప్రతులు తొందరగానే అయిపోయినాయి. ఏ విధమైన ఆర్థిక సహాయం లేకపోయినా- విద్యార్థులు, అభిమానులు అందించిన ప్రోత్సాహంతో విషయం Update గా వుండాలన్న సంకల్పంతో నా గ్రంథాన్ని మరి కొంత విస్తరించి ద్వితీయ పరివర్ధిత ముద్రణం (1989) ప్రకటించాను. విమర్శ క్షేత్ర విస్తరణను గమనిస్తూ వుండటం చేత మలి ముద్రణ మరి నూరు పుటలు పెరిగింది. అనుబంధంగా రూపొందిన విమర్శక సూచికలో 698 మంది విమర్శకులు చోటు చేసుకొన్నారు. వీరంతా ఉత్తమ విమర్శకులన్నది నా తాత్పర్యం కాదుగాని, తెలుగు సాహిత్య విమర్శ సౌష్ఠవాకృతిని సంతరించుకొని విస్తరించిందన్న అభిప్రాయం నాలో దృఢమైంది. మరి పది సంవత్సరాల తర్వాత నా గ్రంథం మూడవ ముద్రణలను (1999) చూఱగొనటంతో ఈ అభిప్రాయం మరింత బలపడింది. సృజనాత్మక ప్రక్రియలకు సమస్థాయిలో స్వయం ప్రతిపత్తితో విమర్శ ప్రక్రియ కూడా విశిష్టమైన స్థానాన్ని అలంకరించింది. ప్రక్రియా వికాసాన్ని గురించి ప్రత్యేక పరామర్శ గ్రంథాలు వెలువడుతూ వుండటమే అందుకు నిదర్శనం. తెలుగు సాహిత్య విమర్శలో భారతీయ సాహిత్య శాస్త్ర అనుస్యూతిని, పాశ్చాత్య విమర్శ సూత్రాల ప్రభావాన్ని ప్రామాణికంగా వివేచించి డా॥కోవెల సంపత్కుమారాచార్య (ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ: సాంప్రదాయిక రీతి), ఆచార్య

వెలువరించారు. ఇంకా వడలి మందేశ్వరరావు, డా॥ముదిగొండ వీరభద్రయ్య ప్రభృతులు ప్రత్యేకమైన అధ్యయనంతో గ్రంథరచన కావిస్తూ విమర్శ ప్రక్రియకు నూత్న చైతన్యాన్ని కలిగిస్తున్నారు.

తెలుగు విమర్శ వైశిష్ట్యాన్ని ఆంధ్రభాషేతరులకు పరిచయం చేయాలన్న ఉద్దేశ్యంతో నా గ్రంథ సారాంశాన్ని సంక్షిప్తీకరించి " The Evolution of Telugu Literary Criticism" పేరుతో ఒక ఆంగ్ల గ్రంథాన్ని (1990) ప్రకటించాను. విమర్శ ప్రక్రియా వివేచనమే కాకుండా ప్రాచీన ఆధునిక కవులు , కావ్యాలు, ప్రక్రియలపై కూడా సమాలోచనం కొనసాగించాను. 1965 నుంచి గత 35 సంవత్సరాలుగా నేను రచించిన విమర్శవ్యాసాలు మూడు సంపుటులుగా వెలువడ్డాయి. అవి 1. అన్వీక్షణం (1984), 2. సమవీక్షణం (1992), 3. అభివీక్షణం (1998). మరి కొన్ని వ్యాసాలు ప్రత్యేక సంచికలలో , పత్రికలలో ప్రచురితమైనాయి. వీనిలో ఆధునిక కవిత్వానుశీలనం ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. నవ్యకవిత్వానికి సంబంధించిన నూత్నమైన ఆలోచనలు సామసోపేతమైన ప్రతిపాదనలు ఈ వ్యాసాల్లో గోచరిస్తాయి. వానిలో సహృదయులు గమనించదగిన ముఖ్యాంశాలు కొన్ని క్రింద ప్రస్తావిస్తున్నాను.

1. జాతీయ పునరుజ్జీవన చైతన్యంతో, సామాజిక స్పందనతో సమకాలీన కవులనే కాక అనంతర కవులను కూడా గాఢంగా ప్రభావితం చేసిన రాయప్రోలునే నవ్యకవిత యుగకర్త లక్షణాలు గురజాడకంటే ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

2. భావకవుల కవితారీతులకు పాశ్చాత్య సాహిత్యం ప్రేరకంగా తోడ్పడిందే తప్ప వారి దృక్పథాలను అంతగా ప్రభావితం చేయలేదు. జాతీయ భావ ప్రభావంతోనే వారు రచనలు కొనసాగించారు. వారిలో భావదాస్యం లేదు. కాని అనంతర యుగంలో కవితా సిద్ధాంతాలు పూర్తిగా విదేశీయమైన ప్రభావంతో వెలసినట్టివే. అధివాస్తవిక అభ్యుదయ, దిగంబర, విప్లవ కవిత మొ॥నవి దేశీయమైన సాహిత్యోద్యమాలే అయినా వాని మూలాలు విదేశంలో కుదురుకున్నవే.

3. అభ్యుదయ కవితకు అవాస్తవిక కవితలో లేని బలమైన సిద్ధాంతం వుంది. అది సంప్రదాయాన్ని పూర్తిగా నిరసించలేదు. దిగంబర కవులు సంప్రదాయ విచ్ఛేదానికి పూనుకోవటం చేత చిరకాలం మనలేదు.

4. సమకాలీనుల ప్రసక్తి అన్ని కావ్యాలలోనూ అనివార్యంగా గోచరమైన విశ్వనాథ కావ్యాలలో అది విలక్షణంగా, ఆసక్తికరంగా వుంటుంది. ఆయన అవతారికలు, అంకిత పద్యాల్లో భావనాత్మకంగా, కవితామయంగా చోటు చేసుకొన్న సమకాలీనుల ప్రసక్తి ప్రత్యేక పరిశీలనార్హమైనది.

ఇంకా పద్యకవితా వైశిష్ట్యం, వచన కవితా వికాసం, ఆధునిక కవుల్లోని ఆత్మాన్వేషణ, స్వాతంత్ర్యోద్యమంలో కవుల శంఖారావం మున్నగు అంశాల వివేచన, గరిమెళ్ల, దాశరథి, నారాయణరెడ్డి, బోయి భీమన్న, కుందుర్తి మొ॥ కవుల కవితారీతుల విశ్లేషణ నూత్నకోణాలతో హృద్యంగా ఈ వ్యాసాల్లో కొనసాగింది.

నా సిద్ధాంత గ్రంథంలో ప్రత్యేక అనుశీలనకు అవకాశం లభించని విమర్శకులపై విపులమైన పరామర్శకు వ్యాసాల్లో వీలుచిక్కింది. కోరాడ రామకృష్ణయ్య, పుట్టపర్తి, దువ్వూరి, సి. నారాయణరెడ్డి, సుప్రసన్న, సంపత్కుమార, జి.వి. సుబ్రహ్మణ్యం ప్రభృతుల విమర్శ రీతుల ప్రస్తావన, సురవరం, బూర్గుల మొ॥ తెలంగాణ సాహిత్య పరిశోధకుల కృషి పరిశీలన వీనిలో ప్రత్యేకంగా పరామర్శితమైనాయి.

కావ్యావతారికల ఆధారంగా ప్రాచీనకవుల కవితాదృక్పథాన్ని స్పష్టంగా దర్శించి సరియైన చరిత్ర నిర్మాణానికి దోహదం చేయవచ్చునని విశ్వాసం. ఈ ఉద్దేశంతోనే ఆదికవి నన్నయ అవతారికకు వ్యాఖ్యానం వ్రాసి 'నన్నయ దర్శనం' పేరుతో (1998) ప్రకటించాను. ఈ విధంగానే ప్రసిద్ధాంధ్ర కవుల దర్శనం చేయాలన్నది నా భవిష్యత్ ప్రణాళిక.

నా సిద్ధాంత గ్రంథంలో క్లుప్తంగా ప్రస్తావితమైన భారతీయ, పాశ్చాత్య విమర్శ సిద్ధాంతాల పరిణామ దశలను విపులంగా వివేచించాలని నా అభిలాష. ప్రారంభంలో కథలు, కవితలు వ్రాసినా విమర్శ ప్రక్రియకే అంకితం కావాలని నా ఆకాంక్ష. రామన్న నూత్న శతాబ్దిలో విమర్శ క్షేత్రంలో ఇతోధికమైన కృషి సలిపి సహృదయులకు మనఃప్రీతి కలిగించాలని నా ఆశయం. నాగ్రంథం ఆద్యంతాలలో ఉటంకించిన విశ్వనాథ సత్యనారాయణ గారి వాక్యాలతోనే ఈ విమర్శ ప్రస్థాన ప్రస్తావన ముగిస్తాను.

"సారస్వత ప్రీతి, కవితా రసానుభవము అనేకావరణములు దాటినచో పొందదగినది. అభిమానాదులు అట్టి ఆవరణములు. వీనిని దాటిన గాని రసానందము లేదు. ఎవ

డావరణము చుట్టు తిరుగుచుండునో వాడు లోనికి ప్రవేశించుట జరుగదు కదా!"

"కవితా విద్య పద్యరచన మొదలు కావ్య గ్రంథన కౌశలాంతము వ్యాపించియున్నది పద్యరచనాది శక్తి లేనిచో కావ్యమే లేదు. కాని కావ్య గ్రథన కౌశలమే చివరిమెట్టు అన్నియుగలిగినవాడు మహాకవి. కొన్ని కలిగినవాడు కవి మాత్రము. పలుమంది మధురముగాను, సుకుమారముగాను ఒక ప్రసిద్ధ కవి శయ్య ననుసరించి యొక సొగసు కలుగునట్లుగా ధారాళముగా పద్య రచన సేయవచ్చును. లోకము పద్యరచనలోని మాధుర్యాది గుణములకు మాత్రము వశమైనట్లు కనిపించుచున్నది. ఇది ప్రశంసనీయమైన విషయము కాదు. మహోత్తమమైన విషయము. కావ్య గ్రంథన కౌశలము. పరమభావుకుడు దాని మీద దృష్టితో కావ్యమును చదువును"

-ooo-

# వీరభద్రయ్య విమర్శ రూపకృషి

ముదిగొండ వీరభద్రయ్య

ముదిగొండ వీరభద్రయ్య 1962 నుంచి నేటి వరకు విమర్శ రూపకమైన సాహిత్య కృషిని సాగిస్తూ వస్తున్నాడు. అతని విమర్శ తొమ్మిది పాయలుగా సాగింది. అవి (1) విమర్శ శాస్త్ర గ్రంథాలు, (2) కళా-సాహిత్య తత్త్వ శాస్త్ర గ్రంథాలు, (3) అనేక విమర్శకుల కృషిని పరిశీలించి సాహిత్య శాస్త్ర వృద్ధిని కలిగించే గ్రంథాలు, (4) ఆలంకారిక, భావ చిత్ర, ప్రతీక విమర్శ రచనలు, (5) సాంఘిక విమర్శ, (6) శిల్ప విమర్శ, (7) బయోగ్రఫికల్ విమర్శ, (8) అనువర్తిత విమర్శ, (9) నవలా నిర్మాణ వివేచన. ఈ తొమ్మిది అంశాల మీద వీరభద్రయ్య మొత్తంగా 23 గ్రంథాలను రాశాడు, ఇతని విమర్శ రూప కృషిని గ్రంథ రచనా కాల రీత్యా కాకుండా, విషయ విన్యాస పరంగా చేసిన పై తొమ్మిది వర్గాల ద్వారా తెలిసికొంటే పాఠకునికి ఒక స్పష్టత ఏర్పడ్తుంది.

## విమర్శ శాస్త్ర గ్రంథాలు

విమర్శ వికాసాల మీద పరిశోధన గ్రంథాలూ తెలుగు విమర్శకుల మీద అటు సంప్రదాయ రీతి ప్రభావాలూ, ఇటు పాశ్చాత్య విమర్శ ప్రభావాలను-వికరంగా తేల్చి చక్కని గ్రంథాలు వచ్చాయి కాని, అసలైన విమర్శ శాస్త్ర మౌలికాంశాల మీద ఏ గ్రంథమూ రాలేదు. ఆంగ్ల సాహిత్య విమర్శ క్షేత్రంలో ఇట్లాంటి కృషిని I.A. Richards-'Principles of Literary criticism ద్వారా చేశాడు. ఇట్లాంటి గ్రంథం మనకు లేదు. మన దేశంలో అలంకార శాస్త్రం మహోన్నత స్థాయిలో ఏర్పడి ఉండడంచేత, విమర్శ శాస్త్రంమీద ప్రత్యేకించి ఒక గ్రంథం రాకపోయి ఉండవచ్చును. కాని అలంకార శాస్త్రంలో అటు సాహిత్య తత్త్వ విచారమూ, ఇటు విమర్శ కొలమానాల విషయమూ, రెండూ కలిసిపోయి ఉండడంచేత, విమర్శకుని ప్రత్యేకంగా ఆధునిక పద్ధతిలో ఒక గ్రంథం రావలసే ఉండింది. పోగా 'ఆధునిక కవిత్వమూ', నవల కథానికాది 'ఆధునిక కాల్పనిక వచన సాహిత్యము' ప్రాచీన విమర్శ కొలమానాలలో కొంత సత్పరిణామాన్ని డిమాండ్ చేస్తున్నవి, సాహిత్య తత్త్వ విచారంలో

కూడా ప్రతీకాదులు నూతనాంశాలపై, నూతన కోణాలపై దృష్టి మళ్ళించాల్సిన అవసరం కల్గించినవి. విశ్వనాథ, శ్రీశ్రీ వంటి వారు అటు అనువర్తిత విమర్శలోనూ, ఇటు కళా సాహిత్య తత్త్వ విచారంలోనూ ఎంతో లోచూపుప్రదర్శించారు. కాని తత్త్వ విచారం అవసరమైనదే అయినప్పటికీ, విమర్శ దాని నుంచి వేరుపడింది. అందువల్ల ఈ అంశంమీద దృష్టి నిలుపుతూ వీరభద్రయ్య మూడు గ్రంథాలను రాశాడు. అవి (1) విమర్శ- మౌలిక లక్షణాలు (మౌలికాంశ వివేచన), (2) సాహితీ విమర్శ: సూత్రం- అన్వయం ఈ రెండవ గ్రంథానికి అనుబంధ తుల్యంగా రాసిన లఘు గ్రంథం. (3) అనువర్తిత విమర్శ- విలువల నిర్ణయం.

విమర్శ అనువర్తనానికి కుదిరినప్పుడే శాస్త్ర గౌరవాన్ని పొందుతుంది. ఐతే అనువర్తనానికి ఏయే సూత్రాలు మన సాహిత్య విద్యలో ఉన్నాయో గుర్తించాల్సిన అవసరం ఉన్నది. 'విమర్శ మౌలిక లక్షణాలు' అన్న గ్రంథంలో వీరభద్రయ్య చేసిన పని ఈ సూత్రాల గుర్తింపు, వాటి అన్వయము, ఆధునిక కవిత్వ విమర్శకు కూడా ప్రాచీన సూత్రాలనెట్లా అనువర్తింపజేయవచ్చునో ఈ గ్రంథంలో అతడు చూపాడు, ఈ గ్రంథంలో అతని ముఖ్యమైన ఆదానం ఇది, శ్రీశ్రీ, శేషేంద్ర ఇత్యాది ఆధునిక కవుల కవితలకు సాంప్రదాయిక విమర్శ సూత్రాలనెట్లా అనువర్తింపజేయవచ్చునో ఈ గ్రంథంలో మనం గ్రహించగల్గుతాము

ఈ గ్రంథంలో అతడి మరొక ప్రతిపాదన ఏమిటంటే, అలంకార శాస్త్రంలోని కావ్యాత్మ సిద్ధాంతాలన్నీ కూడా కావ్య మూల్యాంకనానికి పనికి వచ్చే 'కొలమాన'లేననడం ధ్వని ఒక కొలమానం, అలంకారం ఒక కొలమానం అన్న రెండు అధ్యాయాలు ఈ గ్రంథంలో మనకు కనిపిస్తాయి. కావ్యత్వ సిద్ధిని ఏమే అంశాలు కలిగిస్తవన్న ప్రతిపాదనలే కావ్యాత్మ సిద్ధాంతాలన్నీ, అందువల్ల వాటిని గ్రంథంలో 'కొలమానా'లుగా వీరభద్రయ్య నామ్నీకరించాడు.

ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధమస్థాయి కావ్యాలు ఏవి? అని జగన్నాథుని వివేచనను ఈ గ్రంథంలో ఎత్తిచూపుతూ ఇలాంటి విషయాలను నిర్ణయించగలిగిన సాహిత్య విద్య ఉన్నప్పుడు విమర్శ శాస్త్రానికి ఎంత పుష్టి కలుగుతుందో అన్నది అతను తెలిపాడు.

ఇదంతా కాకుండా ఈ గ్రంథంలో ప్రధానాంశం అయిన మౌలికాంశాలు, విశ్లేషణ, వ్యాఖ్యానం, తులనాత్మక పరిశీలన, నిర్ణయం అన్న వాటి మీద విడి విడిగా ఉదాహరణలతో అధ్యాయాలను రాశాడీయన. విశ్లేషణ, వ్యాఖ్యానాలంటే ఏమిటో స్పష్టంగా తెలుపుతూ త్రిపురనేని శ్రీనివాస్ లాంటి వర్తమాన యువకుల రచనల నుంచి, శ్రీశ్రీ ఇత్యాది పైతరం కవుల రచనల వరకు అనువర్తించిచూపాడీయన. విశ్లేషణ విషయికంగా కేవలం కవిత్వాన్ని మాత్రమేకాక, రావిశాస్త్రి గారి'తప్పు' కథానికను స్పష్టంగా విశ్లేషించి చూపాడీయన. ఈ విశ్లేషణ శిల్ప రహస్యాలను ఆవిష్కరించడంతో తద్విషయికంగా వివరణలనిస్తూ 'సూత్రం-అన్వయం' అన్న గ్రంథంలో ఆ కోణాన్ని కూడా ఆవిష్కరించాడు.

మౌలికాంశ విచారణలోనే తులనాత్మక పరిశీలననూ, వాద ప్రతివాద విమర్శనూ ఈయన వివరించాడు. అనువర్తిత విమర్శకీ గ్రంథం బాగా చేయూత నిచ్చే గ్రంథం.

విమర్శ శాస్త్ర గ్రంథాలలో అనేకాంశాలను సూత్రాన్వయ పద్ధతిలో రాసిన గ్రంథం 'సాహితీ విమర్శ-సూత్రం: అన్వయం' అన్నది అభివ్యక్తి, అలంకారం, భావచిత్రం, ప్రతీక, శిల్పం. అన్న ఐదు అంశాలను వివరంగా చర్చించిన గ్రంథం ఇది. భావ చిత్రం, ప్రతీక, శిల్పాల మీద విషయవివరణలూ, అనేక తెలుగు కవితలూ, కథలూ ఈ నాటికి అన్వయించడమూ ఈ గ్రంథంలో కనిపిస్తుంది. ప్రతీక భావ చిత్రాల గురించి ఎంతో స్పష్టమైన వివరణలనివ్వడంతోపాటుగా, ప్రతీకకు ఎలెగోరీకి ఉండే భేదం, భావచిత్ర ప్రతీకల కుండే సామ్యభేదాలు, లాంటి సూక్ష్మాంశాలను ఈ గ్రంథంలో వీరభద్రయ్య వివరించాడు. ఈ గ్రంథంలోనే కాక, ఇస్మాయిల్ లాంటి సత్కవుల భావచిత్రాలను గురించి అనేక వ్యాసాలు వేరేగా ఇతడు రాశాడు.

ప్రతీక విషయికంగా ఈ గ్రంథంలో వీరభద్రయ్య చూపిన సూత్రాన్వయాలకు తోడుగా, మొత్తం ప్రతీకాత్మకంగా రాసిన దీర్ఘ కావ్యాల మీద విమర్శలను కూడా ఇతను రాశాడు. 'నా దేశం నా ప్రజలు' 'గొర్రిల్లా' కావ్యంలోని ప్రతీకలను గురించి, 1982, 1985లో చేసిన ఈషణ్మాత్ర కృషి సి. నారాయణరెడ్డి గారు రాసిన 'మట్టీ మనిషీ ఆకాశం' అన్న కావ్యేతిహాసం యొక్క వస్తుసంవిధానం మీద రాసిన విమర్శ గ్రంథంలో అనేక ముఖాలుగా విస్తరిల్లింది.

ప్రతీకాత్మకంగా వచ్చిన దీర్ఘ, మహాకావ్యాలన్నింటి మీద, ఏదోరూపంగా మంచి విమర్శలే వచ్చాయి. శేషేంద్రశర్మ గారి గొరిల్లా కావ్యం మీద వీరభద్రయ్య భారతిలో రాసిన 'గొరిల్లా అభ్యుదయ కావ్యం' అన్న వ్యాసం, నగ్నముని గారి 'కొయ్య గుర్రం' కావ్యానికి చేరా గారి ఆలోచనాత్మక పీఠిక, శేషేంద్ర శర్మగారి 'నా దేశం-నా ప్రజలు' కావ్యం మీద వీరభద్రయ్య రాసిన గ్రంథం, 'ఆసుపత్రి గీతం' అన్న శివారెడ్డి గారి దీర్ఘ కావ్యం మీద జీవియస్ గారి రెండు వ్యాసాలూ వచ్చాయి. మట్టీ మనిషీ ఆకాశం అన్న నారాయణరెడ్డి గారి కావ్యం ఇలాంటి కావ్యాలలో ఒక ఖచ్చితమైన మైలురాయి. మానవీయ విలువలను మానవ చైతన్యాన్ని ప్రోది చేసికొనే ప్రేరణ కల్గిస్తున్నందుకు మాత్రమే కాకుండా, ఈ కావ్యంలో ప్రతీక 'నిర్వహణ' ఎంతో ప్రౌఢంగా జరిగిందన్నది ప్రధానాంశంగా, ఇందులోని వస్తు సంవిధానాన్ని వీరభద్రయ్య' మట్టీమనిషీ ఆకాశం-వస్తు సంవిధానం' అన్న గ్రంథంలో వివరించాడు. నారాయణ రెడ్డి గారు రాసిన కావ్యాలన్నీటిలోనూ వస్తుపరంగానూ, సాహిత్య శిల్పపరంగానూ ఇది ఉత్తమోత్తమమన్న స్ఫూర్తిని ఈ విమర్శ గ్రంథం ద్వారా వీరభద్రయ్య కల్గించాడు. అన్నింటికీ మించి ప్రతీక కావ్యాలను అర్థం చేసుకోవడానికి మార్గాన్ని సుగమం చేయడమేకాక, కొన్ని రకాల వస్తువులను తీసికొన్నప్పుడు ప్రతీకను కవి నిర్వహించాల్సిన వస్తుందని, ఆ నిర్వహణను రెడ్డి గారీ కావ్యంలో చక్కగా చేశారనీ వీరభద్రయ్య వివరించాడు. గతంలో వచ్చిన ప్రతీక కావ్యాలలో ఇట్లా ప్రతీకను ప్రౌఢంగానూ, హృద్యంగానూ నిర్వహించిన కావ్యం ఆసుపత్రి గీతం అన్నది వీరభద్రయ్య అభిప్రాయం.

వీరభద్రయ్య ఈ గ్రంథం ద్వారా ప్రతీక కావ్య విమర్శకు మార్గం సుగమం చేశాడు. తన కాలంలో వస్తున్న కొత్త కొత్త సాహిత్య రచనలకు వీరభద్రయ్య వెన్వెంటనే స్పందించి జాగ్రత్తగా పరిశీలించగలిగాడనడానికీ గ్రంథం మంచి ఉదాహరణ. (ఇట్లాంటి పనే 1979లో భారతి పత్రికలో ఒక వ్యాసం ద్వారా అనుభూతి కవిత్వం అన్న సైక్లోస్టైల్డ్ లఘు గ్రంథం రాశాడు) సూత్రం అన్వయంలో ప్రతీక మీద రాసిన వ్యాసాలకు 'మట్టీ మనిషీ ఆకాశం, వస్తుసంవిధానం' అన్నది తోడుగా నిలిచే గ్రంథం.

'సూత్రం-అన్వయం' అన్న గ్రంథానికి ఈయనే తర్వాత రాసిన 'అనువర్తిత విమర్శ-విలువల నిర్ణయం' అన్న లఘు గ్రంథం అనుబంధరచనగా నిలిచేది. సాహిత్య విలువల ప్రాధాన్యాన్ని ఖచ్చితమైన రీతిలో తెల్పుతూ, వాటిని రచనలలో పరిశీలించడానికి ప్రేరణ

కల్గించే గ్రంథం ఇది. సాహిత్య విలువలున్న విషయం నిర్ధారణకు వచ్చాకనే సాహిత్యేతర విలువలకు విలువ అన్నది ఈ గ్రంథంలో ప్రధానంగా ప్రతిపాదించిన అంశం. 'విలువ' అన్న దాన్ని ఈ గ్రంథంలో వీరభద్రయ్య విస్పష్ట రీతిలో వివరించాడు.

**కళాతత్త్వ శాస్త్రం:**

అలంకార శాస్త్రంలో ఒక ముఖ్యభాగంగా మనకు సాహిత్యతత్త్వ వివేచన ఉన్నది. ఐరోపాలో అన్ని లలిత కళలకు తత్త్వ వివేచన చేస్తూ 'ఈస్థెటిక్స్' అన్న శాస్త్రం బౌమ్ గార్డెన్ ద్వారా 1735లో ఏర్పడింది. సాహిత్యేతర కళాతత్త్వ వివేచన మన అలంకార గ్రంథాలలో కూడా అక్కడక్కడ కన్పించినప్పటికీ, అక్కడ అది ప్రధానం కాదు. దువ్వూరి, విశ్వనాథాదులు పలు సాహిత్యంతో పాటుగా చిత్ర లేఖన, సంగీత కళలతత్త్వ వివేచన కూడా చేశారు. 1926లో ఈస్థెటిక్స్‌ను గురించి మొదటి సారిగా తెలుగులో పురాణం సూరిశాస్త్రిగారు తమ 'విమర్శక పారిజాతము' అన్న గ్రంథంలో రాశాడు.

వీరభద్రయ్య ఈస్థెటిక్స్ మీద గ్రంథాన్ని 'కళాతత్త్వ' శాస్త్రం- మౌలికాంశ వివేచన (తులనాత్మక అధ్యయనం) అన్న పేరుతో 1993లో రాశాడు. కళావిషయాలనెన్నింటిని వివేచించినప్పటికీ అవన్నీ 'సౌందర్యం, ప్రతిభ, అభివ్యక్తి' అన్న మూడు ముఖ్యవర్గాలలోకి చేరిపోతాయంటూ, ఈ మూడు మౌలికాంశాల మీద అటు ఐరోపీయ తాత్త్వికులు, ఇటు భారతీయాలంకారికులు చేసిన వివేచననంతా ఈ గ్రంథంలో అతడు తులనాత్మకంగా పరిశీలించాడు, ఇంతకు ముందు ఈ అంశం మీద తెలుగులో ఏ గ్రంథమూ రాలేదు. ఈ గ్రంథంలో విమర్శకు మూలంగా నిలువగలిగిన సాహిత్య, కళాతత్త్వ విషయాలను వీరభద్రయ్య వివరించాడు. ఈ గ్రంథంలో తెలుగు కళాతాత్త్వికుడైన సంజీవదేవ్ ఆలోచనలను కూడా ఇతడు చర్చించాడు. ఈ గ్రంథానికి బాహిరంగా చలం గారి కళాతాత్త్వికాభిప్రాయాలను ఒక వ్యాసంలో ఇతడు 'తెలుగు' పత్రిక సంచికలో చర్చించాడు. 'విశ్వనాథ-సాహిత్యతత్త్వ వివేచన' అన్న గ్రంథంలోను అనేక కళాతాత్త్వికాంశాలను వీరభద్రయ్య వివరింగా చర్చించాడు. విశ్వనాథ వారు కావ్యానందాన్ని గురించి, రస సంఖ్య పరిమితత్వాన్ని గురించీ, చేసిన ఆలోచనలను గురించి మాత్రమే కాక, ఏది కవిత్వం అవుతుంది? అన్న దాన్ని గురించి విశ్వనాథ చేసిన ఆలోచనలను వీరభద్రయ్య ఈ గ్రంథంలో వివరంగా

చర్చించాడు. సంగీత కళనీ-సాహిత్య కళనీ కలిపి చేసిన విశ్వనాథ వారి వివేచనను కూడా వీరభద్రయ్య ఈ గ్రంథంలో చర్చించాడు. యూంగ్ ప్రతిపాదించిన టోటల్ అన్ కాన్షస్‌నెస్‌కీ, విశ్వనాథ వారి బ్రహ్మసరస్సు సరస్వతుల ప్రతిపాదనకూ, కఠోపనిషత్తు తెల్పిన 'అవేద్యం' అన్న దానికీ ఉన్న సామ్యాలను వీరభద్రయ్య ఈ గ్రంథంలో తులనాత్మకంగా పరిశీలించాడు. ఈ అంశం మీద ఇతని ఆలోచనలు, కళాతత్త్వ శాస్త్ర గ్రంథంలో తిక్కన గారి 'భవ్యకవితావేశాన్ని' గురించి ఇతడు చేసిన ఆలోచనలూ విజ్ఞులు పరిశీలించదగినవి.

సాహిత్య-కళాతత్త్వజ్ఞత లేకుండా చేసే విమర్శలు యాంత్రిక విమర్శలుగా దిగజారిపోతాయి. అట్లాంటి రచనలు కేవలం కరపత్రస్థాయిని దాటలేవన్నది మనం చూస్తున్న విషయమే. ఒక సూత్రోత్పత్తికి, ఒక సిద్ధాంత ప్రతిష్ఠాపనకూ వెనుకన కళాతత్త్వ వివేచన జరిగితీరాలి. అట్లా కాకుండా కేవలం సూత్రానువర్తనం తప్పుడు ఫలితాలను ఇస్తుంది. మహాస్రష్ట గొప్ప కళాఖండాన్ని సృజించినప్పుడు దానికి అనుగుణమైన సూత్ర సృష్టి కళాతత్త్వ వివేచన వల్లనే జరుగుతుంది. అందువల్ల విమర్శను సమకాలీనంగా రెలెవెంట్‌గా ఉంచగల్గింది. ఈ కళాతత్త్వ వివేచనే అన్నది వీరభద్రయ్య అభిప్రాయం. ఇందువల్లే ఇతని విమర్శ రూపకృషికి కళాతత్త్వ వివేచన వన్నె పెట్టిందన్నది విద్వాంసుల అభిప్రాయం. ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య గారి ఈ క్రింది అభిప్రాయాన్ని చూడండి.

"కళాతత్త్వ శాస్త్రం - మౌలికాంశ వివేచన' నాకు తెలిసినంతవరకు తెలుగులో ఈ విధమయినది ఇంతకు ముందు వచ్చినట్టు లేదు. . . ఈ గ్రంథంలో వీరభద్రయ్య పాశ్చాత్య భారతీయ కళా సిద్ధాంతాలకు, అభివ్యక్తి విధానాలకు ఉన్న దగ్గరి తనం, దూరం తనం ప్రదర్శించేందుకు సమర్థంగా ప్రయత్నించడం ప్రత్యేకంగా గుర్తించదగిన అంశం. ప్రతిభ, ప్రతీక వంటి విషయాలను ఆయన స్పష్టీకరించాడు. అలంకారానికీ, ప్రతీకకీ ఉన్న భేదాన్ని వివరించాడు. ఈ విధంగా ఈనాటి కవితా విధాన పేటికకు తాళం చెవిగా ఈ రచన కవిత్వాభిమానులకు ఉపయోగపడ్తుంది."

**నవలా, శిల్ప విమర్శలు:**

వీరభద్రయ్య కేవలం కవిత్వ విమర్శనే కాక కొన్ని నవలా విమర్శలు కూడా చేశాడు. వేయిపడగలులోని సాహిత్య-సాంఘిక పరమైన అంశాలమీద ప్రత్యేక దృష్టితో 1984లో

జరిగిన 'వేయిపడగలు' స్వర్ణోత్సవానికి 'వేయిపడగలు- ఒక పరిశీలన' అన్న గ్రంథాన్ని వీరభద్రయ్య రాశాడు. నిజానికి వేయిపడగలు నవలమీద అదే మొదటి పుస్తకం.

'చివరకు మిగిలేది' నవలలో బుచ్చిబాబు గారు జిడ్డు కృష్ణమూర్తి తత్త్వాన్ని చాలా చోట్ల ఇమిడించారని 1985లో 90 పుటల పుస్తకం రాశాడీయన. ఈ పుస్తకం మీద ఆచార్య సంపత్కుమారాచార్య ఇట్లా రాశారు.

"చివరకు మిగిలేది నవలమీద ఎన్నో విధాలయిన వివేచనలు వచ్చినాయి. కాని అందులో జె.కె. తత్త్వం నవలా తాత్త్విక ప్రాతిపదికగా ఉండిందనే అంశాన్ని గుర్తించిన గౌరవం ప్రధానంగా వీరభద్రయ్యదే . . . . దీనితో ఆ నవలమ గూర్చి ఆలోచించే విధానంలోనే అనంతర కాలాన మార్పు వచ్చింది" ఇలాంటి విషయాలలో నికరంగా ఇది ఇంతేనని నిర్ణయించడం కష్టం. నీషే దగ్గర నుంచి రసెల్ మీదుగా సార్త్ర్ వరకు కొన్ని అంశాలలో సామ్యం ఉండిందనిపిస్తుంది. బుచ్చిబాబు గారు, జె.కె. భావాలకు ఇతరులను చదివి కూడా దగ్గర అయి ఉండవచ్చును.

'వేయిపడగలు నవలా శిల్పం' అన్న ఇతని రచన సూత్రాన్వయ పద్ధతిలో రచింపబడింది. శిల్పాన్ని గురించిన విశ్వనాథ వారి ఆలోచనలమ మొదట వివరంగా చర్చించి, వాటి ఆధారంగా నవలలో ఏయే శిల్పాంశాలుండాలో తేల్చి, వాటి ప్రకారం వేయిపడగలు నవలను విమర్శించడం ఈ గ్రంథంలో వీరభద్రయ్య చేసిన పని. వేయిపడగలులోని శిల్పాన్ని గురించి ఒక గ్రంథానికి గ్రంథమే రావడానికి ఇదే మొదలు.

నవలా శిల్పంలో ఏయే అంశాలు ఇమిడిపోయి ఉంటాయో వీరభద్రయ్య పది అంశాలుగా ఈ గ్రంథంలో తేల్చాడు. అవన్నీ నవలా శిల్ప విమర్శకు మంచి ఆధారాలే. నవలా ప్రక్రియ విమర్శలో వస్తువు మీద చూపినంత చూపు శిల్పం మీద చూపకపోవడం కన్పిస్తున్నది. ఈ లోటుని ఈ గ్రంథం కొంతైనా తీరుస్తున్నది. ఇంతే కాకుండా నవలా నిర్మాణంలో ఉండే పాత్రలు, ఇతివృత్తం, ప్లాట్, మొ॥నవి ముఖ్యాంశాలను గురించి 'నవల- నవలా విమర్శకులు' అన్న గ్రంథంలో (44 పుటలు) ఇతడు వివరించాడు. ఈ వివరణ అంతా నవలా శిల్ప విమర్శకు బాగా ఉపయోగిస్తుంది.

'రావి శాస్త్రి గారి ధర్మేతిహాసం- మూడు కథల బంగారం నవల- విమర్శ' అన్న

గ్రంథంలో అటు వస్తు విమర్శను, ఇటు శిల్ప విమర్శను వీరభద్రయ్య చేశాడు. మార్క్సిస్టుగానూ, నక్సలైట్ల సమర్థకుడు గానూ పేరుపొందిన రావిశాస్త్రి గారి 'మూడుకథల బంగారం' నవలలో ధర్మానికే ప్రాధాన్యం ఉన్నది కాని, మార్క్సిజానికి కాదన్నది ఈ తన గ్రంథంలో వీరభద్రయ్య నిరూపణ. వస్తువిషయిక చర్చనే కాక, శిల్పవిషయికంగా కూడా ఇందులో కొన్ని ముఖ్యమైన పరిశీలనలు చేశాడు వీరభద్రయ్య. ముఖ్యముగా భిన్న పాత్రలు, భిన్న సంఘటనలో, భిన్న వాతావరణము, భిన్న సాంస్కృతిక నేపథ్యమూ ఉన్న మూడు కథలను- ఒకే కథగా, అంతర్లీనంగా ఒక అనుభూతిని కల్పిస్తు రావిశాస్త్రి గారెట్లా ఈ నవలను సృష్టించారో వీరభద్రయ్య ఈ గ్రంథంలో సోదాహరణంగా నిరూపించాడు. ఒక రచయితకు లోకంలో అనేక కారణాల వల్ల ఏర్పడే ప్రత్యేక తరహా మూర్తి మత్వానికి లోబడకుండా, కేవలం గ్రంథస్థ సాక్ష్యమే ఆధారంగా రచన వైశిష్ట్యాన్ని నిర్ణయించడానికి చేసిన సఫలయత్నం వీరభద్రయ్య రాసిన ఈ గ్రంథం. ఈ గ్రంథాన్ని గురించి ఆచార్య సంపత్కుమాచార్యుల వారు ఇట్లా రాశారు.

"అనేకానేక ఆధారాలతో 'మూడు కథల బంగారం' నవల ధర్మేతిహాసంగా నిరూపించడం ఇప్పటివరకు సాగిన ఆయన విమర్శ ప్రస్థానంలో అతిసాహసమయిన దయినా అత్యంత సమర్థమయిన achievement గా గుర్తింప వలసి ఉంటుంది."

రావిశాస్త్రి గారి రచనల్లో ఉపమాలంకారం విరాడ్రూపంతో ఉంటుంది. ఒక నవలలో అలంకారాలేమిటి? కవిత్వమేమిటి? అని ప్రశ్నించిన వాళ్లు లేక పోలేదు. కాని శాస్త్రిగారట్లా రాసి నవలా ప్రక్రియను విలక్షణ ప్రక్రియగానూ, మహాకావ్య తుల్యంగానూ, మూడు కథల బంగారం నవలనైతే- కావ్యేతిహాసతుల్యంగానూ చేశారని వీరభద్రయ్య ప్రతిపాదన, వస్తువుతో పాటు రచనా తత్త్వంలో కూడా ఉన్నత స్థాయికి చేరుకున్న నవలా ప్రక్రియలో కావ్య ప్రక్రియ లక్షణాలు అతి సహజంగా చొరబారుతవన్నది వీరభద్రయ్య అభిప్రాయం.

ధర్మం, న్యాయం, పాపం, పుణ్యం, మానవతల విషయికంగా రావిశాస్త్రి గారి నవలలో అనేక సందర్భాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలను వీరభద్రయ్య ఈ తన విమర్శ గ్రంథంలో సాకల్యంగా చర్చించి రావిశాస్త్రి గారి విశాల హృదయాన్ని ఆవిష్కరించాడు. కీ॥శే॥ వాకాటి పాండురంగరావు గారు ఈ గ్రంథాన్ని గురించి ఇట్లా రాశారు.

" రావి శాస్త్రి గారి పాత్రల చిత్రణలో, కథక్రమ పరిణామంలో ఉపమాన ఉపమేయ ప్రయోగాలలో వున్న ధర్మ చింతన అన్న ముడి వస్తువుని విడివిడిగా తీసి మన ముందుంచిన ఈ విమర్శనా గ్రంథం చాలా సాహసోపేతమైంది. కొంతమందికి అప్రియమే అయినా సత్యం గనుక దానిని చెప్పి తీరాలి అన్న పట్టుదలని, పాండత్యాన్ని ప్రతిబింబించేదీను. . . . నిజం తన పక్కన వుందని తెలిపిన వారిలో వుండే నిబ్బరం ఈ రచన పుటపుటలో పోట మరించడంలో అబ్బురమేమి లేదు."

నవలా శిల్పం విమర్శతో పాటుగా వీరభద్రయ్య ఈ తరానికి చెందిన పదుగురు నవలా విమర్శకుల' కృషిని పరిశీలించి, 'నవల-నవలా విమర్శకు' లన్న ఒక గ్రంథాన్ని రాశాడు. ఈ గ్రంథంలో మనోవిజ్ఞాన భూమికతోనూ, మార్క్సిస్టు దృక్కోణంలోనూ, నవలా నిర్మాణ దృష్టితోనూ విమర్శలు రాసిన వారి కృషిని ఈయన పరిశీలించాడు. ఈ గ్రంథానికి 'నవల' అన్న పేరుతో తానే ఒక బృహత్పీఠిక రాసికొని అందులో ప్రధానంగా పాత్ర సృజనలోని తత్త్వాన్ని , నవలకు 'పాత్ర' ఆధారాన్నీ వివరిస్తూ, ఇతర నవలా నిర్మాణాంశాలను కూడా వివరించాడు. నవలా విమర్శకుల కృషిని గురించిన గ్రంథం ఇంత వరకు తెలుగు సాహిత్యంలో రాలేదు. (ఇది సమగ్ర గ్రంథం కాకపోయినా!) ఇందులో నవలా నిర్మాణ విషయికంగా కొత్త విషయాలనీయన తెలిసినవాడని విజ్ఞులు అభిప్రాయపడినారు.

**అగ్రశ్రేణి విమర్శకులపై పరిశీలనలు:**

ఆధునిక సాహిత్యం మీద ప్రౌఢమైన విమర్శలు రాసిన 18 మంది అగ్రశ్రేణి విమర్శకుల మీద వీరభద్రయ్య Major critics of Modern Telugu Literature అన్న పుస్తకాన్ని రాశాడు. ఇందులో ఇతను విశ్వనాథ. ఆర్.ఎస్. సుదర్శనం, జీవియస్, శేషేంద్ర శర్మ, సుప్రసన్న, సంపత్కుమార, చేరా, మందేశ్వరరావు, ఎస్.వి. రామారావు, రారా, కె.వి.ఆర్. పోరంకి దక్షిణామూర్తి, శ్రీశ్రీ ఇత్యాదుల కృషిని గురించి సంక్షిప్తంగా ఈ పుస్తకంలో వీరభద్రయ్య తెలిపాడు. మళ్లీ వీళ్లల్లో జీవియస్,, సంపత్కుమార, సుప్రసన్న గారల విమర్శ రూప కృషి మీద వివరంగా మూడు గ్రంథాలు రాశాడు.

జీవియస్ సిద్ధాంతీకరించిన ధర్మవీరమే రసాలన్నింటికీ మూలమన్న వారి సిద్ధాంతం మంచి సాహిత్య చరిత్రలో కలిగే వికాసాన్ని ప్రక్రియా విమర్శ ద్వారానే తెలిపికోగల్గుతామన్న

వారి సుదీర్ఘ కృషి నుంచి, విశ్వనాథను నవ్య సంప్రదాయోద్యమ నాయకుడుగా వారు అన్వయించిన తీరు వరకు వారి విమర్శలోని అనేక కోణాలను వీరభద్రయ్య 'జీవియస్ విమర్శ దర్శనం' అన్న గ్రంథంలో వివరిస్తూ చర్చించాడు. జీవియస్ నవలా ప్రక్రియ విషయంలో చేసిన కొత్త ప్రతిపాదనను ఎత్తి చూపు దాని సామంజస్యాన్ని ఈ గ్రంథంలో ఈయన నిరూపించాడు.

శ్రీ సంపత్కుమార విమర్శమీద రాసిన 'సంపత్కుమార విమర్శ-దేశీయత భూమిక' అన్న గ్రంథంలో సంపత్కుమార విమర్శకు 'దేశీయతే భూమిక' అని ఇతడే మొదటిసారి ప్రతిపాదించాడు. భావకవిత్వ, అభ్యుదయ కవిత్వ ఉద్యమాల నేపథ్యంలో నవ్య సంప్రదాయోద్యమ విషయాన్ని సాహిత్య చరిత్ర దృక్కోణంతో సంపత్కుమార ఒక సాహిత్య చరిత్రకునిగా వివరించిన అంశాన్ని గుర్తిస్తూ వీరభద్రయ్య ఈ గ్రంథంలో వివరంగా చర్చించాడు. సంపత్కుమార విమర్శలాధారంగా 'రస సిద్ధాంత పరిణామాన్ని' వీరభద్రయ్య స్పష్టీకరిస్తూ, జీవుని వేదనపై సంపత్కుమార చర్చలోని ప్రత్యేకతను ఇతరుల ఆలోచనల నుంచి వారి ఆలోచనలెట్లా విలక్షణమైనవి అన్న వాటిని వీరభద్రయ్య ఈ గ్రంథంలో తెలిపాడు.

శ్రీ సుప్రసన్న విమర్శ బహ్వాంశాలాధారంగా సాగినా వారి విమర్శ పద్ధతిని 'సమన్విత విమర్శ'గా వీరభద్రయ్య నిర్ణయించి వివరించి శ్రీ సుప్రసన్న కృషినంతా దానికి సమన్వయించి వీరభద్రయ్య 'సుప్రసన్న సమన్విత విమర్శ' అన్న గ్రంథంలో చూపాడు. సుప్రసన్న విమర్శలోని మనోవిజ్ఞాన శాస్త్రాంశాల వైశిష్ట్యాన్నీ, వాటిద్వారా వారుసాధించిన సత్ఫలితాలనూ తెల్పుతూ, మహాగ్రంథ సూత్రాన్వయాల ద్వారా సుప్రసన్న తెలుగు విమర్శ క్షేత్రానికి అందించిన విలువైన విద్యావిషయాలను వీరభద్రయ్య ఎత్తి చూపారు.

**సాంఘిక (వస్తు) విమర్శ:**

మొత్తం తెలుగు సాహిత్యంలో అంటే నన్నయ నుంచి, నేటి శివారెడ్డి ఇత్యాదుల వరకు వచ్చిన తెలుగు కవిత్వంలోనూ, కావ్యాలలోనూ కవులు ఇమిడించిన సాంఘిక సిద్ధాంతాలను ఎత్తిచూపుతూ 1980లో ఈయన ఒక గ్రంథం రాశాడు. ఇట్లాంటి గ్రంథం కూడా తెలుగు సాహిత్యంలో అంత వరకు రాలేదు. ఇది ఆం.ప్ర. సాహిత్య ఎకాడెమి పోటీ

కోసం రాసి బహుమతినందించిన గ్రంథం, ఈ గ్రంథంలో 'ధర్మమత సిద్ధాంతం' గురించిన వివరణలు, అది మన ప్రాచీన కావ్యాలలో ప్రతిఫలించిన తీరు ఈయన ఎన్నో నిరూపణలతో రాశాడు. మార్క్స్ చెప్పిన 'స్టేట్ లెస్ స్టేట్' కీ ధర్మమతమున్న రాజ్యానికే ఆశ్చర్యకరమైన పోలికలు కన్పిస్తాయి. కృతయుగ సమాజం నుంచి క్రమంగా మానవ జీవనం, ఎట్లా పతనమయిపోతూ దిగజారిపోయిందో తెలుగు కావ్యాలలోని అనేక పద్యాలాధారంగా ఇతడు వివరించాడు. ఈ గ్రంథం చదివేక తెలుగు కవులు ఇన్ని సాంఘిక సిద్ధాంతాలను తమ కావ్యాలలో ఇమిడ్చారా?! అన్న ఆశ్చర్యం కలుగుతుంది.

గోపీచంద్ గారు మార్క్సిజం నుంచి ఎదిగాక 'పోస్ట్ చేయని ఉత్తరాలు' అన్న గ్రంథం రాశాడు. ఈనాటి రావిపూడి వెంకటాద్రి, మార్క్సిజాన్ని తీవ్రంగా ఖండించగా, గోపిచంద్ అటు ఆధ్యాత్మిక వాదాన్నీ, ఇటు భౌతిక వాదాన్నీ సమన్వయిస్తూ రాసిన ఈ గ్రంథాన్ని చాలామంది తెలుగు సాహిత్య పరులు పట్టించుకోలేదు. 'భౌతికాధ్యాత్మిక సిద్ధాంతాల సమన్వయ వాది-శ్రీ గోపిచంద్' అన్న వ్యాసాన్ని రాసి వీరభద్రయ్య గోపిచంద్ చేసిన మేధాగతమైన కృషికి న్యాయం చేశాడు.

ఇట్లాగే శేషేంద్ర 'నా దేశం-నా ప్రజలు' అన్న కావ్యాన్ని విప్లవ కావ్యంగా నిరూపిస్తూ 1985లో ఒక గ్రంథం రాయడానికి ముందే 1980లోనే భారతి పత్రికలో ఇదే కవి రాసిన గొరిల్లా కావ్యం ఎట్లా అభ్యుదయ కావ్యమో ఒక వ్యాసం రాశాడు.

'మార్క్సిస్టు నవ్య అలంకార శాస్త్రం' అన్న వ్యాసంలో ('తెలుగు' పత్రికలో ప్రచురితం), ఆనాటి ప్లెఖనొవ్ నుంచి నేటి అల్‌నెర్ జీస్ వరకు మార్క్సిస్టు సాహిత్య తత్త్వజ్ఞులైన అనేకుల ఆలోచనలను ముఖ్యంగా 'వస్తురూపాల'కు సంబంధించిన వివేచనను చర్చించాడీయన.

## కళాంశాల పై విమర్శ:

భావకవిత్వం, అధివాస్తవిక కవిత్వం మొదలైన ముఖ్యసాహిత్య విషయాలపై 'సామాజిక సాహిత్య వ్యాసాలు' గ్రంథంలో సుదీర్ఘ వ్యాసాలు రాయడమే కాకుండా 'అభివ్యక్తి' అన్న విషయం మీద ఈయన కృషి చేసి వ్యాసాలను రాశాడు. వస్తువుమీద అభిప్రాయభేదా లున్నప్పటికీ, కవిత్వ విలువలున్న కవితల్ని ఉదహరిస్తూ వాటిలోని అభివ్యక్తి విశేషాలను తెలిపాడు. ఈ అభివ్యక్తి మీద ఇతని కృషిని పరిశీలిస్తే నేటి తెలుగు కవిత ఎంతటి ఉన్నత

శిఖరాల మీద రోహించిందో అర్థమవుతుంది. ఈ కాలపు కవితల్లో మానవతావాదం, మార్క్సిజం వంటి సాంఘికాంశాలను తెలుపుతూనే దానికి తోడుగా కళావిలువల విషయంలో ఇతడు విమర్శ వ్యాసాలు రాయడం గమనార్హం.

'ఆలోచన-ఆలోకన' అన్న తన గ్రంథంలో 'శైశవగీతి-కవిత్వ నికషోపలం'. వంటి విశిష్ట విషయాలమీద అనేక వ్యాసాలనీయన సంకలించాడు. మినీ కవిత్వం మీది ఇతని కృషి విజ్ఞుల ప్రశంసలనందింది.

**అలీ ఇలీ:**

తన 20వ ఏట 'శివయోగి' అన్న 'బయోగ్రఫికల్ విమర్శ' గ్రంథాన్ని (1962)లో రాశాడు. ఈ గ్రంథం స్వచ్ఛమైన వ్యావహారిక భాషలో రాయగా 'ఇదేమినాయనా గ్రామ్యమున రాసినావు?!' అని ఒక పూజ్యవిద్వాంసుడు అన్నారు. ఆ రోజులకి విశ్వవిద్యాలయ సాహిత్య విద్యార్థుల వ్యాసాలన్నీ గ్రాంధికంలో ఉండేవి. క్వాచిత్కంగానే వ్యావహారిక భాషలో ఉండేవి.

విశ్వనాథ కోరాడ రామకృష్ణయ్య గారి వంటి దిగ్గంతుల విమర్శలు చదివీ, భారతి పత్రికలో పడే విమర్శవ్యాసాలను చదివీ ఈ క్షేత్రంలోకి ప్రవేశించాడు వీరభద్రయ్య. జి.వి. సుబ్రహ్మణ్యం గారి 'వీర రసము' (1961) గ్రంథాన్ని చదవడం వల్ల రస సిద్ధాంతం మీద ప్రత్యేక అభినివేశం కల్గింది. ఐచ్ఛికంగా రాజనీతి శాస్త్రము, సొంతంగా సామాజిక మనోవిజ్ఞాన శాస్త్రాలను (విద్యార్థి దశలోనే) చదవడం వల్ల 'సామాజిక సాంస్కృతిక దృక్పధం- శ్రీ శ్రీ కవిత్వం' అన్న విషయం మీద (1970) పరిశోధన చేయగలిగాడు. అప్పటి చదువు మరచిపోకుండా ఉండడం వల్ల కొంచైనా మంచి విమర్శ వ్యాసాలనీయన రాయగలిగాడు.

**కొన్ని వెలుగు కిరణాలు**

వీరభద్రయ్య విమర్శ ప్రసరించే కొన్ని వెలుగు కిరణాలు అని జీవియస్ గారు రాసిన కొన్ని అంశాలు-

1. మినీ కవిత్వాన్ని గురించి ఎందరు చెప్పారో! అయినా చివరకు మిగిలిందిగా 'మినీ కవిత ఒక్క భావ చిత్రం' అనే అనుశీలన సూత్రాన్ని అందించారు వీరు' ఈ అంశంమీద సంపత్కుమారాచార్య కూడా ఇట్లా అన్నారు.

'వీరభద్రయ్య నిర్ణయాలు నిర్వచనాలు కొన్ని అస్పష్టతా రహితంగా, ఋజువుగా ఉంటాయనటానికి ఆయన 'మినీ కవిత'కిచ్చిన నిర్వచనం ఒక చక్కని ఉదాహరణ. మినీ కవితను గూర్చి ఎంతగానో రాసిన ఎంతో మంది ఉన్నారు కాని ఈ నిర్వచనం-శాస్త్రీయ ప్రతిపాదన నాకు తెలిసినంత వరకు వీరభద్రయ్యదే.

2. అభివ్యక్తి ప్రాచీన సాహిత్యంలో కంటే ఆధునిక సాహిత్యంలో ఎలా కావ్య జీవిత శక్తిగా ఆవిష్కరింపబడ్తుందో సోపపత్తికంగా వివరించిన వివేచన ప్రశంసనీయం.-

3. ప్రతీకలను గురించి, భావ చిత్రాలను గురించి అనుశీలనంలో వాటి వినియోగాన్ని గురించి తెలుగులో ఇంతకు ముందు ఇంత స్పష్టంగా, నిర్దుష్టంగా చెప్పి అన్వయించి చూపిన విమర్శ లేదు.

4. శిల్ప విమర్శను కవిత్వేతర ప్రక్రియలతో ప్రయోగించి చూపించి కొత్త పుంతలు తొక్కిన అనువర్తిత విమర్శ అభినందనీయం.

5. నవ్యసంప్రదాయోద్యమాన్ని సమర్థించడంలోనే కాక దానిని అనుశీలించడంలో ఇంత చొరవ తీసుకొన్న విమర్శ ఇంతవరకు వెలువడలేదు.

6. భావకవిత్వానికి సంబంధించిన అనుశీలనం, ఆసక్తిదాయకం, అభినవం.

7. వీర రస భేదాల్లో స్వాతంత్ర్య వీరాన్ని ఎన్నుకొని, 'వందేమాతరం' కావ్యానికి అన్వయించి రస సిద్ధాంతానికే ఆధునిక అనువర్తిత ప్రతిపత్తిని కల్పించటం ప్రశంసాపాత్రం.

జీవియస్ గారే వీరభద్రయ్య అనువర్తిత విమర్శకున్న ఆరు లక్షణాలను ఈ కింది విధంగా తెలిపారు.

1. సాహిత్య చరిత్రలోని పరిణామ వికాస దశలను గురించిన నిర్దుష్టమైన అవగాహన ఉండటం.

2. కొత్తను చూచి మెచ్చుకోవటమేకాక విలువ కట్టగలిగిన వివేచన కలిగి ఉండటం.

3. సామాన్య సాపేక్ష లక్షణ వివేకం.

4. సాహిత్య దర్శన ప్రవృత్తి మీద ప్రామాణిక భావం.

5. విశ్లేషణ, అనుశీలన ప్రజ్ఞా పాటవం.

6. పూర్వాపర విమర్శ దృక్పథాల సమన్వయశక్తి, అవసరమైతే ఖండన శక్తి.

**Major Critics పుస్తకం మీద సంపత్కుమార**

ఆయన సమకాలీనులయిన విమర్శకులను అంచనా వేయటానికి వారి విమర్శ విధానంలోని మౌలికాంశాలను గుర్తుపట్టి, నిర్మోహమాటంగా వివేచించడం ఇంచుమించు అసిధారావ్రతంగా నిర్వహించాడు అందుకు ఈ అంచనాల వ్యాస సంకలనం యథార్థమయిన సాక్ష్యం ఇస్తుంది.

-ooo-

